# అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

## Folk Element in the Musical Compositions of Annamayya

డాక్టరేట్ డిగ్రీ కోసం
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి
సమర్పించిన సిద్ధాంత వ్యాసం

డాక్టర్ పొన్నా లీలావతమ్మ
ఎం. ఎ., పిహెచ్. డి.

పొన్నా పబ్లికేషన్స్
పొనకం - 5[illegible] 5[illegible]
1986

అన్నమయ్య సంకీర్తనల్లో

జానపదగేయ ఫణితులు


పొన్నా పబ్లికేషన్స్ - 1

ప్రథమ ముద్రణ - 1986

ప్రతులు : 1000

వెల : రూ. **50**-

ప్రతులకు :

డా॥ పొన్నా లీలావతమ్మ

ఎం. ఏ., పిహెచ్. డి.

పానకం గ్రామం - 517503

తిరుచానూరు (వయా)

చంద్రగిరి తాలూకా

చిత్తూరు జిల్లా

ముద్రణ :

వెరైటీ ప్రింటర్స్

చల్లబజార్ రోడ్

ఏలూరు - 1

కవర్ పేజీ చిత్రణ : ఆనంద్

కవర్ పేజీ ముద్రణ :

ఎ. హెచ్. ప్రెస్

వేలూరు.



This book is Published with the
Financial assistance of
**Tirumala Tirupati Devasthanams**
Under their Scheme :
"AID TO PUBLIC RELIGIOUS BOOKS"

# అంకితం



నారాయణుని కీర్తించు పవిత్ర జిహ్వాతో
నరుని నుతించ నేరక ప్రభువులనే తిరస్కరించిన
పరమపావన చరితుడు తాళ్ళపాక అన్నమయ్య
తిరుమలేశునికే తన కృతులనంకిత మిచ్చిన రీతిగా

ఎవరు ఆదరించినా నిరాదరించినా నిరాకరించక
నిరంతరమూ నిజభక్తులను సంరక్షించి కాపాడే
కరుణాసముద్రా ! శ్రితజనమందారా !
నేనంకితమిచ్చు ఈ పుస్తక సుమమును
చేకొనుమా సంప్రీతితో శ్రీ రామచంద్రా !

# మనవి

‘అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు’ అనే అంశంపై పరిశోధన చేయడానికి అవకాశమిచ్చి తమదగ్గరున్న అలభ్యమయిన అన్నమయ్య సంకీర్తనల సంపుటాల్నిచ్చి పరిశోధన కార్యక్రమంలో సముచితమయిన సలహాలనిస్తూ ప్రోత్సహించడమే గాకుండా వ్యక్తిగత బాధ్యతా విషయాల్లోకూడా సంపూర్ణంగా సహకరించినవారు పూజ్యులు, గురువర్యులు, శ్రీవేంకటేశ్వర యూనివర్సిటీ వైస్-చాన్సలర్ ఆచార్య జి. యన్. రెడ్డిగారు

చిన్నప్పటినుంచీ అన్నమయ్య సంకీర్తనల్ని పాడి వినిపిస్తూ, పాడిస్తూ చిరుప్రాయంలోనే ఆమహనీయుని సంకీర్తనలపై భక్తి, అనురక్తి, ఆసక్తిబీజాల్ని నా హృదయక్షేత్రంలో నిక్షిప్తంచేసి, ఎం ఎ. ఫైనల్‌లో ఐచ్ఛిక పాఠ్యాంశంగా అన్నమయ్య సంకీర్తనల్ని స్వీకరించడానికి మూలకారకులైనవారు మత్పితామహులు పొన్నా కోదండరామయ్యగారు,

అన్నమయ్య సంకీర్తనల పాఠ్యాంశాన్ని బోధిస్తూ అందలి భాషాసాహిత్య సౌందర్య విశేషాలెన్నింటినో తెలియజేసి సంకీర్తనలపై మమకారాన్ని పెంచిన గురువులు ఆచార్య కె. సర్వోత్తమన్‌గారు, ఆచార్య కేతు విశ్వనాథరెడ్డిగారు,

పరిశోధన కార్యక్రమంలో గురుతరమయిన పర్యవేక్షణాబాధ్యత వహించినవారు ఆచార్య కె. సర్వోత్తమన్‌గారు,

పరిశోధనాకాలంలో తగిన సలహాలనిస్తూ ధైర్యోత్సాహాల్ని కలిగించి సహకరించిన గురువులు ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డిగారు,

అన్నమయ్య సాహిత్యానికి సంబంధించిన ముఖాముఖి చర్చల్లో తమ తమ అభిప్రాయాల్ని వెల్లడించి సహకరించి ప్రోత్సహించిన శ్రీకామిశెట్టి శ్రీనివాసులుగారు, డా॥ కె జి కృష్ణమూర్తిగారు, ఆచార్య బి. రామరాజుగారు, ప్రొ॥ నాయని కృష్ణకుమారిగారు, శ్రీవేంకటేశ్వర సంగీత నృత్యకళాశాల అధ్యాపకులు శ్రీ డి పశుపతిగారు శ్రీ ఎస్. ఆర్. జానకిరామన్‌గారు, శ్రీ వి యల్. జానకి రామన్‌గారు, శ్రీమతి జి. మైథిలిగారు,

అడిగిన తడవుగా జానపదగేయరీతుల్లో కొన్నింటికి సంబంధించిన స్వాభిప్రాయాల్ని వుత్తరాలద్వారా తెలియజేసి సహకరించిన డా॥ ఆర్వీయస్ సుందరంగారు మద్రాసు విశ్వవిద్యాలయ సంగీత శాఖాధ్యక్షులు ప్రొ॥ సీతగారు,

పరిశోధనకు అవసరమయిన పుస్తకాల్ని పరిశీలించడానికి అనుమతిచ్చిన శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయ గ్రంథాలయాధికారులు, పుస్తక సమీకరణలో తోడ్పడిన గ్రంథాలయ సిబ్బంది శ్రీ వి షణ్ముగంగారు, తిరుపతి శ్రీవెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా గ్రంథాలయాధికారులు, కేంద్రీయ విద్యాపీఠ గ్రంథాలయాధికారులు. మద్రాసు విశ్వవిద్యాలయ తెలుగుశాఖ అధ్యాపకులు, గ్రంథాలయాధికారులు, హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయాధికారులు,

పరిశోధన కాలంలో రెండేండ్లపాటు వుపకారవేతనం మంజూరు చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం మాజీ కార్యనిర్వాహకులు శ్రీ పి. వి. ఆర్. కె ప్రసాద్ ఐ ఎ. ఎస్. గారు, మరొక సంవత్సరంపాటు వుపకారవేతనం పొడిగించిన తిరుమల తిరుపతి దేవస్థానం మాజీ కార్యనిర్వాహకులు శ్రీ జి కుమారస్వామి రెడ్డి ఐ. ఎ. ఎస్ గారు,

పరిశోధన ముగింపు కాలంలో పరిపూర్ణమయిన సహకారం అందించి తోడ్పడినవారు డా॥ కేసర్ల వాణిగారు,

సిద్ధాంత వ్యాసంలోని అనుబంధ భాగాల్ని తయారుచేయడంలో తోడ్పడిన మిత్రబృందం కుమారి కె. మహేశ్వరి ఎం. ఎ. (ఫిలాసఫీ) కుమారి టి. శోభ ఎం. ఎ. (హిస్టరీ), కుమారి వై. అరుణ ఎం. ఎ. (హిస్టరీ, కుమారి ఆర్. శశికళ ఎం. ఎ (సంస్కృతం),

సిద్ధాంత వ్యాసానికి ప్రధాన న్యాయనిర్ణేతలుగావుండి పిహెచ్. డి. పట్టం రావడానికి కారకులై, పుస్తక ప్రచురణ విషయంలో చేయవలసిన మార్పులనుగూర్చి మంచి సలహాల నొసంగినవారు ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ (మధురై) గారు, ఇతర న్యాయనిర్ణేతలు ఆచార్య గోపాలకృష్ణరావు (హైదరాబాదు) గారు, ఆచార్య సాళువ కృష్ణమూర్తి (మద్రాసు) గారు,

ఈ పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయాన్ని అందజేసినవారు తిరుమల తిరుపతి దేవస్థానం అధికారులు,

సకాలంలో పుస్తకాన్ని చక్కగా ముద్రించి ఇచ్చినవారు వెరైటీ ప్రింటర్స్ ప్రొప్రైటర్ శ్రీ డి. యస్. ప్రకాశరావుగారు,

ముఖ పత్ర చిత్రాన్ని మనోహరంగా చిత్రించి ఇచ్చిన చిత్రకారుడు ఆనంద్‌గారు,

ముఖపత్ర చిత్రాన్ని సకాలంలో అందంగా ముద్రించి ఇచ్చిన ఎ. హెచ్. ప్రెస్ వేలూరు వారు,

ఇంకా ఈపుస్తక ప్రచురణకు అవసరమయిన సహాయ సహకారాలందించి తోడ్పడిన సోదర మిత్ర శ్రేయోభిలాషులు అందరికీ నా అభినందన కృతజ్ఞతలు.

— పొన్నాడ లీలావతమ్మ.

**ఆచార్య జి. యస్. రెడ్డి**
ఎం. ఎ., ఎం. లిట్., పిహెచ్. డి.
వైస్-చాన్సిలర్,
శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటి,
**తిరుపతి.**

# అభినందన

పదకవితాపితామహుడు అన్నమయ్య కృతులకు ప్రజల్లో పండితుల్లో మంచి వ్యాప్తి, ఆదరణ కల్గించడానికి ఇటీవల తిరుమల తిరుపతి దేవస్థానంవారు శ్రద్ధవహించడం చాలా ప్రశంసనీయమైన విషయం. ఈ రంగంలో దేవస్థానంవారు ప్రతి సంవత్సరం నిర్వహించే అన్నమయ్య జయంతులు, వర్ధంతులు, సంగీతకార్యక్రమాలు ప్రచురిస్తున్న గ్రంథాలు, అందజేస్తున్న పిరాళాలు, విడుదల చేస్తున్న క్యాసెట్లు వగైరా అన్నమయ్య సాహిత్యానికి దేశవ్యాప్తమైన ఒక నూతన వికాసానికి దోహదప్రాయం కావడం ముదావహం.

అన్నమయ్య సాహిత్యానికి విశ్వవిద్యాలయాల్లో స్నాతకోత్తరస్థాయిలో మొట్టమొదట పాఠ్యయోగం కలిగించింది శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు అధ్యయనశాఖ. పరిశోధన రంగంలో అన్నమయ్యకు పెద్దపీటం వేసిందకూడా ఈ తెలుగు అధ్యయన శాఖే. ఈ తెలుగు శాఖలో అన్నమయ్య భాషాసాహిత్య సంబంధిగా వెలువడిన పరిశోధక సిద్ధాంత గ్రంథాల్లో డా॥ లీలావతి ప్రస్తుతం ప్రచురించిన "అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు" ఒకటి. రచయిత్రి లీలావతి తెలుగు జానపద సంగీతంలోను, ప్రాచీన తెలుగు వాఙ్మయంలోను మంచి ప్రవేశమున్న పరిశోధకురాలు.

అన్నమయ్య సంకీర్తనలు ప్రధానంగా దేశిసంప్రదాయానికి సన్నిహితం అన్నమయ్య భాషకూడా దేశీయం. అన్నమయ్య జీవితం కూడా గ్రామీణ వాతావరణ

విలసితమే మౌలికమైన, అచ్చమైన దేశీయమైన సంగీత సాహిత్యభాషా సంపన్న మైన అన్నమయ్య వాఙ్మయం తెలుగు సాహిత్యంలో అద్వితీయం. భారతీయ సాహిత్యంలో అపురూపం. ప్రపంచసాహిత్యంలో అత్యద్భుతం. బహుముఖ ప్రజ్ఞాలమై బహువిధ కాంతుల్ని నవనవోన్మేషంగా ప్రసరించే అన్నమయ్య కృతులు పరిశోధకుల పాలిట బంగారు గనులు

అన్నమయ్య సంకీర్తనల్లోని ఒక అంశం అందలి జానపద గేయ రీతులు తెలుగులోని పల్లెటూరి పదాలు తెలుగువారి మౌలికతకు నిదర్శనాలు. తెలుగు సంగీతానికి ప్రాతిపదికలు; మార్గసంగీతానికి మార్గనిర్దేశకాలు. ఈ దృష్టితో డా॥ లీలావతి అన్నమయ్య సంకీర్తనల్ని వింగడించి, పరిశీలించి, పరిశోధించి అనేకమైన విషయాల్ని కొత్తగా పండితలోకానికి ఈ గ్రంథంలో తెలపడం ప్రశంసనీయం రచయిత్రికి నా అభినందనలు. అన్నమయ్య సాహిత్యరంగంలో ఇటీవల పేరుకెక్కుతున్న యువతరం పరిశోధకుల్లో, విమర్శకుల్లో డా॥ లీలావతి ఇంకా ఎక్కువ గుర్తింపును సాధించాలని, సాధించగలదని ఆశిస్తున్నాను.

జూలై 22,1986
తిరుపతి.

జి. యన్. రెడ్డి

**శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు**

ఎం. ఎ.,

మాజీ డైరెక్టర్,

అన్నమాచార్య ప్రాజెక్టు

**తిరుపతి.**

# అభిప్రాయం

'అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు' - చిరంజీవి లీలావతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి సమర్పించిన సిద్ధాంత వ్యాసంగం. జగతి కడు చెల్లుబడై, నగినగి భాషించునట్టి నాటికి పలుకులు పట్టి పట్టి తన పాటలలో ప్రయోగించి ససర్గపద సౌరభాన్ని తెలుగు వీథులలో గుబాళింప జేసిన ప్రజాకవి అన్నమయ్య. వాడుక భాషతో పాటు వాడుకలో ఉన్న జానపద బాణీలను పరిష్కరించి వానికి స్థిరత్వం కల్పించిన సంకీర్తనాచార్యుడు అన్నమాచార్యుడు. శివ కవుల వ్రాతలలో పట్టి పట్టి కలుగనుంచిన జానపద పాటల రసస్వరూపాలను తొలిసారిగ తెలుగు వాఙ్మయ ప్రపంచంలో నిలిపిన కీర్తి తాళ్ళపాక కవులదే. అన్నమయ్య తన సంకీర్తన లక్షణంలో దేశిపద లక్షణాన్ని వివరిస్తూ ఏల - చందమామ - గొబ్బిళ్ళు - దరువులు, జక్కుల రేకులు మొదలైన మధుర కవితలను చర్చిస్తాడు.

లోకధర్మం, నీతి, న్యాయం అనే నైతిక భావాన్ని ప్రజలలో పెంచడానికి అన్నమయ్య గానాన్ని అనుషంగికంగ స్వీకరించాడు. అతడు 'మేలు కొలుపులు' వినిపించినది కొండలలో నెలకొన్న పరమాత్మునికే కాదు. మన గుండె గూడులలో గూడుకట్టుకొన్న అంతరాత్మకు కూడ. భగవత్తత్త్వాన్ని సామాన్యుడు కూడ అర్థం చేసుకొని ఆచరించాలనేది ఆ భక్తకవి విశ్వాసం. అందుకే ఇన్ని పదాలు ప్రక్రియలు అవతరించాయి. ఇంత వైవిధ్యం, వైశాల్యం మరియే ఇతర పదకవి రచనల్లో గోచరించదు.

అన్నమాచార్య ప్రాజెక్టు అందజేసిన స్కాలర్‌షిప్పును సద్వినియోగం చేసుకొని, అన్నమాచార్యుని వాఙ్మయంమీద అనురక్తిని పెంచుకొని ఈ సిద్ధాంత వ్యాసంగాన్ని ఫలవంతం చేసిన చిరంజీవి లీలావతి అభినందనీయురాలు. జానపద గేయ ఫణితుల చర్చలో గ్రంథస్థమైన సంగీత సాహిత్య విషయాలను తడవుతూ మౌలికమైన విషయ వివేచనలో ఔత్సుక్యాన్ని ప్రదర్శించిన ఈ యువ విద్యార్థిని ఉత్తరోత్తరాభి వృద్ధిని సాధించాలనే నా ఆకాంక్ష. అన్నమయ్య జోలిపాట కొంత యోచించి తెల్పవలసిన విషయం. మన దృష్టికందని జానపద కళాంతర్గంగను సకల జన సంసేవ్యం చేయడానికి చిరంజీవి లీలావతి వంటి వర్ధిష్ణువు లెందరో ముందుకు రావలెననే నా ఆశంస. అంతా శ్రీనివాసేచ్ఛ.

మే 22, 1986

**తిరుపతి.**

**శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు**

# విషయసూచి

పుట

# ప్రస్తావన

## 1. 1 జానపద నిర్వచనం :

'జనానాం పదమ్' జనులకు సంబంధించింది అని జానపదశబ్దానికి వ్యుత్పత్తి. జనపద సంబంధమైంది జానపదం. జనపదమంటే పల్లెపట్టు. ఈ పల్లెపట్టుకు సంబంధించినవారు జానపదులు. కష్టసుఖాల్లో భావావేశాలకు లోనయినపుడు వారి గుండెలోతుల్లోంచి అప్రయత్నంగా వెలువడే పాటలే జానపద గేయాలు.

### 1. 1. 1 జానపద గేయాలు - పర్యాయపదాలు :

ఆంగ్లంలో 'ఫోక్ సాంగ్' (Folk song) అనే మాటకు సమానార్థకంగా తెలుగులో 'జానపద గేయం' అనే మాటను వాడుతున్నారు. జానపద గేయాలకు ప్రజావాఙ్మయం, పదవాఙ్మయం, అనాదృత వాఙ్మయం, మధుర కవితలు, పాత పాటలు, పల్లెపాటలు మొదలైనవి పర్యాయ పదాలుగా వున్నాయి. ఔత్తరాహులు వీటిని లోక సాహిత్యమని, లోక్‌గీత్ అని పిలుస్తారు. కన్నడంలో జానపద గేయానికి 'జనపదగీతె' అని, పల్లెపాట అనడానికి 'హళ్ళియహాడు' అని తమిళంలో 'నాట్టుప్పురప్పాల్గళ్' 'వాయ్‌మొళి ఇలక్కియం' అని వ్యవహరిస్తారు.

### 1. 1. 2 జానపద గేయ లక్షణాలు :

జానపద గేయాలకు ఒక ప్రత్యేకమైన కవి అంటూ లేకపోవడం, గేయ స్వరూపం స్థిరంగా వుండకపోవడం, రచనా కాలం నిర్ధారణగా తెలియక పోవడం, కేవలం మౌఖిక ప్రచారంతోనే జీవించడం, సులభశైలిలో సాగడం, పాడుకోవడానికి వీలుగా వుండడం, ఆశు రచనలయి వుండడం, పునరావృత్తిని కలిగి వుండడం, వస్తువు సామాన్య ప్రజలకు పరిచితమయింది కావడం, శృంగారానికి ప్రాధాన్య మివ్వడం అనే వాటిని ప్రత్యేక లక్షణాలుగా చెప్పుకోవచ్చు.

## 1. 2 ప్రాచీన సాహిత్యంలో జానపద గేయాల ప్రసక్తి :

నన్నయ (క్రీ. శ. 11వ శతాబ్ది) తన భారతంలో జానపదగేయాల్ని ప్రస్తావించకపోయినా గానానుకూలంగా వుండే దేశి ఛందస్సులయిన తరువోజ

(ఆదిపర్వము 5-145, 6-250), మధ్యాక్కర (ఆదిపర్వము 4-103, 142) లను వాడాడు.

నన్నెచోడుడు (క్రీ. శ 12వ శతాబ్ది) తన కుమార సంభవంలో ఈశ్వరుని అంకమాలికలు (3-38), ఉవిద లింపుగ పాడే వూయల పాటలు (4-89) ఆలతులు (4-112), కల్లు దించువారి గౌడుగీతాలు (6-85) శబర కామినులు కోరట గొని దంచుపాటలు (687) మొదలయిన జానపద గేయ రీతుల్ని ప్రస్తావించాడు.

పాల్కురికి సోమన (క్రీ. శ. 12వ శతాబ్ది) ఏలలు పండితరాధ్యచరిత్ర (పు. 433), తుమ్మెద ప్రభాత, పర్వత, ఆనంద, శంకర, నివాళి, వాలేశు, గొబ్బి, వెన్నెల. (పండితారాధ్య చరిత్ర పుట 513) కోలాటం, చాంగుబళా (బసవపురాణం పుట. 22), జోల (బసవపురాణం, పుట. 68) మొదలయిన దేశి గేయరీతుల్ని పేర్కొన్నాడు.

దేశి రీతికి చెందిన అనిబంధ పదాల్ని రచించినవాడు కృష్ణమాచార్యుడు. అతని రచనలయిన వచన సంకీర్తనం, తులసీ మాహాత్మ్యం, నృసింహ నామాలు, రామనామ కీర్తనం. రామనామాలు, తరువాతి వాగ్గేయకారులకు భావంలో, రచనా పద్ధతిలో, సంప్రదాయ పాలనలో మార్గదర్శకంగా నిలిచాయి.
అన్నమాచార్యునికి పూర్వం వాగ్గేయకారుడుగా చెప్పదగ్గవాడితడొకడే.

తర్వాత నాచనసోముని (క్రీ శ. 14 వ శతాబ్ది) వసంత విలాసంలోని జాజర పాట ఒక్కటే నేటికి లక్ష్యోదాహరణంగా మిగిలింది.

దీని తర్వాత పోతన (కీ. శ. 15 వ శతాబ్ది) తన భాగవతంలో బాలునంకించి పాడే పాటల్ని (10-355) గోవిందు మీది పాటల్ని (10-505), ప్రస్తావించాడు శ్రీనాథుడు (క్రీ. శ. 15 వ శతాబ్ది) భీమేశ్వర పురాణంలో 'యక్షగాన సరణి' ని (3-68) పేర్కొన్నాడు. అన్నమయ్య కాలం నాటిదాకా లిఖిత వాఙ్మయంలో కనిపించే జానపద గేయాలివి మాత్రమే.

## 1. 3. జానపద గేయ కవులు :

కవి అన్న బిరుదు తగిలించుకోకపోయినా భావ రమ్యతతో పదిమంది మెచ్చే విధంగా అప్రయత్నంగా తన వూహల్ని పదస్థం, సంగీతస్థం చేసేవాడే జానపద కవి.

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

కవి అన్న ప్రతి వ్యక్తిలోను జానపద ధర్మం నిగూఢంగా వుంటుంది. ఆ ధర్మాన్ని అభిమానించే వాడు తన రచనలో ఎక్కడయినా దాన్ని ప్రస్ఫుటింప జేస్తాడు. జానపద గేయకవుల్లో ఉత్తమమయిన ఉదాత్తమయిన భావాలు కూడా కనిపిస్తాయి. అలాగే లాక్షణికులు మెచ్చుకోదగ్గ పదుసలు కూర్చే వాగ్గేయకారులున్నారు.

### 1. 3. 1. జానపద గేయకవులు - మహా కవులు :

ఏ సాహిత్యంలోగాని పద్యం కంటే పదమే ముందు పుట్టి పెరుగుతుందనడం విజ్ఞులంగీకరించిన సిద్ధాంతం ఆ పదాల్ని ఆధారంగా చేసుకొని కథకు, కల్పనకు, అవకాశమిస్తూ పదాలతో, చిత్ర విచిత్ర కవితా శిల్పంతో రచనలు చేస్తూ పండితుల మధ్య రాజాస్థానంలో పీఠం వేసుకొని కూర్చునేవాడు కవి. శాస్త్ర పరిధి, వ్యంగ్య వైభవం మహాకవుల ప్రతిష్టను నిలిపేవి. అయితే జానపద గేయ కవుల పరిధి స్వతంత్రం. వారు కోరుకొనేది సామాన్య ప్రజల మెప్పు. వాస్తవికతకు దగ్గరగా రచన చేయడం వారి ధర్మం. అయినా మహాకవులయిన వారు తమకు నచ్చినచోట్ల జానపదగేయ ఫణితుల్ని కథల్ని ఆదరించడమూ, అలాగే జానపదగేయ కవులు మహా కవుల లక్షణాల్ని అనుకరించడమూ జరుగుతుంది. ఈ విషయాన్నే శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు-

'స్వతంత్రమైన ధారాళత గల పద్య రచనలో అర్థభావాలకు కవి చూపగలిగినంత అఖండత, వైశాల్యం, సూక్ష్మత, వైవిధ్యం మొదలైన గుణాలు పద రచనలో చూపలేడు. మరి రాగతాళాలు, సూత్రాలు, బొమ్మనాడించినట్లు అర్థభావ భావనలను పట్టి చూపగలిగిన పద రచనలో ఉన్నంత వర్చస్సు, శక్తి, ఆకర్షణ పద్య రచనలో రాదు'[1] అని తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

### 1. 3. 2. జానపద గేయకవులు - వాగ్గేయకారులు :

'వాఙ్మాతు ఉచ్యతే గేయం
ధాతు రిత్యభి ధీయతే
వాచం గేయం చ కురుతే
యః స వాగ్గేయ కారకః'

అని శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరం - ప్రకీర్ణాధ్యాయంలో వాగ్గేయకార లక్షణం చెప్పాడు.

ఈ వాగ్గేయకార లక్షణాన్ని గూర్చి సవివరంగా ఆచార్య జి యస్ రెడ్డిగారు-

'వాగ్గేయకారుడు అంటే వాక్ + గేయం వాక్కును, గేయాన్ని చేసే నేర్పు గలవాడు అంటే వాక్కారుడు, గేయకారుడు అయినవాడు వాగ్గేయకారుడు అని తెలుసుకోవాలి. గేయమంటే పాట. పాటల నిర్మాణంలో రెండు అంశాలు ముఖ్యం 1. భాషాపరంగా పాటలోని మాటలు ఆ మాటల కూర్పు. ఇదే వాక్కు. 2 సంగీత పరంగా పాటకు రాగ లక్షణ నిర్ణయం అంటే సంగీతపు కూర్పు. ఇదే గేయం. సంగీతపు పరిభాషలో వాక్కును అంటే పాటల్లోని మాటల కూర్పును మాతువు అనీ, గేయాన్ని అంటే సంగీతపు కూర్పును ధాతువు అనీ వ్యవహరిస్తారు. 'వాగ్గేయ కారుడు' అన్నపుడు వాక్కారుడు వాక్కును (మాతువును) కూర్చగలవాడు. గేయకారుడు సంగీతాన్ని (ధాతువును) కూర్చగలవాడు అయినవాడని గ్రహించాలి. ఇంకా వివరించి చెప్పాలంటే మన సినిమాల్లోలాగ పాట వ్రాసినవాడు ఒకడు. దానికి సంగీతం కూర్చినవాడు ఒకడు, పాడి రంజింపజేసేవాడు మరొకడులాగా కాకుండా వాక్కారుడు, గేయకారుడు, గాయకుడూ అయిన వాడే వాగ్గేయకారుడు'[2] అని తెలియజేశారు.

మహాకవులకంటే వాగ్గేయకారులు జానపద కవులకు దగ్గరివారు. కారణం వీరి లక్ష్యమెల్లా సామాన్య ప్రజా జాగృతే. ప్రజలు దేన్ని ఆదరిస్తారో, ప్రజలకు ఎలా చెబితే రుచిస్తుందో తెలిసినవారు. ప్రజల భాషను తమ గేయభాషగా కీర్తన భాషగా, కృతిభాషగా మార్చుకొన్నవారు. ఈ రహస్యాన్ని తెలిసినవారు, ఆచరించినవారు ప్రసిద్ధ వాగ్గేయకారులుగా రాణించారు. వారిలో తాళ్ళపాక అన్నమయ్య ఒకడు.

## 1. 4 అన్నమయ్య సంకీర్తనలు వ్రాయడానికి కారణాలు :

అన్నమయ్య సంకీర్తల్ని వ్రాయడానికి ప్రధానంగా నాలుగు కారణాలు కనిపిస్తాయి మొదటిది అతని కాలం నాటికి కృష్ణమాచార్యులు వచన సంకీర్తనలు ప్రసిద్ధిలో వుండడం,

రెండవది శైవకవులు పదకవితకు ఆదరణ చూపడం.

మూడవది కన్నడ వాగ్గేయకారులు జానపద గేయరీతుల్ని తమ కవితా వాహికగా వాడుకోవడం,

నాల్గవది నాళాయిర దివ్య ప్రబంధాలకు దీటుగా వ్రాయాలనే సంకల్పం

## అన్నమయ్య - కృష్ణమాచార్యులు :

ఆంధ్ర దేశంలో వచన రచనకు, భజన సంకీర్తన పద్ధతులకు పరమాచార్యుడు ప్రపితామహుడయినవాడు కృష్ణమాచార్యుడు. ఇతడు నాలుగు లక్షలకు పైగా వచన సంకీర్తనల్ని రచించినట్లు ప్రసిద్ధి. వీటిని వచనాలని, విన్నపాలని, సంకీర్తనలని, సింహగిరి నరహరి వచనాలని నామసంకీర్తనలని, వేదాంత సంకీర్తనలని, ధ్యాన సంకీర్తనలని అనేక విధాలుగా పేర్కొన్నాడు. ఇతని ధ్యాన సంకీర్తనల్లో గానాను కూలమయిన నృసింహ నామాలు, రామనామాలు, రామనామ సంకీర్తనలు ప్రముఖ మయినవి.

## అన్నమయ్య - శివకవులు :

పన్నెండు, పదమూడు శతాబ్దాల్లో వీరశైవకవులు శైవమత ప్రచారంకోసం సాహిత్యాన్నే సాధనంగా గ్రహించి సాహిత్యలోకాన్ని పాలించిన ప్రజాకవీశ్వరులు. మతము సాహిత్యానికి మూలాధారమని విశ్వసించి మతోద్దీపనకు సాహితీ విలాసం అత్యావశ్యక మని భావించి ఆ మత ప్రచారంకోసం ప్రజామోదకరమైన వైవిధ్యాన్ని నూతన చైతన్యాన్ని సాధించారు. వీరు తమ కావ్య రచనలకు జానుతెనుగునే వుపయోగించారు. భాషను రచనా ప్రక్రియను, వస్తు విషయాన్ని ప్రజలకు సన్నిహితంగా తెచ్చి వాటిపై దేశీయతా ముద్ర వేశారు. వీరి కవిత్వం, భక్త్యావేశంతో కొనసాగి శైవమత ప్రచారానికి తోడ్పడింది. కాబట్టి వైదిక మత పునరుద్ధరణకు తానుకూడా శివకవుల మార్గాన్నే అనుసరిస్తే తన దీక్ష ఫలించగలదని విశ్వసించి భాషావస్తు ప్రక్రియాదుల్లో దేశీయతా ముద్రతో సంకీర్తన రచన గావించాడు అన్నమయ్య.

## అన్నమయ్య - కన్నడ హరిదాసులు :

కన్నడ హరిదాస వాఙ్మయంలో శ్రీపాదరాయలు, వ్యాసరాయలు, పురందర దాసు, కనకదాసు గోపాలదాసు జగన్నాథదాసు మొదలయినవారు జానపద గేయాల

ఆసరాగా ద్వైత మత సిద్ధాంతం ప్రచారం చేశారు. నిత్య నైమిత్తిక పూజాదుల్లో సంస్కృతంతో సమానంగా వాటికి ప్రతిపత్తి కల్పించారు. దీనివల్ల భాషకు గౌరవం, సమాజంలోని వారి కందరికి ప్రాధాన్యం, సిద్ధాంత ప్రచారానికి అనుకూల వాతావరణం ఏర్పడింది.

## అన్నమయ్య - ఆళ్వారులు :

తమిళదేశంలోనే విశిష్టాద్వైతం పుట్టింది. ఆ మత ప్రవర్తకులు రామానుజుల వారు వైష్ణవులకు నాలాయిర దివ్య ప్రబంధం పవిత్ర గ్రంథం. దేవాలయాల్లో సంస్కృత భాషలో సాగే పూజా కార్యక్రమాలకు సమానమయిన గౌరవం నాలాయిర దివ్య ప్రబంధ పఠనానికి వుంది వైష్ణవమంతా తిరునామం చుట్టూ పరిభ్రమిస్తు వుంది. అన్నమయ్య వైష్ణవాలయాలలో సాగే నాలాయిర దివ్య ప్రబంధ పఠనానికి ఆకర్షితుడై తెలుగులో కూడా తత్తుల్యమయిన పవిత్ర మత ప్రచార యోగ్యమయిన గేయ సంకలనం వుంటే బాగుంటుందనే దీక్షతో అన్నమయ్య ఈ కీర్తనలు వ్రాసి వుండవచ్చు శ్రీరంగ పట్టణంలో సాగే దివ్య ప్రబంధ పఠనమే శ్రీ పాదరాయల వారికి కన్నడ సంకీర్తనల సృష్టికి కారణమయిందనే వాదాన్ని ఇక్కడ సమన్వయించుకోవచ్చు.

ఇంక అన్నమయ్య జీవితచరిత్ర విశేషాలు అనే అంశం రెండవ ప్రకరణంలో ప్రస్తావించబడుతుంది.

> 'పావనములు హరి భక్తి వి
> భావనములు సర్వ మంత్ర పరమ రహస్యో
> ద్భావనములు గాయక నిక
> రావనములు తాళ్ళపాక యన్నయ పదముల్'

## సంఖ్యాసూచి :

1. సారంగ పాణి పద సాహిత్యం – 'అభినందన', పు. 9
2. అన్నమాచార్యుని కవిత (వాణి 22-7-55)
3. కీర్తన కారరు, పుట: 17

# 2. అన్నమయ్య జీవిత చరిత్ర

## 2. 1. జననం - బాల్యం :

ఆంధ్ర వాగ్గేయకారుల్లో ప్రసిద్ధుడయిన తాళ్ళపాక అన్నమయ్య జన్మస్థలం నేటి కడప జిల్లా రాజంపేట తాలూకాలోని తాళ్ళపాక అనే గ్రామం. ఈ గ్రామం పేరే వీరి వంశీయులకు ఇంటిపేరుగ నిలిచింది.

భారద్వాజస గోత్రుడయిన నారాయణ సూరికి, అతని ధర్మపత్ని లక్కమాంబ అనే పుణ్యదంపతులకు శ్రీ వెంకటేశ్వరస్వామి అనుగ్రహం వల్ల నందకాంశంలో క్రీ. శ. 1408 క్రోధి సంవత్సరం వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు విశాఖ నక్షత్రంలో ఒక శుభలగ్నంలో అన్నమయ్య జన్మించాడు. వీరు నందవరీకులు. తల్లిదండ్రులు, ఆగమోక్తంగా తమ కుమారునికి అన్నమయ్య అని నామకరణం చేశారు. అన్నమయ్య పసిటి ప్రాయం నుండి తిరుమలప్ప ప్రసాదమని చెప్పందే వుగ్గుపాలు కూడా త్రాగేవాడుకాదు. వెంకన్న పేరు వివరించి జోలపాట పాడందే నిద్రపోయేవాడు కాదు.

తల్లిదండ్రులు ఐదేండ్లు నిండిన తోడనే అన్నమయ్యకు ఉపనయనం చేసి గురువు దగ్గర విద్యాభ్యాసానికి చేర్చారు. అతడు ఏకసంథాగ్రాహియై గురువు చెప్పిన పాఠాలు ఎప్పటి కప్పుడు వల్లించేవాడు. గురువు ఆశ్చర్య చకితుడై ఆ బాలునికి నేర్పించ వలసిందేమీలేదని గ్రహించాడు. అతని విద్యాభ్యాసం కేవలం శాస్త్రమర్యాదగానే సాగింది. దైవానుగ్రహం వల్ల విద్యలన్నీ కరతలామలకం కావడంతో అతడు ఆడినమాటెల్ల అమృతకావ్యంగాను, పాడిన పాటెల్ల పరమగానంగాను మారింది.

## 2. 2 తిరుపతి యాత్ర - స్వామి దర్శనం :

ఎప్పుడూ భుజాన దండె తగిలించుకొని పాటలు పాడుకొంటూ ఉండే అన్నమయ్యను పిలిచి తల్లిదండ్రులు, అన్నవదనెలు అప్పుడప్పుడు పనులు చెప్పుతుంటే విసుక్కోకుండా చేస్తుండేవాడు. ఒకసారి పశువులకు గడ్డి తెమ్మని అడవికి పంపినపుడు అన్నమయ్య కొడవలితో పచ్చిక కోస్తున్నపుడు ఉన్నట్లుండి

చిటికెనవ్రేలు తెగి బొటబొట రక్తం కారింది. ఈ అవస్థకు కారకులైన తల్లిదండ్రులపై తన బంధువులపై విరక్తి చెంది తనకెవ్వరూ లేరని నిశ్చయించుకొని శేషాద్రినాథుని సేవించి తరించాలని తిరుపతి వెళ్ళే యాత్రికుల వెంట నడిచి తిరుపతి చేరాడు. ఆయా దేవతలను దర్శించుకొంటూ అలిపిరికొండ దాటి మోకాళ్ళ పర్వతం చేరే సరికి మిక్కిలి ప్రయాస చెంది ఒక రాతిపై సొమ్మసిల్లి పడిపోయాడు. అప్పుడు అలమేలు మంగమ్మ తల్లిరూపములో ప్రత్యక్షమై బాలుని ఒడిలోకి తీసుకొని సేద దీర్చి పాయసాన్నం తినిపించి స్వామిని తెలుసుకొనే మార్గాన్ని సూచించి అంతర్ధానమయింది. జగన్మాత ప్రసాదంతో అన్నమయ్య పరమ సారస్వత పారీణుడై సహజ కవిత్వవాచా ప్రౌఢిమతో అలమేలు మంగమ్మపై ఆశుధారగా వేంకటేశ్వర మకుటంతో ఒక శతకాన్ని చెప్పాడు.

దేవి ఆదేశానుసారం చెప్పులు వదలి పెట్టి శేషశైలాన్ని ఎక్కుతూ చూడ వలసిన ప్రదేశాలన్ని చూసి ఆ రాత్రి అక్కడే గడిపి మరునాటి ఉదయం స్వామి పుష్కరిణిలో స్నానంచేసి నేరుగా వరాహస్వామిని దర్శించుకొని వేంకటేశ్వరస్వామి గుడికి వెళ్ళేటప్పటికి ఆలయం తలుపులు తాళం వేశారు. అన్నమయ్య ఆవేదనతో భావావేశం పొంది ఒక పద్యశతకంతో స్వామిని స్తుతించాడు. వెంటనే తాళాలు ఊడి ఆలయం తలుపులు తమంత తామే తెరుచుకొన్నాయి వైఖానసులు అన్నమయ్య మహిమను కొనియాడి స్వామి దర్శనం చేయించి తీర్థప్రసాదాలిచ్చి ఆశీర్వదించారు.

అన్నమయ్య స్వామిని సేవించి ఒక పంచ తిన్నెపై ఆసీనుడై వున్నపుడు ఘన విష్ణువనే యతీంద్రుడు అతని దగ్గరకు వచ్చి తనకు స్వామి క్రిందటి రాత్రి స్వప్నంలో అన్నమయ్య రాకను గూర్చి తెలిపి పంచ సంస్కారాలు చేయమని ఉద్బోధించిన విషయాన్ని చెప్పి ముద్రాధారణాది పంచసంస్కారాలు నిర్వహించాడు నాటితో అన్నమయ్య అన్నమాచార్యుడయ్యాడు.

## 2. 3. తాళ్ళపాక ఆగమనం - గృహస్థాశ్రమ స్వీకారం :

అన్నమయ్య తిరుమలలో వైష్ణవుడై కాలం గడుపుతున్నపుడు కొంత కాలానికి తల్లిదండ్రులు అన్నమాచార్యుని వెతుక్కొంటూ తిరుమల చేరారు. దేవాలయం మండపంలో కూర్చొని తన్మయత్వంతో గానం చేస్తున్న కుమారుని చూసి సంతోష

పడి తాళ్ళపాకకు రమ్మని తల్లి ప్రాధేయ పడింది. అన్నమయ్య తనకు స్వామి స్వప్నంలో కనబడి ఆజ్ఞ యిచ్చిన ప్రకారం గురువు దగ్గర సెలవు తీసుకొని తల్లి దండ్రుల వెంట తాళ్ళపాకకు తిరిగి వెళ్ళి అక్కడే కొన్నేళ్ళు గడిపాడు. అపుడు వారి తల్లిదండ్రుల ఆదేశం, భగవత్సంకల్పం వల్లను తిమ్మక్క, అక్కలమ్మ అనే ఇద్దరు కన్యలను అన్నమయ్య వివాహమాడి గృహస్థాశ్రమ ధర్మం నిర్వహిస్తూ భగవదారాధనలో నిమగ్నుడయ్యాడు.

## 2. 4. నానాదేశ సంచారం :

అన్నమాచార్యులు స్వామివారు తనకు స్వప్నంలో కనబడి చెప్పిన ఆజ్ఞాను సారం రోజుకొక్క సంకీర్తన వెలయిస్తూ సంకీర్తన యజ్ఞం నిర్వహించేవాడు. ఊరూరు తిరుగుతూ ఆయా దేవాలయాల్లోని దేవుళ్ళను కీర్తిస్తూ పాటలు పాడేవాడు. ఇలా సంచరిస్తున్నప్పుడే శఠకోప యతుల శక్తియుక్తులను గూర్చి విన్నాడు. అహో బిల క్షేత్రంలోని నృసింహస్వామి శఠకోపమునికి యతిరూపంలో ప్రత్యక్షమై త్రిదండాన్ని, నారసింహచక్రాన్ని బహూకరించి నామమంత్రాన్ని వుపదేశించి సన్యాసాశ్రమాన్ని అనుగ్రహించిన విషయం తెలుసుకొని ఆ మహనీయుడయిన శఠకోపమునీంద్రుని వద్ద సకల వేదాంత సారాన్ని సమగ్రంగా అభ్యసించాడు.

## 2. 5. రాజాశ్రయం :

అన్నమాచార్యులు మానవజాతి కళ్యాణంకోసం వైష్ణవ తత్వాన్ని సంకీర్తనల ద్వారా ప్రచారం చేయసాగాడు అతని సంకీర్తన పద్ధతి జగన్మోహనమై ప్రసిద్ధి కెక్కింది. అతని హరి భక్తిని, సంకీర్తనల గానరక్తిని తలపోసి, తుంబురుడో, నారదుడో అని ప్రజలందరూ కీర్తింప సాగారు. ఆ వార్తలు విన్న కడప మండలం లోని టంగుటూరును పాలించే సాళ్వ నరసింగరాయలు అన్నమాచార్యులను తన ఆస్థానానికి పిలిపించి సకల సదుపాయాలను కలుగజేసి తనకు తోడు నీడగా అక్కడే వుండమని ప్రార్థించాడు. వైష్ణవ ధర్మవ్యాప్తికి రాజాశ్రయం ఉపకరిస్తుందనే భావనతో అన్నమయ్య అందుకు సమ్మతించాదు.

ఒకరోజు ప్రభువు అన్నమాచార్యుని తన కొలువుకూటానికి ఆహ్వానించి మధురమైన ఒక కీర్తన పాడి వినిపించమని సభాముఖంగా ప్రార్థించడంతో అతడు

రసరాగాలుట్టిపడేలాగా 'వేంకటపతి' మీద ఒక శృంగార పదాన్ని పాడాడు. ఆ పాట విని రాజు, సభలోనివారూ తన్మయులయ్యారు. ఆ పాటలోని కవితగానీ, శృంగార భావంగానీ కాళిదాసాది ప్రముఖ కవుల్లో కూడా కనిపించదని ప్రభువు కీర్తించి కాంచనాంబరాలతో ఘనంగా సత్కరించి తనమీద కూడా ఇలాంటి పాట ఒకటి పాడమని అన్నమయ్యను కోరాడు. అతడు వెంటనే హరిహరీ! అని చెవులు మూసుకొని నరహరిని కీర్తించే నా నాలుక నరుని కీర్తించలేదని రాజును తిరస్కరించాడు. రాజు అవమానితుడై ప్రతీకార బుద్ధితో అతనికి మూరురాయరగండ సంకెల బిగించి చెరసాలలో త్రోయించాడు. అన్నమయ్య దీనుడై వేంకటేశ్వరుని గూర్చి ఒక పాట పాడేసరికి సంకెళ్ళూడి క్రింద పడ్డాయి ఆ వార్తవిన్న రాజు ఉగ్రుడై మళ్ళీ తన సమక్షంలో సంకెల వేయించి అవహేళన చేశాడు. మహా భక్తుడయిన అన్నమయ్య అతని అజ్ఞానానికి నవ్వుకొని స్వామి మీద మళ్ళీ ఒక పాట పాడి బంధ విముక్తుడయ్యాడు.

సాళ్వ నరసింహరాయలు తన తప్పిదాన్ని తెలుసుకొని అన్నమయ్యను అవతార పురుషునిగా భావించి అతని పాదపద్మాలకు ప్రణమిల్లి క్షమించమని దీనుడై విలపించాడు. చిన్ననాటి నుండి తనకాశ్రయమిచ్చినవాడు కావడం వల్లను, గౌరవాభిమానాలు ప్రదర్శించినవాడు కావడం వల్లను అన్నమయ్య ప్రసన్నుడై అనుగ్రహించి భగవద్భక్తులను ఇంకెప్పుడూ అవమానించవద్దని, కృతయుగంలో ధ్యానానికి, త్రేతాయుగంలో క్రతువులకు, ద్వాపరంలో అర్చనలకు మెచ్చి పరమాత్ముడిచ్చే వరాలు కలియుగంలో కేవలం సంకీర్తనలకే ఇస్తాడని నరసింగ రాయలకు ఉపదేశించి తాను రాజాశ్రయాన్ని ఇష్టపడక మళ్ళీ తిరుమలక్షేత్రాన్నే చేరుకొన్నాడు.

తిరుమలలో ఉన్నప్పుడే కర్ణాటక సంగీత పితామహుడుగా ప్రఖ్యాతి చెందిన పురందరదాసు అన్నమయ్య మహిమలను, సంకీర్తనలను విని అతనిని కలుసుకోవడానికి తిరుమలకు వచ్చాడు. అన్నమయ్య మూర్తీభవించిన స్వామి వాకిలాగ కూర్చొని తంబుర మీటుతూ పాటపాడుతున్నాడు. పురందరదాసు ఆ సన్నివేశం చూస్తూ మైమరచి అప్రయత్నంగా అలాంటి పాటే పాడసాగాడు. వీరిద్దరు కలుసుకొని ఒకరి మహిమలనొకరు కీర్తించుకొన్నారు. పురందరదాసు అన్నమా

చార్యుని సాక్షాత్తు విష్ణువుగా భావించి స్తుతిస్తే అన్నమాచార్యులు పురందరదాసును శ్రీరంగ విట్ఠలుడుగా సంభావించి ఆశీర్వదించాడు.

## 2. 6 అన్నమయ్య సంతతి - వారి రచనలు :

తాళ్ళపాక వంశానికి ప్రసిద్ధి తెచ్చినవాడు అన్నమయ్య. ఈ కుటుంబం లోని వారు మూడు తరాల వరకు కవిపండిత వాగ్గేయకారులుగా రాణించారు.

అన్నమయ్య వేంకటేశ్వర స్వామి ముద్రాంకితంగా ముప్పైరెండువేల శృంగార ఆధ్యాత్మ సంకీర్తనల్ని ద్విపద రామాయణం, సంస్కృత సంకీర్తన లక్షణం సంస్కృత వేంకటాద్రి మాహాత్మ్యం, శృంగార మంజరి, పన్నెండు శతకాలు, అనేక బాషల్లో ప్రబంధాలు రచించాడు. వీటిలో పదకొండు శతకాలు, ద్విపద రామాయణం, వేంకటాద్రి మహాత్మ్యం, సంకీర్తనలక్షణం, అలభ్యాలు. ఒక శతకం, పన్నెండువేల శృంగార ఆధ్యాత్మ సంకీర్తనలు మాత్రం లభించాయి.

అన్నమయ్య మొదటి భార్య తాళ్ళపాక తిమ్మక్క. ఈమె సుభద్రా కల్యాణమనే మంజరీ ద్విపద కావ్యాన్ని రచించింది. ఇది ప్రకటించబడింది.

అన్నమయ్య పెద్దకుమారుడు తాళ్ళపాక నరసింగన్న. ఇతని కృతులు తెలియడంలేదు.

అన్నమయ్య రెండవ కుమారుడు తాళ్ళపాక పెదతిరుమలాచార్యుడు. ఇతని కృతులు - వేంకటేశ్వర వచనాలు, శృంగార దండకం, చక్రవాళ మంజరి, శృంగార వృత్త శతకం, వేంకటేశ్వరోదాహరణం, నీతి సీస శతకం, సుదర్శన రగడ, శ్రీ వేంకటేశ్వర సుప్రభాత స్తవం, భగవద్గీతానువాదం, రేఫ ఱకార నిర్ణయమనే లక్షణ గ్రంథం మొదలైనవి ప్రకటించబడ్డాయి. శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు, ద్విపద హరివంశం, సంకీర్తన లక్షణ వ్యాఖ్య అలభ్యాలు.

పెద తిరుమలయ్య పెద్దకుమారుడు తాళ్ళపాక చిన తిరుమలాచార్యుడు ఇతని కృతులు - శృంగార, ఆధ్యాత్మ సంకీర్తనలు, అష్టభాషా దండకం, తెలుగు సంకీర్తన లక్షణం, ఇవన్నీ ప్రకటించబడ్డాయి.

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

పెద తిరుమలయ్య నాల్గవ కుమారుడు తాళ్ళపాకి చిన్నన్న. ఇతని కృతులు అన్నమాచార్య చరిత్ర, పరమయోగి విలాసం, అష్టమహిషీ కల్యాణం, ఉషా పరిణయం మొదలైనవి. ఇవి కూడా ప్రకటించ బడ్డాయి.

చిన తిరుమలాచార్యుని కుమారుడు తాళ్ళపాక తిరువేంగళప్ప. ఇతని కృతులు అమరుక మనే కావ్యానువాదం ప్రకటింపబడింది అమరుకానికి తెలుగు వ్యాఖ్య అయిన బాలప్రబోధిక మమ్మటుని కావ్య ప్రకాశికకు వ్యాఖ్య అయిన సుధానిధి ప్రకటించబడలేదు.

అన్నమయ్య దౌహిత్రుడు - తిరుమలాంబా తిరుమల కొండయార్యుల కుమారుడు రేవణూరి వేంకటాచార్యుడు. ఇతని కృతులు - శకుంతలాపరిణయం శ్రీపాద రేణుమాహాత్మ్యాలు.

అన్నమయ్య రోజుకొక్క కీర్తన వంతున 32 వేల కృతులు వ్రాసి తన సంకీర్తన యజ్ఞాన్ని పూర్తిచేసి పదకవితాపితామహుడు, సంకీర్తనాచార్యుడు ద్రావిడాగమ సార్వభౌముడు అనే బిరుదాలతో ప్రఖ్యాతికెక్కి క్రీ. శ. 1503 దుందుభి సంవత్సరం ఫాల్గుణ బహుళ ద్వాదశినాడు శ్రీ వేంకటేశ్వర స్వామిలో ఐక్యమయ్యాడు. తరువాతి వాగ్గేయకారులకు గురువయ్యాడు.

అన్నమయ్య సంకీర్తనల ప్రసిద్ధికి కారణమయిన అంశాల్లో ఒకటయిన జానపద గేయ ఫణితులు అనే అంశం మూడవ ప్రకరణంలో చర్చించబడుతుంది.

'రంజనములు దుర్గుణ గణ
భంజనములు విమల కమల భవ జనక గుణా
సంజనములు సుజ్ఞాన ధ
నాంజనములు తాళ్ళపాక యన్నయ పదముల్'

---

# 3. అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు

అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితుల్ని పరిశీలించడానికి ముందు వాగ్గేయకారుల లక్షణాల్ని పరిశీలించడం సమంజసం.

## 3. 1 వాగ్గేయకార లక్షణాలు :

వాక్కు సాహిత్యం యొక్క కూర్పు. గేయం సంగీతం యొక్క కూర్పు. సాహిత్యానికి పదం ప్రాతిపదిక. దీని గుణం భావం. అలాగే సంగీతానికి ప్రాతిపదిక స్వరం. దీని గుణం నాదం. అందువల్ల భావ ప్రధానమయిన పదాన్ని నాద ప్రధానమయిన స్వరాన్ని కూర్చి ధాతు మాతువుల్ని గీతంగా కూర్చే వాడే వాగ్గేయ కారుడు. ఇతనికే ఉభయకారుడు, బయకారుడు అనే పేర్లు.[1] సుశబ్దాపశబ్ద వివేచనం, మార్గ దేశిచ్ఛందో భేదాల వివేచన, రసభావ పరిజ్ఞానం నృత్య గీత వాద్యాల్లో నేర్పు, గాత్ర మాధుర్యం కలిగి వుండడం, గాన పద్ధతుల్లోని యాసల్ని తెలుసుకొని వుండడం మొదలయినవి వాగ్గేయకారుల లక్షణాలు.[2]

## 3. 2. వాగ్గేయకారులు - వర్గీకరణ :

వాగ్గేయకారులకున్న సంగీత సాహిత్య పరిచయాల్ని బట్టి వుత్తమ, మధ్యమ, అధములని మూడు రకాలుగా వర్గీకరించడం ఒక పద్ధతి.

సంగీత సాహిత్యాలలో నిష్ణాతుడయినవాడు ఉత్తముడు. సంగీత రచన బాగా చేయగలిగి మాటల కూర్పులో మందుడయితే మధ్యముడు. ధాతు మాతువుల రెండింటి రచన తెలిసీ ప్రబంధాల్లో ప్రౌఢి లేని వాడు కూడా మధ్యముడే అవుతాడు. మాటల కూర్పులో నేర్పరి, సంగీత రచనలో మందుడూ అయితే అధముడు. సంఖ్యా దృష్టితో వాగ్గేయకారుల్ని గణించడం ఒక పద్ధతి. పల్లవి - గోపాలయ్యర్ కొన్ని రచనలే చేశాడు. త్యాగయ్య, 24 వేల కృతులు వ్రాశాడు. క్షేత్రయ్య 4, 100 పదాలు వ్రాశాడు. పురందరదాసు 4,75,000 పదాలు వ్రాశాడు. తెలుగు వాగ్గేయ కారులలో రాశిలోను, వాసిలోను మించే విధంగా అన్నమయ్య 32 వేల కీర్తనలు

వ్రాశాడు. ఇతరుల రచనల్లోలేని విధంగా ఆధ్యాత్మ సంకీర్తనలు, శృంగార సంకీర్తనలనే విభాగం తాళ్ళపాక కవుల రచనల్లోనే కనిపిస్తుంది.

రచనా వైవిధ్యం బట్టి వాగ్గేయకారుల్ని గౌరవించడం మరో పద్ధతి. కేవలం కృతుల్ని మాత్రమే కాకుండా శతకాలు, నాటకాలు, లక్షణ గ్రంథాలు వ్రాయడం వాగ్గేయకారుల బహుముఖ పాండిత్యాన్ని స్పష్టం చేస్తుంది. త్యాగయ్య ప్రహ్లాద భక్త విజయమనే అయిదంకాల నాటకాన్ని, నౌకాచరిత్రమనే గేయ నాటకాన్ని, సీతారామ విజయమనే నాటకాన్ని వ్రాశాడు. అన్నమయ్య 12 శతకాలు, సంస్కృత సంకీర్తన లక్షణం, ద్విపద రామాయణం, సంస్కృత వేంకటాచల మహాత్మ్యం మొదలయినవి వ్రాశాడు. లక్షణ కారుడు, లక్ష్యకర్త కావడం అన్నమయ్య ప్రత్యేకత.

సంగీత సాహిత్యాలలో వాగ్గేయకారుల ప్రతిభావ్యుత్పత్తుల్ని బట్టి వారిని సహజ వాగ్గేయకారులని, సంపాదిత పాండిత్య వాగ్గేయకారులని వర్గీకరించవచ్చు. అన్నమయ్య బాల్యంనుండి కూడా వేంకటేశ్వరుని మీద ఆశువుగా మధురంగా పాటలు పాడేవాడని అన్నమాచార్య చరిత్ర నిరూపిస్తుంది.[4] కాబట్టి ఇతడు సహజ వాగ్గేయకారుడు. నేడు ఇతని సంకీర్తనలు తిరుమల తిరుపతి దేవాలయాలలోను, తదితర దేవాలయాలలోను పాడబడుతున్నాయి. సుప్రసిద్ధ సంగీత శాస్త్ర కళాకారులు కచ్చేరీలు చేస్తున్నారు. అభినయాత్మకమైన కీర్తనలకు నృత్యకళాకారులు నృత్య ప్రదర్శనలు చేస్తూ సభికుల్ని రంజింప చేస్తున్నారు. లలిత సంగీత గాయకులు కీర్తనల్లోని జానపద గేయాలను పాడి నలుదిశలా వ్యాపింపజేస్తున్నారు.

సంగీతం కళాత్మక సంగీతమని, పవిత్ర సంగీతమని, నృత్య సంగీతమని, జానపద సంగీతమని నాలుగు రకాలు. సహజంగా ఒక్కొక్క వాగ్గేయకారుడు ఒక్కొక్క రకమయిన సంగీతానికి తన కృతులలో ప్రాధాన్యమిస్తాడు. అన్నమయ్య తన సంకీర్తనలలో అన్ని రకాలైన సంగీత రీతులకు ప్రాధాన్యమిచ్చాడు.

**జానపద గేయ వరుసల విభాగం :**

వాగ్గేయకారుల లక్షణాలలో దేశి రాగాలను గూర్చిన విశేష జ్ఞానం కలిగి వుండడం, గాన పద్ధతిలో యాసలు తెలుసుకొని వుండడం అనేవి చేరతాయి. కాకువును గూర్చి రజనీకాంతరావుగారు—

"కాకువంటే ఛాయ అని వ్యాఖ్యాత లన్నారు. అంటే గాన పద్ధతిలోని 'యాస' అని మనం చెప్పుకోవాలి. ఈ యాసలు ఆరు విధములుగా ఉండవచ్చు. స్వరకాకు ప్రత్యేకం స్వరములకే సంబంధించిన యాస. ఏ స్వరమును ఏ స్థానములో ఏ విధముగా పెట్టవలెనో ఆ యాస అన్న మాట. రాగకాకువు అనగా ఆయా రాగములకు ప్రత్యేక లక్షణమై స్వరూప నిర్దేశకమయిన యాస. అన్యరాగ కాకువు అంటే - కొన్ని రాగాలలో తదితర రాగములకు చెందిన సంగతులు ప్రయోగించడానికి వీలు కలిగినపుడు అలా ప్రయోగించినపుడు కలిగే ప్రత్యేకపు యాస. ఆ దేశాలలో ఒక్కొక్క రాగాన్ని వేర్వేరు యాసలలో పాడవచ్చు. ఆ ప్రశంస వచ్చినపుడు ఆ యాస లోని తేడాను 'దేశకాకు' వంటారు. పాడే గాత్రము పురుషుడో, స్త్రీయో అందులో ఒకే లింగమునకు చెందినవారిలో సన్న గొంతో గొడ గాత్రమో ఆ వ్యత్యాసాన్ని నిర్దేశించే యాసను క్షేత్రకాకు వంటారు. ఒక్కొక్క జంత్ర వాద్యమునకు ప్రయోగించే పద్ధతిని బట్టి వేర్వేరు యాసలు కలుగుతాయి కనుక ఆ యాసను యన్త్రకాకువంటారు"[5] అని విశదపరచారు. ఆయా దేశ భాషలకు ప్రత్యేకమయిన కాకువులుంటాయి. అందువల్ల వాటికి సరి అయిన సంగీత రచన ఆదేశంలోని దేశి గాన పద్ధతిలో జరిగినపుడే ఆ దేశ ప్రజలకు ఆస్వాద యోగ్యం అవుతుంది. దీనివల్ల ఒకదేశంలోని సంగీత ఫణితిలోను, మరో దేశ బాషలోను గేయాన్ని రచించినట్లయితే యాస అతకకుండా విరసంగా ఉంటుందని రజనీకాంత రావుగారి అభిప్రాయం.[6] ఈ లక్షణాలు జానపద గేయ ఫణితుల్ని ఆసరగా తీసుకొని రచనలు సాగించే వారికి చక్కగా అన్వయిస్తాయి. అన్నమయ్య సంకీర్తనలలో జానపదగేయ వరుసలు రెండు రూపాల్లో కనిపిస్తాయి. వాటినే అనుకరణాత్మకాలు, అనుసరణాత్మకాలు అని వర్గీకరింపవచ్చు.

### 3. 3. జానపదగేయ వరుసలు - అనుకరణాత్మకాలు :

జానపదుల వ్యవహారంలో బాగా నాటుకొని పోయి విస్తృత ప్రచారం పొందిన ఫణితుల్ని అనుకరిస్తూ వ్రాసినవన్నీ ఈ విభజనలో చేరతాయి. అంటే అన్నమయ్య పాటలకు జానపద గేయ వరుసల్ని గుర్తించ వచ్చని అభిప్రాయం. వీటిలో మేలుకొలుపులు. సువ్విపాటలు, అల్లో నేరెళ్ళు, గొబ్బి పాటలు, జాజర పాటలు, సోది

పాటలు: తాత్త్విక గేయాలు, తందాన పాటలు, కోలాటం, ఏలపాటలు, దశావతారాల పాటలు, చందమామ పాటలు, శోభనపు పాటలు, ఉయ్యాల, హారతి. నివాళి, ధవళ, లాలి, జోల, మంగళ గీతాలు మొదలయినవి చేరతాయి

**3. 3. 1. మేలుకొలుపు పాటలు :**

స్వామివారికి జరిగే అంగరంగ వైభోగాల్లో ప్రభాత సేవ మొదటిది. ఆ సేవలో మొదటిది మేలుకొలుపు పాడడం. దీనినే సుప్రభాత సేవగా జరపడం దేవాలయాలలో సంప్రదాయంగా నేటికీ నిలిచి వుంది. తమ ఇష్టదైవాన్ని మేలుకొలిపి ఆపై కైంకర్యాదులు నిర్వహించడం ఆచారం. దీనినే పాల్కురికి సోమనాథుడు 'ప్రభాత పదాలు' అన్నాడు. ఈ పదాలు కాలక్రమంలో రాజులు, సామాన్య జనుల్ని శిశువుల్ని మేలుకొలిపే రీతులలో పరిణతి పొందాయి.

ఆచార్య బిరుదురాజు రామరాజుగారు మేలుకొలుపు పాటల్ని గూర్చి-

"వైష్ణవ పరముగా నున్న మేలుకొలుపులందు సాధారణముగా కృష్ణు నుద్దేశించిన వానిలో మధుర భక్తి గాన్పించును. సాధారణముగా నీ మేలుకొలుపులు వ్రాసిన వారందరును కొంత సాహిత్య జ్ఞానము కలవారే. యతిప్రాసాది నియమములు చక్కగా పాటింపబడుటయే గాక శబ్దాలంకారములు, ప్రౌఢపద బంధములును వీనిలో నక్కడక్కడ కాననగును.

ప్రాతః కాలమున పల్లెపట్టులందిప్పటికిని ప్రాతర్వేళల పూజారులు మందిరము లందును, స్త్రీలు చల్ల చేయుచునో, ఇల్లలుకుచునో, పురుషులు కార్యములు దీర్చు కొని తమ ప్రక్కల పైననే కూరుచుండియో, భూపాళ రాగములందు భగవంతుని విభూతిని కొనియాడి తమ యాత్మలను, ఇరుగు పొరుగు సోమరులను మేల్కొల్పె దరు,[7] అని వివరించారు.

ఆచార్య తూమాటి దొణప్పగారు-

"ఆనంద భైరవి, ముఖారి, రేగుప్తి రాగాలు కూడ మేలుకొలుపులలో అప్పు డప్పుడు వాడుక చెయ్యడం లేకపోలేదు" అని తెలియ జేశారు.

కృష్ణశ్రీగారు-

"భూపాలం జానపద రాగము, 'బౌళి' పండిత గాయకుల రాగము"[9] అని పేర్కొన్నారు.

ఆచార్య యస్వీ జోగారావుగారు-

"ఇదియొక వైతాళిక గీతము. చిర ప్రసిద్ధమైనది యక్షగానములందు దఱచుగనే కన్పట్టుచుండును. తఱచు దేశాక్షి, మలహరి, దేవగాంధారి, భైరవి, బౌళి సౌరాష్ట్రి మొదలయిన ఉదయ రాగాలలో ఉండును. భూపాలరాగముతోడి దాని అనుబంధము కడు ప్రసిద్ధము'[10] అని అభిప్రాయ పడ్డారు.

శ్రీమతి ఎస్ లక్ష్మీనరసమ్మగారు-

"తెల్లవారు జామున ప్రకృతి యంతయు ఆహ్లాదకరముగ నుండి మనసున కుత్తేజమును కలిగించు చుండును. అటువంటి ప్రశాంత సమయమున స్త్రీలు తమ వంటరితనము తెలియ రాకుండుటకును, తాముచేయు పని యందలి కష్టమును మఱచుటకును పాటలు పాడుకొనుచుందురు. విషయమును బట్టి వీనిని పది విధములుగ విభజింపవచ్చును. సేవాభావమును వ్యక్తము చేయునవియును, తమ్ము రక్షింపుమని ప్రార్థింపునట్టివియును, స్తోత్రరూపముగ నున్నవియును, జీవిత గాథలను తెలుపునవియును, వర్ణనాత్మకముగ నున్నవియును, శృంగార పరమగునవియును, మధుర భక్తి పూరితములును, వేదాంత పరముగ నున్నవియును, పదినగారిపై రచింపబడిన హాస్యపు మేలుకొలుపులును, దేశభక్తి మేలుకొలుపులును గలవు"[11] అని అన్నారు.

## పై అభిప్రాయాలవల్ల తేలిన అంశాలు :

ప్రాతః కాలములో పరాత్పరుని లీలావిభూతిని కొనియాడడం మేలుకొలుపుల మొదటి లక్షణం. పూజా కార్యక్రమాలల్లో కూడా పాడడం రెండవ లక్షణం. పాదాదిలోను లేక పాదాంతంలోను 'మేలుకో' అనే మాట ఆవృత్తి కావడం మూడవ లక్షణం. వీటిని ఎక్కువగా భూపాల రాగంలో పాడతారనడం నాల్గవ లక్షణం.

## లోక వ్యవహారంలోని మేలుకొలుపులు :

వీటిని శివోద్దిష్టాలు, కృష్ణోదిష్టాలు, పరబ్రహ్మోద్దిష్టాలు, అంబోద్దిష్టాలని వర్గీకరించవచ్చు

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

శివోద్దిష్టాలు :

"శివశివ మేలుకొనవె
అరయ కజ్ఞానంపు తిమిరము నణగి నరులను
జార చోరులను సొరది అవగుణ తారవములు
సొంపు వెడలన్ ॥శివశివ॥

అమల నాధారంపు కమలము లారు వికసించెన్
అమిత చిత్కిర నక్షరములను తత్త్వభూములు
తక్షకులొదవెను క్రమముతో
యేగంటి లింగము గానబడియెన్ ॥శివశివ॥"[12]

కృష్ణోద్దిష్టాలు :

"కేశవ యని నిన్ను వాసిగ భక్తులు
వర్ణింపుచున్నారు మేలుకో
వాసవ వందిత వసుదేవ నందన
వైకుంఠవాసుడ మేలుకో
నారాయణ నిన్ను నమ్మిన భక్తుల
కరుణ బ్రోవ వేగమేలుకో
శరణన్న రక్షణ బిరుదు నీకున్నది
శశిధర సన్నుత మేలుకో"[13]

పరబ్రహ్మోద్దిష్టాలు :

"మేలుకొనవే రాజహంసా
మేలుకొను చైతన్యమా
మేలుకొనవే శుద్ధ నిలయా
మేలుకో గదవె జీవామేలుకో"[14]

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

అంభోద్దిష్టాలు :

"అమ్మా సీతమ్మా మాయమ్మా
ముద్దుల గుమ్మా
అమ్మ బంగరు బొమ్మ లెమ్మా !
ఆమ్మ రో యిమ్మాగ
అరుణోదయం బాయే
అమ్మల గన్నమ్మ లెమ్మా !
భక్తులందరు లేచి
ప్రార్థించుచున్నారు
భక్త పరాధీన లెమ్మా !
భక్త శిఖామణి
పావని అరుదెంచె
ముక్తి ప్రదాయినీ లెమ్మా !"15

### అన్నమయ్య మేలుకొలుపు కీర్తనలు :

ఇప్పటి వరకు ప్రకటించబడిన ఇరవైతొమ్మిది సంపుటాల్లో లభ్యమయిన మేలుకొలుపు పాటల్ని మూడు రకాలుగా వర్గీకరింపవచ్చు. నిర్దిష్ట దేవతాత్మకాలు : వస్త్వాశ్రితాలు : ఆవృత్తి పదాశ్రితాలు.

### నిర్దిష్ట దేవతాత్మకాలు :

అన్నమయ్య వేంకటేశ్వరస్వామి భక్తుడు అతను తిరిగిన దివ్యదేశాలెన్నో. ఆయా దివ్య దేశాల్లోని అర్చావతార మూర్తుల్ని ఉద్దేశించి మేలుకొలుపులు పాడాడు. కనుక వీటిని నిర్దిష్ట దైవగతమయిన మేలుకొలుపులుగా చెప్పవచ్చు. లేదా మూడవ చరణంలో వేంకటేశ్వరానుబంధం వుండడం వల్ల వేంకటేశ్వర ప్రభాత సేవగా కూడా చెప్పవచ్చు. కాని ప్రధానంగా చెప్పబడిన మూర్తులనే యిక్కడ గ్రహించడం జరుగుతుంది.

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

### విష్ణ్వాత్మకాలు :

భూపాలం

మేలుకొనవే భూలలనాధిప భోగిశయన ॥పల్లవి॥

లేదు వేదవిధి లేశమును
మేదిని భరమై మించినది
పాదుపడదు చూపరకు భువి
గాదిలి సుతుపై గనలె జనకుఁడు ॥మేలు॥

కనకము చవి చెడెఁ గడుఁ గడును
ఘన నృప బాధలు గదిమినవి
దనుజాల కలివలు దలకెదరు
ఎనయ బలాధికులెవ్వరు లేరు ॥మేలు॥

అసుర సతుల పుణ్యము ఘనము
కిస (సిరి) రిమసఁగెడి కలికాల మహిమ
పసగల వేంకటపతి యిఁకను
వసుధ లోని నెవ్వగ లుడుపఁగను ॥మేలు॥

(11-2-21)

ఈ కీర్తనల్లో దేవాధి దేవతలు పొలకడలిలో విష్ణువు దగ్గరికి చేరి స్తుతించినట్లు కనిపిస్తుంది కనుక ఇది విష్ణ్వాత్మక ప్రభాత పదమనవచ్చు.

### కృష్ణాత్మకాలు :

భూపాళం

మేలుకో శృంగార రాయ మేటి మదన గోపాల
మేలుకో నాపాల నుంచిన నిధానమా ॥పల్లవి॥

సంతతిచే గోపికల జవ్వన వనము లోన
కందువం దిరిగే మదగజమవు
యిందుముఖి సత్యభామ హృదయ పద్మము లోని
గంధము మరిగినట్టి గండుతుమ్మెదా

గతిగూడి రుక్మిణి కౌఁగిటి పంజరములో
రతిముద్దు గురిసేటి రాచిలుకా ।
సతులు పదారువేల జంట కన్నుం గలువల
కితవై పొదమిన నాయిందు బింబమా ।

వరుసం గొలనిలోని వారి చన్నుం గొండలపై
నిరతి వాలిన నానీలమేఘమా
సిరి నురమున మోచి శ్రీవేంకటాద్రి మీద
గరిమ వరములిచ్చే కల్పతరువా । (2-224)

ఈ కీర్తనలో మదనగోపాల, సత్యభామ, రుక్మిణి, పదారువేల సతులు మొదలయిన వారి ప్రస్తావన వుండడం వల్ల ఇది కృష్ణాత్మక ప్రబాతపదమని చెప్పవచ్చు. లేదా మదనగోపాల విగ్రహమున్న ప్రదేశంలోని దేవుని గూర్చిన మేలుకొలుపయినా గావచ్చు.

వేంకటేశ్వరాత్మకాలు :

'భూపాలం'

"విన్నపాలు వినవలె వింతవింతలు ॥పల్లవి॥
పన్నగపు దోమతెర పైకెత్తవేలయ్యా ॥అనుపల్లవి॥

తెల్లవారె జామెక్కె దేవతలు మునులు
అల్లనల్ల నంత నింత నదిగో వారే
చల్లని తమ్మిరేకుల సారసపు గన్నులు
మెల్లమెల్లనె విచ్చి మేలుకొన వేలయ్యా ॥విన్న॥

గరుడ కిన్నెర యక్ష కామినులుగములై
విరహపు గీతముల వింతాలాపాల
పరిపరి విధముల బాడేరు నిన్నదివో
సిరిమొగము దెరచి చిత్తగించవేలయ్యా ॥విన్న॥

పొంకపు శేషాదులు తుంబురు నారదాదులు
పంకజ భవాదులు నీ పాదాలు చేరి
అంకెల నున్నారు లేచి అలమేలుమంగను
వేంకటేశుఁడా రెప్పలు విచ్చి చూచి లేవయ్యా ॥విన్న॥ (14-25)"

ఈ కీర్తనలో అలమేలుమంగ ప్రసక్తి వుండడం వల్ల ఇది వేంకటేశ్వరాత్మక ప్రభాత పదంగా చెప్పవచ్చు.

వస్త్వాశ్రితాలు :

అన్నమయ్య మేలుకొలుపు కీర్తనల్లోని వస్తువు రెండు రకాలు. మేలుకొలుపు ఉదయం పూటనే (బ్రాహ్మీముహూర్తంలో) పాడబడేవి కనుక వీటిలో ప్రాతః కాల వర్ణనలుండడం సహజం.

భూపాళం

మిన్నక వేసాలు మాని మేలుకోవయ్యా
సన్నల నీ యోగనిద్ర చాలు మేలుకోవయ్యా ॥పల్లవి॥

అవులు వేయలకుఁగా నఱచీఁబిదుకవలె
గోవిందుఁడ యింక మేలుకొనవయ్యా
అవలీవలి పడుచులాటలు మరిగివచ్చి
త్రోవగాచుకున్నారు ప్రొద్దున మేలుకోవయ్యా ॥మిన్న॥

వాడల గోపికలెల్లా వచ్చి నిన్ను ముద్దాడఁ
గూడియున్నారి మేలుకొనవయ్యా
తోడనే యశోద గిన్నెతోఁ బెరుగువంటకము
యీడకుఁదెచ్చి పెట్టెనిక మేలుకోవయ్యా ॥మిన్న॥

పిలిచీ నంద గోపుఁడు పేరుకొని యదె కన్నుఁ
గొలుకులు విచ్చి మేలుకొనవయ్యా
అలరిన శ్రీ వేంకటాద్రి మీఁది బాలకృష్ణ
యిల మామాటలు వింటి విఁక మేలుకోవయ్యా ॥మిన్న॥

(1-374)

ఈ కీర్తనలో స్త్రీలు పాలు పితకడానికి వేచి వుండడం, గోపికలు బాలకృష్ణుని ముద్దాడడానికి రావడం, యశోద పెరుగువంటకాన్ని తెచ్చి పెట్టడం, నందగోపుడు పేరు పెట్టి పిలవడం మొదలయిన ప్రాతఃకాల కార్యక్రమాదులు వర్ణించబడ్డాయి.

రెండవది సంయోగ వియోగ శృంగారానుబంధి కావడం.

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

భక్తి ప్రభేదాల్లో మధుర భక్తి ఒకటి. తన్ను నాయికగా భావించుకొని పరమాత్మునితో నాయక భావముంచి తపించడం ఇందులోని ప్రధానాంశం. ఈ నాయికానాయక భావాన్ని వర్ణించేటప్పుడు కవి కొన్ని సమయాల్లో తానే నాయికగా వ్యవహరిస్తాడు. కొన్నిసార్లు కేవలం ద్రష్టగా నిలుస్తాడు. ఈ మధుర భక్తిలో సంయోగ వియోగ శృంగార అనుభవాలు కూడా వుంటాయి.

### కాంబోది - ఏకతాళి

భారపు టూర్పులతోఁ బవళించీని వీఁడె
కూరిమి సతులు మేలుకొలుపరమ్మా ॥పల్లవి॥

వేగినంతకు నితఁడు వెలఁదులతోడి రతి
భోగించి వచ్చి నిద్రవోయీని
సోగ కనురెప్పలు మూసుక యిప్పుడెంతేసి
జాగరపుఁబతి తొడ చరచరమ్మా ॥భార॥

వొప్పైన సతులతో వుదరము లోపల
యిప్పుడు నితఁడు సుఖియించీని
దప్పిదేరు తనమోముఁ దమ్మితోడనిదె వీడె
వుప్పవడముగఁ బాదాలొత్తరమ్మా ॥భార॥

సరుగున మేలుకొని సరసపుఁగొఁగిట
గరగరికెల నన్నుఁ గలసీని
అరవిరి సురమున అలయుచును వీఁడె
తిరువేంకట పతిఁ దెలుపరమ్మా ॥భార॥ (12-388)

ఈ కీర్తనలో సంయోగ శృంగార చేష్టలు వర్ణించబడ్డాయి.

### భూపాలం

పొలయలుక నిద్దరులు భోగించ వొరకొంటి
అలరవడి మేల్కొనవె అఖిలేశ్వర ॥పల్లవి॥

తరుణిమైనపుడె పరితాప సూర్యుఁడు వొడిచె
వరుసఁ జెలికన్నుఁగలువలు మొగిచెను
మరుని సాయకపు తామరలు వడి వికసించె
కరుణతో మేల్కొనవె కమలేశ్వర

కాంత నిట్టూర్పులను గాలియును నగ్నియును
వంత చెమటల వాన వరుణుండును
వింతలుగ నిన్ను సేవింతు మనియున్నారు
పంతమున మేల్కొనవె పరమేశ్వర

ఒడికముగ జెన నుదయరాగము వొడమె
వెడలెనదె పలుకు గోవిలరవములు
పడతిఁ గూడితివి రతి పరవశంబిఁకనైన
కడఁగి మేల్కొనవె వేంకట రమణుఁడ (4-173)

వేంకటేశ్వరుని కామించి విరహానికి గురి అయిన ఒక నాయిక స్థితిని తన చెలికత్తె నాయకునితో విశదపరచే విధంగా ఈ కీర్తన సాగింది. నాయిక విరహావస్థలో మునిగి రేయీ పగలుగా వ్యథపడుతుంటే ఏమాత్రం దిగుల్లేకుండా నిద్రపోవడం న్యాయంకాదనే దృష్టి ఈ కీర్తనలో ప్రతిపాదించడం జరిగింది. పరితాప సూర్యుడు, చెమటల వానవరుణుడు మొదలయినవి నాయిక విరహావస్థను విశదం చేస్తున్నాయి. అంతేగాకుండా సూర్య, చంద్ర, అగ్ని, వరుణాదుల ప్రసక్తి పరోక్షంగా చెప్పడం జరిగింది.

**ఆవృత్తి పదాశ్రితాలు :**

ప్రభాత పదాల్లో 'మేలుకో' అనే మాట ఆవృత్తి అవుతుంది. ఇది పల్లవిలో కావచ్చు చరణాల్లో కొన్ని పాదాంతాల్లో కావచ్చు. లేదా చరణం చివరగాని రావచ్చు.

**పల్లవిలో మేలుకొలుపు చెప్పడం :**

'మేలుకొనవే భూలలనాధిప భోగిశయన' (11-2-21)

'ఎందాఁక నిద్రనీకిదె తెల్లవారె గదె
యిందిరా రమణ నీవిటు మేలుకొనవే' (17-202)

చరణాల్లోని కొన్ని పాదాంతాల్లో మేలుకొలుపు చెప్పడం :

భూపాళం

మేదిని జీవులఁగావ మేలుకోవయ్యా
నీ దయే మాకెల్ల రక్ష నిద్ర మేలుకోవయ్యా ॥పల్లవి॥

తగుగోపికల కన్నుఁదామరలు వికసించె
మిగుల సూర్య నేత్రుఁడ మేలుకోవయ్యా
తెగువ రాక్షసులనే తిమిరము విరియఁగ
నెగడిన పరంజ్యోతి నిద్రమేలుకోవయ్యా ॥మేది॥ (1-377)

చరణాంతంలో మేలుకొలుపు చెప్పడం :

భూపాళం

హరికృష్ణ మేలుకొను ఆదిపురుషా
తరువాత నామోము తప్పకిటు చూడు ॥పల్లవి॥

కనుదెరవు నా తండ్రి కమలాప్తుఁడుదయించె
వనితమొక మజ్జనము వడిఁదెచ్చెను
మొనసి మీ తండ్రియిదె ముద్దాడఁజెలఁగీని
దనుజాంతకుండ యిఁకఁదగ మేలుకోవె ॥హరి॥ (9-254)

ఇవేగాక 'మేలుకో' అనే మాట ఆవృత్తి లేని ప్రభాత పదాలుకూడా అన్నమయ్యలో ఉన్నాయి.

ధన్నాసి

ఉప్పవడము గాకున్నారిందరు
యెప్పుడు రేయి నీకెప్పుడు పగలు ॥పల్లవి॥

కన్నుల చంద్రుఁడును కమలమిత్రుఁడును
వున్నతి నివి నీకుండఁగను
వెన్నెల యెండలు వెలయఁగ మెలఁగును
యెన్నఁడు నిద్దుర యెన్నఁడు నీకు ॥ఉప్ప॥

కందువ సతికనుఁగలువలు ముఖార
విందము నిదివో వికసించె
ముందర నిద్దుర మొలనదు చూచిన
విందగు నీ తెలిసికిఁదుదయేది ॥ఉప్పు॥

తమము రాజసము తగు సాత్త్వికమును
నమరిన నీమాయారతులు
కమలాధిప వేంకటగిరీశ నిన్ను
ప్రమదము మఱపునుఁబైకొటెట్లా ॥ఉప్పు॥ (1-148)

ఈ కీర్తనలో పల్లవిలోగాని పాదాంతంలోగాని చరణాంతంలోగాని 'మేలుకో' అనే పదంలేదు. కాని సూర్య చంద్రులే కన్నులుగా కలిగిన దేవునికి పగలురాత్రి అనే భేదం లేదని అందువల్ల నిదరపోవడం మేల్కొనడం వంటివి లేవనే విశేషార్థాన్ని కవి వ్యంజింపజేశాడు.

### 3. 4. సువ్విపాటలు :

ధాన్యం దంచేటప్పుడు ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసాలు త్వరితంగా జరుగుతాయి. అప్పుడు వారికి శ్రమ అధికంగా వుంటుంది. ఆ శ్రమను తగ్గించుకోవడం కోసం 'ఇస్, ఇస్' అంటుంటారు. ఈ ధ్వన్యనుకరణ శబ్దమే పోటువేసే పూపులో సువ్విగా మారుతుంది. ఈ మాట వూతగా గల్గిన పాటలే సువ్విపాటలు.

నన్నెచోడుడు కుమార సంభవంలో సువ్వి పాటల్ని గూర్చి "శబర కామిని యోర్తు పటికపురోల ముత్యెదురు బ్రాలొగి బోయుచు గౌదు కొమ్ము రోకటగొని దంచుచు రసోత్కటముగ" (6-47) పాడినట్లు వర్ణించినాడు. పాల్కురికి సోమన బసవ పురాణంలో "రోకటి పాటలట్లు వేదములు" (పు. 212) అని పేర్కొన్నాడు. చిన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణిలో-

"తలకొని తగ బ్రాలు దంపెడి చోట
దరుణులచే సొంపు దనరు దర్వోజ" (8-50)

అవి దంపుళ్ళ పాటను తరువోజలుగా పేర్కొన్నాడు.
ఆచార్య బి. రామరాజుగారు-

"ఈనాడు వినబడు రోకటి పాటలు కొన్ని తరువోజకును, ద్విపదకును మధ్యగానున్న వరుసలో గలవు. వీనిని విన్నచో 'సువ్విరామచంద్ర సువ్వి సువ్వి కీర్తిసాంద్ర సువ్వి, సువ్వి సీతమ్మ మాకు శుభములిమ్మా' అను కొట్నముల పాట పెండ్లి పాటల లోనిదే గాని అచ్చె లోకవ్యవహారమున గల దంపుడు పాటల కోవ లోనిది గాదనిపించును. దీనిని సువ్వాల యనుట కలదు" అని అభిప్రాయపడ్డారు[16].

ఆచార్య యస్వీ జోగారావుగారు–

"ఇది యొక దంపుళ్ళపాట. చిర ప్రసిద్ధమైనది. బహు యక్షగానము లందు వివాహ సందర్భములందు ప్రయుక్తమైనది. దీనికి సువ్వాలాలి, సువ్వాల, సుంకులపాట, కొట్నములపాట యనియు నామాంతరములు గలవు. ఇది సువ్వాల ద్విపద, సువ్వాల ధాతువు అను పేర్లతో కూడ కొన్నియక్షగానము లందు కన్పట్టు చున్నది సువ్వియన్నది ధ్వన్యనుకరణ శబ్దము, స్తోత్ర పదమును గావచ్చును. రోకటి పోటున కెన్ని యొత్తులుండునో యామాటకన్ని గతులుండును అందు తురగవల్గన గతికి ప్రాచుర్యమధికము. కొన్ని యక్షగానములందు 'సుంకులు దంచే పాట' సువ్విగను 'సుంకులు చెరిగేపాట' సువ్వాలగను గన్పట్టుచున్నది"[17] అని వ్యక్తం చేశారు.

డా॥ వేటూరి ఆనందమూర్తిగారు –

"ఈ సువ్వి పాటలలో రచనా విషయమేదో యుండదవెను గావున శైవులు శైవ సంబంధి రచనలు గావింపగా వైష్ణవులు విష్ణు సంబంధి రచనలు గావించినారు సువ్వి పాటలన్నియు ప్రధానముగా తొలి నాళుల నుండియు ఖండగతిలోనే సాగు చున్నవి. 'సువ్వి సువ్వి రామచంద్ర సువ్వి సువ్వి కీర్తిచంద్ర' వంటి రచనలొక కొన్ని త్రిసగతిలో గూడ నడచినవి లేకపోలేదు. దంపుళ్ళ సువ్విపాటలకు ఖండ గతియే ప్రసిద్ధము గావున తాళ్ళపాక వారును అట్లే సువ్వులను రచించినారు"[18] అని పేర్కొన్నారు.

కన్నడంలో కూడ సువ్విపాటలు కనిపిస్తాయి వీటిని 'సువ్వాలి' అంటారు. సువ్విగళఅలి (ఆళి) సువ్వాలి. ఇవి తత్త్వభరితాలు పరమాత్మస్తుతి రూపకాలు. వాలె (వాలీ) అంటే కమ్మలు. సువాలీ అంటే శుభప్రదమయిన లేక మంచి కమ్మలు అనే అర్థం. వివాహిత స్త్రీకి వుండే ఐదవ లక్షణాల్లో కమ్మలు కూడా ఒకటి. ఇవి కల్గిన

స్త్రీని ముత్తైదువ అంటారు. అలాంటి స్త్రీలు పాడే మంగళకరమయిన పాటలు సువ్విపాటలు[19].

## పై అభిప్రాయాలవల్ల తేలిన అంశాలు :

ఈ సువ్వి పాటల్లో సువ్వి అనే పదం పూతగా వుండడం మొదటి లక్షణం. ఇవి త్ర్యస్ర, చతురస్ర, ఖండగతుల్లో సాగడం రెండవ లక్షణం. వివాహసందర్భాల్లో వధూవరుల తలంబ్రాల కోసం వడ్లు దంచేటప్పుడు కూడా ఈ పాటలు పాడటారనడం మూడవ లక్షణం.

## లోక వ్యవహారంలోని సువ్వి పాటలు :

జానపదంలోని సువ్విపాటలు చాలవఱకు దైవాత్మకాలే. కొన్ని చారిత్రాత్మకాలున్నాయి. ఉదా : కాటమరాజుకథ కొన్నిటిలో కుటుంబ జీవితంలోని కష్ట సుఖాల ప్రస్తావన కూడా ఉంటుంది. స్త్రీలు దంచెడి వస్తువుల పట్టిక చెప్పడం కూడా ఉంది.

"నాచేతి రోకండ్లు నల్ల రోకండ్లు
సేయించు అన్నయ్య చేవ రోకండ్లు
సువ్వని నేనొక్క పోటేసి తేను
దుక్కాలు పిక్కాదిల్లు సూరన్న వగడు
అత్తనే నొక్క పోటేసి తేను
అకసమ్ము కదుగు ఆ రాజు కదులూ
ముగ్గురన్నల తోడ నే బుట్టినాను
నా వడుము ముప్వంచు చీరగోరింది"[20]

## దైవాత్మకాలు :

"సువ్వి సువ్వి రామచంద్ర సువ్వి సువ్వి కీర్తిసాంద్ర
సువ్వి సీతమ్మ మాకు శుభములిమ్మా
మోదమునను పెండ్లి పీట మీద శ్రీరాము సరసున
ఆదిలక్ష్మియైన సీతమ్మ నునిచిరి

వాటమైన పసిడి రోకండ్లు పట్టుకా
రాజనములు యిప్పపువ్వు రాజనములు మంచి పునుగు
మేలుకొండ రాజనములు మేలు వంకెలా
కుంది యందు నిండ నించి కొట్టుమూలు దంచిరపుడు
కుందరదనలెల్ల నవ్వుకొనుచు చెలగుచు"21

సువ్వి సువ్వి సువ్వాన రంగా
సువ్వి మోహన రంగా సువ్వి
సువ్వి కావేటి రంగా
సువ్విలాలీ సువ్వి"22
"సువ్వి గోపాల బాల
సువ్వి సద్భక్తి పాల
సువ్వి భాసుర కపోల"23 ॥సువ్విలాలీ॥

## అన్నమయ్య సువ్వి పాటలు :

అన్నమయ్య సువ్వి పాటలలో ఆధ్యాత్మిక విషయమూ వుంది. శృంగారాంశమూ వుంది. ఆధ్యాత్మిక సువ్వి పాటలలో దేవుని మాయా విలాసం, శ్రీకృష్ణ జననం చెప్పబడింది ఆధ్యాత్మిక సంకీర్తనలలో 'సువ్వి' ఆవృత్తమయిన కీర్తన 'సువ్వి' ఆవృతం కాని కీర్తనలు కూడా ఉన్నాయి

భూపాళం

"సువ్వి సువ్వి సువ్వాలమ్మ
నవ్వుచు దేవకి నందనుఁగనియె ॥పల్లవి॥

శశివొడచె అలసంబులు గదచె
దిశల దేవతల దిగుళ్ళు విడిచె ॥సువ్వి॥

కావిరి విరిసె కంసుఁడు గినిసె
వావిరిఁబువ్వుల వానలు గురిసె ॥సువ్వి॥

గతినేసె అటు గాడిద గూసె
కుతిల కుడిచి జనకుఁడు నోరు మూసె ॥సువ్వి॥

గగురుపొడిచె లోకము విధి విడిచె
మొగులు గురియఁగ యమునపై నడచె
కలి జారె వేంకటపతి మీరె
అలమేల్మంగ నాచారలుకలు దీరె ॥సువ్వి॥ (12-361)

శ్రీకృష్ణ జనన సందర్భంగా రేపల్లె ప్రజలు ఆ మహోత్సవాన్ని సంబరంగా జరుపుకొనే వైనం ఈ కీర్తనలో వర్ణింపబడింది. మంగళకరమైన కార్యాలకే ము త్తైదువలు చేరి దంచడం లోకవ్యవహారం. ఇక్కడ శ్రీకృష్ణజననం లోకానికంతా మంగళకరం. ఈ సువ్వి పాటలో 'సువ్వి' అనే మాట పూతగా కనిపిస్తుంది. ఆ సమయంలో చంద్రోదయం కావడం దిగ్దేవతలకు భీతి తొలగడం, కంసుడు దిగులొందడం, పూలవాన కురియడం, గాడిద అరచినపుడు జనకుడు నోరుమూసి పెట్టడం మొదలయిన సంఘటనలు జరిగినట్లు స్పష్టమవుతుంది.

కేదార గౌళ :

పరమాత్ముని నోరఁబాడుచును యిరు
దరులు గూడఁగఁదోసి దంచీ మాయ ॥పల్లవి॥

కొలఁది బ్రహ్మాండపు కుందెన లోన
కులికి జీవులను కొలుచు నించి
కలికి దుర్మోహపు రోఁకలి వేసి
తలఁచి తనువులను దంచీ మాయ ॥పర॥

తొంగలి రెప్పల రాత్రులుఁబగలును
సంగడి కనుఁగవ సరిఁదిప్పుచు
చెంగలించె వెసఁజేతులు విసరుచు
దంగుడు బియ్యముగా దంచీ మాయ ॥పర॥

అనయముఁదిరు వేంకటాధీశ్వరుని
పనుపడి తనలోఁబాడుచును
వొనరివిన్నాణి జీవుల నెడి బియ్యము
తనర నాతనికియ్య దంచీ మాయ ॥పర॥ (1-130)

కుందెన, రోకలి మొదలయినవి ధాన్యం దంచడానికి వుపకరించే వస్తువులు. కనుగవ త్రిప్పడం. చేతులు విసరడం, పాట పాడడమనేవి దంపుళ్ళ సమయంలో సాగే క్రియలు. దంచడంలోని వస్తువుల్ని క్రియాకలాపాల్ని తాత్త్విక అంశాలతో అన్వయించి చెప్పడం ఇందులోని ప్రత్యేకాంశం. బ్రహ్మాండంలో జీవులు దుర్మోహాలకు గురి అయి పుట్టుతూ గిట్టుతూ పునర్జన్మ సాధించడాన్ని కుందెనలో కొలుచు నించి రోకలితో దంచడంతో ఆరోపణ చేయడం ఈ పాట ప్రత్యేకత. ఈ పాటలో సువ్వి అనే మాట పూత పదంగా కనిపించక పోయినా ఇది దంపుళ్ళకు సంబంధించిన పాటయే.

శృంగారాత్మక సువ్వి పాట :

కేదార గౌళ

సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెదరోలాల ॥పల్లవి॥

వనితల మనసులు కుందెన చేసిటు
వలపులు తగనించో లాల
కనుసన్నల నెడి రోకండ్ల సు
కన్నెలు దంచెదరో లాల ॥సువ్వి॥

బంగారు చెరఁగుల పట్టు పుట్టముల
కొంగులు దూలఁగ నోలాల
అంగన లందరు నతి వేడుకతో
సంగడి దంచెదరోలాల ॥సువ్వి॥

కురులు దూలఁగ మంచి గుబ్బచన్నులపై
సురులు దూలాడఁగ నోలాల
అరవిరి బాగుల నలివలు ముద్దులు
గురియుచు దంచెద రోలాల ॥సువ్వి॥

ఘల్లు ఘల్లుమని (ను ?) కంకణ రవములు (ల ?)
పల్లవ పాణులకో (నో ?) లాల......
అల్లన నడుములు అసియాడుచు నతు
లొల్లనె దంచెద రోలాల ॥సువ్వి॥

కప్పర గందులు కమ్మని పువ్వుల
చప్పరములలో నోలాల
తెప్పలుగా రతిఁదేలుచుఁగోనో
టప్పనిఁబాడెద రోలాల ॥సువ్వి॥ (12-353)

శ్రీనివాస కళ్యాణానికీ తలంబ్రాలు తయారు చేయడంకోసం లావణ్యవతులయిన స్త్రీలు దంపుళ్ళను ప్రారంభించారు తమ మనసుల్ని కుదురుగా చేసి అందులో వలపుల్ని నింపి, కనుసన్నలనే రోకండ్లతో దంచడం సాగించారు ఆ సమయంలో వారి సింగారాలు విలాస చేష్టావిశేషాలు వర్ణింపబడ్డాయి. ఈ పాటలో 'సువ్వి' అనే మాట పూతగా కనిపిస్తుంది. మరి ప్రతిపాదాంతంలోను 'ఓలాల' అనే మాట ఆవృత్తి అయింది. జలక్రీడలో ఒకరి మీద ఒకరు నీళ్ళు చల్లుకోవడాన్ని 'ఓలలాడడం' అంటారు. కానీ ఈపదసముదాయాన్ని వుత్సాహంసూచించే మకుటంగా గ్రహించవచ్చు.

### 3. 3. 3. అల్లోనేరేళ్ళు :

అల్లోనేరేళ్ళు అనేమాటకు రాజ జంబూఫలం. నమస్కారం, బాలక్రీడావిశేషం ఒకానొక పాట అనే అర్థాలు సూర్యరాయాంధ్ర నిఘంటువుతో చెప్పబడ్డాయి

ప్రాచీనాంధ్ర సాహిత్యంలో అల్లోనేరేళ్ళు ప్రసక్తి వుంది. భాస్కర రామాయణం సుందర కాండలో 'వెన్నెల దినములలో నల్లోనేరేళ్ళు గాక యావల గలవే' (పుట-181) అని, శ్రీనాథుని భీమేశ్వర పురాణంలో 'హాలాహలంబను నల్లోనేరేడుపండు మిసిమింతుఁడును గాక మ్రింగినాఁడు' (1-111); అని చిన్నన్న పరమయోగి విలాసంలో –

'గారాబు వెన్నెల గలనాడే యల్లో
నేరేళ్ళుగాక యోనీలాహివేణి' (పు. 278)

అని ప్రస్తావించడం గుర్తించదగింది.

ఆచార్య బి. రామరాజుగారు —

"జాజర పాటలవలె అల్లోనేరేళ్ల పాటలుకూడా శృంగారగేయములే. పెద్ద నేరేడు పండ్లను అల్లనేరేళ్లందురు. అల్లనేరళ్లే అల్లోనేరేళ్లుగా మారి పాదాంత పదములుగా నిలిచిన పాటలనా పేరులో బిలురు. 24... "తెలంగాణమున నల్లనేరెళ్ళ పాట లధికముగా పాడబడును. చిన్న నేరేడు పండ్లను కుక్క నేరెళ్ళందురు. కొన్ని ప్రాంతములందు కుక్కనేరేళ్లకు కాకినేరేళ్లని కూడా పేరున్నట్లు తెలియుచున్నది అల్లనేరేడి యనగా ప్రసిద్ధమైన నేరేడుపండని యర్థము. ఈ మంచి నేరేడుపండు పేరేల గేయములకెక్కెనో తెలియరాదు."24అ అని పేర్కొన్నారు.

ఆచార్య యస్వీ జోగారావుగారు —

"ఇదియొక గీతప్రబంధ విశేషమనుట యిట బ్రికృతము. చాల యక్షగానములందది ప్రయుక్తమైనది. 'అల్లోనేరేడల్లో' అనుమాట యీ పాటకొక పల్లవి వంటిది. ప్రతి చరణాంతముననను పునరావృత్తముగుచుండును"25 అని అభిప్రాయపడ్డారు.

డా॥ వేటూరి ఆనందమూర్తిగారు —

'ఈ అల్లోనేరేళ్ల పాటలను స్త్రీలు రాత్రిపూట వెన్నెలవేళల బాడుకొందురు. వెన్నెల వేళలకును, అల్లోనేరేళ్ల పాటలకును గల సంబంధమే ప్రాచుర్యముచేత భాషలో నొక పలుకుబడిగా రూపొందినది.... ద్రావిడ ప్రబంధ కారులగు నాళ్వారులు స్వామి మూర్తిని ఉజ్జ్వల నీలమణితోడ బోల్చియున్నారు. నీలమణిని బోలినదే యీ 'అల్లోనేరేడు పండు'ను. కనుక స్వామివారి యాకృతి సౌభాగ్యమును ప్రస్తుతించు నుపమాన పదమే 'అల్లోనేరేళ్లు' పాటలకు పల్లవిగా నేర్పడినదేమో యనిపించును26 అని వ్యక్తం చేశారు

డా॥ నాయని కృష్ణకుమారి గారు —

'దీనికి పురాణాలలో ఒక ప్రసిద్ధమైన స్థానం వుంది. బ్రహ్మాండ పురాణంలోనూ, భవిష్య బ్రహ్మపురాణాలలోనూ, సృష్టి క్రమాన్ని చెప్పడం కనిపిస్తుంది. ఈ సృష్టి అంతా తొలుత కొన్ని ద్వీపాలుగా విభజింపబడింది. ద్వీపాలలో మొదట పేర్కొన బడ్డది జంబూ ద్వీపం. ఈ జంబూ ద్వీపంలో కింపురుష, హరి రమ్యక

హిరణ్మయ వర్షాలతో పాటు భరత వర్షం కూడా ఉంది ఇక్కడి జంబూ వృక్షాలు సమృద్ధిగా ఉండడం వలన దానికా పేరు వచ్చింది. దీని ఫలాలు గజపరిమాణం కలిగి మధుర రసాన్ని స్రవిస్తూ ఉంటాయి. ఈ రసమే జంబూనదంగా మారింది. ఈ ప్రవాహంలో కనుగొనబడిన లోహం కావడం వలన బంగారం జంబూనదంగా పేరుతెచ్చుకున్నది. నిజానికి పురాణప్రసిద్ధాలైన ఏడు ద్వీపాలలో చాలావాటికి వృక్షసంబంధమైన పేర్లే ఉన్నాయి. అవి 1. జంబూ, 2. ప్లక్ష (జువ్వి), 3. శాల్మలి (బూరూహ) 4. కుశ మొదలైనవి. ఇట్లా పురాణ ప్రసిద్ధమైన ఈ పదానికి జానపద సాహిత్యంతో సంబంధ వున్నదని నిర్దేశించుటయే ఈ వివరణ ఉద్దేశ్యం.

... ఈవంత కలిగిన పాటల్ని రెండు మూడు సందర్భాల్లో మాత్రమే పాడుతున్నట్లుగా తెలుస్తుంది. 1. పెళ్ళివేళ కొట్నాలు దంచేటప్పుడు, 2. సమర్త వేళ చిమ్మిలి దంచేటప్పుడు, వ్యావసాయికమైన పనులు చేస్తూ పరిమళ్ళలో శ్రమించేటప్పుడు"27 అని వివరించారు

పై అభిప్రాయాల వల్ల తేలిన అంశాలు :

అల్లోనేరేళ్ళు అనే మాట ప్రతిపాదాంతంలోను లేదా పల్లవిలో వంతగాను రావడం మొదటి లక్షణం. రాత్రిపూట వెన్నెల్లో పాడతారనడం రెండవ లక్షణం. హిందువులు పాటించే పండగల్లో, ఆచార వ్యవహారాల్లో రకరకాల సంప్రదాయాలలో పళ్ళకు ప్రత్యేక స్థానం వుంది. వాటిలో నేరేళ్ళు ఒకటి. శ్రీ కృష్ణ జన్మాష్టమినాడు నేరేళ్ళతో తర్పణం వదలడం ఆచారం. అలాగే పెళ్ళిచూపులు మొదలయిన వాటిలో పుష్పఫలాదుల్ని తీసుకొని పోవడం ఆచారం కనుక ఈ పాటలలోని అంశాలు పౌరాణిక వృత్తాంతంగావచ్చు లేదా ఆచార వ్యవహారాలకు అనుబంధించిన వర్ణనలు కావచ్చు అనడం మూడవ లక్షణం.

లోక వ్యవహారంలోని అల్లోనేరేళ్ళు :

లోక వ్యవహారంలోని అల్లోనేరేళ్ళు పాటల్లో ఆచార వ్యవహారాలకు సంబంధించిన అంశాలు, కుటుంబ జీవితంలోని సరససంభాషణలు కనిపిస్తాయి.

'వెలది రుక్మిణి సమర్త వేడుకలాయ ।అల్లోనేరేడల్లో।
ఆదివారమునాడు అతిరోగియౌను ,,
సోమవారమునాడు శుభతి పతివ్రత ,,

మంగళవారమునాడు మతిమంతురాలు అలోనేరేడల్లో
బుధవారమునాడు బుద్ధిమతియౌను ,,
బేస్తవారమునాడు పుత్రవతి యగును ,,
శుక్రవారమునాడు శుభతి సంపద కలిగియుండు ,,
శనివారమునాడు సతి పేదరాలు ,, 28

'అల్లోనేరేడల్లో అల్లోనేరేడల్లో
అల్లల్ల నేరాడ అల్ల నేరాడ
అల్లోనేరేడల్లో

అల్ల నేరడికింద సల్లన్ని సెలిమే ॥అ॥
సల్లన్ని సెలిమూల సద్దారగించీ ॥అ॥
కడవతో నీరు బోస్తే ఘనమాయె మానూ
నేరుపుతో నీరుబోస్తే పెద్దాయె మానూ
మా యింట రామన్న పెండ్లీపోలనాడె
అమాను కాయలు పెండ్లిపోకల్లు
ఆమాను చెక్కాలు పెండ్లి పీటాలు
ఆమాను ఆకూలు సిరిదోరణాలు' 29

'అల్లోనేరెడల్లో - సీతకల్యాణంబు
చలుపంచమాయా - మా పూరి
అడవిలో - మల్లల్లకింరా
మౌగువరో మావదిన - మత్స్యావతారం
యీ పూరి - అడవిలో
ఇప్పల్లకిందా
ఇత్తిరో - మా వదిన యింగ్యావతారం
పౌరుగూరి అడవిలో - పౌన్నల్లకిందా
పౌణతిరో మావదిన - అకుల్లకిందా
అతివరో మావదిన - నల్యావతారం
నల్లూరి అడవిలో - నెరెడి కిందా

అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

చెన్నూరి అడవిలో - చిత్తల్లకిందా
చెలియరో మావదిన - చీమావతారం

అల్లొనేరెడల్లొ
యల్లక్క నీమొగుడు
ఇల్లక్కిడుమికా' 30

అన్నమయ్య సంకీర్తనలలోని 'అల్లో నేరేడు' పాటలను రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. మొదటి విభాగంలో అల్లోనేరేడు పద ప్రసక్తి వచ్చినవి చేరతాయి.

"అవల వెన్నెలలో అల్లునేరేళ్ళంతే" (5-274)
"బచ్చించి యాల నేరేడు బండు లమ్మేవే" (13-206)

అన్నమయ్య వేంకటేశ్వర స్వామిని 'అంటుకొన్న మేనిచాయ అల్లునేరేడు బండు' (13-284). అన్నట్లే కన్నడంలో పురందరదాసు 'గిరియ మేలప్ప అలమేలుమంగ అరసనాద పురంధర విఠల నెంబోజంబు న్రేలి' అని నేరేడు పండుతో పోల్చాడు.

ఇంక అల్లోనేరేడు పదం ఆవృత్తి అయిన కీర్తనలు రెండవ విభాగంలో చేరతాయి. అన్నమయ్య సంకీర్తనల రాశిలో ఒకే ఒక అల్లోనేరేడు పాటవుంది.

దేసాళం

నెయ్యములల్లోనేరేళ్లో
వొయ్యన పూరెకె వువ్విళ్లో ॥పల్లవి॥

పలచని చెమటల బాహామూలముల
చెలమలలోఁ జెలువములే
ఘళఘళమనును ముత్యపుఁ జెఱగు సురటి
దులిపేటి నీళ్ల తుంపిళ్లో ॥నెయ్య॥

తొటతొటఁగన్నులఁ దొరిగేటి నీళ్ళ
చిటిపోటియలుకల చిరునగవే
వటఫలంబు నీవన్నెల మోవికి
గుటకలలోనా గుక్కిళ్లో ॥నెయ్య॥

గరగరికల వేంకటపతి కౌఁగిట
పరిమళములలో బచ్చనలు
మరువిపింటి కమ్మని యంపవిరుల
గురితాఁకు లినుప గుగ్గిళ్లో ॥నెయ్యి॥ (12-179)

అల్లోనేరేడు అనే మాట లేకున్నా ఆ మాటతో సమానమయిన పదాలు ఆవృత్తి అయిన మరొకపాట అన్నమయ్య కీర్తనల్లో కనిపిస్తుంది.

సా మం తం

పొదలిన పీడెపుఁ బుక్కిళ్లో ధమ
చొదుకల చెమటల చొక్కిళ్లో ॥పల్లవి॥

అముకొనిన యధరామృత వేళల
మోముల మోముల మొక్కిళ్లో
కామినుల మకరికా పత్రమ్ముల
చీమక (మల)? దొంతర చెక్కిళ్లో ॥పొదలి॥

కయ్యపుఁ గౌగిటఁ గలికి రచనలను
నెయ్యపుఁబులకల నిక్కిళ్లో
ముయ్యని మోహపు ముచ్చట మురిపెపు
తొయ్యలి పాదపుఁదొక్కిళ్లో ॥పొదలి॥

మొలక లేనగవు మోముల గోళ్ళ
నులిమేటి వదనపు నుక్కిళ్లో
అలమేల్ మంగకు నావేంకటపతి
తలఁపు లొసంగిన దక్కిళ్లో ॥పొదలి॥ (12-31)

ఈ రెండు పాటలలోను శృంగారాంశాలే వున్నాయి. మొదటి అల్లోనేరేడు పాటలో నాయిక వియోగ శృంగార చేష్టలు వర్ణించబడ్డాయి. రెండవ పాటలో నాయికా నాయకుల సంయోగశృంగార చేష్టలు వర్ణించబడ్డాయి. అల్లోనేరేడు పాటలలో శృంగారాంశమే వుంటుందనే లక్షణానికి ఈ రెండు కూడా ఉదాహరణలే.

3 3 4. గొబ్బిపాటలు :

'గొబ్బిళ్ళు' అంటే వేడుక, క్రీడావిశేషం, నమస్కార భేదం అనే అర్థాలు సూర్యరాయాంధ్ర నిఘంటువులో చెప్పబడ్డాయి

ఈ పండుగ మార్గశిర పుష్యమాసాలలో వస్తుంది. సంక్రాంతి అంటే చేరడం అని అర్థం. సూర్యుడు నెలకొక్కసారి ఒక్కొక్క రాశిని చేరతాడు. దీన్నే సంక్రాంతి సంక్రమణం, సంక్రాంతి పండుగ అంటారు. ఈ పండుగ రోజులలో స్త్రీలు, బాలికలు వుదయాన్నే లేచి వాకిళ్ళు అలికి గొబ్బి ముద్దలు పెడతారు. వాటి చుట్టూ తిరుగుతూ చేతులు తట్టుతూ పాడే పాటలే గొబ్బిపదాలు.

పాల్కురికి సోమనాథుడు బసవపురాణం (పు 22)లో పేర్కొన్న 'చప్పటు లిడుచు' గునిసి గునిసి ఆడే పదాల్ని గొబ్బిపాటలుగా గ్రహించవచ్చు.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు :

"ధనుర్మాసమునఁ దెలుఁగు దేశమున బాలికలు తెల్లవారుజాముననే నిద్రలేచి గొబ్బెమ్మలను పేర గోమయముతో (ముద్దలు) బొమ్మలుగాజేసి మునిగిళ్ళ ముగ్గులు ముగ్గులు బెట్టి పూలతో నలంకరించి పూజింతురు. అట్టి ప్రార్థనము తిరుప్పావైలోను గొంత గలదు. దక్షిణ భారత మందంటను సామాన్యమైన యొక వ్రతము ననుసరించి ద్రావిడ శైవులు శివ సంప్రార్థనార్థకమగు తిరువెంబావై, ద్రావిడ వైష్ణవులు విష్ణు సంప్రార్థనార్థకమగు తిరుప్పావైని గల్పించుకొనియుందురు 'గొబ్బెమ్మ' పదము 'గోపెమ్మ' పదభవము అరవమున 'గొబ్బియళ్ళో' 'గోపిగళ్' పదభవము"[31] అని చెప్పారు.

ఆచార్య బి రామరాజుగారు —

"బొడ్డెమ్మ" "బతుకమ్మ" పండుగలు తెలంగాణము, ప్రత్యేకతను చాటు నట్టివి. ఈ పండుగలు సాగరాంధ్రదేశమున కానరావు. బొడ్డెమ్మ పిల్లల పండుగ. ఇది బతుకమ్మ పండుగకు పూర్వము తొమ్మిది దినములు జరుగును. ఇందులో పెద్దలంతా పాల్గొనరు. ప్రేక్షకత్వమేగాని పెద్దరికము వారికేమియు నుండదు. పుట్టమన్నుతో నొక పీటమీద ఐదంతరువుల బొడ్డెమ్మ భాద్రపద బహుళపంచమినాడు నిర్మింతురు. దానిపై నొక కలశము నుంచెదరు. కలశముపై నొక కణుము (కొత్త

రపికబట్ట) నుంచి, పసుపు గౌరమ్మను నిల్పి, పసుపు కుంకుమలిడి, రుద్రాక్ష, గోరింట బీరపువ్వులతో నలంకరింతురు. ఇది ప్రతి యింటిలో చేయనవసరము లేదు. పల్లెటూరి యందు వాడకొక్క కుటుంబము వారైనను చేసిన చాలును. సాయంకాలమున ఇంటి ముందర నలికి ప్రముగ్గులుపెట్టి బొడ్డెమ్మనచ్చట నిలుపగనె ఆ వాడలోనుండు ఆడపిల్ల లందరచ్చట చేయకొందురు పెద్దలీ వినోదమును చూచుటకై వచ్చెదరు. చూడవచ్చిన పెద్దలలో నొకస్త్రీ పాటలు పాడుచుండగా పిల్లలు చేతులు తట్టుచు బొడ్డెమ్మచుట్టు తిరుగుచూ పాడెదరు సాధారణముగా బ్రతుకమ్మ పండుగలప్పుడు పాడెడు పాటలను గూడ ఈ సమయమున పాడుదురు. ఈ బొడ్డెమ్మ పండుగ మహాలయామావాస్యతో పూర్తియగును. బొడ్డెమ్మ నృత్యములను, ఆటపాటలను మనమౌత్తరాహుల 'గర్భో' నృత్యములో పోల్చుకొనవచ్చును"[32] అని విశద పరచారు.

ఆచార్య యస్వీ. జోగారావుగారు–

"గొబ్బిళ్ళనగా ఒక ఆడపిల్లల పండుగ. ఇం దూతపదము విశేషము. గతి యందును విలక్షణత గలదు. ఇది తాళ్ళపాక వారి సంకీర్తన లక్షణమున నిబంధ పదముగా బరిగణింపబడినది అర్ధచంద్రిక పదము ఏలపదము, చందమామపదము మొదలగు వానితో పాటు 'పాదయుగళముగ బహుజన సంప్రయుక్తి బరగు' నని చెప్పబడినది"[33] అని అభిప్రాయపడ్డారు

డా॥ సేటూరి ఆనందమూర్తి గారు–

"మార్గశిర మాసమున స్త్రీలు, బాలికలు గృహ్యాలముందు గుంపులు చుట్టి వలయాకారముగ తిరిగి చప్పట్లు చరచుచు నీ గొబ్బి పాటలు బాడుదురు......... గొబ్బిపదములకీ పేరు వాసి పాదాంత చరణాంతము లందావృత్తములగు గొబ్బి, గొబ్బిళ్ళో, గొబ్బియల్లో యను పదములను బట్టి యేర్పడినది"[34] అని పేర్కొన్నారు.

పై అభిప్రాయాలవల్ల తేలిన అంశాలు :

గొబ్బిపాటల్ని సంక్రాంతి పండుగ సమయంలో ఆడపిల్లలు, స్త్రీలు, మండలాకారంగా తిరుగుతూ నృత్యంచేస్తూ పాడతారనడం మొదటి లక్షణం. ఈ పాటలలో గొబ్బి, గొబ్బెమ్మా అనేవి పూత పదాలుగాను, గొబ్బిళ్ళో, గొబ్బియాళ్ళో అనేవి పాదాంత ఆవృత్తి పదాలుగా వుంటాయనడం రెండవ లక్షణం. ఈ పాటలలోని

విషయం చాలా వరకు పౌరాణికం కావడం మూడవ లక్షణం. తెలంగాణ ప్రాంతం లోని బొడ్డెమ్మ, బతుకమ్మ పండుగలతో సాదృశ్యం వుండే పండుగ గొబ్బెమ్మ పండుగ అని చెప్పడం నాల్గవ లక్షణం.

లోక వ్యవహారంలోని గొబ్బిపాటలు :

లోక వ్యవహారంలోని గొబ్బిపాటల్ని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. మొదటిది శక్త్యాత్మకాలు. రెండవది విష్ణ్వాత్మకాలు.

శక్త్యాత్మకాలు :

"సుబ్బి గొబ్బెమ్మా మొగలి పువ్వంటి
మొగుణ్ణియ్యావే చామంతి పువ్వంటి
చెల్లెల నియ్యావే తామర పువ్వంటి
తమ్ముణ్ణియ్యావే పనస పండంటి
బాలుణ్ణియ్యావే........."35

వైష్ణవాత్మకాలు :

'శ్రీపతికై గొబ్బిపాడరే
వాని చిత్తములో గొనియాడరే
దీపితముగను గుంపులు గూడి
యేపు మీరగను కర్పూరాది
ధూప దీపోహారా పూర్ణమింపొంద ॥శ్రీ॥

కరకంకణములు ఘల్లు ఘల్లనగా వినెదు
సురసుల గుండె ఝల్లనగా వరుస
చప్పట్లు గొట్టుచు మనోహరము
లవునట్లు దిరుగుచు మది
ఓరమగు వరములు పరమభక్తిని గోరి'36 ॥శ్రీ॥

"గొబ్బియలో గొబ్బియని పాడరమ్మ
కంచి వరదరాజునే గొబ్బియళో
గొబ్బియళో కోటామీదా ఢంకావేసి
కోడీస్తంభం నాటారే గొబ్బియళో

గొబ్బియళో ముప్పైయారూ దేశాములకు
ముఁసీ గొల్పే పట్నామే గొబ్బియళో॥
గొబ్బియళో యాభైయారు దేశాములకు
పెద్దా కంచీపట్నామే గొబ్బియళో"37

కన్నడ సాహిత్యంలోని హరిదాస వాఙ్మయములో కూడా గొబ్బి పాటలు న్నాయి శ్రీవాదిరాజ తీర్థులవారు భగవంతుని చతుర్వింశతి నామాలను గొబ్బిలో కీర్తించారు.—

'గొబ్బియాళో గోవింద గోవింద
గోవింద గోవిందా నెందు నెనయినో గుబ్బియాళో
కేశవన్న నెనెదరె క్లేశ పరిహారమ గుబ్బియాళో
నారాయణ ధ్యానవింద నరక భయ విల్లనో గుబ్బియాళో'38

తాళ్ళపాక అన్నమయ్య సంకీర్తనలరాశిలో ఒకే ఒక గొబ్బిపాట కనిపిస్తుంది.

దేసాళం

కొలని దోఁపరికి గొబ్బిళ్లో యదు
కులము స్వామికిని గొబ్బిళ్లో ॥పల్లవి॥

కొండ గొడుగుగా గోవులఁగాచిన
కొండక శిశువుకు గొబ్బిళ్లో
దుండగంపు దైత్యుల కెల్లను తల
గుండు గండనికి గొబ్బిళ్లో ॥కొలని॥

పాపవిధుల శిశుపాలుని తిట్ల
కోపగానికిని గొబ్బిళ్లో
యేపునఁగంసుని యిడుములఁబెట్టిన
గోప బాలునికి గొబ్బిళ్లో ॥కొల॥

దండి వైరులను తఱిమిన దనుజుల
గుండె దిగులునకు గొబ్బిళ్లో...
వెండిఁబైఁడి యగు వేంకటగిరిపై
గొండలయ్యకును గొబ్బిళ్లో ॥కొలని॥ (12-98)

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

ఈ పాటను శ్రీకృష్ణ జన్మదినోత్సవ సందర్భంలో స్త్రీలు గుంపులు చేరి బాలకృష్ణుని లీలావిలాసాదుల్ని కీర్తిస్తూ పాడేవారని తెలుస్తుంది. ఈ పాటలో ప్రతి చరణంలోని రెండు, నాలుగు పాదాంతాలలో 'గొబ్బిళ్ళో' అనే మాట ఆవృత్తి అవుతుంది. కొండను గొడుగుగా పట్టి గోవుల్ని సంరక్షించడం, రాక్షసులను తునుమాడడం, శిశుపాలుని, కంసుని సంహరించడం మొదలయిన శ్రీకృష్ణుని లోకోత్తర సంఘటనలు వర్ణింపబడ్డాయి.

గొబ్బిళ్ళో అనే మాటలేకున్నా గొబ్బివరుసలో సాగిన మరొక గొబ్బిపాట కూడా కనిపిస్తుంది.

భైరవి :

గోళ్ళ మీటుచు నుండెఁ గొన్నాళ్ళు గొల్ల
వీళ్ళ పాలారగించెవీఁడు కొన్నాళ్ళు ॥పల్లవి॥

కోడెకాఁడై తిరిగెఁగొన్నాళ్ళు తాఁ
గోడెల నాపులఁగాచెఁగొన్నాళ్ళు
కోడెల వల్లె తాడై గొల్లె తలా తాఁ
గూడి పైకొన నుండెఁగోరి కొన్నాళ్ళు ॥గోళ్ళ॥

గుజ్జు రూపము ధరించెఁగొన్నాళ్ళు (తా?)
గుజ్జున గుళ్ళారగించెఁగొన్నాళ్ళు
గుజ్జుబాలకీఁదగిలెఁగొన్నాళ్ళుతా
బొజ్జనె లోకము నించె పొందుగఁగొన్నాళ్ళు ॥గోళ్ళ॥

కొండ గొడుగుగాఁబట్టెఁగొన్నాళ్ళు తాఁ
గొండ ముచ్చులనేలెఁగొన్నాళ్ళు
కొండల కోనేటి వాఁడై కోరికలా తాఁ
గొండుక చేఁతలు దొరకొనియెఁకొన్నాళ్ల ॥గోళ్ళ॥

(12-94)

ఈ పాటలో 'గొబ్బిళ్లో' అనే మాటకు బదులు 'కొన్నాళ్ళు' అనేమాట పాదాంతాల్లో ఆవృత్తి అయింది. ఇందులో శ్రీకృష్ణ, నృసింహ, వామన, రామావతార ఘట్టా వర్ణించబడ్డాయి.

3. 3. 5 జాజర పాటలు :

ఈ జాజర పాటల ప్రసక్తి మొట్టమొదటగా నాచన సోమన గ్రంథాలలో కనిపిస్తుంది. ఇతడు రచించిన వసంత విలాసంలోనిదిగా లక్షణకారులు ఈ క్రింది పాటను పేర్కొన్నారు—

'వీణాగానము వెన్నెల తేట
రాణమీరగా రమణుల పాట
ప్రాణమైన పిన్నబాహ్మణు పీట
జాణలు మెత్తురు జాజర పాట'

అనే తాళ చౌపదాన్ని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ఉత్తర హరివంశ పీఠికలో వెల్లడించారు.

శ్రీనాథుడు భీమఖండంలో —

"జాదుర జాదురంచు మృదుచర్చరి గీతులు వారుణీరసా
స్వాద మదాతి రేకములఁజంద్రికల్ గాయగ పక్షవాటికా
పీథుల మీదటం గనక వీణలు మీటుచుఁబాడిరచ్చరల్" (5-103)

అన పేర్కొన్నాడు.

దామెరల వెంగళ భూపాలుడు తన బహుళాశ్వ చరిత్రలో ఋతువర్ణన సందర్భంలో—

'జాజులు దేటుల జాడలు పీఁచెన్
జాజర పాటల జాగులు రేగెన్' (2-13) అని వర్ణించాడు

ప్రాచీన సంగీత నృత్య శాస్త్రగ్రంథాలలోకూడా 'చర్చరీ' గీతాల ప్రసక్తి కనబడుతుంది. జాయ సేనాపతి విరచితమయిన నృత్త రత్నావళి పీఠికలో

డా॥ పోణంగి శ్రీరామ అప్పారావుగారు —

"చర్చరి" అంటే "ఇది రాసకతుల్యమే కాని ఇందు నర్తకులు వసంతోత్సవములందు మండలములుగా నేర్పడి నాయక గుణములను కీర్తించుచు నర్తింతురు" అని చెప్పారు.

అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు —

"షోడశమాత్రాః బహవః పాదాః 16 మాత్రలు, బహుపాదాలు కలిగి అను అనుప్రాసాన్వితమై ఉంటుంది ప్రాకృతంలోను (ఆంధ్రాది) దేశ భాషలలోను ఎన్నో చర్చరీ పదాలు వున్నవని సింహభూపాలుడు వ్రాశాడు,

వసంతోత్సవంలో పాడతగినది శ్రీహర్షుని రత్నావళి నాటకములో వసంతోత్సవ సందర్భంలో చర్చరి ప్రశంస ఉంది"[39] అని పేర్కొన్నారు.

ఆచార్య బి. రామరాజుగారు జాజర పాటల్ని గూర్చి —

"ఇప్పటికిని తెలంగాణమున జాజర పాటలు 'కామునిపున్నమ' పండుగ దినములందు జానపదులు పాడెదరు. నేటి జాజర పాటలకిది మాతృకయై యుండవోపు" అని "జాజరయన నేమిటో యర్థము తెలియరాదు. శృంగార ప్రియులు పరస్పరము చల్లుకొనెడు కస్తూరి, గంధవొడి పుష్పొడి మున్నగు పరిమళ ద్రవ్యముల పొడియని అన్నమయ్యగారే తొలిసారిగా చెప్పినారు"[40] అని వ్యాసంలో పేర్కొన్నారు.

డా॥ వేటూరి ఆనందమూర్తిగారు —

"జాజర పదము ప్రయుక్తమగుటచేత 'జాజరపాట' యైనది. ఈ జాజర పాట జాజర ఆటగా పూర్వమే యుండినదో లేక తాళ్ళపాక వారి తరువాతనే యేర్పడినదో తెలియరాదు. ఈ జాజర ఆటపాటలు తెలుగున నొక పలుకుబడికి దారి తీసినట్లున్నది"[41] అని అభిప్రాయపడ్డారు.

డా॥ ఆర్వీయస్ సుందరం గారు —

"ఈ జాజర పాటలను కోలలు తడ్తూ పాడతారు. వీటిని పాడేటప్పుడు కస్తూరి, గంధవొడి, పుష్పొడి మొదలైన వాటిని చల్లుతారు. ఈ పొడికి జాజర అని పేరు. జాజర పాటలు శృంగార, హాస్యరస ప్రధానములై ఉంటాయి"[42] అని పేర్కొన్నారు.

జి వసుంధర గారు –

"జాజర పాటలను మొగవారు కోలాటము వేయుచు పాడెదరు. మొగవారు మాత్రమే కాక ఆడ మగ కలసి జట్టుగా కూడా ఆడుదురు. జాజర పాటలు సంధ్యవేళ కోలలు చేత బూని లయబద్ధమైన ధ్వనిలో పాడెదరు"[43] అని తెలియజేశారు.

**పై అభిప్రాయాల వల్ల తేలిన అంశాలు :**

ఈ పాటలలో 'జాజర' అనే పదం పాదాంతాలలో ప్రయుక్తం కావడం మొదటి లక్షణం. వీటిని వసంతోత్సవ సమయాలలో శృంగార ప్రియులు పరిమళ ద్రవ్యాల్ని చల్లేటప్పుడుగాని, వెన్నెల రాత్రులందు స్త్రీలు వీణమీటుతూగాని పాడతారనడం రెండవ లక్షణం. ఇవి శృంగార హాస్య రస ప్రధానాలయి వుండడం మూడవ లక్షణం.

**లోక వ్యవహారంలోని జాజర పాటలు :**

లోక వ్యవహారంలోని జాజర పాటల్ని రెండు విధాలుగా వర్గీకరించవచ్చు. వివిధ భావాత్మకాలు, శృంగార పూరితాలు :

**వివిధ భావాత్మకాలు :**

"జాజిరి జాజిరి జాజిరి జాజ
జాజిరాడబోతె జొన్నత్తి దొరికె ...

జొన్నత్తు పట్టుకొని పల్లెకు బోతె
పల్లె పటేలు రెండు బొల్లెద్దులిచ్చె
బొల్లెద్ల బట్కొని యవుసం పెట్టి
ఆతల దాన్ని ఈతల గట్టి
ఈతల దాన్ని ఆతల గట్టి
ముత్యాల ముంగ్రర తుంటిమీద మోపి
బంగార్ పగ్గం భుజంమీద మోపి
బొల్లెద్ల బట్కొని యవుసం జేస్తె
ఈడ్చి కొడితె ఇరవై పుట్లు
ఆర్చి కొడితె అరవై పుట్లు"[44]
"జాజిరి జాజిరి జక్కుల పాప
జాజిరాడబోతె ఏమేం దొరికె
జిల్లేడాకుల బెల్లం దొరికె
నాకు బెట్టుమంటె నక్కకు బెట్టె

నక్కబోయి నాలుగ్గాల్లు అందుకునెసుక్క
సుక్క మీది సుక్క గావురాల సుక్క
పట్టుకురాబంచోత్ ముక్కుసెవులు గోస్తు
నువ్వేమి గోస్తవు రాయుడు గోస్తడు
దాయుని బతుకు గంజిలొక్కమెతుకు
దాయుని సించు బంగారు గొలుసు" 45

శృంగార పూరితాలు :

"జాజిరి జాజిరి గాజుల పాప
జాజుల్ల గూచున్న సన్నపుచాప
చాప చుట్టలే సందారి కోట
కోట కోటకు రెండు కొమ్మల జగ్గాల్
జగ్గాలు పట్టుక పల్లెకు పోతే
అప్పుడే నావొల్లు జల్లుమానే
జల్లుమన్నాకాడ మల్లెలు రాలె
మల్లెలమాదేవి తొట్లో వున్నాది
గుబ్బాల పడుచుకు గుత్తాపు రవికె
రవికె గాదురో రామాలి మొగ్గ" 46

అన్నమయ్య సంకీర్తనల్లోని జాజర పాటలను రెండు విధాలుగా విభజించవచ్చు. మొదటి భాగంలో 'జాజర' ప్రసక్తి వచ్చేనవి చేరుతాయి.

"మంతనము లేలాడీనే మగువలతో నెల్లాను
సంతలోని వలపుల జాజర కాదు (13-149)

సందు సుడి వలపుల జాజర కాద
యిందరిపై నడియాసలేల చూపేవయ్యా? (13-161)

సంతలోని జాణవు జాజరలో వాడవు
వింతలేదు నాకు నీకు విన్నపమిదయ్యా (13-209)

ఇంక నేమి సేసేవయ్యా యింతేకాయను
సంకెలేసి వలపులు జాజరాయను (19-72)

చందయయ్యా నన్నియు జాజరకాదా
చిందులుగా మోపి యిచ్చి వేడు కోరాదా (19-185)

చల్లలమ్మే గొల్లెతలు జాజరాడ బోలుదురు
అల్లదె నీసేన జిడ్డయి వున్నది (20-84)

చలపాది సరసాల జాజరకాడు
వలపులు చల్లి బెక్కు వలపుకాడు (24-105)

వెలలేసె వలపుల వేడుక కాడవు
చలమరి చేతల జాజర కాడవు (25-17)

తర్వాత 'జాజర' అనే మాట ఆవృత్తి అయిన కీర్తనలు రెండవ విభాగంలో చేర్చాయి. అన్నమయ్య సంకీర్తనలలో రెండు జాజర పాటలున్నాయి.

హిందోళ వసంతం

జగడపు జనవుల జాజర
సగినల మంచపు జాజర ॥పల్లవి॥

మొల్లలు దురుముల ముడిచిన బరువున
మొల్లపు సరసపు మురిపెమున
జల్లనబుప్పొడి జారగ గుబ్బల పై
చల్లే రతివలు జాజర ॥జగ॥

భారపు గుచముల పైపై గడుసిం
గారము నెరపేటి గందవొడి
చేరువ పతిపై చిందగ బడతులు
సారెకు జల్లేరు జాజర ॥జగ॥

బింకపుఁ గూటమి పెనఁగేటి చెమటలు
పంకపుఁ బూఁతల పరిమళము
వేంకటపతిపై వెలఁదులు నించేరు
పంకు మదంబుల జాజర ॥జగ॥ (12-274)

ముఖారి

చాలఁజాలు నీ జాజర నన్ను
జాలిఁబరచెనీ జాజర ॥పల్లవి॥

వలపు వేదనల వాడేను యీ
తల నొప్పుల చేఁదలఁకేను
పులకల మేని తోఁబొరలేను కడుఁ
జలిగొని చల్లకు జాజర ॥చాలు॥

ఒల్లని సినుఁగని వుడికేను నీ
చిల్లర చేఁతలఁజిమిడేను
కల్ల గంద వొడిఁగాఁగేను పైఁ
జల్లకు చల్లకు జాజర ॥చాలు॥

తిరువీధి వేంకటాధిప నేను నీ
కవుఁగిటఁ కబ్బితిఁగడు నేను
రవరవ చెమటఁగరఁగి నేఁడు యిటె
చవులాయను నీ జాజర ॥చాలు॥ (12-332)

ఈ రెండు పాటలు కూడా శృంగార పూరితమయినవే. మొదటిది సంయోగ శృంగారానికి చెందినపాట. రెండవది వియోగ శృంగారానికి చెందిన పాట రెండింటిలోను 'జాజర' అనేమాట చరణాంతాలలో ఆవృత్తి అయింది. మొదటి పాటలో స్త్రీలు తమ నాయకునిపై పుప్పొడి, గందవొడి మొదలయిన పరిమళ ద్రవ్యాల్ని చల్లుతూ సరసాలాడడం వ్యక్తమవుతుంది. రెండవపాటలో ప్రియుడు తన ప్రేయసిపై పరిమళ ద్రవ్యాలు చల్లుతుండే ఆమె కొసరు కోవడం స్పష్టమవుతుంది.

### 3. 3. 6. సోది పాటలు :

'సోది' అనేమాటకు శబ్దరత్నాకరం 'రాగల మేలు కీడులను గూర్చి చేయు ప్రసంగం' అని వివరించింది.

సోది శోధన శబ్దభవం కావచ్చును. శోధనమంటే అన్వేషించి సత్యాన్ని తెలుసుకోవడం. సోది చెప్పేవారు ఎరుకలు. ఎరుక అంటే జ్ఞానం. ఈ జ్ఞానం కల వారు సోదెలు. వీరు భగవంతుని అనుగ్రహంవల్లో లేదా ఎదుటివారి మనస్తత్వాన్ని బాగా ఆకళించుకొన్నవారు కావడం వల్లనో భూత భవిష్యద్వర్తమానాలు చెబుతారు. సాధారణంగా లోకంలో జబ్బు వచ్చినపుడో ఎవరయినా తప్పిపోయినప్పుడో లేదా పెళ్ళి వ్యవహారాలలోనో సోదెలు చెప్పుకోవడం అలవాటు. ఎరుకలవాళ్లు అంతః పురం ప్రవేశించి కూడా ఎరుక చెబుతుంటారు.

ప్రభావతీ ప్రద్యుమ్నంలో —

"వనిత! యిటు నీవ వచ్చి నీవలయు సోదె గొనుము" (5-120)

అని ప్రయోగించబడింది. మన్నారు దాసు విలాస నాటకంలో ఎరుకల వేష భాషలు వర్ణింపబడ్డాయి.

లోక వ్యవహారంలోని కొన్ని సోదె పాటలు :

బిడ్డ అనారోగ్యం గురించి తల్లి అడగడం —

"ఎరుకన్న చెప్పావే ఎరుకలి నాంచారి
నా బిడ్డ బాలమ్మ తొట్టెల్ల పన్నాది
నాకు అయినారాడు లంబాడి నాయకుడు
ఎర్రాగుంట నీళ్ళు ఏడెయిలు దెచ్చినా
పచ్చగుంట నీళ్ళు పది మెయిలు తెచ్చినా
ఎరుకిన్నా చెప్పోయి ఎరుకలి నాంచారి"47

ఏరుకత్తె ఒక వృద్ధురాలిని సోదె చెప్పించుకోమనడం —

'ఎరుక సెప్పింతువా అవ్వోలవ్వ
ఎరుక సెప్పింతువా అవ్వోలవ్వ

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

ఎరుక సెపుతాను ఎరుక ముందల నీ
ఎరిగి ఎఱుగని కతలు ఎల్ల నూ తెలియగను'48

అన్నమయ్యలో ఒకేఒక సోది పాట కనపిస్తుంది.

తెలుగు కాంబోది

ఎరుకచెప్పే నీయిచ్చ యెల్లా నెరుఁగుదు
మెఱుగైన సొమ్ములిచ్చి మెచ్చవయ్య నన్ను ॥పల్లవి॥

చేతికి కలపలము చెప్పే రావయ్య నీకు
ఘాతలఁ బరాంగనలఁగాఁ గిలింతువు
ఈతలఁగన్నుల మేలిటు చేప్పే రావయ్య
సూతకపు మానములు (?) చూడఁగలధికను ॥ఎరుక॥

మోవి లక్షణాలు నీకు మోవజెప్పే రావయ్య
దావ నొక్క రాకాసి చన్ను దాగితి
వావిరి నీ పాదముల వ్రాతల జయము చెప్పే
బావి మడుగున నొక్క పాము ద్రొక్కితివి ॥ఎరుక॥

ఇంగితాకారపు భాగ్యమిటు చెప్పే నీవురాన
నంగన మోహించి పాయక యున్నది
తంగని శ్రీ వేంకటేశ తలఁపు చెప్పే నన్నుఁ
బొంగుచు గూడి యిట్టె పోననేవయ్యా ॥ఎరుక॥ (13-318)

శ్రీనివాస కల్యాణంలో ఎరుక కత్తె దగ్గర పద్మావతీ జోస్యం చెప్పించుకోవడం ప్రసిద్ధమైన విషయమే. కానీ ఈ కీర్తనలో సోది చెప్పించుకొనేవాడు శ్రీ వేంకటేశ్వరుడు వేంకటేశ్వరుని వలచింది పద్మావతి. ఇంథు స్వామివారి దివ్యమంగళాకారాన్ని పరిశీలించి వాటివల్ల గోపికలను వలపించుకోవడం, పూతనను సంహరించడం, కాళీయ సర్పాన్ని మర్దించడం మొదలైయిన జరిగిన అవతార ఘట్టాల్ని వివరించడం జరిగింది.

### 3. 3. 7. తాత్త్విక గేయాలు :

మోక్ష సాధన మార్గాలయిన భక్తి జ్ఞాన కర్మాదులలో జ్ఞాన మార్గం అత్యంత క్లిష్టమయింది. జ్ఞానం అంటే సంపూర్ణమయిన ఆధ్యాత్మికానుభవం. శంకరాచార్యుల వంటి ప్రముఖులయిన తత్త్వవేదాంత జ్ఞానులు ఈ మార్గాన్ని అనుసరించి ముక్తి నొందారు. శిష్టులయినవారు వేదాలను ఉపనిషత్తులను చాల పవిత్రంగా భావించారు. అందువల్ల సంస్కృతం నుంచి ఇతర భాషలలోకి అనువాదాలు చేయడానికి సాహసించలేదు కాని అవి మౌఖిక ప్రచారంతో కొనసాగడం వల్ల జానపదులు అందున్న విజ్ఞానాన్ని ఆకళింపు జేసుకున్నారు. నిర్భయంగా తమకు నచ్చిన గేయ రీతులలో పాడుకోసాగారు.

ఆచార్య బి. రామరాజుగారు-

'తత్త్వవిషయములుండుటచే గాబోలు నట్టి గేయములకు తత్త్వములను పేరు వచ్చినది. ఇట్టి తత్త్వము లధికముగా నద్వైత వేదాంతమయములు'47 అని అభిప్రాయ పడ్డారు.

ఈ తత్త్వాలనే వైరాగ్యాత్మకాలని కూడా పిలువవచ్చు. సాధారణంగా వీటిలో జీవితంమీద విరక్తి, భవిష్యత్తు మీద నిరుత్సాహం, సంసారం అంటే వెగటు, ఆత్మ ప్రబోధ, ఆత్మ నివేదన మొదలయిన విషయాలు ప్రస్ఫుటమవుతాయి. ఇవి తుమ్మెదా, చిలుకా, జీవా మనసా హంసా, కర్మమా మొదలయిన పాదాంత సంబుద్ధి పదాలతో సాగుతాయి

### తుమ్మెద పదాలు :

తుమ్మెదకు షట్పదమనిపేరు. ఆరుపాదాలు కలది అని అర్థం, కామ క్రోధాదులల్ని అరిషడ్వర్గాలంటారు. తుమ్మెదలు రకరకాలయిన పూలపై వాలినట్లు జీవుడు లోకంలోని పైపై ఆకర్షణకు లోబడి పతితుడవుతాడనే ఉద్దేశ్యంతో తాత్త్విక గేయాలలో 'తుమ్మెద పదా' లను పాడతారు. ఈ పదాలలో శృంగారం కూడా ఉండవచ్చు. బహుశః భాగవతంలోని గోపికాగీతాలు ఈ పదాలకు ప్రేరేపకం కావచ్చు.

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

### లోక వ్యవహారంలోని తుమ్మెద పదాలు :

'శివ శివ యనమేలు తుమ్మెదా
శివయంటే వినమేలు తుమ్మెదా

శివుని భక్తులాకు ,,
శరణన్న మెలే ,,
శ్రీకంఠుడను వువ్వు ,,
మూడులోకమ్ములాయెను ,,
సాకారమై యుండు ,,
పరమేకాంతమున జూడ ,,[50]

'చెట్టుపెట్టి పాయె తుమ్మెదా
చెట్టుపూలుకాయకాచె తుమ్మెదా
కాచెవారు లేరు ,,
నన్నుకాకు శాయకనెల్ల ,,
ఇంటిలోని పోరు ,,
నన్నుయిల్లు వెళ్లనీరు ,,[51]

'ఓయి బావల్లార తుమ్మెదా
బావన్నిలాలో తుమ్మెదా
ఈశ్వరుడు మానవుడు తుమ్మెదా
తోటల్లోకి తుమ్మెదా
ఇరగమడి వచ్చింది తుమ్మెదా
దేవసిరి నంది తుమ్మెదా
సోలతో సోలడే తుమ్మెదా
మాగలేసూకోని తుమ్మెదా
ఇదిగోకాసన్న తుమ్మెదా
ఈ నందీ బండి తుమ్మెద'[52]

**అన్నమయ్య తుమ్మెద పాటలు :**

శ్రీరాగం - ఏకతాళి

'తొల్లింటి వలె గావు తుమ్మెదా ఇంక
వొల్లవుగా మమ్మునో తుమ్మెదా ॥

తోరంపు రచనల తుమ్మెదా కడు
దూరేవు గొందులే తుమ్మెదా
చేరినా నెరగవు తుమ్మెదా మమ్ము
వోరగా చూడకు వో తుమ్మెదా ॥

తొలి ప్రాయపు మింద తుమ్మెదా కడు
తొలి చేవు చేగ లే తుమ్మెదా
తొలకరి మెరుగువై తుమ్మెదా ఇంక
ఉలికేవు మముగని వో తుమ్మెదా ॥

దొరవు వేంకట గిరి తుమ్మెదా మా
తురుమేల చెనకేవు తుమ్మెదా
దొరకెనీ చనవులు తుమ్మెదా ఇంక
ఒరు లెరింగిరి గదవో వో తుమ్మెదా ॥' (4-9)

ఈ పాటలో ప్రతి పాదాంతంలోను 'తుమ్మెద' ఆవృత్తి అయింది. అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతున్న ఒక సామాన్య మానవుడు తన చిత్తచాపల్యాన్ని వ్యక్తపరచడం ఇందులో కనిపిస్తుంది. ఇక్కడున్న తుమ్మెద మామూలు తుమ్మెద కాదు సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వరుడే.

**చిలక పదాలు :**

'చిలుక శుకమహర్షిని సూచిస్తుంది. పరీక్షిత్తుకు భాగవతం బోధించినవాడు శుకుడు. సరస్వతీదేవి మూడవ చేతిలో వుండేది చిలుక.

తమిళంలో చిలుక పాటను 'కిళిప్పాట్టు' అంటారు. క్రీ. శ. 7వ శతాబ్దంలో శైవాచార్యుడయిన తిరుజ్ఞాన సంబందర్ 'తేవారం' లో ఈ పద్ధతి అనుసరించాడు. క్రీ. శ. 9వ శతాబ్దినాటి మాణిక్య వాచకర్ తన కావ్యంలో ప్రవేశ పెట్టాడు.

మలయాళంలో చిలుక పాటల్ని కిళిప్పాట్టు అంటారు. భగవంతుడు చిలుక రూపంలో ప్రత్యక్షమై రామాయణ భారతాల్ని గానం చేశాడని 'ఎళుత్తచ్చన్' ఆ పద్ధతిలో వ్రాశాడని అంటారు. 'చిలుక' శబ్దానికి ఇంతటి ప్రాధాన్యం వుండడం వల్ల 'చిలుక పదాల్ని' పాడతారని చెప్పవచ్చు.

**లోక వ్యవహారంలోని చిలుక పాటలు :**

'కాళ్ళను వేళ్ళను కనుపాప మొదలుగా
కర్త జేశె నిన్ను చిలుకా
యీ క్రమము యెవ్వడు జేశె చిలుకా
దుర్మోహములుమాని ధర్మమేదచల్లితె
కర్మములు వెదుకదె చిలుకా
నిర్మలముగా వీరగురుని నెరనమ్మితె
నీవు నేనె కదె చిలుకా'53

"మూన్నాళ్ళ ముచ్చటకు మురిసేవు తుళ్ళేవు
ముందుగతి కావవే చిలుకా
ఏనాడో ఏటిలో ఎవరు చెప్పాగలరు
ముందు గతి కావవే చిలుకా
యిల్లు యిల్లన్నావు యిల్లునాదన్నాను
యింటిలో ఏముంది చిలుకా"54

**అన్నమయ్య చిలుక పాటలు :**

ఆహిరి

జీవాత్మమై యుండు చిలుకా నీ
వావలికి పరమాత్మడై యుండు చిలుకా
ఆతుమ పంజరములోన నయమున నుండి నా
చేతనే పెరిగిన చిలుకా
జాతిగాఁగర్మపు సంకెళ్ళఁబడి కాలఁ
జేతఁబేదైతివే చిలుకా ॥జీవా॥

ఖాతిగాఁజదువులు పగలు రేలును నా
చేత నేరిచినట్టి చిలుకా
రీతిగా దేహంపు రెక్కల చాటున నుండి
సీతుకోడుపలేసి చిలుకా ॥జీవా॥

చెదరి అయిదు గుటకిని భీతిఁ బొందుచుఁగడుఁ
జెదరఁగఁజూతువే చిలుకా
అదయులయ్యిన శత్రులాఱుగురికిఁగాక
అడిచి పడుదువే నీవు చిలుకా
వదలకిటు యూదారవాంఛనటు పదివేలు
వదరులు వదరేటి చిలుకా
తుదలేసి మమతలు తోరమ్ము సేసి నా
తోఁగూడి మెలగిన చిలుకా ॥జీవా॥

నీవన నెవ్వాఁడ నేనన నెవ్వఁడ
నీవే నేనై యుండుఁజిలుకా
శ్రీ వేంకటాద్రిపై చిత్తములో నుండి
సేవించు కొనఁ గట్టి చిలుకా
దైవ మానుషములు తలఁపించి యెపుడు నా
తలఁపునఁబాయని చిలుకా
యేమియును నిజముగా విని యేఁటి కని నాకు
నెఱిఁగించి నటువంటి చిలుకా ॥జీవా॥

(1-50)

ఈ పాట పాదాంతాలలో 'చిలుకా' అనే మాట ఆవృత్తి అయింది. ఇందులో ఒక సామాన్య మానవుడు ప్రాపంచిక మాయాబంధనాలలో చిక్కుకొని తల్లడిల్లడం, జీవాత్మ పరమాత్మలకు ఐక్యం చెప్పడం మొదలయిన తాత్త్విక అంశాలు వ్యక్తమవు తాయి.

జీవాత్మకాలు :

వేదాంతంలో పరమాత్మ చర్చ తర్వాత ప్రాధాన్యం వహించేది జీవాత్మ చర్చ. జీవాత్మ పరమాత్మల అనుబంధం వినిమయంలోనే అభిప్రాయ భేదాలు వచ్చాయి. ద్వైతం భేదాన్ని చెబుతుంది. అద్వైతం జీవాత్మ పరమాత్మల ఐక్యాన్ని స్పష్టం చేస్తుంది. అందువల్లనే జానపద గేయాలలో 'జీవ' సంబుద్ధి పదం కలిగిన గేయాలు ప్రచారం పొందాయి.

లోక వ్యవహారంలోని జీవాత్మకాలు :

"మాయా కారముగా, మమతలలోపడి
చెడితివి గదరా!
అడియాసలతో పడుచేగాని
కట్టుకు పోయే దేమిటిరా జీవా!
కట్టెబొగ్గులో కాలేటప్పుడు
గవ్వరాదురా నీవెంబడినీ!
ఏటికి నీయారాటం బింకా
ఎపుడో ఏమో ఎరుగమురా!
త్వరపడరా కడతేరెడు
గతికమగొనరా జీవా"[55]

అన్నమయ్య జీవాత్మకాలు :

రామక్రియ

ఏలిక విందరికి యీ దేహభూమి నీ
మేలు అన్నిమట్టువెట్టి మించరాదా జీవుఁడ ॥పల్లవి॥

వెలిఁబడ్డయింద్రియాల వెలయలోనికిఁ బిల్చి
కొలువులు సేయించు కొనరాదా
కలఁచెడి లోలోని కామాది శత్రువుల
వెళక నీకడ్డ పెట్టించరాదా జీవుఁడ ॥ఏలి॥

అట్టె పరువు దోలిన ఆసలనే గుణ్ణముల
గట్టిన లోలాయమునఁగట్టుకోరాదా
వొట్టి యెదుట పొంటులై వుండిన భోగములను
ముట్టియంతర్యామి కిచ్చి మొక్కరాదా జీవుఁడ ॥ఏలి॥

పంపు వెట్టి దండంపిన బలు నీ వుద్యోగాల
గుంపు గూర్చి ముక్తి చూరఁగొనరాదా
యింపుల శ్రీవేంకటేశుఁడితడే సర్వకర్త
సొంపుగ భావించి చక్కఁజూడరాదా జీవుఁడ ॥ఏలి

(8-217)

ఈ పాట చరణాంతాలలో 'జీవుఁడ' అనే సంబుద్ధి ఆవృత్తి అయింది. ఇందులో ఒక సామాన్య మానవుడు కామ క్రోధ లోభ మోహాదు లయిన అరి షడ్వర్గాలు, గుర్రాల్లా పరుగులు దీసే కోరికలు మొదలయిన ఐహిక సంబంధ వాంఛల్ని అణచుకొని ముక్తి నొందమని జీవుణ్ణి హెచ్చరించడం వ్యక్తమవుతుంది.

మనసాత్మకాలు :

ఎదుటి వారికి చెప్పడంకన్నా ముందుగా తనకు తాను చెప్పుకోవడం ఉత్తమ పద్ధతి. ఈ కారణం వల్లనే తాత్త్విక గేయాలలో 'మనసాంత' పదాలు వచ్చాయి. మనిషి బందీకావడానికి విముక్తి కావడానికి మనసే కారణమవుతుంది అందువల్లనే వాగ్గేయకారులందరు 'మనసాంత' కృతులు వ్రాశారు.

లోక వ్యవహారంలోని మనసాత్మకాలు :

"సిచ్చుసిచ్చుగాల మెల్ల యిచ్చుక
సచ్చిదానందమైన శివుండలచవె మనసా
కాయమది మాయ కెడశాయక
శినాయన్నమో యని తలంచవె మనసా"56

"పరధనాపేక్ష యిక పరిహరించవె మనసా
పరనారి తల్లిగా భావించు మనసా
పరతత్త్వము వెరపరగశాయవె మనసా
పరమహంసను నెక్కి పరమగనుము మనసా

మూల ఆధారమున కీలెరిగినపుడు మనసా
పొంచి యోగంటి గురుడు బోధించి నట్ల
సచ్ఛిద్రమైన శివుదలచవె మనసా
కాయమీది మాయా పడకా
ధీరు పరమాత్మ గురుని జేపమీ మనసా" 57

"శ్రీమతె నరవరాయ నమహ యనగదవె
జిహ్వ గలిగిన ఫలము మనసా
నేమముతో వారినె ధాన్యంబు శాయవె
నీవు గల్గిన ఫలము మనసా
చిరభక్తితో వారి పదములకు మ్రొక్కవే
శిరము గలిగిన ఫలము మనసా
కరములై వారి విగ్రహము సేవించవే
కన్నులు గలిగిన ఫలము మనసా
ధర వారి గుణ కథల్ తగ విన వెనకన్
రంధ్రములు గల్గిన ఫలము మనసా
గరిమగల వారి కైంకర్యంబు శాయవె
కరములుండిన ఫలము మనసా" 58

అన్నమయ్య మనసాత్మకాలు :

ఆ హి రి

'పారకుమీ వో మనసా పంతము విడువకుమీ మనసా
పారిన నీవే బడగమ్యేదవు చేరువ నాడే చెప్పవె మనసా ॥పల్లవి॥

చింతించకుమీ శివునివైరిచే చిక్కువడకుమీ వో మనసా
కంతువారకము వయసూబ్రాయములు కావటి కుండలు వో మనసా
యెంతే మేలుగిదేకాలము యెప్పుడు నుండదు వో మనసా
వంతరించుకో వాని మనసున సంతోషముగా వోమనసా ॥పార॥

యెన్నికలే తలపోయకుమీ యేమరకుండుమీ వోమనసా
కన్న విన్నవారిలో నెప్పుడు కాకు పడకుమీ వోమనసా
పున్నమమాసలు పుడమిలో బదుకులు పోయవచ్చేవి వోమనసా
మిన్నోనేలని మన్నుదినములో మీఁదు చూడకుమీ వోమనసా ॥పార॥

కన్నుల సంగాతము సేయకుమీ కావరించకుమీ వో మనసా
వన్నెల మాటలు చెవులఁబెట్టక వాసి విడువకుమీ వోమనసా
మున్నిటి సురలు బ్రహ్మాదులకైనను ముక్తిసాధనము వోమనసా
వెన్నుని వేంకటగిరి పతిఁదలఁచుము వేసారకుమీ వోమనసా ॥పార॥

(1-188)

ఈ పాటలో ప్రతి పాదాంతంలోను 'మనసా' అనే మాట ఆవృత్తి అయింది. మానవుని మనస్సు చంచల మయింది. విషయ సుఖాలవల్ల కష్టాలు, నష్టాలే తప్ప ప్రశాంతత వుండదని తెలిసి కూడా పునః వాటివైపే పరుగులు తీస్తుంది. అలాంటి మనస్సుకు హితబోధ చేసుకోవడం ఈ కీర్తనలో విశదమవుతుంది.

హంస పదాలు :

ఇది 'సోహం' యొక్క వికట రూపం. హంసకు పాలునీళ్ళను వేరుచేసే శక్తి వుంది. సహజంగా విజ్ఞానానికి తెలుపురంగు గుర్తు. హంస తెల్లనిది కాబట్టి విజ్ఞానానికి ప్రతీకగా ఈ పదాన్ని వాడారని చెప్పవచ్చు. విశిష్ట జ్ఞానం పొందినవారు 'హంస' నామధేయులవుతారు. రామకృష్ణ పరమహంస మొదలయిన వారు. మరి 'సోహం' తత్వాన్ని అర్థం చేసుకున్నవారు (అద్వైత సిద్ధాంతాన్ని) హంసులే కాబట్టి 'హంస' అనే పదానికున్న వైశిష్ట్యం వల్ల 'హంసపదాల్ని' వ్రాశారని చెప్పవచ్చు.

అన్నమయ్య హంస పదాలు :

కాంబోధి

దిబ్బలు వెట్టుచుఁ దేలిన దిదివో
ఉబ్బు నీటిపై నొక హంసా ॥పల్లవి॥

అనువున(గమలసి హారమె నెలపై
వొనరివున్న దిదె వొక హంసా
మనియెడి జీవుల మానససరసుల
వునికి నున్న దిదె వొక హంసా ॥దిబ్బ॥
పాలు నీరు నేర్పరచి పాలలో
నోలలాడెడిదె వొక హంసా
పాలుపడిన యీపరమహంసముల
వోలినున్న దిదె వొక హంసా ॥దిబ్బ॥
తడవి రోమ రంధ్రంబుల గుడ్ల
నుడుగక పొదిగీ నొక హంసా
కడు వేడుక వేంకట గిరి మీ(దట
నొడలు వెంచె నిదె యొక హంసా' (1-16)

ఈ పాట పాదాంతాల్లో 'హంసా' అనే మాట ఆవృత్తి అయింది. ఇందులో ఒక హంస సరస్సులో విహరించడం, పాలు నీళ్ళను వేరుచేసి పాలను ఆరగించే గుణం కలిగి వుండడం, గుడ్లు పెట్టి రెక్కల్లో దాచుకొని పొదగడం, మొదలయిన క్రియలు చేస్తే, రెండవ హంస ప్రాణుల మానస సరోవరాల్లో విహరించడం, మంచి చెడుల్ని వేరుచేసి మంచిని స్వీకరించడం, ఒక్కొక్క రోమ కూపం నుంచి విశ్వ సృష్టిని ఆవిష్కరింప జేయడం మొదలయినవి జేస్తుంది. ఇక్కడ రెండవ హంస శ్రీవేంకటేశ్వరుడు. ఇలాంటి తాత్త్విక పదాలు పాదాంతాల్లో వున్న మరికొన్ని కీర్తనలు :

ఆదిమూలమా : **పాడి**

'విభుడ వింతటికి వెరవుతో నను(గావు
అభయ హస్తముతోడి ఆదిమూలమా ॥పల్లవి॥
పలు లంపటాల చేత(బాటువడి పాటువడి
అలసితి(గావవే వో ఆదిమూలమా
చలమరి యితర సంసార భ్రాంతి(జిక్కితి న
న్నలరించి కావవే వో ఆదిమూలమా' ॥విభు॥ (6-66)

ఏఱుక   లలిత

'ఆతుమ సంతసపెట్టుటది యేఱుక, తా
నే తెరువు నొల్లకుండు టిదియే యేఱుక ॥పల్లవి॥

ముంచిన బంధములలో ముణుఁగుడువడక తా
నంచల విడఁదన్నుటది యేఱుక
చంచలపు విషయాల సగ్గుడు మొగ్గుడు గాక
యెంచి హరిఁదలఁపోయు టిదియే యెఱుక' ॥ఆతుమ॥

(11-3-164)

కర్మమా :

శ్రీరాగం

ఎన్ని బాధలఁబెట్టి యేఁచెదవు నీవింక నెంతకాలముదాఁకఁ గర్మమా
మన్నించు మనుచు నీ మఱఁగు చొచ్చితిమి మా మాటాలకించవో కర్మమా
॥పల్లవి॥

ప్రతిలేని దురితములపాలు సేయక నన్నుఁ బాలించవైతి వో కర్మమా
తతితోడ నాత్మపరితాపంబు తోడుతను తగులేల సేసితో కర్మమా
జితకాములకుఁగాని చేతికిని లోనయి చిక్కవెపాలంబు కర్మమా
మతిహీనులై నట్టిమాకు నొక పరిపాటి మార్గంబు చూపవో కర్మమా ॥ఎన్ని॥

(1-284)

కలియుగమా :

సామంతం

కలలోని సుఖమే కలియుగమా, వెన్న
కలిలో నెక్కడిది కలియుగమా ॥పల్లవి॥

కడిగడి గంపమై కాలము గడపేవు
కడుగఁగడుగ రొంపి కలియుగమా
బడలికె పాపపు పరమోబో చూపవు
గడిపీటియును నీవు కలియుగమా ॥కల॥ (1-118)

కాపురమా :

లలిత

కరుణించు మింకనైన కాఁపురమా
కరికరి బెట్టకుమీ కాఁపురమా

కలలోని సుఖమైన కాపురమా
కలుషమే చవియైన కాపురమా
కలను బేహారపు కాఁపురమా
కలఁడు మాకిదే హరి కాఁపురమా ॥కరు॥ (5-34)

చదువు :

సామంతం

నాఁటికి నాఁడే నాచదువు
మాటలాడుచును మఱచేటి చదువు ॥పల్ల॥

ఎనయ నీతని నెఱుగుటకే పో
వెనకవారు చదివిన చదువు
మనసున నీతని మఱచుటకే పో
పనివడి యిప్పటి ప్రౌఢల చదువు ॥నాటి॥ (1-91)

ఛీఛీ :

పాడి

ఏఁటికి నేవ్వరి పొందు యిస్సిరో ఛీఛీ
నాటకములాల ఛీఛీ నమ్మతిఁగా మిమ్మను ॥పల్లవి॥

జవ్వనమదము ఛీఛీ చక్కదనమరో ఛీఛీ
రవ్వైనరాజస గర్వమరో ఛీఛీ
కొవ్వినమదము ఛీఛీ కూగిమియాసరో ఛీఛీ
నవ్వుల దేహమ ఛీఛీ నమ్మితిఁగా మిమ్మను ॥ఏటి॥

(1-195)

చింత :

లలిత

బ్రహ్మాదులకు నిదే పరచింత
బ్రహ్మాండమన్న తంత్రికమైన పరమాత్మ చింత ||పల్లవి||
మూడు లోకములకెల్లా మొదలి చింత
మెదె (ద?) పుఁ గర్మములకు మీఁది చింత
తోద జనించిన నాటి తొల్లిటి చింత
వీడక మాకు గలిగె వొక్కటే చింత ||బ్రహ్మా||
(10-48)

జడులు :

భైరవి

అయ్యో మాయలఁ బొంది అందు నిందు నున్నవారు
ఇయ్యకొన సత్తలు గా రెఱఁగరు జడులు ||పల్లవి||
చుక్కలై యుండినవారు సురలై యుండినవారు
యిక్కడనుండి పోయిన యీ జీవులే
దిక్కులవారి నింపరు దేవతలంటా మొక్కేరు
యొక్కడైన హరి నాత్మ నెఱఁగరు జడులు ||అయ్యో||
(6-12)

తగులు :

శ్రీరాగం

ఎక్కడి విరతి మాకు నిహ మెల్లాదగులు
మక్కళించి మక్కళించీ మాయకింతాఁదగులు ||పల్లవి||
పుట్టినప్పుడే పాపపుణ్యములుఁదగులు
అట్టె యాదేహమున నన్నమూఁదగులు
గట్టిగా నిరెండునైతే కర్మమూఁదగులు
చుట్టుముఁజోరాదు మాయకింతాఁదగులు ||ఎక్క||
(8-77)

దేహమా : భైరవి

తెలియరాదు మాయదేహమా మమ్ము
పలు వికారాలఁబెట్టి పదగొన్న దేహమా ॥పల్లవి॥

దినముక్క వయసెక్కె దేహమా సారె
పెను మదము గురిసే బెండు దేహమా
దిన దిన రుచి గోరే దేహమా నన్ను
ఘన మోహ పాశాలఁగట్టెఁగద దేహమా ॥తెలి॥ (1-416)

దైవమా : ముఖారి

ఏమీ నెఱఁగనినా కేడ పుణ్యము
తామసుండఁజేసి ముందరనున్న దైవమా ॥పల్లవి॥

పాతకపుఁజేతలనే పట్టి నిన్నుఁబూజించు
ఘాతకుఁడ నాకు నెక్కడి పుణ్యము
చేతనముఁబోడిసేయు చిత్తము నీదే కాన
రాతి బొమ్మఁజేసి ఖారము నీది దైవమా (1-286)

నాటకము : ముఖారి

నానాఁటి బదుకు నాఁటకము
కానక కన్నది కైవల్యము ॥పల్లవి॥

పుట్టుటయు నిజము పోవుటయు నిజము
నట్టనడిమి పని నాఁటకము
యెట్ట నెదుటఁగలది ప్రపంచమును
కట్ట గడపటిది కైవల్యము ॥నానా॥ (9-267)

పరము : సామంతం

ఇతరములిన్నియు నేమిటికి
మతి చంచలమే మానుట పరము ॥పల్లవి॥

ఎక్కడి సురపురమెక్కడి వైభవ
మెక్కడివిన్నియు నేమిటికి
ఇక్కడనే పరహితమును బుణ్యము
గక్కనఁజేయఁగఁగలదిహపరము ॥ఇతర॥ (11-3-20)

ప్రజలు : అహిరి

ఏఁటికిఁదలఁకెద రిందరును
గాఁటపు సిరులివి కానరో ప్రజలు ॥పల్లవి॥

ఎండలఁబొరలక యేచిన చలిలో
నుండక చలిలోనుడుకక
అండనున్న హరినాత్మ దలఁచిన
పండిన పసిఁడే బ్రతుకరో ప్రజలు ॥ఏటికి॥ (11-35)

పాడి : భూపాళం

పావనము గావో జిహ్వ బ్రదుకవో జీవుఁడా
వేవేల కితని నింక వేమారునుఁ బాడి ॥పల్లవి॥

హరినామములే పాడి అతని పట్టపురాణి
యిరవై మించినయట్టి యిందిరఁబాడి
సరి నిరువంకలను శంఖచక్రములఁబాడి
వరదకటిహస్తాలు వరుసతోఁబాడి ॥పావ॥ (7-125)

మర్మం : గౌళ

వలసిన వారికి వైపులివి
చలమున మానులె జయమర్మం ॥పల్లవి॥

తనలోనే వోదైవము
ఘనమే యణువై కనినది
కనవలె నీతని గనుటకు
మనసు అయమౌటె మర్మం ॥వలసి॥ (11-1-156)

**మాయ :** రామక్రియ

నేనా (న?) గెలువ లేను నీమాయ
శ్రీనాథ నీవు సేసే చేతలే నీమాయ ॥పల్లవి॥

తమకము గడు రేచు తలఁపు ఉబ్బుత లూఁచు
నిమిష మూరకుండదు నీ మాయ
తిమిరము బుద్ధిఁగప్పు తెలివల వెంట దిప్పు
అమర తోడునీడ అయఁబో నీమాయ ॥నేనా॥ (9-251)

**యోగి :** బౌళి

నానామార్గముల నాఁటుకొను నొకయోగి
మానిమీఁది తపసి సామాన్యుఁడా యోగి ॥పల్లవి॥

పున్నమ నమాస గూడఁబొదిగి నొక్కొక యోగి
కన్నుల చూపులు సరిగా జూచు నొక యోగి
మిన్నునూయి చేఁతాటఁజేదిమెచ్చు మింగు నొక యోగి
వెన్న సన్నముగ నూరి పీఁగు నొక యోగి ॥నానా॥ (6-125)

**ఋణము :** గుండక్రియ

ముందటి జన్మము లెల్లా ముంచేఁబారుబడి వడ్డి
యెందు చొచ్చినానుఁబోనియ్య దీఋణము ॥పల్లవి॥

నుదుట వ్రాసిన వ్రాలు నూరేండ్ల పత్రము
పొదలు నాకర్మమే పూఁట కాఁపు
వెదకి సంసారము వెంటఁబై తరవు
యిది యెందువొచ్చినాఁబోనియ్య దీఋణము ॥ముంద॥ (1-469)

**రోఁతా :** ముఖారి

అనుమానపుఁబడు కదిరోఁతా తన
మనసెనయనికూటమి మరి రోఁతా ॥పల్లవి॥

ఉపకీర్తులంటి అడికె లోనై
అపవాదియాట అడిరోంత
వుపమ గెలిచేనని వొయ్య జెయచుటలు
విపరీతపు గుణవిధ మొకరోంతా ॥అను॥ (1-26)

వివేకమా : రామక్రియ

మాయలో మోహమున మరచితివిదే హరి
చేయింటికి వింటే వివేకమా ॥పల్లవి॥

అంతటికి నొడయఁడు అఖిల జీవులలోన
అంతర్యామి శ్రీహరి యట
యింతటిలో నీకు హితబంధువులు వేరి
వింతవారెవ్వరు నీకు వివేకమా ॥మాయ॥ (11-1-46)

సాక్షి : దేసాళం

కాదన్న వారికి వారికర్మమే సాక్షి
యేదెస చూచిన మాకు నీతడే సాక్షి ॥పల్లవి॥

వేదాలు సత్యమౌటకు విష్ణుఁడు మత్స్యరూపమై
అదటఁదెచ్చి నిలిపె నది సాక్షి
ఆదిఁగర్మములు సత్యమౌటకు బ్రహ్మయఁ గాన
వేదితో నీతఁడు యజ్ఞభోక్తాయె సాక్షి ॥కాద॥ (8-287)

సంసారము : భైరవి

సడిఁబెట్టెఁ గటకటా సంసారము చూడ
జరధిలోపలి యీఁత సంసారము ॥పల్లవి॥

జమునోరిలో బ్రదుకు సంసారము చూడ
చమురు దీసినదివ్వె సంసారము
సమయించుఁబెనుదెవులు సంసారము చూడ
సమరంబులో నుసికి సంసారము ॥సడి॥ (1-199)

సుండి : సాళంగం

జ్ఞానులాల యోగులాల సకల విరక్తులాల
నానావిధాల నివి నమ్మేరు సుండి ॥పల్లవి॥

అలరి యింతుల యధరామృతము లివియెల్ల
కాలకూట విషముల కరణి సుండి
శిలముతో వీరల చెట్టలు వట్టుటలెల్లా
బాలవాగాల దొడికి పట్టుట సుండి ॥జ్ఞాను॥ (6-26)

### 3. 3. 8. తందాన పాటలు :

ఈ పాటల్ని సమూహంలో ఒకరు ఏకతార మీటుతూ పాడుతుంటే తక్కిన వారు చివర అందుకొని 'తందాన' అనిగాని లేదా 'తందానతాన' అని గాని వంత పాడతారు.

ఆచార్య యస్వీ. జోగారావుగారు -

"ఇది సంగీతంలో గానాంగ విశేషమైన తాన శబ్ద సంబంధియైయుండును" 58 అని అభిప్రాయపడ్డారు.

శిరోమణి సముద్రాల లక్ష్మణయ్య గారు-

"ఇది గాన సమయమున మాటి మాటికిని లయను చూపుతూ చేయు రాగాలాపన ధ్వని."59 అని పేర్కొన్నారు

లోక వ్యవహారంలో వుండే వంత పాటల పద్ధతిలో సాగే కథాగేయాల్లోను తాత్త్వికాంశాలున్న గేయాల్లోను 'తందాన తాన' లేదా 'తందనానా' ఆవృత్తి వుంటుంది.

ఉదా : రాజా ఓరాజా రేజా భోగతి గలిగి తందాన తాన
మనది యా దేశంబు తందానతాన
మనది ఏది భూమి ,,
పట్నానికి పడమటి దిక్కు ,,
రగా రంగం పేట ,,

బీదరు తాలూకా తందాన తాన
అందోళి జోగిపేట ,,
సదాశివనం పేట ,,
ఏలెవాడు రాజు ,,
రెడ్డిపిదిమారెడ్డి ,,
వృదిమరెడ్డి భార్య ,,
తల్లి శివరంగమ్మ ,,
శివరంగమ్మ కన్నకొడుకు ,,
డాల్ బహద్దురు శివారెడ్డి ,,
వెంకటేశ్వర్లు వరము చేత ,,
కలిగినవాడు శివారెడ్డి ,,
అయిదురేఖలు గలవాడు ,,
పట్నములో భేషైనవాడు ,,
రాజా భోగతి గలిగి ,,[59]

"గంతా దోచుకు పోయెనె తండనానా కృష్ణు
డెంతా మోసము చేసెనే తందానా
వక్కాలాకుల తిత్తిపోయె తందానా మొలను
జెక్కిన పొగ చుట్ట పోయె తందానా"[60]

**అన్నమయ్య తందానపాట :**

అన్నమయ్య సంకీర్తనల్లో ఒకే ఒక తందాన పాట కనిపిస్తుంది.

భౌళి

'తందనాన ఆహి తందనాన పురె
తందనాన భళా తందనాన ॥పల్లవి॥
బ్రహ్మమొక్కటె పరబ్రహ్మమొకటె పర
బ్రహ్మమొకటే పరబ్రహ్మమొకటే ॥తంద॥

కందువగు హీనాధికములిందు లేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతుకులమింతా నొకటే
అందరికి శ్రీహరే అంతరాత్మ ॥తంద॥

నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే
అండనే బంటు నిద్ర అదియు నొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టు భూమియొకటే
చండాలుడుండేటి సరిభూమి యొకటే ॥తంద॥

అనుగు దేవతలకును అలకామసుఖమొకటే
ఘనకీట పశువులకు కామ సుఖమొకటే
దినమహోరాత్రములు తెగి ధనాఢ్యున కొకటే
వొనర నిరుపేదకును నొక్కటే అవియు ॥తంద॥

కొరతిశిష్టాన్నములు గొను నాక లొకటే
తిరుగుదుష్టాన్నములు తిను నాక లొకటే
పరగదుర్గంధములపై వాయు వొకటే
వరుసబరిమళముపై వాయు వొకటే ॥తంద॥

కడగియేనుగు మీద గాయు యెండొకటే
పుడమి శునకము మీదబొలయు నెండొకటే
కడుబుణ్యులను బాప కర్ములను సరిగావ
జడియు శ్రీవేంకటేశ్వరునామమొకటే ॥తంద॥ (7-151)

ఈ సృష్టిలో వుండే సమస్తం కూడా విభిన్న స్వరూప స్వభావాలతో ఎల్లప్పుడూ పరిణామం చెందుతుంది. కానీ ఎలాంటి మార్పు లేకుండా శాశ్వతంగాను, స్థిరంగాను వుండేవి ఒక్క పరబ్రహ్మమే. ఈపరబ్రహ్మ మయమయిన జగత్తులో తెగలు తెగలుగా విభజించి న్యూనతాధిక్యతలను చూపవలసినవి ఏవీలేవు. సకల జీవులకు ఆ శ్రీహరే అంతరాత్మ. కాబట్టి 'అందరూ సమానులే అనే సామ్యవాద సిద్ధాంత భావాలు ఈ పాటలో చెప్పబడ్డాయి.

3. 3. 9. దశావతార కీర్తనలు :

అవతారం అంటే దిగడం. పై నుండి క్రిందికి రావడం అని అర్థం. దేవుడు అవతారమెత్తాడు అంటే పైన వుండే దేవుడు లోకక్షేమం కోసం క్రిందికి దిగి ఈ లోకానికి వచ్చాడని భావం.

ప్రపంచంలో అధర్మం ఎక్కువయినపుడు దుష్ట శిక్షణ, శిష్ట రక్షణకోసం భగవంతుడు పశుపక్షి మనుష్యాది రూపాలలో భూమిపై అవతరిస్తాడని అన్ని మతాల వారి నమ్మకం. భగవంతుడు లోకోపకారం కోసం భౌతిక దేహాన్ని ధరిస్తాడన్న నమ్మకమే ఈ అవతార కల్పనకు మూలం దుష్టులవల్ల దానవులవల్ల పీడన కలిగి నపుడు భూదేవిగాని, ఇంద్రాది దేవతలుగాని విష్ణువుతో మొరపెట్టుకోవడం, అతడు వారికి అభయ మిచ్చి పంపి సమయం వచ్చినపుడు ఒక అవతారమెత్తి దుష్టుల సంహ రించడం అనేది విష్ణ్వవతారాలకు సంబంధించిన సామాన్యమయిన విషయం

దశావతారాల్ని గూర్చి లోకంలో ప్రసిద్ధి గాంచిన శ్లోక మొకటుంది.

"మత్స్య కూర్మవరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కిరేవచ"

ఈ శ్లోకంలో ముగ్గురు రాములు వరుసగా పరశురామ, దశరథరామ, బలరా ములు ప్రస్తావింపబడ్డారు. పై శ్లోకంలో కృష్ణావతారం చెప్పబడలేదు. దీనికి కారణం కృష్ణుడు పూర్ణావతారమని, స్వయంగా విష్ణువనే భావం వుండడమే కావచ్చు.

సంస్కృత హరి వంశంలో (పూర్వ 1-42) నారాయణ, పిష్ణువరాహ, నారసింహ, వామన, దత్తాత్రేయ, జామదగ్ని, రామ, కృష్ణ, కల్కి అనే దశావ తారాలు చెప్పబడ్డాయి. వీటిలో మత్స్య కూర్మ, బుద్ధ, బలరామావతారాలు చెప్పబడ లేదు. బలరామావతారానికి బదులు కృష్ణావతారం చెప్పబడింది.

దేవీ భాగవతంలో (స్కంధం. 4) ధర్మ, నర, నారాయణ, దత్తాత్రేయ, నృసింహ, వామన, పరశురామ, రామ, అర్జున, కృష్ణ అనే పది అవతారాలు చెప్ప బడ్డాయి ఇందులోనే విష్ణువు అవతారాలు అనంతాలని సనత్కుమార, వరాహ, నారద, నరనారాయణ, కపిల, దత్తాత్రేయ యజ్ఞ, ఋషభ పృథు, మత్స్య, కూర్మ, ధన్వంతరి, మోహిని నరసింహ, వామన, పరశురామ, వ్యాస, శ్రీరామ, బలరామ, కృష్ణ, బుద్ధ, కల్కి అనే22 అవతారాలు కూడా చెప్పబడ్డాయి.

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

విష్ణువు యొక్క అవతారాలు అనేకం వున్నాగాని వాటిలో పది అవతారాలే ప్రసిద్ధి గాంచాయి. పురాణాల్లో కూడా ఈ అవతారాల మహిమలే ఎక్కువగా వర్ణించబడ్డాయి.

జానపదుల్లోని దశావతారం పాటలు రెండు రకాలుగా వున్నాయి. కేవలం విష్ణ్వవతారాల్ని పేర్కొంటూ రక్షించమని ప్రార్థించేట్టు సాగిన గేయాలు మొదటి వర్గంలో చేరతాయి. కుటుంబంలోని వ్యక్తుల్ని అవతారాలతో పోలుస్తూ పాడేవి రెండవ వర్గంలో చేరతాయి. ఇవేగాక లాలిపాటలలో కూడా దశావతార వర్ణన లుంటాయి.

"మరుజనకమమ్మేలు మత్స్యావతార
గురుతుగా కృప జూడు కూర్మావతార
వరదుడవు కావయ్య వరహావతార
సిరులు కరుణించు నరసింహావతార
వక్షముననిరిగల్గు వామనావతార
రక్షించుమము పరశురామావతార" 61

"మాపాపమామల్లు మత్స్యావతారం
కూర్చున్న తాతల్లు కూర్మావతారం
వరసైన బావల్లు వరహావతారం
నట్టింట నాయత్త నరసింహావతారం
వాసిగల బొట్టెల్లు వామనావతారం
పరమ గురుదేవ పరశురామావతారం
రంజించు మామయ్య రామావతారం
బంటైన బంధువులు బలభద్రావతారం
బుద్ధితో మాచిట్టి బుద్ధావతారం
కలిపిడితో పూయన్న కలికావతారం
వర్ధిల్లు పసిపాప వర్ధిల్లు నా తండ్రి
చిట్టి నాకన్నోడ శ్రీ కృష్ణావతారం" 62

అన్నమయ్య సంకీర్తనలలోని దశావతార కీర్తనల్ని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు.

మొదటిది అవతార నిర్దేశాత్మకము వీటిలో స్పష్టంగా మత్స్యాద్యవతారాల ప్రసక్తి స్పష్టంగా వుంటుంది రెండవది అస్పష్ట అవతార నిర్దేశాత్మకాలు. వీటిలో అవతారాల పేర్లుండవుగాని అవతారాల్లోని లోకోత్తర క్రియల వల్ల ఫలానా అవతారా లని భావించే అవకాశం వుంటుంది.

అవతార నిర్దేశాత్మకాలు : సామంతం

"ఇతని కంటే మరి దైవము గానము యెక్కడ వెదకిన నితఁడే
అతిశయమగు మహిమలతో వెలసెను అన్నిటి కాధారము దానె ॥పల్లవి॥
మది జలధుల నొక దైవము వెదకిన మత్స్యావతారం బితఁడు
అదివో పాతాళమందు వెదకితే నాది కూర్మ మీ విష్ణుఁడు
పొదిగొని యడవుల వెదకి చూచితే భూవరాహ మని కంటిమి
చెదరక కొండల గుహల వెదకితే శ్రీనరసింహంబున్నాఁడు ॥ఇత॥
తెలిసి భూన భోంతరమున వెదకిన త్రివిక్రమాకృతి నిలిచినది
బలుపీరుల లో వెదకి చూచితే పరశురాముండొక డైనాడు
తలఁపున శివుఁడును బార్వతి వెదకిన తారక బ్రహ్మము రాఘవుఁడు
కెలఁకుల నావుల మందల వెదకిన కృష్ణుఁడు రాముఁడు నైనారు ॥ఇత॥
పొంచి యసుర కాంతలలో వెదకిన బుద్ధావ తారంబైనాడు
మించిన కాలము కడపట వెదకిన మీఁదటి కల్క్యవతారము
అంచెల జీవుల లోపల వెదకిన నంతర్యామై మెరసెను
యెంచుక యిహమునఁబరమున వెదకిన యీతఁడే శ్రీవేంకటవిభుఁడు
॥ఇత॥ (9-81)

ఈ కీర్తనలో మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ రామ, కృష్ణ, బుద్ధ, కల్కి అనే దశావతారాల్ని ఆయా అవతారాలపేర్లతో వర్ణించడం జరిగింది.

అవతార నిర్దేశం లేనివి :

అవతారాల పేర్లు లేకున్నా లోకోత్తర క్రియల్ని వ్యాఖ్యానించడం వీటిలో ప్రధానం. అన్నమయ్య లోకోత్తర క్రియల్ని ప్రహేళికా రూపంలోను, ఉత్సవ

వర్ణనాత్మకంగాను, మానవ స్వభావాదుల్ని దేవుళ్లలో ఆరోపించే భంగిమలో కీర్తించాడు

ప్రహేళికా రూపాలు :

ప్రహేళిక అంటే పొడుపు కథ పొడుచునట్లుగా ప్రశ్నించు అనే అర్థంలో పొడుచు లేదా పొడుపు కథలు అనవచ్చు. కథలు అనడంలో ఇక్కడ విషయం అనుకోవాలి. పొడుపు కథలు ప్రశ్నరూపంలో ప్రత్యక్షంగానో లేదా పరోక్షంగానో సంపూర్ణంగానో లేదా అసంపూర్ణంగానో సంప్రదాయబద్ధంగా వుంటాయి. ఇవి సాధారణంగా అసంభవంగాను పరస్పర విరుద్ధంగాను కనిపిస్తాయి. ఇవి తెలుగు ప్రజల దేశీయతను ప్రతిబింబింప జేస్తాయి. ఇవి ఆబాలగోపాలంలో జిజ్ఞాసను రేకెత్తించి ఆలోచనాశక్తిని పెంపొందింప జేస్తాయి. వీటిలో కొన్ని ఉద్దేశ్యపూర్వకంగా జటిల ప్రశ్న రూపంలో కల్పింపబడి వుంటాయి. కొన్ని బాగా అర్థమవుతున్నాగాని ఎంతో ఆలోచిస్తేగాని అందులోని నిగూఢార్థం తెలియని విధంగా వుంటాయి. వీటిలో ఆయా ప్రాణుల లేదా వ్యక్తుల స్వభావాన్ని భిన్న రీతుల్లో చెప్పడం కనిపిస్తుంది.

రామక్రియ

ఎవ్వఁడో కాని యెరగ రాదు కడు
దవ్వులనే వుండు తలపులో నుండు ॥పల్లవి॥

ఎడయపు తన రెక్క లెగసి పోలేఁడు
కడు దాఁగుఁగాని దొంగయుఁగాఁడు
వడిఁగిందు పడును సేవకుఁడును గాఁడు
వెడఁగు గోళ్ళువెంచు విటుఁడును గాఁడు ॥ఎవ్వ॥

మిగులాఁబొట్టివాఁడు మింటికినిఁబొడవు
జగడాలు తపసి వేషములును
మగువకై పోరాడు మరి విరక్తుఁడును
తగుఁగాఁపుఁబనులు నెంతయుఁదెల్లఁదనము ॥ఎవ్వ॥

తరుణుల వలపించు తగిలి పైకొనఁడు
తురగముఁబోలు రౌతునుఁగాఁడు
తిరువేంకటాద్రిపైఁదిరుగు నెప్పుడును
పరమమూర్తియై పరగు నీఘనుఁడు ॥ఎవ్వ॥ (1-74)

పై కీర్తనలో 'ఎడయవుతనరెక్కలెగసిపోలేడు' అనే వాక్యంలో 'ఎడయపు రెక్కలు' అన్నపుడు రెక్కలను కల్గివుండేటి పక్షి అనే అర్థం స్ఫురిస్తుంది. పక్షికి పైకెగసిపోయే స్వభావం వుంటుంది కాబట్టి ఆ అర్థం స్ఫురించనివ్వకుండా 'ఎగసి పోలేడు' అనే నిషిద్ధం చెప్పడం వల్ల అది మీనం అని తేటతెల్లమవుతుంది. మహావిష్ణువు సోమకాసురుణ్ణి సంహరించి వేదాలను వెలికి తేవడం కోసం మీనావతారం దాల్చాడని ఈ పొడుపు కథలోని గూఢార్థం. ఇలాగే తక్కిన మత్స్యావతారాలు ఆలోచించేవారికి స్ఫురిస్తాయి.

**ఉత్సవాత్మకాలు :**

దేవాలయాల్లో జరిగే నిత్య నైమిత్తిక ఉత్సవ విశేషాల్ని దృష్టిలో వుంచుకొని వాటిని భంగ్యంతరంగా వర్ణించడం.

రామక్రియ

పడియుఁబడియుఁగాను పరమాత్ముఁడితనికి
వెడకి చవులు దెచ్చి విందు లిట్టె సేయరే ॥పల్లవి॥

పొలసు పైఁబారెనట బురద మేనంటెనట
యిల మన్ను మోఁచెనట యీదేవుఁడు
నెలవైన రాకాసి నెత్తుటఁదోఁగి నాఁడట
కల పన్నీరెల్లఁ బోసి కడుగరే దేహము ॥పది॥

బాఁపన బిక్షమెత్తెనట పట్టెనట మున్నుమ్మరము
కైపగునల్లిసికోక గట్టినాఁడట
చాపలానఁజెంచు దాని సంగతిఁదిరిగెనట
కోపులఁగప్పురధూళి గుప్పరే యీతనికి ॥పది॥

కాంతలనే కూడెనట కడగడ దొక్కెనట
పొంతలఁదట్టు పుణుఁగు పూయరే నేఁడు
యింతట శ్రీవేంకటేశు నెద నలమేలుమంగఁ
గాంతునికి మెడఁగుచ్చి కట్టరే మొక్కుదము ॥పది॥ (25-336)

భగవంతునికి పన్నీటి అభిషేకం, కర్పూరధూళి కప్పడం, పునుగు పూయడం వంటివి అభిషేక సమయాలలో చేసే కృత్యాలు. కాని ఆయా అభిషేకాలు చేయ డానికి కారణాల్ని అతికిన విధంగా చెప్పడంలోనే అందం వుంది. పొలసు పారడం, బురద అంటడం, మన్ను మోయడం, రక్తపు మడుగులో దొగడం మొదలయినవి దేహానికి పట్టిన కల్మషాలు మలినాలు. ఈ మలినం అసహ్యమయింది. దుర్వాసన యుక్తమయింది. తలచుకొంటేనే రోత గలిగించేవి. వీటిని మామూలు స్నానంతో గాక పన్నీటి స్నానంతోనే పూర్తిగా మాయం చేసుకోవచ్చు. పై క్రియలన్నీ మత్స్య, కూర్మ, వరహ, నరసింహాద్యవతారాల్లో చేసిన లోకోత్తర క్రియల్ని స్పష్టం చేస్తాయి.

శుక్రవారం రోజు జరిగే అభిషేకం గురించిన వివరణ 'History of Tirupati' (P. 329) లో ఇలా వుంది — 'The applicati( n of this scented oil over the entire body of the Murti is of recent origin. It may be pointed out here that the whole body was not an pointed nor was the application made all round the year. The current practice is to apply the Civet oil daily to the feet and to the face. When the of Civet oil for the whole body commenced we cannot say'

ఈ కీర్తనలో ప్రతి శుక్రవారం జరిగే అభిషేకోత్సవాలు వర్ణించబడ్డాయి స్వామి వారి విగ్రహాన్ని సుగంధ తైలంతో అభ్యంజనం చేసి, కుంకుమ పువ్వు మొదలైన వాటితో నలుగుపెట్టి పన్నీటితోను, శుద్ధోదకంతోను జలకం చేసి ఆ:న తర్వాత కర్పూరపుపొడిని చల్లి దానిపై మంచి సుగంధ తైలం దిద్ది ముత్యాల తిరు నామం మొదలైన దివ్యాభరణాలను అలంకరించడం తాళ్ళపాకవారి కాలంనాటి శుక్ర వారాభిషేక ఆచారం. అభిషేకానికి సంబంధించిన కీర్తనలు అన్నమయ్యలో చాల కనిపిస్తాయి (8-163, 165, 166; 13-198, 493, 472; 25-531, 569; 29-142, 154, 330,376.)

మానవ నైజ స్థితికి సంబంధించినవి :

సామాన్య మానవునికున్న దైన్య పరిస్థితుల్ని భగవంతునికి అన్వయించడం

సామంతం

ఏమి సేయవచ్చుఁగర్మ మిచ్చినంతేకాని లేదు
తాము సేసినంత వట్టు తమకుఁబోరాదు ॥పల్లవి॥

ఇట్టునట్టు మిట్టిపడ్డ యించుకంతా లేదు. పీఫు
బట్టగట్ట మోపు మోఁచి పాటువడ్డాలేదు
తట్టుద లోకమెల్లఁ దవ్వుకొనినా లేదు
ఒట్టఁదెరువున నోము దెరచినా లేదు ॥ఏమి॥

అడిగి పరుల బదుకాసపడ్డా లేదు, భీతి
విడిచి నెత్తుటఁదోఁగి వీరుఁడైనా లేదు
అడవులెల్లాఁదిరిగి అలమటించిన లేదు
యిడుము పాటుకుఁజొచ్చి యియ్యకొన్నా లేదు ॥ఏమి॥

పుట్టి వచ్చి వనితల వలపించుకొన్నా లేదు
మెచ్చుల గుఱ్ఱము నెక్కి మెరసినా లేదు
యెచ్చరికఁదిరువేంకటేశుఁ గొలువక వుంటే
యిచ్చట నచ్చట సుఖ మించుకంతా లేదు ॥ఏమి॥ (1-55)

ఈ కీర్తనలో "గ్రాసవాసోదైన్యాలు ప్రతి సామాన్య మానవునికి వుంటాయి. అవే మానసిక బాధలకు కారణాలు. ఇలాంటి బాధలు భగవంతునికి కూడా తప్పడం లేదని" వాటిని ఆయా అవతారాలతో అన్వయించి చెప్పడం జరిగింది. ఇందులో వరుసగా మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణ, బుద్ధ కల్క్యవతారాలు కనిపిస్తాయి.

## వాత్సల్య భక్తి :

భక్తిభేదాల్లో వాత్సల్య భక్తి ఒకటి. యశోదలో ఆ భక్తి సహజంగా వుంది కాని ఆళ్వారుల్లో పెరియాళ్వారు హిందీకవుల్లో సూరదాసు, కన్నడ కవుల్లో పురందర దాసు మొదలయినవారు తమ్ము తల్లులుగా భావించుకొని వాత్సల్య భక్తిని స్పష్టం చేశారు. వీటిలో అవతార వర్ణనలున్నాయి.

భైరవి

ఏమీననకురే యెప్పుడు మీరు
గామిడియై కాలిసన్నఁ గదలీని బిడ్డఁడు ॥పల్లవి॥

పొలసీననకురే పొడిగి యిందరుఁ గూఁడి
వులికి తలదీసుకవున్న బాలుని
పలుకఁడనకురే బలుమోరతోపుఁ గోపి
తలఁకి సిబ్బితిగొని త (నీద?) లరమ్మ బిడ్డఁడు ॥ఏమి॥

అడిగీననకురే ఆసదీర దనకురే
కడఁగి చలమరియై గాసిఁబెట్టీని
జడలున్న వనకురే జననుతుఁడీ శిశువు
కడు దూరీగిరులకు గమనించి బిడ్డఁడు ॥ఏమీ॥

బిత్తలున్నాఁడనకురే పృథివిలోఁ బిన్నవాఁడు
మత్తులై వున్నవారి మదియించీని
చిత్తిణి వాఁడనకురే శ్రీవేంకటేశుఁడు
యెత్తుక యీాలేదు లోకాలే లీవి బిడ్డఁడు ॥ఏమీ॥ (12-213)

పొలయడమంటే సంచరించడం; వ్యాపించడమని అర్థాలు. ఎక్కడబడితే అక్కడ తిరుగుతున్నాడని అనకండి అనడంలో స్వేచ్ఛావిహార శీలమయిన మత్స్య వృత్తి, తలదీసుకవున్న బాలుడు అనడంలో కూర్మరూపం స్పష్టమవుతుంది. అలాగే బిత్తల దిరగడం తప్పే. బిత్తల దిరగడం అనర్థం, ఎబ్బెట్టు కూడా. కాని పసివారిపట్ల ఇది దోషం గాదు. క్షమార్హం అనడంలో బుద్ధావతారాన్ని నిరూపించడం జరిగింది.

నాయికా నాయకులకు సంబంధించిన కీర్తనలు :

ఈ కీర్తనల్లో నాయికా నాయక గతమయిన శృంగార భావాల్ని భగవంతుని ఆయా అవతారాలతో అన్వయించి చెప్పడం.

భూపాళం

ఇన్ని చేఁతలును జేసె నిందుకొరకే పీఁడు
కన్నులనె పొద్దుపుచ్చెఁగదవె నీకొరకే ॥పల్లవి॥

మీనమాయఁజెమటల మెను ముంచు కొరకే
తానే కమఠము నాయ దాఁగు కొరకే
ఆనుకొని కిటియాయ నదలించు కొరకే
మానవుఁడు కంబము చాటు మాటు మోము కొరకే ॥ఇన్ని॥

కాలుచాఁచెనేలమీఁద గమనించు కొరకే
జాలిఁబెట్టి చేఁతలనే చంపు కొరకే
యేలికాయ విరహాలనేఁపెడి కొరకే
కైలమెత్తే నీకుచముచెత్తే కొరకే ॥ఇన్ని॥

కలవెల్ల విరసించెఁగదవె నీకొరకే
కలికి యాయెను నీసంగతి కొరకే
వలపుల వేంకటేశ్వరుఁడు లోకమున
చెలువముతో మెరసెను నీకొరకే ॥ఇన్ని॥ (.2-282)

ఇందు ఒక చెలికత్తె తన నాయికతో నాయకుని విరహావస్థను గూర్చి తెలియ జేస్తూ దానికి కారణంగా ఆయా అవతారాలు దాల్చవలసి వచ్చిందని నాయికకు నాయకునిపై సానుభూతి కలిగేలాగా వివరించడం కనిపిస్తుంది. సాధారణంగా కావ్యాలలో నాయిక యొక్క విరహావస్థను వివరించడం వర్ణించడం జరుగుతుంది. ఈ కీర్తనలో నాయకుని విరహావస్థ వర్ణించడం ఇందలి విశేషం. ఇందు వరుసగా మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణ, బుద్ధ కల్క్యవతారాలు చెప్పబడ్డాయి.

## 3. 3. 10. ఏల పాటలు :

ఏలపాటలకు యాలపాటలని, యాలపదాలని కూడా పేర్లు. తమిళంలో 'ఏలేలో' అనే సంబోధనతో కూడిన పాటలున్నాయి. తెలుగులో ఏల పాటల ప్రసక్తి ప్రాచీన ఆంధ్ర సాహిత్యంలో కూడా కనిపిస్తుంది.

పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలో —

"ఏలలు వెట్టుచు సంపు సొంపారు శైలిచే గ్రాలుచు (పు. 513)" అని, పాలవేకరి కదిరీపతి శుకసప్తతిలో "వీధి నేగెడు ప్రౌఢ పటుండు పాడెను వింత యాలాపవా లిట్టె యాలికించు" (2-172) అని, పింగళి సూరన 'ప్రభావతీప్రద్యుమ్నంలో' — నానాతాళములు యథోక్త స్ఫూర్తి జరగునేలాది ప్రబంధ చయము' (4-99) అని, తాళ్ళపాక చినతిరుమలయ్య 'తెలుగు సంకీర్తన లక్షణం'లో దేశిరీతుల్ని — దరువుల్ జక్కుల రేకు లేలలును' అని పేర్కొని ఏలా లక్షణాన్ని గూర్చి ఇలా చెప్పారు

> "నాయకాహ్వాన పూర్వమై నయము గలిగి
> మ్లేచ్ఛపరిభాష దగి రాగ మిళితమైన
> యేలపాట పదంబునా సిల<sup></sup>వెలగు
> మహిత నాయక సంబుద్ధి మధ్యమగుచు" (పద్యం. 65)

ఆచార్య బి. రామరాజుగారు —

జానపదగేయ రీతులలో ఏలలదొక విశిష్ట స్థానము. ఎత్తుగడలోను మధ్య సంబుద్ధిలోను, ముక్తాయిలపులోను ఏలలను త్రిభంగి ధనస్సుతో పోల్చవచ్చును. మొదటి పాదపు ఎత్తుగడతో విల్లెక్కుబెట్టి మధ్య పాదపు సంబుద్ధితో బాణము సంధించి, నారిసారించి, మూడవ పాదపు ముగింపుతో ఎదటివారి గుండె గూడులందు భావములను బాణములను నాటవచ్చును. అవి భక్తి భావములు కానిండు, రక్తి భావములు కానిండు ఆ రెండింటికిని కావలసినంత శక్తి ఏలపాటయను విల్లునుండి లభించును"53 అని పేర్కొన్నారు.

ఆచార్య యస్వీ. జోగారావుగారు —

"ఇది హేలగానెట్లు వలసినట్లు రాగతాళములు సాగదీయుచు పాడుకొనుట కనువైనది. గొల్ల కలాపమునందలి సుంకరి కొండని ఏల లిట్టివే. అవి గొల్లవారి హేలా రసికత్వమునకు గుర్తులు"64 అని అభిప్రాయపడ్డారు.

డా॥ వేటూరి ఆనందమూర్తిగారు —

"ఆంధ్రుల దేశిగాన మంతయు తొలుత 'ఏలపాట' అను వ్యవహారముననే పోగుచుండినది. కాని దేశైలావిభాగములోని 'ఆంధ్ర ఏలలు' నలువదింటిలోను నానా

విధ ప్రయోగములు, గమకములు, రాగాంశలు, రసభావములు కలిగి మిక్కిలి ప్రచారముగాంచిన యొకానొక ప్రక్రియా భేదమే ఏలపదమను పేరున నేడు ప్రఖ్యాతముగ నున్నది"65 అని వ్యక్తపరచారు.

కృష్ణశ్రీగారు —

ఏలలు అన్నవి నిర్ణీత ఛందో నిర్మాణముగల పదములు. యౌవనానుభవమును సూచించే భావాలున్న పదములను ఇక్కడ ఏలపాటలంటున్నాము. ఈ అర్థముతో 'ఏలపాటలు' అన్నమాట వాడుకలో నున్నది"66 అని అభిప్రాయ పడ్డారు,

పై అభిప్రాయాలవల్ల తేలిన అంశాలు :

మహిత నాయిక సంబుద్ధి కలిగి వుండడం మొదటి లక్షణం. శృంగార పూరితంగా వుండడం రెండవ లక్షణం. వీటిలో లోకానురాగం, ధార్మికత ఔదార్యం ప్రదర్శింపబడడం మూడవ లక్షణం. ఇవి ఇష్టమొచ్చిన రీతుల్లో పాడుకోవడానికి అనువుగా వుండడం నాల్గవ లక్షణం.

లోక వ్యవహారంలోని ఏలపాటలు :

జానపదంలోని ఏలల్లో తాత్త్విక భావాలు, లౌకిక శృంగార సన్నివేశాలు. మధుర భక్తి పూరితాలున్నాయి

తాత్త్వికం : (సాంకేతికం)

"కానరాని అడవిలోనా
వానలేనీ మడుగూ నిండె
వానలేని మడుగూ మీదానూ యేగంటిలింగా
మానరానీ అగ్ని పొదమీదా యేగంటి లింగా"67

లౌకిక శృంగారం :

"నీకు నాకు దూరమాయె
నీలికొండా లడ్డమాయె
చంద్రగిరీ చీరాలంపారా - ఓరందకాడ బంగారుమామా
రాజమండ్రి రైకాలంపారా"68

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

"ఊళ్ళమళ్ళా బీరాగట్టి
కుచ్చెలూ పైకేగా గట్టి
ఉన్నావాళ్ళాపిల్లనంటావే - ఓలోలీరంగీ
ఉన్నవాళ్ళా పిల్లానంటావె" 69

"ఉన్నావాళ్ళా పిల్లానంటే
కన్నుగీసే రమ్మన్నావూ
కంటి బాసలు నాకూ ఒద్దుర - ఓరోరిమావా
కంటివిరుపులు నాకూ ఒద్దుర" 70

మధుర భక్తి :

"వలచి నిన్ని వేళ మరుని
దలచి మరుబారి సొలసి
చెలువమిగుల మరులు చెందెరా - శ్రీవేంకటేశా
కలికి వగలాచే లాలించరా" 71

"చింతన రాజీవాక్షి
కుంతాయుధము చేతబూని
చెంత సోకు మూకలు గెలువగా వోహో రక్షనాథా
వంతుగా నీ సొంతా నిల్యామీ" 72

ఈ వరుసల్లో ఆచార్య బి. రామరాజుగారు వ్రాసిన ఏలపాట పరిశీలించదగింది.

"తలపు తలపున నిన్నే నిలిపి
వలపు మూటలు కట్టినాను
తలచనైనా తలచావేలయ్యా - ఓ సత్యసాయి
పిలిచినాను పలుకావేలయ్యా" 7

అన్నమయ్య ఏలపాట :

అన్నమయ్య సంకీర్తనల్లో ఒకేటొక ఏలపాట కనిపిస్తుంది.

## దేసాళం

మేడలెక్కి నిన్నుఁజూచి - కూడేనని యాస తోడ
వాడు దేరి వున్నారందురా - వెంకటేశ
యేడనుంటి విందాఁకానురా ॥

పెక్కటిల్లు చన్నులపై చొక్కపు నీవుంగరము
గక్కన నేనద్దుకొందురా - వెంకటేశ
అక్కవలె ముద్రలంటెరా ॥

దప్పిగొంటివని నీకుఁగప్పురము పొరమిచ్చి
ముప్పిరి నీ విరహానను వెంకటేశ
నిప్పనుచు భ్రమసితిరా ॥

నిండఁబూచిన మానిపై గండు గోవిల గూయఁగా
నిండిన నీయెలుంటాను వేంకటేశ
అండకు నిన్ను రమ్మంటిరా ॥

వుదయ చందురుఁజూచి అదె నీ పంజని సవి
యెదురుకోనే వచ్చితిరా వేంకటేశ
బెదరి మూప మోమైతిరా ॥

మిన్నక కేళాకూళిలో వున్న తమ్మివిరులు నీ
కన్నులంటాఁజేరఁబోగాను వేంకటేశ
పన్ని మదనమ్ములాయరా ॥

ఆనిన తుమ్మెదలు నీ మేని కాంతిఁబోలునని
పూని చేతఁబట్టబోగాను వెంకటేశ
సూనాస్త్రుని వేగులాయరా ॥

కందువమై చమరించి గందవొడి చల్లుకొని
పొందనిన్ను దలఁచితిరా వెంకటేశా
అంది చొక్కమందులాయరా

బొండుమల్లె పానుపుపై నుండి నిన్ను బాడిపాడి
నిండుజాగరము లుంటిరా వెంకటేశ
యెండలాయ వెన్నెలలురా ॥

నిద్దిరించి నీవునాకు వొద్దనుండగలగంటే
చద్దివేసి పలసాయనా వెంకటేశ
సద్దులింకా నేమి సేసేవో ॥

మల్లెపూవు కొనదాకి ఝల్లునను బులకించి
వుల్లము నీకొప్పించితిరా వెంకటేశ
కల్లగాదుమమ్ముగావరా ॥

జోడుగూడి నీవునేను నాడుకొన్న మాటలెల్లా
గోడలేని చిత్తరువులై వెంకటేశ
యేడానామతి బాయవురా ॥

అద్దము నీకలు చూచి ముద్దమోవి గంటుండగా
కొద్దిలేని కాక తోడను వెంకటేశ
పొద్దువోక తమకింతురా ॥

పావురము లెక్కజూటి నీ వొద్దికి గట్టియంపి
దేవరకే మొక్కుకొందురా వెంకటేశ
నీవిందు రావలేనంటాను ॥

బంగారు పీటపై నుండీ ముంగిటికి నీవు రాగా
తొంగి చూచి నిలుచుండగా వెంకటేశ
యెంగిలి మోవేలడిగేవు ॥

దంతపు బావాలు మెట్టి పంతాన నేను రాగాను
యింతలో బలిమి బట్టేవు వెంకటేశ
అంతనీకు బ్రియమైతినా ॥

పట్టు చీరకొంగు జారి గుట్టుతోనే నుండగాను
పట్టినవ్వు లేలనవ్వేవు వెంకటేశ
విట్టవు నీయంత వాతమా ॥

కొప్పువట్టి తీసినీవు చెప్పరాని సేత సేసి
తప్పక నేఁజూచినంతలో వెంకటేశ
చిప్పిలేల చెమరించేవు ॥

బొమ్మల జంకించి నిన్ను తమ్మిపూవున వేసితే
కమ్మియేల తిట్టుదిట్టేవు వెంకటేశ
నిమ్మపంట పెతునటరా ॥

నెత్తమాడేనంటూ రతి - పొత్తుల పందలు వేసి
వొత్తినీవే వోడే వెలగా వెంకటేశ
కొత్తలైన జాణవౌదువు ॥

వున్నతి శ్రీ వేంకటేశ మన్నించి కూడితిపదే
నన్ను నెంత మెచ్చుమెచ్చేవు వెంకటేశ
కన్నుల పండువలాయరా ॥

చిలుకలు మనలోన కలసిన యట్టివేళ
పలుకు రతి రహస్యాలు వెంకటేశ
తలఁచి నేఁడలపూఁతురా ॥

నీకు వలచిన వలపు పులక లొత్తె నామతిని
వాకుననే జెప్ప జాలరా వెంకటేశ
లోకమెల్లా నెరిఁగినదే ॥

పాయము నీకొక్కనికే చాయగా మీఁదెత్తితిని
యీయెడ గైవాల కుందను వెంకటేశ
మాయింటనే పాయ కుండరా ॥

మమ్మాటికి నీబాసలే నమ్మివున్న దాననేను
కుమ్మరించరా నీ కరుణ వెంకటేశ
చిమ్ముఁజీకటెల్లి బాయను ॥ (13-223)

ఈ పాటలో ఒక నాయిక విరహతాపంతో వ్యధపడుతూ ప్రియునిపై తన కున్న మమతానురాగాల్ని వ్యక్తం చేసుకోవడం వర్ణించబడింది. ఇది ఏలపదగా

లకు అనుగుణంగా రచింపబడింది. ఇందులో 25 చరణలున్నాయి. ప్రతి చరణం మూడవ పాదాంతంలో 'వెంకటేశ' అనే సంబుద్ధి వుంది. మహిత నాయకుడయిన శ్రీ వేంకటేశ్వరుని ఔదార్యలోకానురాగాలు ఈ కీర్తనలో వ్యక్తమవుతాయి. నాయికా విప్రలంభ శృంగారం చెప్పబడింది. ఇందులో భాష పామర జనవ్యవహార భూయిష్ఠమయింది

ఈ పాటలో 'వెంకటేశ' అని సంబోధించడం జరిగింది గాని ఆమంత్ర సూచకమయిన 'ఓ' చేర్చబడలేదు ఈవిషయాన్ని గూర్చి ఆచార్య బి రామరాజుగారు

"అన్నమయ్య ఒక్కసారి పిలవగనే వెంకటేశ్వరుడు 'ఓ' యని పలికే వాడేమో ! అందుకే అన్నమయ్యకు 'ఓ వేంకటేశ' అని సంబోధించవలసిన అవసరం లేక పోయింది" అని వ్యాఖ్యానించారు [72] అ

3 3. 11 కోలాట పాటలు :

కోలాటము అనడానికి సి. పి. బ్రౌన్ తెలుగు - ఇంగ్లీష్ నిఘంటువులో "A merris - dance in a ring in which sticks are struk together in hormony. Single stick is also thus namec" అని శబ్దరత్నాకరంలో "చేతుల గోల లుంచుకొని యాడెడియాట" అని చెప్పబడింది. తెలుగువారు 'కోలన్న' అని కూడా అంటారు. కన్నడిగులు 'కోలాట' అని తమిళులు 'కోలాట్టం' అని, ఔత్తరాహులు 'లకుటరాసకం' అని వ్యవహరిస్తారు. సంస్కృతంలో పీటిని దండ వర్తనం, దండలాసకం అనే పేర్లతో పిలుస్తారు.

పాల్కురికి సోమనాథుడు బసవపురాణంలో 'కోలాటమును బ్రాత గొండ్లి పేరిణియు గేళిక జోకయు లీలనటింప బాయక 'చాగుబళాయను శబ్ద మాయతి నాక సంబంధి ఘూర్ణిల్ల నలిరేగి వెణువీణా వాద్యపితతులు లీయుచు లీలతో నొక్కట మ్రోయ నానంద గీతంబులగ్గించువారు' (పు 22) అని మరొకచోట 'చాగుబళా ! యంచు నే గు-నంది కోలలవారు ముందటి-గములు వేడుక గోలాట మాడెడువారు-గూడతి త్రిపురాంతకుని కొల్చువారు' (పు. 68) అని ప్రస్తావించాడు. దీనిని బట్టి కోలాటపు పాటలును, చాగు భళాలును కోలాట గడియలతో ఆడుతూ ఆనంద సమయాల్లో పాడుకోదగిన పాటలని తెలుస్తుంది.

ఆచార్య బిరుదురాజు రామరాజుగారు - 'పల్లెటూళ్ళయందు స్త్రీలు పురుషులు బంతులు కట్టి కోలాటము వేయుచు భజనలు చేయుదురు కోలలనే నాడుటచే నిది కోలాటమైనది. కోలాటమును ననేక విధములున్నవి. జడకోలాటము (వేణీకోలాటము) వీనియందొక యపూర్వ ప్రక్రియ సంగీత సాహిత్యములతోపాటు కోలాటమునందు కొంత నృత్యమునకు గూడ స్థానముండుట గమనింపదగినది. వీనియందు మధుర భక్తికి సంబంధించిన పాటలనేకము. శ్రీకృష్ణుని చిలిపి చేష్టలు కూడా వీనియందలి కథావస్తువై యుండును'73 అని అభిప్రాయపడ్డారు.

ఆచార్య యస్వీ జోగారావుగారు - 'ఆడుపిల్లలచే దండలాసక క్రీడావసరము లందు పాడ బడుటకుద్దిష్టములైనవి. అడుగునకు దగిన నుడుగు కోలుకోలను నార్భటముకైశికీ వృత్తియు దీని ప్రత్యేకతలు'74 అని పేర్కొన్నారు

శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారు - 'కోలాటమనగా జాతీయ మర్యాదలో కొయ్యకోలలను రెండు చేతులతో ధరించిగాని, కరతాళములచేగాని వెనుక ముందుకు అడుగులు పెట్టుచూ మధ్య దైవ ప్రతిమనుంచి స్త్రీపురుషులు ఆనందోత్సాహములతో చేయు నొకానొక నృత్యభంగిమము'75 అని వెలిబుచ్చారు.

డా॥ ఆర్వీ యస్ సుందరంగారు - 'భారత దేశంలోని అనేక ప్రదేశాలలో అత్యంత జనప్రియమైన వినోదం కోలాటం............ యమకాది శబ్దాలంకారాలు ఈ పాటలలో నిండుగా ఉంటాయి గోపాలా మల్లేశా నిర్గుణనాథా చల్లుదామా, దిద్దుదామా, కూడుదామా, మొదలైన పాదాంతాలు ఈ పాటల్లో ఉంటాయి.76 'వీటిలో దైవస్తుతులు, తత్వాలు స్థలపురాణాలు, శృంగార హాస్యాలు నిండిన భావాలు దర్శన మిస్తాయి'76-అ అని వివరించారు.

డా॥ యెల్లండ రఘుమారెడ్డిగారు - 'కోలాటం చలికాలము, వేసవి కాలము లందు విశేషముగ నాడుదురు. దసరా, దీపావళి, సంక్రాంతి, ఉగాది వంటి పండుగ సందర్భములలో కోలాట బృందముల యొక్క సందడి కనుపించుచుండును. వెన్నెల రాత్రులు మరింత ఆనందోత్సాహములను పెంచును దంపుడు కోపు, పాలపిట్టకోపు, మల్లన్నకోపు, రథయాత్రకోపు, చక్రపు కోపు మున్నగునవి కోలాట నృత్య రీతులు. కోపు అనగా నృత్య భంగిమ రీతి. ప్రతి కోపు కించిద్భేదముతో ఆడుట యొప్పును

......... ఆయా కోపులలో కీర్తనయొక్క భాగమెక్కువ. కోలాటం పూర్తి శృంగారమే'77 అని తెలియజేశారు

కోలాటలో ఆట, పాటలనే రెండంశాలు చేరి ఉంటాయి. ఆటగాళ్ళు ఉద్దు బుద్దులు (జతలు జతలు)గా వర్తులాకారంతో ఏర్పడి కోలలపై క్రమపద్ధతిలో కొట్టతూ అవసరమైతే తమ చుట్టూ తాము తిరుగుతూ గుండ్రంగా తిరుగుతూ ఆడుతుంటారు. కోలాటం నేర్పిన వ్యక్తి వాళ్ళ మధ్య ఉంటూ.గాని, లేదా వాళ్ళలో ఒకడైనాని ఆటను కొనసాగిస్తాడు దీనినే కోలన్న వేయడం అట కూడా వ్యవహరిస్తారు కోలాటగాళ్లు కాళ్ళకు గజ్జెలు కట్టుకొని ఆడుతారు. ఆటలో మువ్వల సవ్వడి శ్రుతికాగా, కోలల శబ్దాలు తాళంకాగా కమ్మగా కంఠమెత్తి కోలన్న పాటపాడుతూ ఉత్సాహంతో ఊపుగా ఆడుతుంటే అమాయకమైన అరమరిక లేని అనురాగ పూర్ణహృదయులైన వాళ్ళ ఆటను చూచి ఆనందించ వలసిందేకాని చెప్పనలవికాదు'78 అని అభిప్రాయ పడ్డారు.

బిగిదెర్ల క్రిష్టారెడ్డిగారు —

నృత్యానికి సంబంధించిన గేయాలు 'కోలాట గేయాలు'. ఈ జానపద నృత్యాలు అనేకాలు. వాటిలో కోలాటమొకటి. దీన్ని పల్లీయులు, పండగల్లోను, జాతరల్లోనూ, ఇప్పటికీ మరువకుండ చేస్తున్నారు. చూడముచ్చటగా సాగే ఈ నృత్యం వినోదంగా ఉంటుంది పీటిలోని రకాల్ని కోపులంటారు. 1 తాలుపుకట్టి, 2. సెల కట్టి, 3. నిండుచిత్తారి, 4. యెలదిద్ది చిత్తారి, 5 తూగుడు కోపు, 6. బాలనారికోపు. 7. ముంగారి కోపు, 8. పరమానంద చిటుకులు; 9. బజారుకోపు, 10. జడకోపు మొదలైనవి'79 అని కోలాట కోపుల్లోని రకాల్ని చెప్పారు.

## పై అభిప్రాయాలవల్ల తేలిన అంశాలు :

ఈ పాటలు చాలా వరకు దైవనామాంకాలతో వుండడం మొదటి లక్షణం, కోలాటంలో సంగీత సాహిత్యాలతోబాటు, నృత్యానికి కూడా స్థానం వుండడం, వాటిలో అనేక రకాల గతులు వుండడం రెండవ లక్షణం. ఇవి ఎక్కువగా మధుర భక్తి పూరితాలుగా వుండడం మూడవ లక్షణం. వీటిని దసరా, దీపావళి సంక్రాంతి ఉగాది మొదలయిన పండుగదినాల్లో పాడతారనడం నాల్గవ లక్షణం.

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

లోక వ్యవహారంలోని కోలాట పాటలు :

వీటిని స్తుత్యాత్మకాలు, శృంగారాత్మకాలు, వినోదాత్మకాలు అని విభజించవచ్చు.

స్తుత్యాత్మకాలు :

"శివ శివ మూర్తివి గణనాథా
శివునీ కుమారుడవు గణనాథా
గణనాథా స్వామి లోకనాథా
సకలా విద్యలకెల్ల స్వామినాథా"80

"మామ కంసుణ్ణి జంపి గోపాల నీవు
మదన పురిని ఏలినావె గోపాలా
అత్త పూతకిని జంపి గోపాలా నీవు
అయోధ్య నేలినావె గోపాలా
బాల ప్రాయము నాడు గోపాలా నీవు
పదవల్ల దిరిగినావు గోపాలా
శ్రీకృష్ణపద్మరాయ గోపాలా నీవు
జోడిద్దరెవ్వతయ్యా గోపాలా"81

శృంగారాత్మకాలు :

'తరుణి సీతలకురుల సందు
ఘుమఘుమా మౌ వితజాజులే ముడువమందూ
కరువు దీర నీమ కలసొంపులెల్ల నా
కనులార నేరోజుగందూ
..................
..................''82

'గొల్ల వారి వాడలకు కృష్ణమూర్తి
నీవు ఏమిపనుల కొచ్చినావు కృష్ణమూర్తి
పాలుగొనా వచ్చినానె గొల్లభామా మంచి
పాలుపోసి నన్ను పంపూ గొల్లభామా

కొత్తకోడల నయ్య నేను కృష్ణమూర్తి
మాయత్తగారి నడుగవయ్య కృష్ణమూర్తి
కొత్తకోడలౌతేనేమి గొల్లభామ
నారొక్కమిచ్చి పుచ్చుకొంటే గొల్లభామ
నీరొక్కము మాకొద్దయ్య కృష్ణమూర్తి
నీవు రొంపు చేయక మళ్లమయ్య కృష్ణమూర్తి"83

వినోదాత్మకాలు :

'రాధా రమణున్ని యేడుదమా బల
రాముని తమ్ముణ్ణి కూడుదమా
కన్నూల కాటుక పెట్టుదమా మరి
తీరైన తిలకము దిద్దుదమా
తెల్లాపి యిరివఙ్ల మల్లేలు దోసిట్ల
కొల్లలుగా ఎగ చల్లుదమా
తీగ ఉయ్యాల మీద ఊగుదమా
ఊగుదమా మనము సాగుదమా'84

'అటవీ స్థలములు కడుగుదమా
వటపత్రంబులు కోయుదమా
జనులారా గుమిగూడుదమా
జటకోలాటము వేయుదమా
.....................
దాగుడు మూతాలాడుదమా !
తరువుల చాటున దాగుదమా
విప్పపువ్వులూ ఏరుదమా ,
విసువక మనమిపుడుం పోవుదమా'85

అన్నమయ్య సంకీర్తనల్లోని కోలాట పాటల్ని మూడు విధాలుగా వర్గీకరించ వచ్చు. మొదటి వర్గంలో 'కోలలు' 'కోలాట' ప్రసక్తులు వచ్చిన కీర్తనలు చేర

తాయి. రెండవ వర్గంలో కోలాటం ఆడే పద్ధతి స్పష్టంగా తెలిపే కీర్తనలు చేరతాయి. మూడవ వర్గంలో కోలాటం గతుల్లో సాగిన కీర్తనలు చేరతాయి.

'కోలలు' 'కోలాట' ప్రసక్తులు వచ్చిన కీర్తనలు :

'కోలల చాఁచివుట్లు గొట్టఁగాఁబాలుఁబెరుగు
కాలువలు గట్టి పారెఁగదవమ్మా' (10–161)

'కోలలెత్తుకొని గోపాలులునుఁదాను
బాలీల సోదించె యీతఁడే కదవె' (10 288)

'కొట్టేటి వుట్లు కోలల గుంపులు
గుట్టులఁబొంచెడి గోపాలులు' (14-51)

'వన్నెల నీ పచ్చకాన వ్రాసిన కోలాటపు
అన్నువ పతిమలను అటు చూచి' (15 74)

'కొట్టేటి వుట్లును కోలల సాములును
వెట్టినప్పులేడవే వీదివీదులా' (22-180)

కోలాటం ఆడేస్పష్టంగా తెలిపే కీర్తనలు :

భూళి రామక్రియ

'వాఁడే వాఁడే అల్లరి వాఁడడివో
నాఁడు నాఁడు యమునా నదిలోన ॥పల్లవి॥

కాంతలు వలయపు కంకణ రవముల
నంతంతఁగోలాట మాడఁగను
చెంతల నడుమను శ్రీరమణుఁడమరె
సంతతపుఁజుక్కలలో చంద్రుని వలెను ॥వాఁడే॥

మగువలు ముఖపద్మములు దిరిగిరా
నగపడి కోలాట మాడఁగను
సగిడీ నడుమ నదె నీల వర్ణుఁడు
పగటుతోఁగమల బంధుని వలెను ॥వాఁడే॥

గోపిక లీలతోఁగోలాట మాడఁగ
యేపున శ్రీవేంకటేశ్వరుఁడు
వోవెలమేల్మంగను రమున నిడుకొని
దీవించె మణులతో తేజము వలెను ॥వాఁడే॥ (25-343)

వసంతం

వేడుక వసంతము వేళఁదే
వాడల వాడల వెంట వనిత లాడేరు ॥పల్లవి॥

కేలుఁగేలుఁ జుట్టిపట్టి కెందామర మోములెత్తి
కోలఁగోల దాఁకజేసి గుంపువాయక
చాలుకొని యిద్దరేసి జంటలై సతులు గూడి
వోలి వరొకతె కోల నొడ్డుతా నాడేరు ॥వేడు॥

పాలిండ్లు గదలఁగ బరువైన తురుముల
చీలుచు పోలుచుఁగొంత వెనకకును
మేలిమి పిఱుఁదులతో మెరయుచు మురియుచు
కోలలఁబెడ మరలి కోలాటమాడేరు ॥వేడు॥

కడకొండురు మోములు కన్నులఁ దేలించి చూచి
పదతాళగతులకు పడఁతులెల్లా
అదివో శ్రీ వేంకటేశుఁడలమేలుమంగతోడ
మాదమంది చూడగాఁను ముందట నాడేరు ॥వేడు॥

(25-349)

ఈ రెండు పాటలు కూడా కోలాట లక్షణాలకు అనువుగా వున్నాయి. మొదటి పాట పాదాంతాల్లో 'కోలాట మాడఁగను' అనే మాట ఆవృత్తి అయింది. ఈ కీర్తనలో యమునా తీరంలో గోపికా స్త్రీలు తమ సౌందర్య హావభావాదులు ప్రస్ఫుటమయ్యేలాగా బృంద నృత్యం చేస్తూ కోలాట మాడుతుంటే శ్రీకృష్ణుడు వారి మధ్యలో చుక్కల్లో చంద్రుడిలాగా, కమల బంధువునిలాగా మణుల్లో తేజంలాగా అమరి వుండడం వర్ణించబడింది.

రెండవ పాటలో లావణ్యవతులైన స్త్రీలు వసంత కాలంలో కోలాటమాడుతున్న తీరు వర్ణించబడింది. వీరు ఒకరి చేయి ఒకరు పట్టుకొని వలయాకారంలో వృద్ధులు వృద్ధులుగా నిలబడి ఒకరి కోలలు ఒకరు తాకిస్తూ ముందుగతులుగా పదతాళ గతుల్ని మారుస్తూ కోలాటమాడడం, **అలమేల్మంగా** వేంకటేశ్వరులు ఆ నృత్య భంగిమల్ని ఆనందంగా తిలకించడం ఇందు వర్ణించబడింది. వసంత కాలంలో చేస్తున్న ఈ కోలాటకు వసంత రాగాన్నే వాడడం ఇందలి విశేషం.

కోలాట గతుల్లో సాగిన కీర్తనలు :

### శ్రీ రాగం

పట్టి వలపు చల్లకు విష్ణుమూర్తిరితి నాతో
వెట్టి దీరమాటాడు విష్ణుమూరితి ॥పల్లవి॥

వినయము సేసేవు విష్ణుమూరితి నీవు
వెనకటి వాడవేకా విష్ణుమూరితి
వినవయ్య మామాట విష్ణుమూరితి మమ్ము
వెనుకొని పట్టకుమీ విష్ణుమూరితి ॥పట్టి॥

వెరవుగల వాడవు విష్ణుమూరితి నేడు
వెరగైతి నిన్నుం జూచి విష్ణుమూరితి
విరివాయె నీమాయలు విష్ణుమూరితి నాకు
విరులిచ్చే వన్నటికి విష్ణుమూరితి ॥పట్టి॥

వెలసెనీ చింతలెల్ల విష్ణుమూరితి మా
వెలుపల లోన నీవె విష్ణుమూరితి
వెలలేని శ్రీవేంకట విష్ణుమూరితి కూడి
విలసిల్లితివి నాతో విష్ణుమూరితి ॥పట్టి॥ (2-250)

### పాడి

చక్కని తల్లికి చాంగు భళా తన
చక్కెర మోవికి చాంగు భళా ॥పల్లవి॥

కలికేటి మురిపెపు సమ్మరింపుదన
సఖపుజూపులకు చాగు బళా
కులుకుల సొంపుల బతితోగసరేడి
చలముల యలుకకు చాగు బళా ॥చక్క॥

కిన్నెరతోబతి కెలన నిలుచుదన
చన్నుమొలగులకు చాగు బళా
ఉన్నతిబతిపై నొరగి నిలుచుదన
సన్నపు నడిమికి చాగుబళా ॥చక్క॥

జందెపు ముత్యపు సరులహారముల
చందన గంధికి చాగు బళా
పొందయి వేంకట విభుబెనచిన తన
సంది దండలకు చాగు బళా ॥చక్క॥ (12-107)

ఈ రెండు పాటలు కోలాట గతుల్లో సాగాయి. మొదటి పాట పాదాంతాల్లో విష్ణుమూర్తి అని, రెండవ పాట పాదాంతాల్లో 'చాగు బళా' అనే మాటల ఆవృత్తి వుంది. అన్నమయ్య సంకీర్తనల్లో కనిపించే కేశవా, మాధవా, అచ్యుతా, జనార్దనా, గోవిందా త్రివిక్రమా మొదలయిన దైవ నామాంతపదాలు చాంగుబళా......... సంసారము సంకీర్తనము, వైష్ణవము వంటి నామాంత పదాలున్న పాటలు –

'చింతల చిగురులెచిచ్చులట
యింతటి లోనిక నేలాగే' (12-170)

'మనలోని మాట మనసులో తీట
వెనకజెప్పేగాని విడువుమీ పూటా' (15 91)
'నీవే యిన్నిట నిజమరివి
వావిచెలపయిక వద్దయ్యా' (15-165)
'ఎగ్గో తప్పో యెఱగనిది
సిగ్గులు దేరగ నినుబైకొందు' (15 182)

వంటి పొట్టి పాదాలున్న పాటలు కూడా కోలాట పాటల వరుసలే అని ఆచార్య బి. రామరాజుగారు

"అన్నమయ్య పాటలలో జానపద రీతులు" అనేవ్యాసంలో పేర్కొన్నారు

### 3.3.12 చందమామ పదాలు :

వీటిని తమిళంలో 'వెణ్ణిలా పాడల్‌గళ్' అని, కన్నడంలో 'బెళదింగళు హాడుగళు' అని అంటారు.

ఆంధ్ర సాహిత్యంలో చందమామ పాటలకు ప్రత్యేకస్థానం వుంది. ప్రబంధ సాహిత్యంలో చంద్రదూషణాదులున్నాయి. మరి యయాతి చరిత్రలో వెన్నెల వర్ణనలు (2-79,80 81.83,85) కనిపిస్తాయి

చినతిరుమలయ్య తెలుగు సంకీర్తన లక్షణంలో చందమామ పదలక్షణాన్ని విధంగా చెప్పాడు.

> "దుస్తర విప్రలంభమున
> దూతిక తోడ మొఱంగి చంద్ర వి
> న్యస్తభర స్వభావమున
> నాయకుఁడే యు గాంత యేఁయున్
> విస్తర పాదపాదముల
> వేడుకఁజందురుఁ బేరుకొన్నచో
> ప్రస్తుతి కెక్కెదత్పదము
> భాసురమై ద్విచతుష్పాదాకృతిన్" (పద్యం 64)

విరహావస్థలో నాయకుడు గాని నాయిక గాని పాదపాదంలో చంద్రుసుద్దేశించి పాడే పాటలు చందమామ పాటలు.

జానపదుల్లోని చందమామ పాటల్లో ఆధ్యాత్మికాంశం, శృంగారాంశం రెండూ వున్నాయి. ఆధ్యాత్మికాంశంలో యోగవిశేషాలు సామాన్య కటుంబ జీవితంలో వుండే సర్వోదాదులు వర్ణించబడ్డాయి. శృంగారాంశంలో వియోగానికే పైచేయి. ఈ పాటల్లో చివర 'చందమామ' 'చందమామవోలె చందమామ' 'చందమామోయ్' 'చందమామయ్యో' అనే మాటల ఆవృత్తి కనిపిస్తుంది.

ఆధ్యాత్మికాంశం :

> 'యేమి చెప్పనున్నదయ్యా చందమామ
> నాప్రియమైన పతినిగంటి చందమామ

శిష్టుని అసితమునై చందమామ
యితండు నామరూప క్రియరహితుడె చందమామ
నొక్కడె లోకాలకెల్ల చందమామ
పది దిక్కులందు తానెయుండు చందమామ'86

యోగ విశేషాలు :

"పెక్కు రంధ్రముల దిరిగే చందమామా
ప్రాణు మిక్కిలి నిరోధించెనే చందమామా
ఉక్కణచి కుండలిసి చందమామా
దివికి చక్కగా నెగయించితివో చందమామా
గట్టిగా నింద్రియములలో చందమామా
గాలిదిట్టనై కూర్చక నేమే చందమామా
అట్టి తోవలు తడకట్టి చందమామా
నేను మెట్టి రవి చంద్రులను మించితిని చందమామా"87

సామాన్య కుటుంబ జీవనాంశాలు :

"కాపుకొచ్చె నేలమీద సందమామా తెల్ల
కాకులన్ని కలిసిమేసె సందమామా
బర్లకాడి బచ్చిగాడు సందమామా దొడ్డి
ఇరుగవెట్టి బర్ల దోలె సందమామా
లంకె పీటె తెంపుకోసె సందమామా
లేగదూళ్లు రంకెలేసె సందమామా
కూతనేర్చె కోడిపిల్ల సందమామా మనిషి
నెత్తిమీద కోత కొచ్చె సందమామా...
మనిషి కుడికె విసికె రోజు సందమామా రేపో
మాపో సెప్ప కుండ పచ్చు సందమామా"88

"చందమామ రావె జాబిల్లి రావే
కొండెక్కి రావె కోటివేలు తేవే

బండెక్కి రావే బంతిపూలు తేవే
తేరుమీద రావే తేనెపట్టు తేవే
అన్నీ తెచ్చి మా పాప కియ్యవే"[89]

శృంగారాంశం :

వాడు వలచీనాడమ్మా నన్ను వలచీనాడమ్మా చందమామోయ్
వాడు వలచీన తెల్లారి పిలచీన పలుకాడు ,,
వాడు పిక్కల్లి సన్నంపు బిగువైన మగవాడు ,,
వాడి భుజాన ఉన్నది భూచక్ర కంబళి
అది పదిగజ్జ భూమిపై పరిచీన చాలమ్మా ,,
వాడి మునిపళ్ళ సందున ముత్యాలు తాపిస్తు ,,
వాడి పక్కాన ఉన్నాది పచ్చాల పిడిబాకు ,,
అది ఎదలోన ఒకసారి నాటిన చాలమ్మా ,,
వాడు వలచీన దాకాను వలపోసి తిరిగాడు ,,[90]

వియోగశృంగారం :

'చందమామయ్యో మామ చందమామయ్యో
రాతిరి రాతిరి వొస్తావని ,,
రాతీగంధం తీసీ వుంచితి ,,
రాతీ గంధం రగిలీపోయే ,,
ఎప్పుడెప్పుడు వొస్తావని ,,
ఎలగాచెట్టు నీడానుంటి ,,
ఇప్పూడెప్పుడు వొస్తావని చందమామయ్యో
ఇప్పా చెట్టు నీడా నుంటి ,,
మళ్లి మళ్లి వొస్తావని ,,
మల్లె పొదగా నిలిచీ వుంటి ,,
మల్లె పువ్వే రాలీనాది ,,[91]

"వచ్చి పోయే తోవ లోన చందమామ వోలె చందమామ
నీవు ఆశ మొదలు పెట్టుకుంటివి చందమామ వోలె చందమామ
ఇద్దరాము కూడితిమి ,,
వద్దిమాను కొరిగితిమి ,,
ఇద్దనీ కంటి నీకు వద్దిమానుకుంటినండె ,,
వద్దిమాను కుంటలోనె ఇద్దు మిరుసు వడ్లుపండె ,,
ఇద్దుమిరుస వడ్లబియ్య ,,
ఎద్దు మీద పోసుకోని ,,
కానరాని గట్లమీద ,,
మనయిద్దరికి తలంబ్రాలు ,,
బాయిలోన బల్లి పలికె ,,
బన్నసరము కొలుకులాడె ,,

అన్నమయ్య సంకీర్తనల్లో మూడు చందమామ పాటలున్నాయి. మొదటిది పూర్ణచంద్రోదయ వర్ణన, రెండవది చంద్రాహ్వానానికి సంబంధించినది, మూడవది అన్నమయ్య కాలంనాడు జరుపబడుతుండే వెన్నెలరాత్రి ఉత్సవాన్ని తలపించేది.

పూర్ణచంద్రోదయ వర్ణన :

రామక్రియ

సందెకాడ బుట్టినట్టి చాయల పంట యెంత
చందమాయ జూడరమ్మ చందమామ పంట ॥పల్లవి॥

మునుపాలవెల్లి మొలిచి పండిన పంట
నినుపై దేవతలకు నిచ్చపంట
గొనకొని హరి కన్ను గొనచూపుల పంట
విను వీధి నేగడిన వెన్నెలల పంట ॥సందె॥

వలరాజు పంపున వలపు విత్తిన పంట
చలువై పున్నమ నాటి జాజర పంట
కలిమి కామిని తోడ కారు కమ్మిన పంట
మలయుచు దమలోని మట్టిమాని పంట ॥సందె॥

విరహాలు గుండెలకు వెక్కసమైన పంట
పరగ చుక్కల రాసి భాగ్యము పంట
అరుదై తూరుపు గొండ సారెగఁబండిన పంట
యిరవై శ్రీవెంకటేశునింటి లోని పంట ॥సందె॥ (11-1-47)

ఈ కీర్తనలో 'పంట' అనే మాట ప్రతిపాదాంతంలోను ఆవృత్తి అయింది. ఇందులో చంద్రుని కున్న ప్రసిద్ధిని రకరకాల పంటలుగా వర్ణించి స్త్రీలు పాడడం కనిపిస్తుంది. పాల సముద్రంలో పుట్టి పండిన పంటగాను, దేవతలకు నిత్యమైన పంట గాను, మహావిష్ణువునకు కడ కంటి చూపుల పంటగాను, పున్నమనాటి జాజర పంటగాను, విరహులను పీడించే వెక్కసమైన పంటగాను, చుక్కల పాలిట భాగ్య మైన పంటగాను రకరకాలుగా చంద్రుని కీర్తించడం జరిగింది.

చంద్రాహ్వానం :

'చందమామరావో జాబిల్లి రావో మంచి
కుందనపు పైడికోర వెన్నపాలు తేవో ॥పల్లవి॥
నగుమోము చక్కనయ్యకు నలువ పుట్టించిన తండ్రికి
నిగమము లందుండే అప్పకు మానీలవర్ణునికి
జగమెల్ల ఏలిన స్వామికి చక్కని ఇందిర మగనికి
ముగురికి మొదలైన ఘనునికి మాముద్దుల మురారి బాలునికి
॥చంద॥

సురలగాచిన దేవరకు చుంచు గరుడు నెక్కిన గబ్బికి
నెరవాడి బుద్దుల పెద్దకు మానిటు చేతల పట్టికి
విరుల వింటి వాని అయ్యకు వేవేల రూపుల స్వామికి
సిరిమించు, నెరవాడి జాణకు మా శ్రీవేంకట నాథునికి ॥చంద॥

(శ్రీ అన్నమాచార్య సంకీర్తనలు శ్రీ వెంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయము) ఈ పాట ఎత్తుగడలో చందమామరావో, అనే చంద్రాహ్వానం వుంది ఈ పాటలో తల్లి యశోద అంబర వీధిలోని అందాల జాబిల్లిని రమ్మని పిలుస్తూ చిన్నికృష్ణునికి గోరుముద్దలు తినిపించడం వ్యక్తమవుతుంది. ఇందులో నీలమేఘ శ్యాముడయిన మహావిష్ణువు గుణగణాదుల ఔన్నత్యం చెప్పబడింది.

వెన్నెల రాత్రి మహోత్సవం :

సామంతం

చల్లనై కాయఁగదో చందమామా నీ
వెల్ల (ల్లి?) గాఁదిరువేంకటేశు నెదుర
మెల్లమిగ నమృతంపు వెల్లి గొల్పుచు లోక
మెల్ల నిన్నుఁ గొనియాడఁగాను ॥పల్లవి॥

పొందైన హితులు నాపులు రసికులును గవులు
నందమగు నునుమాటలాడ నేర్చిన ఘనులు
చిందులకు నాడేది సీమంతినీ మణులు
చెలఁగి యిరుగడఁ గొలువఁగాను
వంది మాగధులు గైవారింపఁదనదివ్య
మందిరోపాంత ఘనమార్గమునఁ గోనేటి
ముందటను మంద మంద ప్రయాణములతో
నిందిరాపతి మెరయఁగాను ॥చల్లనై॥

ఏకాంత సుఖగోష్ఠి సింపొంద మానవా
నీకంబులెడఁగలసి నిలిచి సేవింపఁగాం
తా కదంబముల (లు?) హస్తముల కంకణఝణ
త్కారములు నిగుడఁ జామరము లిడఁగ
జోకైన మణి గణ స్తోమాంకితంబులై
సొంపొందు నాలపట్టములు గరములఁ దాల్చి
యేకాంతు లిరువంక నెదిరి కొలువఁగ సకల
లోకేశ్వరుఁడు మెరయఁగాను ॥చల్లనై॥

బంగారు ప్రతిమలకు ప్రతులైన దివిజ లో
కాంగనలు ఘనవిమానాంగణంబున నుండి
చెంగలువలును మంచి సేవంతి రేకులును
చెలఁగి యిరుగడఁ జల్లఁగాను

మంగళాత్మకములగు మహిత వేదాంత వే
దాంగ విద్యలకు ప్రియమంది చేకొనుచుఁదిరు
వేంగళేశ్వరుఁడు వేడుకలతోడఁదిరు
వీధులను విహరించఁగాను ॥చల్లనై॥ (12 228)

ఈ కీర్తనలో ద్విచతుష్పాదాకృతి కల్గిన మూడు పాదాలున్నాయి. పల్లవి పాదాంతంలో 'చందమామ' అనే మాట వుంది. ఇందు హితులు, ఆప్తులు, రసికులు, వందిమాగధులు, వేదవేదాంగ వేత్తలు మొదలయిన వారందరు స్తుతిస్తుండగా, దివిజాంగనలు దివ్య విమానాలనుండి ఎఱ్ఱని తామర పుష్పాల్ని చల్లుతుండగా వేంకటేశ్వరస్వామి మిక్కిలి వేడుకతో విహరించే విధంగాను, లోకమంతా కొనియాడే విధంగా అమృతపు జల్లులు కురిపిస్తూ చల్లగా వెన్నెలకాయుమని చందమామను గూర్చి పాడడం కనిపిస్తుంది. ఈ పాటలోని వివర బట్టి చూస్తే ఇది స్వామి పుష్కరిణి సమీపంలో స్వామివారికి జరిపే వెన్నెల రాత్రి మహోత్సవంగా తెలుస్తుంది. దీన్ని కౌముదీ మహోత్సవమనవచ్చు. ప్రస్తుతం తిరుమలలో జరిపే వుత్సవాల్లో ఇది లేదు. బహుశః అన్నమయ్య కాలంలో జరుపబడేదేమో !

## 3. 3. 11. శోభనపు పాటలు :

సి. పి. బ్రౌన్ తెలుగు - ఇంగ్లీష్ నిఘంటువులో సోబాన, సోబనము అనే రెండు శబ్దాలున్నాయి

సోబానకు 'A song each foot of which has the word శోభానే as a chorus' సోబనముకు 'Happiness, Good fortune' అనే అర్థాలున్నాయి

శబ్దరత్నాకరంలో సోబాన, సోబనము, శోభనము అనే మూడు శబ్దాలున్నాయి.

సోబనకు ఒక దినుసు పెండ్లిపాట; 'సోబనము'కు మంగళము, 'శోభనము'కు గ్రహయోగము, సుందరము అనే అర్థాలున్నాయి

'శోభానె' అనేది ఉత్సవపారిభాషిక పదం. ఇష్టదైవమహిమల్ని, వాత్సల్యగుణాదుల్ని వర్ణిస్తూ స్తుతించే పాటలు శోభనపు పాటలు.

ప్రాచీనాంధ్ర సాహిత్యంలో సోబన ప్రసక్తి ఉంది. యయాతి చరిత్రలో —

'ఏవరింప నెడము లే డింక
నువిదకు సోబనపు జలక మొనరింపగా
జవరాండ్రంబనుపుము' (4-86)

ఆచార్య యస్వీ. జోగారావు గారు —

"దాం పేరి చెప్పుచున్నట్లిది యొక శోభన గీతము తఱచు వివాహ సందర్భము లందు మంగళ హారతుల వేళను, మంగళస్నానాదిక సమయములందు ప్రయుక్తము నైనది తఱచు ధవళము తోడి జంట పాట వలె గన్పట్టును ఇది యాడువారి వేడుక పాట. కాని విష్ణు మాయా విలాసమున 'తాళధ్వనితో సామలుట్టి యుంపుచు వీణాముని నారదుండు శోభనము వినిపించెన్' అని యున్నది ఇది సాధారణముగా షష్ఠ్యంతము. చివర 'శోభనమే' అననదూత పదముగా వచ్చుచుండును. దీని రచనా ప్రక్రియకొక నియతిలేదు. గతి వైవిధ్యము బహుళము"[9] అని వివరించారు.

## పై అభిప్రాయ సారాంశం :

ఈ పాటల్లో ఎత్తుగడలోగాని, పాదాంతాల్లోగాని. 'శోభనమే' అనే మాట రావడం మొదటి లక్షణం, వీటిని వివాహ సందర్భాల్లోను మంగళస్నానాదిక సమయాల్లోను ఉత్సవ సమయాల్లోను పాడతారనడం రెండవ లక్షణం. ఇవి సాధారణంగా షష్ఠ్యంతాలుగా వుండడం మూడవ లక్షణం, ఆసీనులయిన వారి శోభను అతిశయింప జేసేది శోభనం, లేదా ఆసీనులయినవారికి ఈ పాటలవల్ల శోభ కలుగుతుందనడం వల్లకూడా 'శోభనం' కావచ్చు

## లోక వ్యవహారంలోని శోభనపు పాటలు :

'కన్యలాల శోభనమె
శ్రీమల ద్వారక పురములో కృష్ణా
దేవుడు రుక్మిణి నగరమునా
మేలైన బంగారు మేడలో పగడ
శాల పంతము పూని ఆడనూ
నారదుడు ఆటకు వచ్చెను
తని పారిజాత పుష్ప తెచ్చెనూ

ఆ పువ్వు కని శౌరి మెచ్చెనూ
మెచ్చి అపుడె రుక్మిణి
చేతికిచ్చెను
ఆ పువ్వు కొప్పును పెట్టెను రుక్మిణి'94

శ్రీగణాధిపతిని దలుతు
సీతముందు రాముని దలుతు
త్రిపుర సుందరిని దయతోన దలుతు
కావునేటికి శోభనము
కన్యకలక్ష్మికి శోభనము'95

అన్నమయ్య శోభన పాటలు :

అన్నమయ్య శోభన పాటల్ని రెండు రకాలుగా విభజించవచ్చు. మొదటి విభాగంలో 'శోభన' పద ప్రసక్తి వచ్చినవి చేరతాయి అవి —

"తొడమీఁదఁగూచున్నది తొయ్యలి యిందిరాదేవి
బడిఁజెలులు సోబాన బాడేరు" (11-1-194)
"నెలమూఁడు శోభనాలు నీకు నతనికిఁదగు
కలకాలమును నిచ్చ కల్యాణమమ్మా" (13-280)
"పట్టరాని కోరికకు పచ్చిమాటే సోబనము
చిట్టకపు చేతలకు చిరునవ్వేలాభము" (13-350)
"సుదతుల కితనికి సోబనవేళ
వుదుటునఁజెలులెల్ల నూడిగాలు శాయరే" (19-100)
"సొరిది బేరటాండ్లు సోబాన బాడఁగాను
హరియు సిరియుఁబెండ్లియాడేరదే" (20-110)
"ఇంతి జవ్వన రాజ్యమేలుదువు రావయ్య
పంతముతో నీకు సోబన కాలమబ్బెను" (22-577)
"విభునితో నిఁక నేల వేసాలు
సుభ సోభ (శుభశోభ) నము లెల్లాఁజూపవలె గాని" (24-8)

తర్వాత 'శోభన' పదం ఆవృత్తి అయిన కీర్తనల రెండవ విభాగంలో చేరతాయి ఈ విభాగంలోని శోభన పాటల్ని మరోరెండు విధాలుగా విభజించవచ్చు. మొదటిది ఉత్సవ సమయంలో పాడేవి రెండవది వైవాహిక సమయంలో పాడేవి.

ఉత్సవ సమయంలో పాడేవి :

వ స ం త ం

"శోభనమే శోభనమే
వైభవముల పావన మూర్తికి ॥పల్లవి॥

అరుదుగ మును నరకాసురుఁడు
సిరులతోఁజెరలు దెచ్చిన సతుల
పరువపు వయసుల (లప?) బదారువేలను
సొరిది(బెండ్లాడిన సుముఖునికి ॥శోభ॥

చెండిన వేడుక శిశుపాలుఁడు
అంది పెండ్లాడఁగ నవగళించి
విందువలెనె తావిచ్చేసి రుకుమిణి
సందడిఁబెండ్లాడిన సరసునికి ॥శోభ॥

దేవదానవులు ధీరతను
ధావతిపడి వారిధ్దరువఁగను
శ్రీవనితామణిఁజెలఁగి పెండ్లాడిన
శ్రీ వేంకట గిరి శ్రీనిధికి ॥శోభ॥ (12 18)

ఈ పాట ఎత్తుగడలో 'శోభనమే శోభనమే' 'అనే మాటలున్నాయి. ఈ పాటను ఏదో ఒక ఉత్సవంలో శ్రీకృష్ణుని కి సంబంధించి పాడేవారని తెలుస్తుంది. శ్రీకృష్ణుడు నరకాసురుని, శిశుపాలుని సంహరించడం పదారువేల సతులను, రుక్మిణీ దేవిని పెండ్లాడడం మొదలయిన కృష్ణావతార సంఘటనలు వర్ణించబడ్డాయి.

బౌ ళి

పాడరే సోబనాలు పడఁతులాల
వేడుక లిద్దరికిని వెలసెఁజూడరే ॥పల్లవి॥

కొంగలే పీటలుగా గూచున్నా రెదురుబడి
సంగడనే నారసింహుండు నాదిలక్ష్మియు
వెండిఁబైఁడి నిండుకొన్న వేదాద్రి గరుడాద్రులు
పెండిలాడే రిద్దరును ప్రియములఁజూడరే ॥పాడ॥

భవనాశి జలములఁబాయక తోడ నీళ్ళాడి
నవలా నవలాఁదాము యేటి దరుల
జవళిమంచి పూవుల సరిసేసలు వెట్టుచు
తవిలి సుముహూర్తానఁదప్పక చూచేరు ॥పాడ॥

పొందుగఁగనకావతి భోగావతి నదుల
సంచడి వసంతముగాఁజల్లులాడుచు
అందమై శ్రీవేంకటాద్రి నహోబలాన నొకట
నందముగఁగూడి కూడి సరసము లాడేరు ॥పాడ॥ (24 436)

ఈ పాట ఎత్తుగడలో 'సోబనాలు' అనే మాట వుంది. ఈ పాటను కూడా ఏదో ఒక వృత్తాంతసమయంలో పాడేవారని తెలుస్తుంది అహోబిలంలో వైభవోపేతంగా తులతూగుతున్న ఆదిలక్ష్మి నృసింహ స్వాములకు శోభనాలు పాడడం వర్ణించబడింది.

వైవాహిక సమయంలో పాడే శోభనపాటల్ని రెండు విధాలుగా విభజించవచ్చు. మొదటిది స్వామివారికి సంబంధించినవి. రెండవది స్వామివారికి అమ్మవారికి ఇద్దరికీ సంబంధించినవి.

మాళవి

పిలువక వచ్చితిమి పేరటాండ్లము
సొలసి సొలసి మీపైన సోబానఁబాడేము ॥పల్లవి॥

చుక్కబొట్టు పెట్టుకొని సూసరముఁగట్టుకొని
నిక్కి నిక్కి చూచీ నావె నీదిక్కు
పిక్కటిల్ల నీకు నావె పెండ్లి కూఁతురాయనో
చొక్కముగఁజెప్పవయ్య సోబానఁబాడేము ॥పిలు॥

ముప్పిరి నవ్వుల తోడ ము(మ)ంగ జేతి కంకణపు తో
చిప్పిలి నీయెదుటను సిగ్గుపడీని
చెప్పరమై తానుఁగొత్తచేవులు నీకాయనో
చొప్పులెత్తి చెప్పవయ్య సోబానఁబాడేము ॥పిలు॥

తాళిమెడఁగట్టుకొని దైవానాఁబసపు పూసి
ఆరామనో తాను అప్పుడే నీకు
యేలితివి వేంకటేశ నన్నా సింతలోనే
సోలిసింకాఁజెప్పవయ్య సోబానఁబాడేము ॥పిలు॥ (24 53)

ఈ పాట చరణాంతాల్లో 'సోబాన బాడేము' అనే మాట ఆవృత్తి అయింది. ఇందులో పెండ్లికూతురు పెండ్లి కొడుకును ఉత్సుకతతో అవలోకించే తీరును పెండ్లి కొడుకుకు తెలియజేస్తూ పాడడం స్పష్టమవుతుంది.

శుద్ధవసంతం

నిచ్చ నిచ్చ సోబనాలు నెలమూఁడు సోబనాలు
హెచ్చెనీకు సింతలోనె ఇవి గదవయ్యా ॥పల్లవి॥

చెలియ మోహములే నేసపాలు
వెలుచు సిగ్గులే మీకు పెండ్లి తెర
కలగొను చూపులే కంకణాలు
సులబాన నీకు నబ్బెసుఖియించవయ్యా ॥నిచ్చ॥

మగువ మాటలే నీకు మంత్రాలు
పొగరు మోవి తేనెలు బువ్వాలు
వెగటు బొమ్మ జంకెలే విడేలు
జిగి నీకునేఁడ బ్బెఁజిత్తగించవయ్యా ॥నిచ్చ॥

కాంత సరసములే కప్పురాలు
పొంత నున్న కుచములే బూ (పూ?) జకుండలు
చెంతలఁగూడితివిట్టి శ్రీవేంకటేశా! యివి
సంతసమాయను నీకు జయమందవయ్యా" (26-412)

ఈ పాట పల్లవిలో 'సోబనాలు' అనే మాటలున్నాయి. యిందులో పెండ్లికూతురు మోహాలు, సిగ్గులు, చూపులు, మాటలు మొదలయిన శృంగార భావాల్ని సేసపాలు, పెండ్లితెర కంకణాలు, మంత్రాలు మొదలయిన వైవాహిక చర్యలతో అన్వయిస్తూ స్వామివారికి శోభనం పాడటం విదితమవుతుంది.

## లలిత

సోబానఁబాడేము మేము సుదతులము
యీ బుద్దులు మీకుఁజెల్లు దరికి నయ్యా ॥పల్ల॥

చూపులనే వుంకువలు సుదతికిఁబెట్టితివి
వూపనవ్వులు మించే కప్పుర విడేలు
యేపు మీరి నవ్వులనే యెదుట తెర వేసితి
వీపొద్దే పెండ్లాయెను మీకిద్దరికి నయ్యా ॥సోబా॥

తరితీపు మాటలనే తలఁబ్రాల వోసితి
గరిమ సరసములే కంకణాలు
గౌరవైన వలపుల కొంగులు ముళ్లువేసితి
విరవాయ వేడుకలు ఇద్దరికినయ్యా ॥సోబా॥

పొంచిన కెమ్మోవినే బువ్వపు విందు వెట్టితి
మంచముపై కాఁగిలే మంచి చపికె
అంచల శ్రీవేంకటేశ అలమేలు మంగ నీవు
యెంచి కూడితిరి తగు నిద్దరికినయ్యా ॥సోబా॥ (27-40)

ఈ పాట ఎత్తుగడలో 'సోబానబాడేము' అనే మాట వుంది. ఇందులో పెండ్లికొడుకు తన తీపు మాటలనే తలబ్రాలు పోయడం సరసాలనే కంకణాలు కట్టడం వలపులనే కొంగు ముళ్లు వేయడం, కెమ్మోవనే బువ్వపు విందుగా పెట్టడం మొదలయిన సరస చేష్టల్ని వర్ణిస్తూ సుదతులు స్వామివారికి శోభనం పాడడం వెల్లడవుతుంది.

స్వామి వారికి అమ్మవారికి ఇద్దరికీ సంబంధించినవి.

### భూపాళం

సిందు సోబనము నేఁడు నెయ్యపు దంపతులకు
మెండగ నారతు లెత్తి మీఁద నేసచల్లరే ॥పల్లవి॥

కట్టుడు కలువడాలు ఘనమైన తోరణాలు
గట్టిగాఁ బట్టణము సింగారించరే
కిట్టి రుక్మిణీదేవి కృష్ణుఁడు పెండ్లాడి వచ్చె
పెట్టుఁడిందరికి నేఁడు పెండ్లి పీడేలు ॥సిందు॥

పాడరె సోబనాలు పై పైనె పేరఁటాండ్లు
యాడాడనక వీధులేగించరే
జాడతో వాయించరె పంచమహావాద్యాలు
యీడనె పెండ్లి కట్నాలియ్యరె యిద్దరికి ॥సిందు॥

పొత్తుల విందులు దెచ్చి బువ్వమున నిడరే
హత్తి గంధాక్షతలిచ్చి అందరు నేఁడు
సత్తిమె శ్రీవెంకటాద్రి సిరియుఁడీ కృష్ణుఁడు
తత్తరాన నీకె గూడె దగ్గరి సేవించరే ॥సిందు॥ (15-55)

ఈ పాట ఎత్తుగడలో 'సిందు సోబనము' అనే మాట వుంది. ఇందులో కలువడాలు కట్టడం, తోరణాలు కట్టి సింగారించడం, మంగళ వాద్యాలు వాయించడం, పెండ్లి కానుక లివ్వడం, మొదలయిన వైవాహిక కార్యక్రమాలు వర్ణించబడ్డాయి.

### సాళంగ నాట

ఈపెను నితఁడుఁదగు నితని కీపెఁగగు
చూపులకు పండుగాయ శోభనము నేఁడు ॥పల్లవి॥

పిలువరె పెండ్లికూఁతుఁ బెండ్లిపీట మీఁదికి
చెలఁగి తానెదురు చూచీ దేవుఁడు
బలువుగా నిద్దరికి బాసికములుఁగట్టరె
కలిమెల్ల మెరసి సింగారించరే ॥ఈపె॥

ఆతల దెచ్చి పెట్టరె ఆ పెండ్లి కూతురును
యీతఁడీ జంట శోభనమిద్దరికి
కాతరాన బువ్వానకు గక్కనఁబెట్టరె మీరు
చేతిపసుండియు నగిరించేరు వీరు ॥ఈ పె॥

పూనపు వరచరె బలునాగపల్లి నేడు
పూనె నెరవేయరె పోలంతులాల
ఆసుక శ్రీవేంకటేశుఁడలమేలుమంగయును
లోననె భూకాంతయును లోలులైరితాము ॥ఈ పె॥ 23-295

ఈ పాట పల్లవి అంతంలో 'శోభనము నేడు' అనే మాటవుంది. ఇందులో వధూవరులు ఒకరికొకరు తగినట్లుండి కన్నుల పండువ గొల్పుతున్నారనడం వారికి బాసికాలు కట్టడం, తదనంతరమయిన సింగారాలు చేయడం మొదలయిన వైవాహిక కృత్యాల్ని నిర్వర్తించడం వర్ణించబడింది.

పాడి

పొద్దుపొద్దు కిట్లానె భోగించరయ్యా
ఇద్దరికిఁ గలిగెనేఁడిదివో సోబనము ॥పల్లవి॥

పెంచెపు మీతొడలే పెండ్లి పీటలు మీకు
ముంచిన సిగ్గులే కడుము తెల సేస
పంచల బిమ్మఁజూపులు పసపులునలంచుట
అంచెల మీ యిద్దరికి నమరె సోబనము ॥పొద్దు॥

పొత్తుల మోవి తేనెలే బువ్వపుఁబాలుపళ్లు
బత్తితోడి నవ్వులే కప్రపు బాగాలు
హత్తిన చెనకులే అలరిన వుంకువలు
మెత్తలఁజూచిన మీకు మెనసె సోబనము ॥పొద్దు॥

కందువ కాఁగిటి రతి గందాక్షతలు మీకు
విందుల సరసములు వీడు దోడులు
యిందునె శ్రీవెంకటేశ యింతి నీవుఁగూడితివి
సందడితో మెరసె నిచ్చలు మీసోబనము ॥పొద్దు॥ (27-417)

ఈ పాట చరణాంతాల్లో 'సోబనము' అనే మాట ఆవృత్తి అయింది ఇందులో పెంచెపు తొడలే పెండ్లి పీటలు, ముంచినసిగ్గులే ముత్తెల సేస, చిమ్ము చూపులు పసపుల నలచుట, మోపితేనెలే బువ్వపు పాలకూళ్లు అని వధూవరుల ఆంగిక సౌందర్య చేష్టల్ని వివాహానికి వుపయుక్తమయిన వస్తువులతో అన్వయించడం వినోదమవుతుంది

### 3.3.14 హారతి పాటలు :

సి. పి బ్రౌన్ తెలుగు - ఇంగ్లీష్ నిఘంటువులో హారతి, హారతి పాటలు అనే శబ్దాలున్నాయి 'హారతి' 'A wave offering to a diety An offering of camphor , presented on marriages or such like festivities to prevent the bad effects of an evil eye

'హారతి పాటలు' కు - Songs sung at the time of offering camphor to a diety or on festive occasions having the phrase హారతులెత్తరే as a chorus అనే అర్థాలున్నాయి.

హారతి పాటలు :

హారతి పాటల్ని మంగళ హారతులు, మంగళారతులు. నీరాజనపు పాటలు అని కూడా అంటారు 'ఆరత్యుపరతి విరతయ ఉపరామే' అని అమరకోశంలో చెప్పబడింది. అంటే ఆరతి ఉపరతి, ఉపరామము, విరతి అనేవి చాలించడానికి పేర్లు అని అర్థం.

నన్నెచోడుని కుమార సంభవంలో అలతుల ప్రసక్తి కనిపిస్తుంది

'సోలుచు సమ్మదరసమున
గ్రాలుచు వనపాల బాలికలు నవలతికాం
దోలములు వేడ్క నలుపుచు
నాలతులొగి జేసి పాడిరభినవలీలన్' (4-112)

ఇలాగే మరో పద్యంలో -

'పసిగొన సాహకారిఫలమంజరులను
బారాళినాందోళి భైరవి నాట

నుఁ పార నాలతుల్ నూల్కొనజేసి
ననురీతి తోడ మనోరాగలీల
వినసింపుగాఁ బెక్కువిధములఁ బాడి
వి పతించి రింతులా విశ్వేశునకు' (9 135)

అని తరువోజలో ఆలతుల ప్రసక్తి చెప్పబడింది.

ఆచార్య బిరుదురాజు రామరాజుగారు—

"పూజాదికములందు గాని, శుభకార్యము లందుగాని మంగళము పాడుటకలదు. ఈ యాచారము భారతదేశ మందంతటను కలదు మంగళహారతి యనగా నివాళి. కాని రానురాను నివాళి నిచ్చునప్పుడు పాడెడు పాట కర్థమైనది. పాల్కురికి సోమ నాథుడు పేర్కొన్న నివాళి పదములు మంగళారతులై యుండవలెను. దీపారతులు, ధూపారతులు మున్నగునవి తత్సంబంధములే. ఈయా దేవత యనక మంగళారతులు అన్ని దేవతలకు సంబంధించినవి కలవు. వర్ణనాత్మకముగను స్తోత్రరూపముగను, సేవా రూపమునను, భక్తివేదాంత, శృంగార పరముగను మంగళ హారతులున్నవి"[96] అని పేర్కొన్నారు.

పై అభిప్రాయమువల్ల తేలిన అంశాలు :

హారతి పాటల్లో నీరాజనం, మంగళారతులు, హారతి అనే మాటలు పల్లవి ఎత్తుగడలోగాని, పాదాంతాల్లోగాని, రావడం మొదటి లక్షణం ఇవి వేదాంత, భక్తి శృంగారాత్మకంగా వుండడం రెండవ లక్షణం. వీటిని పూజాకార్యక్రమాదుల్లోను శుభ కార్యాదుల్లోను పాడతారనడం మూడవ లక్షణం. ఇవి షష్ఠ్యంతాలుగా వుండడం నాల్గవ లక్షణం

లోక వ్యవహారంలోని హారతి పాటలు :

"హారతి మీరేల ఇవ్వారే
అంబకు మంగళ హారతి మీరేల ఇవ్వారే
హారతి మీరేల ఇవ్వరే
జ్ఞాన విద్యల కెల్ల పఠనము

లీలతో పదియారు వన్నెల
మేలితో బంగారు తల్లికి
..................
పారిజాతపు హారతివ్వరే"97

"గుమ్మాడి గుమ్మాడి గుమ్మాడి పందిట్లో
పచ్చకర్పూరంబులే రుక్మిణీ దేవికి పచ్చకర్పూరంబులే
ఆదేవి భూదేవి చెలియ లిద్దరు గూడి
చేతి కందియ్యరమ్మా ఆరతి పళ్లెం చేతి కందియ్యరమ్మా
పచ్చాగంధము పచ్చిగంధము పసు గాల గిన్నెలతో
పన్నీరు పై జల్లరమ్మా రుక్మిణీదేవికి పన్నీరు పై జల్లరమ్మా"98

**అన్నమయ్య హారతి పాటలు :**

అన్నమయ్య హారతి పాటల్ని రెండు రకాలుగా విభజించవచ్చు మొదటివి ఉత్సవ సమయంలో పాడేవి. రెండవది వివాహ సమయంలో పాడేవి.

**ఉత్సవ సమయంలో పాడేవి :**

భౌళి

ఎత్తరే ఆరతులు యియ్యరే కానుకలు
యిత్తలనేగి వచ్చిసె యిందిరా నాథుఁడు ॥పల్లవి॥

గరుడధ్వజపుతేరు కనకమయపు తేరు
సిరులతో వేదముల చేరు తేరు
సురలు మునులు బట్టి సొంపుతోడ దియ్యఁగాను
యిరవుగనేఁగి వచ్చె నిందిరానాథుఁడు ॥ఎత్త॥

జీవకోట్లున్న తేరు శేషుఁడే రూపైన తేరు
వేవేలు సింగారముల వెలయు తేరు
మూనరుస నిత్యులును ముక్తులునుఁ గొలువఁగా
యీవలనేఁగి వచ్చె నిందిరానాథుఁడు ॥ఎత్త॥

పంచభూతముల తేరు బ్రహ్మాండమైన తేరు
మించిన శ్రీవేంకటాద్రి మీఁదటి తేరు
కొంచక యలమేల్మంగ గూడి వచ్చిన దె తేరు
యెంచరాని మహిమల నిందిరానాథుఁడు॥ (10-36)

లలిత

అంగన లీరే యారతులు
అంగజ గురువుకు నారతులూ ॥పల్లవి॥

శ్రీదేవి తోడుత జెలఁగుచు నవ్వే
ఆదిమ పురుషుని కారతులూ
మేదినీ రమణి మేలములాడేటి
ఆదిత్యతేజున కారతులూ ॥అంగ॥

సురలకు నమృతము సొరిది నొసంగిన
హరి కిదివో పసిఁడారతులూ
తరిమిది దుష్టుల దనుజుల నడఁచిన
అరి భయంకరున కారతులూ ॥అంగ॥

నిచ్చలుఁగల్యాణ నిధియై యేగేటి
అచ్చుతునకు నివె యారతులూ
చొచ్చి శ్రీ వేంకటేశుఁడు నలమేల్మంగ
యచ్చుగ నిలిచిరి యారతులూ ॥అంగ॥ (25-346)

మొదటి పాటలో మహోన్నతమయిన బంగారు తేరుపై ఊరేగుతూ వస్తున్న ఇందిరానాథునికి హారతులిమ్మని ఆదేశించడం కనిపిస్తుంది. బహుశః ఇది స్వామి వారికి తిరుమలలో నాలుగు వీధుల్లో రథారోహణచేసి వెంచేస్తున్నప్పుడు స్త్రీలు హారతు లెత్తుతూ పాడే పాట కావచ్చు.

రెండవ పాటలో స్వామివారి పేరోచిత కృత్యులు వర్ణించబడ్డాయి. అనుకున్న కార్యాన్ని సాహసంతో పూర్తిచేసి మరలివచ్చిన వారికి హారతులిచ్చే సంప్రదాయంలో ఈపాట సాగింది. మొదటి పాట ఎత్తుగడలో 'ఆరతులు' అనే మాట కన్పిస్తుంది. రెండవ పాటలో పాదాంతాల్లో 'ఆరతులు' అనే మాట ఆవృత్తి అయింది.

వివాహ సమయంలో పాడేవి :

శ్రీ రాగం

ఎత్తరే ఆరతు లీవె కింతులాల
హత్తెను శ్రీవేంకటేశు కలమేలుగంగ ॥పల్లవి॥

హరివురముపై సొమ్ము అరతఁగట్టిన తాళి
సరిలేని దేవుని సంసార ఫలము
సిరులకుఁబుట్టినిల్లు సింగారములవిత్తు
మెరుఁగుఁబోడి యలమేలుమంగ ॥ఎత్త॥

పరమాత్మునికి నాత్మభావములో కీలుబొమ్మ
కెరలుచు నితఁడు భోగించే మేడ
సరసపు సముద్రము సతమైన కొంగుపైఁడి
అరిది సంపదలది యలమేలుమంగ ॥ఎత్త॥

శ్రీవేంకటేశుని దేవి చిత్తజుని గన్నతల్లి
యీ విభుని కౌఁగిటిలోయేచిన కళ
బూవపు పెండ్లిమేలు పొందిన నిధానము
ఆవలనీవల నీపె యలమేలుమంగ' ॥ఎత్త॥ (14.84)

మంగళ కౌశిక

క్షీరాబ్ధి కన్యకకు శ్రీమహాలక్ష్మికిని
నీరజాలయమునకు (యకును?) నీరాజనం ॥పల్లవి॥

జలజాక్షి మోమునకు జక్కవ కుచంబులకు
నెలకొన్న కప్పురపు నీరాజనం...
అలివేణి తురుమునకు హస్తకమలంబులకు
నిలువు మాణిక్యముల నీరాజనం ॥క్షీరా॥

చరణకిసలయములకు సకియ రంభోరులకు
నిరతమగు ముత్తెల నీరాజనం

అరిది జఘనంబునకు నతివ నిజ (నత)? నాభికిని
సిరతి నానావర్ణ నీరాజనం ॥క్షీరా॥
పగటు శ్రీ వేంకటేశు పట్టపురాణియై
నెగడు సతి కళలకును నీరాజనం
జగతి నలమేల్మంగ జక్కందనములకెల్ల
నిగుడు నిజశోభనపు నీరాజనం ॥క్షీరా॥ (26-295)

సాధారణంగా దేవతల సౌందర్యాన్ని వర్ణించేటప్పుడు ఆపాదకేశాంతం వర్ణించడం, మానవుల్ని వర్ణించేటప్పుడు ఆకేశపాదాంతం వర్ణించడం జరుగుతుంది. ఈ కీర్తనలో కూర్చొన్న అమ్మవారిని మోమునుంచి వర్ణించడం కనిపిస్తుంది. కాని పాదాది సౌందర్యవర్ణన కనిపించదు. కాబట్టి ఇది పీటమీద కూర్చొనివున్న అమ్మవారి భంగిమకు హారతియిచ్చిన వైనాన్ని సూచిస్తుంది.

ఈ రెండు పాటలు కూడా లక్ష్మీదేవికి సంబంధించినవి. మొదటిపాటలో లక్ష్మీదేవి ఔన్నత్యం, గుణగణాదుల స్తుతి కనిపిస్తుంది. రెండవ పాటలో అంగాంగ సౌందర్య వర్ణన చేస్తూ ఆయా అంగాలకు తగిన కప్పురము, మాణిక్యము, ముత్యాలు మొదలయిన వస్తువులతో నీరాజనం ఇవ్వడం కనిపిస్తుంది. మొదటిపాట ఎత్తుగడలో 'ఆరతులు' అనే మాట కనిపిస్తుంది. రెండవపాట పాదాంతాల్లో 'నీరాజనం' అనే మాట ఆవృత్తికావడం జరిగింది. ఈ పాటలో 'క్షీరాబ్ధి కన్యకు' 'జలజాక్షి మోమునకు' 'అలివేణి తురుమునకు', మొదలయిన షష్ఠ్యంత పదప్రయోగాలు కనిపిస్తాయి.

### 3. 3. 15 నివాళి పాటలు :

సి. పి. బ్రౌను తెలుగు - ఇంగ్లీష్ నిఘంటువులో నివాళికి—

**A wave offering Fumigation, used as a superstitious rite to avert evil./** అని చెప్పబడింది.

తమిళంలో 'నీడువాళి' అంటే 'చిరాయువైవర్ధిల్లుము' అని అర్థం. ఈ అర్థంలో మంగళాశాసన పురస్సరంగా పాడే పాటలు నివాళి పాటలు.

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్ర (పు.518)లో 'నివాళి' పదాన్ని పేర్కొన్నాడు.

ఆచార్య యస్వీ. జోగారావుగారు—

"నివాళి పదము ద్విపదవికారమైన రచనయే" అని అభిప్రాయ పడ్డారు.

హస్నాబాద నాగలింగ శివయోగిగారు —

"మంగళహారతికి నివాళి పర్యాయ పదము. రానురాను 'నివ్వాళి'యే మంగళముగా మారినదా ? అన్నమయ్యగారి కాలమునుండి మంగళములు పాడుట యాచారమయ్యేనేమో , అయిన యీ 'నివాళి' పాటయందు నీరాజనములు (ఆరతులు) మంగళము మున్నగు శబ్దములును, వచ్చుటచే నిరాజనములు, నివాళులు వేరువేరు అయివుండునాయని సంశయము కలుగుచున్నది"[99] అని వ్యక్తం చేశారు.

డా॥ వేటూరి ఆనందమూర్తిగారు—

"దిష్టితీయుటకై పారాణి పళ్లెము నెత్తుచూ పాడు పాటలే నివాళి పాటలు"[100] అని అభిప్రాయపడ్డారు

పై అభిప్రాయములవల్ల తేలిన అంశాలు :

ఈ పాటల్లో 'నివాళి' అనే పదం ప్రయుక్తం కావడం మొదటి లక్షణం. వీటిని దిష్టితేసేటప్పుడు పాడతారనడం రెండవ లక్షణం.

లోక వ్యవహారంలోని నివాళి పాటలు :

"నివ్వాళి ప్రభురాయ నివ్వాళి బసవ
నివ్వాళి గురుమూర్తి నీకు నివ్వాళి
అఖిలేశ లోకేశ అమిత ప్రకాశ
నిఖిల లోకారాధ్య నీకు నివ్వాళి
ఉద్రిత సరి శేష ఓ పరమేశ
నిర్జిత జగదైత్య నీకు నివ్వాళి"[101]

"నివ్వాళి ప్రభురాయ నివ్వాళి
బసవ నివ్వాళి గురుమూర్తి నివ్వాళి
మెరుకాని వనుభూతి కరసల్లాపమున
పరమ......గురుమూర్తి నీకు నివ్వాళి

నిశ్చయం నీవైన నిరహంకృతి హస్త
నిశ్చలా శివలింగ నీకూ నివ్వాళి
పరిణమా తృప్తి సద్భావహస్తమున
నిరవాయ మహాలింగ నీకూ నివ్వాళి
పరిణామా సుజ్ఞాని పాణి పద్మమున
నిరవాయ మహాలింగ నీకూ నివ్వాళి"102

అన్నమయ్య నివాళి పాటలు :

అన్నమయ్య సంకీర్తనల్లో రెండు 'నివ్వాళి' పాటలు కనిపిస్తున్నాయి.

శంకరాభరణం

వలపులు వలపులు వయ్యాళి
చలమరి మరుఁడును సమెళి ॥పల్లవి॥

నెలత మోమునను నీకనుచూపులు
నిలువున ముత్తెపు నివాళి
కొలదికి మీరిన గురు కుచములకును
తొలఁకు నీ మనసు దువాళి ॥వల॥

వనితనిందు జవ్వన గర్వమునకు
ఘనమగు నీరతి కరాళి
వెనకముందరల వెలఁది మేనికి నీ
పెనఁగుఁగోరికొన పిసాళి ॥వలపు॥

పడఁతి కోరికల భావంబునకును
కడుఁగడు నీతమి గయాళి
చిడిముడి మగువకు శ్రీవేంకటపతి
విడువని కూటపు విరాళి ॥వలపు॥ (13-292)

ఈపాట పాదాంతాల్లో నివాళి అనే మాటతో బాటు తత్తుల్యమయిన వయాళి, సమెళి, దువాళి, కరాళి, పిసాళి గయాళి, విరాళి, అనే మాటలున్నాయి. ఇందులో అమ్మవారి మోమునకు స్వామివారి కనుచూపులు ముత్తెపు నివాళిగా వర్ణించబడింది.

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

మలహరి

నిచ్చ నిచ్చఁజేకొను నివాళి
యిచ్చఁబేరె వరమోబుళేశ నివాళి ॥పల్లవి॥

సొలపుల వాలుక చూపుల నెత్తురు
నెలఁతలు నీకిదె నివాళి
వలయపు కంకణరవంబుల నెత్తేరు
నిలువుఁబయ్యెదల నివాళి ॥నిచ్చ॥

నక్కనను సరసపు కప్పురపు నవ్వుల
నిక్కుచు నెత్తేరు నీకు నివాళి
వక్కణించ మాణికపు వన్నె గోళ్ల చేతుల
నెక్కొని (వ?) నెత్తేరు నీకు నివాళి ॥నిచ్చ॥

ముంచిన కాఁగిటిలో నీమోహన వేదమంత్రాల
నించినించి యెత్తేరు నివాళి
వెంచపు శ్రీవేంకటాద్రి పేరెవరపోబుళేశ
అంచెనిన్నుఁగూడి యెత్తెరదే నివాళి నిచ్చ॥ (28-129)

ఈ పాట పాదాంతాల్లో 'నివాళి'అనే మాట ఆవృత్తి అయింది. ఇది అహోబల నృసింహస్వామికి చెందిన నివాళి పాట ఇందులో నివాళి త్తె నెలతల అంగాంగ సౌందర్య వర్ణన నాయికా నాయక గత శృంగార చేష్టల వర్ణన గాపించబడింది. అన్నమయ్య అహోబలంతో విద్య నేర్చుకోవడం వల్లను, అహోబలంలోని నృసింహ స్వామికి వేంకటేశ్వరునికి అభేదం చెప్పడంవల్లను ఇలాంటి కీర్తనలు అన్నమయ్య సంకీర్తనల్లో చాలా కనిపిస్తాయి.

### 3.3.16 ధవళ గీతాలు :

నిఘంటువుల్లోని అర్థ వివరణ :

ధవళ మనే శబ్దానికి ఆప్టే నిఘంటువు తెలుపులో రంగు పరిశుద్ధమైనది శ్రేష్ఠ మైనది. సుందరమైనది. కర్పూరము, ఒక వృక్షజాతి అనే అర్థాలివ్వబడ్డాయి.

శబ్ద కల్పద్రుమంలో
"ధవళః రాగావిశేషః పరతమతే
హిందోళరాగస్య అష్టమపుత్రః
ఇతి సంగీత శాస్త్రమ్"

అని చెప్పబడింది.

సంస్కృత లాక్షణికుల నిర్వచనాలు :

సంస్కృత ఛందో గ్రంథాల్లో మొదటిదయిన పింగళ ఛందశాస్త్రంలో –

"ధవల మిషేణ చ పురుషో
వర్ణ్యతే యేన తేనసా ధవలా
ధవలోపిఽ భవతి త్రివిధోఽ
ష్టపద : షట్పదశ్చతుష్పాద :" (14-16)

అని పేరుడైన వానిని వర్ణించు పద్య గతిగా చెప్పబడింది.

స్వయంభూ ఛందస్సులో ఒకటి రెండు పాదాల్లో ఒక షణ్మాత్రాగణం, మరి రెండు చతుర్మాత్రా గణాలును, మూడు నాలుగు పాదాల్లో ఐదు చతుర్మాత్రా గణాలు, లేదా నాలుగు పంచమాత్రాగణాలు రావడమే అన్నారు. ఈ 'మంగలే' అనేదే మంగళకరమైన సన్నివేశాల్లో పాడదగిన పద్యగతి అని వివరించాడు. అతడే ధవళాలు పాడదగిన సన్నివేశాన్ని ఈ శ్లోకంలో వివరించాడు.

దేవానాంస్తుతి కరణో ఛందో జాతీయః యాః భణితాః
తాయేవ పుల్లడకా అపభ్రంశస్తే సదాభవంతి
మంగళ వివాహ కరణే తాన్యేవ మంగలాని గీయంతే
బహువిధ బంధైః సదావిబుధామన్యంతే సర్వకార్యేషు" (8 29)

మానసోల్లాసంలో —

ధవలాది పదైః పాదై
రాశీర్వాద సమన్వితైః
ఛందసాయేన కేనాపి
కర్తవ్యో ధవళాభిః

సుమంగలపదోపేతైః
శుభైర్వాక్యైర్మనోరమైః
కైశిక్యా వోట్టరాగేణ
గేయం మంగల గీతకం

మంగలకరమైన పదాలతో కూడింది శుభవాక్యాలతో మనోహరమయింది. కైశికీ వృత్తిలో వోట్ట రాగంలో పాడదగింది, అని వివరణ ఇచ్చాడు. వివాహకాలంలో ధవళాన్ని ఉత్సవకాలంలో మంగళగీతాన్ని పాడాలని నియమం చెప్పాడు.

రాజశేఖరుడు తన చంద్రశేఖరం (22-28) లో శుభసమయాల్లో పాడదగిన ఉత్సాహమంగళం, హేళామంగళాల్ని ప్రస్తావించాడు మరి పురుష స్తుతిలోనే వీటిని వాడాలని నిర్దేశించాడు.

హేమ చంద్రుడు తన ఛందోను శాసనంలో (5-32. 38 ) ఉత్సాహాదులు ధవళం మరి, మంగళ శబ్దంతో కూడితే ఉత్సాహ ధవళం ఉత్సాహ మంగళమని పిలువబడుతుందని స్పష్టం చేశాడు.

సంగీతజ్ఞుల నిర్వచనాలు :

సంగీత గ్రంథాల్లో 13వ శతాబ్దంలోని పార్శ్వదేవుని సంగీత సమయ సారంలో (4-27.3 28) ధవళాన్ని నిర్యుక్త ప్రబంధంలో చేర్చి దాన్ని పద తాళాలతో సమాయుక్తం చేయాలని చెప్పబడింది. ఆ శతాబ్దం లోనే హరిపాలుడు తన సంగీత సుధాకరంలో ప్రబంధాదుల్లోనే ధవళాన్ని చేర్చి వివాహంలాంటి సంద ర్భాల్లో ఏకకాలంలో పాడవగిందని - 'వివాహాదిషు కార్యేషు మంగళే ష్వేవనగీయతే' (2-8, 9, 13) అని చెప్పాడు. ఆ శతాబ్దంలోనే సంగీత రత్నాకరంలో కీర్తి, విజయ. విక్రమ, ధవళాలు సవిస్తరంగా చెప్పబడ్డాయి.

వ్యక్తి గుణ కీర్తనానికి మంగళ కార్యాల్లో పాడడానికి అనువైన పాటగా ధవళాన్ని సంస్కృత లాక్షణికులు సంగీత శాస్త్రవేత్తలు భావించారనడం స్పష్టం

కన్నడ సాహిత్యంలో ధవళాలు :

కన్నడ సాహిత్యంలో ధవళాల ప్రశంస ప్రాచీన కాలంలోనే కనిపిస్తుంది. రన్న కవి (10వ శతాబ్ది (గదాయుద్ధం (5-41), అతని అజిత పురాణం

(3-221, రాఘవాంకుని సిద్ధరామ చరిత్రె (8 87), కుమార చెన్నబసవని పురాతనర చరితె (8-20, సిద్ధనం జేషని రాఘవాంక చరితె (7-74), హెళవన కట్టి గిరియమ్మ చంద్రహాసన కథె (4-28) మొదలయిన గ్రంథాలలో ధవళాల ప్రశంస కనిపిస్తుందిది. మరి ఇమ్మడి గురుసిద్ధుని హాలాస్యపురాణంలో 15 ధవళాల్ని పేర్కొన్నాడు. అజ్ఞాత కర్తృకమయిన ధవళదముడుగళు అనే పుస్తకంలో సీమంత ధవళ, జాతకర్మ ధవళ, ఉపనయన ధవళ, భరతేశ్వర ధవళలు వుదాహరింపబడ్డాయి

కన్నడ ధవళల్ని గురించి పరిశోధన చేసిన డి. ఎల్. నరసింహాచార్యగారు ధవళదౌపది, ధవళార్ధషట్పదిధవళార్ధ త్రిపది మొదలయిన వాటిని వుదాహరించాడు.

తెలుగులో ధవళాలు :

తెలుగు వాఙ్మయంలో అప్పకవీయం (4 40), ఆనంద రంగరాట్ఛందస్సుగ (2-131), మొదలయిన లక్షణ గ్రంథాల్లో ధవళాల లక్షణాలున్నాయి.

చిత్రకవి సింగన తన పెల్వజీయంలో 'అత్తరి నయిదువలారతు లెత్తుచు ధవళములు పాడ' (పుట 1.9) అని చెప్పాడు.

తాళ్ళపాక చిన్నన్న ఉషాకల్యాణంలో-

> 'పాడవే యొక పెండ్లిపాట సొంపార
> పాడరే ధవళంబు పాడరే యనిన' (పుట. 89)

అని పేర్కొన్నాడు.

చేమకూర వేంకట కవి విజయవిలాసం (1-129)లో ధవళాల ప్రశంసవుంది. మరి కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయం (పుట 137) లో సుగ్రీవుని పట్టాభిషేకానంతరం పుణ్యస్త్రీలు ధవళాలు పాడారని వర్ణించబడింది. మన్నారుదాస విలాస నాటకం (పుట. 101) లో విజయరాఘవ నాయకునికి కాంతిమతికిని జరిగిన వివాహ సందర్భంలో బ్రాహ్మణస్త్రీలు ధవళాల్ని పాడారని చెప్పబడింది, భవానీ శంకర విలాస మనే యక్షగానం, ఉమామహేశ్వరుల్ని వుయ్యాల్లో కూర్చుండ బెట్టి సఖులు కీర్తిస్తూ పాడిన ధవళాలున్నాయి.

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

ఆచార్య యస్వీ జోగారావుగారు -

"ఇదియొక మంగళ గీతము ప్రాచీన కాలము నుండియు బహు యక్షగానములందు ప్రయుక్తమగుచు వచ్చినది. ముత్తైదువలు హారతిపట్టు సందర్భమున గన్పట్టును. దీనినొక హారతి పాట యనవచ్చును. ధవళ శబ్దమునకు కర్పూర విశేషమనియు నర్థము. కర్పూరము తెల్లనిది. ఆరాత్రిక ముఖ్య ద్రవ్యము. అందులకే హారతిపాటలకును ఆ పేరు వచ్చియుండును"[103] అని అభిప్రాయపడ్డారు.

డా॥ వేటూరి ఆనందమూర్తిగారు —

"వాస్తవమునకు జూడగా నక్షతలు చల్లుచు శుభకార్యములందు పాడదగిన ఈ గేయరచనలన్నియు ఛందోభేదము లెట్లున్నను ఆశీర్వాదాత్మకములగుట చేత ధవళములే యని పేర్కొనదగును...... తంజావూరి యక్షగానములందీ గేయరచనా ప్రక్రియలలో భేద సాంకర్యములు రెండును పాటింపబడు చు వచ్చినవి. పూర్వులు జయదేవుని "ప్రళయ పయోధిజలే జయజగదీశహరే" పదమును 'కీర్తిధవళము'గా ప్రస్తుతించుటచేత కాబోలును జయారంభమును అంత్యాను ప్రాసమును గల రచనలను తరువాతి వారు ధవళములని పిలువ సాగిరి"[104] అని పేర్కొన్నారు.

### పై అభిప్రాయాలవల్ల తేలిన అంశాలు :

ధవళ గీతాలు జయాన్వితంగా వుండడం మొదటి లక్షణం. ఆశీర్వాదాత్మకంగా వుండడం రెండవ లక్షణం. వీటిని వివాహ సమయంలో పాడతారనడం మూడవ లక్షణం, ఇవి షష్ట్యంతాలుగా వుండడం నాల్గవ లక్షణం.

### లోక వ్యవహారంలోని ధవళ గీతాలు :

"జయ మంగళం
సీతారాములకు జయమంగళం
సలలితములయిన వజ్రాల మంటపములో
తెలివిగ నున్న మైథిలీ రామునకు ॥జయ॥
మేలిమిగల ముత్యాల మంటపములో
బాలితమైన మాళవభరతునకు ॥జయ॥

సరియైన దగిన పచ్చల పందిటిలోను
మెరసేటి లక్ష్మణునకూర్మిళాదేవికి ॥జయ॥
క్షితిలోన వెలసేటి కెంపుల పందిటిలో
సతి శ్రుతకీర్తికి శత్రుఘ్ననకు ॥జయ॥105

"జయ భక్త మందార
జయ వారధి గంభీర జయ నీరదాకార
జయ మేరు ధీరా ॥జయ॥

జయ త్రిభువనా వేశ
జయ రమాహృదయేశ
జయ పాలిత దిగీశ
జయ దనుజ నాశా ॥జయ॥

జయ శేషగిరివాస
జయ నుతైక విలాస
జయ కోటి రవి భాస
జయ మందహాస ॥జయ॥106

జయ మంగళము నిత్య శుభమంగళం
జయ మంగళము నిత్య జనులాకు శుభములు
దయసేయు నట్టి మాతల్లి శీతమ్మకు
అందెలు పాదార విందము లందున
పొందుగ మ్రోగియు నా సుందార కన్యాకు జయమంగళం"107

కన్నడ ధవళం :

'తన్న కులద, హరి యరసను
మన్నిసి కరె, యిళిమనెగె
చిన్న విళిద, వవరిగె
తన్నంతె, స్థవను"108

దీనికి సమానమయిన తెలుగు ధవళం—

'శ్రీరాముడు గుణధాముడు
వారిజ లోచనుడు
శూరత రావణు గూల్చి
నారీమణి దేవలయున్'[109]

## అన్నమయ్య ధవళ గీతాలు :

అన్నమయ్య సంకీర్తనల్లోని ధవళగీతాల్ని రెండు రకాలుగా విభజించవచ్చు. మొదటిది లక్ష్మీనారాయణుల నిద్దరినీ వుద్దేశించి పాడినవి. రెండవవి కేవలం మహా విష్ణువు నుద్దేశించి పాడినవి.

## లక్ష్మీనారాయణుల నుద్దేశించి పాడినవి :

### రామక్రియ

మరలి మరలి జయ మంగళము
సొరిది నిచ్చలును శుభమంగళము ॥పల్లవి॥

కమలారమణికి గమలాక్షునకు
మమతల జయజయ మంగళము
అమర జననికిని అమర వంద్యునకు
సుముహూర్తముతో శుభమంగళము ॥మర॥

జలధి కన్యకను జలధి శాయికిని
మలయుచును శుభం మంగళము
కలిమికాంత కాకలికి విభునికిని
సుళువుల యారతి శుభమంగళము ॥మర॥

చిత్తజు తల్లికి శ్రీవేంకట పతికి
మత్తిల్లిన జయం మంగళము
యిత్తల నత్తల యిరవుర కాగిట
జొత్తుల రతులకు శుభమంగళము ॥మర॥ (1-448)

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

గుండ క్రియ

జయమంగళము నీకు సర్వేశ్వరా
జయ మంగళము నీకు జలజవాసినికి ॥పల్లవి॥

శరణాగత పారిజాతమా
వైరి నసురల పాలి భూతమా
అరుదయిన సృష్టికి నాదిమూలమా వో
హరి నమో పరమపుటాలవాలమా ॥జయ॥

సకల దేవతా చక్రవర్తి
వెకలివై నిండిన విశ్వమూర్తి
అకలంకమైన దయానిధి
వికచముఖ వమోవిధికి విధి ॥జయ॥

కొలచిన వారల కొంగు పైఁడి
ములిగిన వారికి మొనవాఁడి
కలిగిన శ్రీవేంకటరాయా
మలసి దాసులమైన మాకు విధేయా ॥జయ॥ (7-197)

మొదటి పాటలో లక్ష్మీనారాయణుల్ని కలిపి మంగళం పాడడం కనిపిస్తుంది. రెండవపాటలో సర్వేశ్వరునకి, జలజవాసినికి అని ప్రత్యేక నిర్దేశం చేయబడుతూ మంగళ గేయాలు పాడడం కనిపిస్తుంది మొదటి పాట పాదాంతాల్లో 'జయమంగళము' అనే ఆశీర్వాచక పదాలు ఆవృత్తి అయ్యాయి రెండవ పాట జయారంభంతో సాగింది. ఈ రెండు పాటల్లోనూ షష్ఠ్యంత రూపాలు ప్రయోగించబడ్డాయి.

విష్ణువు నుద్దేశించి పాడినవి :

బౌళి

విదురుని విందా విజయీభవ !
హృదయేశ్వర విజయీభవ !
దైవశిఖామణి దానవమర్దన ।
దేవేలకు నీకు విజయీభవ ॥

శ్రీవల్లభగుణ చింత సాగర
యీ వలనిదే విజయీభవ ।
జగదేక విభుంత శతముఖవందిత
వెగటు విజయముల విజయీభవ
నిగమవినుత సర్వనిలయ నారాయణ ।
యిగిరించె గృప విజయీభవ ।
జలధిమథన సర్వజంతు విహారక ।
వెలసె నీమహిమలు విజయీభవ
కలిత శ్రీవేంకటకామిత వరద నిత్య ।
యిల ధర నీకు విజయీభవ॥ (2-165)

గుండ్రక్రియ

జయ జయరామా సమర విజయరామా
భయహర నిజభక్త పారీణ రామా ॥పల్లవి॥

జలధి బంధించిన సౌమిత్రి రామా
సెల్లవిల్లు విరచిని సీతారామా
అల సుగ్రీవునేలిన అయోధ్యరామా
కలిగి యజ్ఞము గాచే కౌసల్యరామా ॥జయ॥

అరి రావణాంతక ఆదిత్యకులరామా
గురుమౌనులను గాచే కోదండరామా
ధర నహల్యపాలిటి దశరథరామా
హరురాణి నుతుల లోకాభిరామా ॥జయ॥

అతి ప్రతాపముల మాయామృగాంతక రామా
సుతకుశలవ ప్రియ సుగుణరామా
వితతమహిమల శ్రీవేంకటాద్రి రామా
మతిలోనఁబాయని మనువంశరామా । (9-11) ॥జయ॥

ఈ రెండు పాటలు కూడా కేవలం విష్ణుమూర్తికి సంబంధించినవే. మొదటి పాటలో మహావిష్ణువు యొక్క మహిమల్ని గుణగణాదల్ని కీర్తించడం కనిపిస్తుంది రెండవపాటలో రామావతార సంఘటనల్ని కీర్తిస్తూ శ్రీరామచంద్రుని స్తుతించడం జరిగింది. మొదటి పాట పాదాంతాల్లో 'విజయీభవ' అనేమాట ఆవృత్తి అయింది. రెండవ పాట జయారంభంతో సాగింది.

3. 3. 17 ఉయ్యాల పాటలు :

బిడ్డను ఉయ్యాల్లోవేసి వూపుతూ పాడేపాటలు ఉయ్యాల పాటలు. ఈ పాటల్ని ఢోల్లరీ గీతాలని శార్ఙ్గదేవుడు పేర్కొన్నాడు. ఈ ఉయ్యాలపాటల ప్రసక్తి ప్రాచీన గ్రంథాల్లో కూడా కనిపిస్తుంది. నన్నెచోడుడు కుమార సంభవంలో 'ఉపేదలింపు మిగుల నూయల పాటలు పాట మధుమదమునఁబాడె నలులు' (4-89) అని పేర్కొన్నాడు.

పెద్దన కవిత్వం వ్రాయడానికి కావలసిన హంగుల్ని పేర్కొనే సందర్భంలో ఆశువుగా చెప్పిన -

"నిరుపహతి స్థలంబు రమణీప్రియ దూతిక తెచ్చి యిచ్చు క
ప్పుర విడెమాత్మకింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పు తప్పొ
ప్పరయు......................."

అనే పద్యంలో ఉయ్యాల కున్న ప్రాముఖ్యం స్పష్టమవుతుంది.

ఆచార్య యస్వీ జోగారావుగారు —

"లాలి, యన్నదియు ఉయ్యాల పాటయే. జోల ఉయ్యాల పాటగ గూడ నున్నదిగాని వానిగతియే వేఱు. చిన్నపిల్లలను నిద్రబుచ్చుటయు, దేవాయతన కల్యాణోత్సవములను వాని సందర్భములు..... ...వివాహవేళ వధూవరులన య్యాల లూచు నాచారము తమిళ మలయాళాది రాష్ట్రములందీ నాటికి నున్నదని వినదుము"110 అని పేర్కొన్నారు.

'ఎల్లోరాగారు —

"అసలు యీ ఉయ్యాల పాటలు అనేవి, ఉయ్యాల అనేది చిన్నవారికే కాదు. ప్రేమీ ప్రేమికులు, భార్యాభర్తలు, వారు వీరూ అనేమిటి అందరూ సరదాగా పాడు

కుంటూ ఊగుతారు... అటు ఏ చెట్టుకొమ్మకో ప్రేలాడ గట్టిన పాత చీరలో పరుండి ఆడుకొనే బీద పసికూననుంచి, ఇటు అంతఃపురసౌధాలలో చక్కని తూగుటుయ్యాలలో ఊగే కలవారిబిడ్డ దాకా యీ ఉయ్యాలపాటల మధురమైన గాలుల మధ్య నిద్రపోయి ఆడుకోవడం సహజంగా జరుగుతుంటుంది. వారూ, వీరూ అనే భేదంలేకుండా అన్ని తరగతులలోనూ యీ పాటలకు విలువ, గౌరవం స్థానంవుంది. అదే యీ పాటలకున్న ప్రత్యేకత, ఆకర్షణ"111 అని వ్యక్తం చేశారు.

కల్లూరి వీరభద్రశాస్త్రిగారు —

"పరమ భాగవతుల దాస భక్తి సంప్రదాయములో 'డోలోత్సవము' మిక్కిలి రమ్యమైనది. ఈ ఉత్సవములందు బ్రహ్మాది దేవతలు దేవమునులు, నారదాదులు, పరమభాగవతులు, వేదపండితులు, సామగానములు, స్తుతులు, సంకీర్తనములు చేయుచున్నట్లు దివ్య సన్నివేశమును భావించినారు"112 అని తెలియ జేశారు.

పై అభిప్రాయాలవల్ల తేలిన అంశాలు :

ఉయ్యాల పాటల్లో 'ఉయ్యాల' అనే పదం ఆవృత్తి కావడం మొదటి లక్షణం, ఇవి చిన్నపిల్లలకే కాకుండా పెద్దలకు కూడా వుపయుక్తం కావడం రెండవ లక్షణం. ఉత్సవ సమయాల్లో భగవంతుడికీ, వివాహ సమయాల్లో వధూవరులకు కూడా ఉయ్యాల పాటలు పాడతారనడం మూడవ లక్షణం.

లోక వ్యవహారంలోని ఉయ్యాల పాటలు :

లోక వ్యవహారంలోని ఉయ్యాల పాటల్ని రెండు రకాలుగా విభజించవచ్చు. మొదటిది చిన్నపిల్లల్ని భగవత్స్వరూపులుగా భావించి పాడేవి. రెండవది ఉత్సవ సమయాల్లో దైవాన్ని వుద్దేశించి పాడేవి.

భగవత్స్వరూపులుగా భావించి పాడేవి :

"ఊఁకే ఉయ్యాల అమ్మ వచ్చినవి
కొడుకులా గన్నతల్లి కొనరే ఉయ్యాలా
ఏంబెట్టినేగొందు వెండి ఉయ్యాల
పాదివేలు పోసి పైడి ఉయ్యాలా

నిద్రబో నా తండ్రీ నిద్రబోవయ్యా
నిద్రలో బలభద్ర రాముతమ్ముాత...
నిద్రూకు నూరేండ్లు నీకు వెయ్యేండ్లు
నిన్నుగన్న తండ్రికీ నిండనూరేండ్లు"113

"అన్నాయేడువకు కుశలన్నా
యేడువకు లవన్నా యేడువకు
ఉన్నాము అడవిలో కుశలాకుమారా
ఊ కి వుత్తరాన ఉయ్యాల కట్టి
కొడుకా ఉయ్యాల కట్టి
ఊంచీ పోదువురావె వుభయకావేరి"114

ఉత్సవ సమయాల్లో దైవాన్ని వుద్దేశించి పాడేవి :

"సురలు నసురులు మందరాగిరి
తరచి మథనము చేయగా
గిరికింద తాకూర్మమై వెలసినా
సరసు జాడరె వుయ్యాలా"115

"కరుకు లైన వజ్రాల కాళ్లనాటి
హరినీలమణి గొలుసూ అమరవేశి
పరమ మణిమయ హేమ పలకమీదా
హరి రుక్మిణి వేడుక ఆడిరుయ్యాల
దివినుండి నారదుడు తుంబురుడూ
నవనవంబుగ వీనాగానము శాయ
వెయి విధములుగా పాటలను వినుతిశాయ
హరి లక్ష్మి వూపోసి ఆడిరుయ్యాల"116

అన్నమయ్య ఉయ్యాల పాటలు :

అన్నమయ్య సంకీర్తనల్లో రెండు ఉయ్యాల పాటలున్నాయి.

తిరుమలలో శ్రీవారికి జరపబడే ఉత్సవాల్లో డోలోత్సవమొకటి. బ్రహ్మోత్సవాల్లో స్వామివారి మొగవణికి ముందు 'ఊంజల్ సేవ' జరపడం ఆచారం. ఆలాగే అద్దాల మహలులో కూడా ఊంజల్ సేవ ఆర్జితోత్సవంగా జరుపబడుతుంది. మరి ఏకాంత సేవలో కూడా 'ఉయ్యాల లూపడం' ఒక నిత్య కృత్యంగా పాటిస్తారు.

హరిదాస వాఙ్మయంలో ఉయ్యాల పాటలెన్నో వున్నాయి. మాధ్వులు శ్రీకృష్ణ విగ్రహాన్ని ఉయ్యాలల్లో బెట్టి 'గోపికా గీత'ను పాడతారు.

అన్నమయ్య సంస్కృతంలో కూడా 'డోలాయాం చల డోలాయాం హరే డోలాయాం' అనే డోలోత్సవ కీర్తన వ్రాశాడు (7-140).

ఆ హి రి

అలరఁ జంచలమైన ఆత్మలందుండ నీ యలవాటు సేసె నీ వుయ్యాల
పలుమారు నుచ్ఛ్వాస పవనమందుండ నీ భావంబు తెలిపె నీ వుయ్యాల ॥పల్లవి॥

ఉదయాస్త శైలంబు లొనరఁ గంభములైన వుడుమండలము మోచె నుయ్యాల
అదన నాకాశపద మడ్డదూలంబైన అఖిలంబు నిండె నీ వుయ్యాల
పదిలముగ వేదములు బంగారు చేరులై పట్టివెరపై తోఁచె నుయ్యాల
వదలకిటు ధర్మదేవత పీఠమై మిగుల వర్ణింప నరుదాయ నుయ్యాల ॥అలర॥

మేలుకట్లయి మీకు మేఘమండల మెల్ల మెలుఁగునకు మెలుఁగాయ నుయ్యాల
నీలశైలమువంటి నీమేని కాంతికిని నిజమైన తొడవాయ నుయ్యాల
పాలిండ్లు గదలఁగాఁ బయ్యెదలు రాఁపాడ భామినులు వడినూచు నుయ్యాల
ఓలి బ్రహ్మాండములు వొరగునోయని భీతి నొయ్యనొయ్యన వూఁచిరుయ్యాల ॥అలర॥

కమలకును భూసతికి కదలు కదలుకు మిమ్ముఁ గౌఁగిలింపఁ జేసె నుయ్యాల
అమరాంగనలకు నీహావభావ విలాస మందంద చూపె నీ వుయ్యాల
కమలాసనాదులకుఁ గన్నులకు పండుగై గణుతింప నరుదాయ నుయ్యాల
కమనీయమూర్తి వేంకటశైలపతి నీకు కడువేడుకై యుండె నుయ్యాల ॥అలర॥

(1-67)

ఆహిరి

తొల్లి యశు, మట్టాకు తొట్టెలనె యూఁగె గన
చెల్లుబడి నూఁగీని శ్రీరంగ శిశువు ॥పల్లవి॥

కలికి కావెరి తరగల బాహులతలనే
తలఁగ కిటు రంగమధ్యపు తొట్టులన్
పలుమారు దను నూఁచి పాడఁగా నూఁగీని
చిలుపాల సెలతో శ్రీరంగ శిశువు ॥తొల్లి॥

ఆదివో కమలజుని తిరువారాధనం బనఁగ
అదన గమల భవాండమను తొట్టెలన్
ఉదధులు తరంగముల నూఁచంగా నూఁగీని
చెదరని సిరుల తోడ శ్రీరంగ శిశువు ॥తొల్లి॥

వేదములె చేరలై వెలయంగ శేషుఁడే
పాదుకొను తొట్టెలై పరగఁగాను
శ్రీదేవితో గూడి శ్రీవేంకటేశుఁడై
సేదదేరెడి వాఁడె శ్రీరంగ శిశువు ॥తొల్లి॥ (11-2-1)

అన్నమయ్య మొదటి ఉయ్యాలపాటలో 'వుయ్యాల' అనే మాట ఆవృత్తి అయింది. ఇద్దరు దేవేరులతో కూడివున్న స్వామి వారిని ఉయ్యాల్లో వుంచి వూపడం ఈ కీర్తనలో కనపిస్తుంది దీన్ని డోలోత్సవ కీర్తనగా చెప్పవచ్చు ఈ కీర్తనలో స్థితికారకుడయిన మహావిష్ణువుయొక్క విరాట్స్వరూపవైభవ వర్ణనలు గావించబడ్డాయి. పూర్వాద్రి, పశ్చిమాద్రులు స్తంభాలుగా, ఆకాశం అడ్డదూలంగా నాలుగు వేదాలు నాలుగు త్రాళ్లుగా మారిన ఉయ్యాల ధర్మపీఠంగా వెలసింది. ఈ ఉయ్యాల స్వామి వారికి నిజమైన అలంకారంగా ఒప్పింది. ఒక్కవూపులో శ్రీదేవిని, మరోవూపుతో భూదేవిని కౌగిలించుకొనే విధంగా విలాసంగా భామినులు వుయ్యాల వూస్తూన్నారు. ఇలా కన్నుల పండువగా వెలుగొందుతున్న ఉయ్యాల బ్రహ్మాది దేవతలకు కూడా హర్షదాయకం.

రెండవ పాటలో ఉయ్యాల అనే మాట అవృత్తి కాకపోయినా, వుయ్యాల్లో వూగడం అనే విషయం స్పష్టంగా తెలుస్తుంది. ఈ పాట శ్రీరంగనాథునికి సంబంధించింది. ఈ పాటలో వటపత్రశాయి అయిన మహావిష్ణువును శ్రీరంగ శిశువుగా భావించి వుయ్యాల వూస్తూ పాడడం కనిపిస్తుంది. అన్నమయ్య శ్రీరంగ పట్టణాన్ని దర్శించాడనడానికీ ఈ పాట నిదర్శనమని చెప్పుకోవచ్చు. ఇది క్షేత్ర పరిసర ప్రాధాన్యాన్ని స్పష్టం చేస్తుంది.

### 3. 3. 18 లాలి పాటలు :

మారాముచేస్తూ ఏడుస్తున్న బిడ్డల్ని తలులు లాలిస్తూ పాడే పాటలు లాలి పాటలు. ఆంగ్లంలో వీటిని 'లల్లబీ' అని, హిందీలో 'లోరి' అని, తమిళంలో 'తాలాట్టు' అని, కన్నడంలో లాలి హాడుగళు' అని అంటారు ఆంగ్లంలో లల్లబీ' అనడానికి వివరణ ఇలా వుంది.

'A soothing refrain used to please or pacify infants'. 'A song sung to children to soothe them to rest'. Also any song which soothes to rest' — Oxford English Dictionary.

'A strain sung to soothe a child to sleep', 'Cradle soft song to put a baby to sleep' — Throndika Junior Illustrated Dictionary.

**Lullaby (lull-a-bi) 'song for lulling a baby to sleep- Advance Twentieth Century Dictionary.**

లాలి పాటల్ని గూర్చి ఆచార్య బి. రామరాజుగారు —

"సంతానము వడయుటకు స్త్రీలు పడరానిపాట్లుపడెదరు. వ్రతములు నోములు, తీర్థయాత్రలు చేసెదరు. ఇట్టి యాశ ఫలించి ఇంటివెలుగును కన్నతల్లి సంతోషమునకు మేర యుండదు. ఆ సంతోష పారవశ్యమున తన బిడ్డ రాముడుగనో కృష్ణుడుగనో, శంకరుడుగనో భావించి తల్లి లాలించును. ఇవి శంకరాభరణ, నవరోజు, ఆనంద భైరవి, శ్రీరాగము లందుండును. లాలులందుండు కవిత్వమున కడియే సాటి. మనోహరమైన భావములు లలితములగు పద బంధములు, సుకుమార మగు శయ్యను సంతరించుకొనును" 17 అని పేర్కొన్నారు.

డా॥ యస్వీ. జోగారావుగారు —

"ఇదియొక ఊయల పాట సర్వసాధారణముగ ఊంజల్, జోలపాటల వలె జంపె గతి గలదగుట గమనింప దగినది. ఈ పాటలు ప్రజాజాతి యందును బిడ్డ పుట్టుక అసలు పాట పుట్టుకను యెంత ప్రాచీనములో అంత ప్రాచీనము"[118] అని పేర్కొన్నారు.

కృష్ణశ్రీగారు —

"గేయవాఙ్మయ సిశ్రేణిలో లాలిపాటలు మొదటి మెట్టుకావలెను. వీటిలో సాహిత్యార్థము గౌణము. సంగీతమూ, చివరి స్వరాలు మాత్రమే ప్రధానము ఈ పాటలు బిడ్డలకు విశ్రాంతి నివ్వడానికి నిర్మించినవి కనుక ప్రతి లలితములగు మాటలనే వీటిలో ఉపయోగిస్తారు. లాలిపాటలు ఏడుస్తున్న బిడ్డలకోసం పాడుతారేమో నని అనుమానము కలుగుతుంది. లాలీలలో లీనాలను వినిపించి నరాలను నిద్రలోకి అవరోహింప జేస్తాయి లాలిపాటలలో నీవలూ లేలలూ వుండడము పరిపాటి"[119] అని అభిప్రాయపడ్డారు అంతేకాకుండా 'జోజో' అనే శబ్దాలకన్నా లాలీ అనే శబ్దాల్లో లాలిత్యం అధికంగా వుంటుందని వారు భావించారు.

డా॥ ఆర్వీయస్ సుందరంగారు —

ప్రపంచ మంతటా వ్యాపించి ఉన్న ఈ లాలి పాటలలో అంత్య ప్రాసలు గమనించ దగ్గవి కొన్ని పాటలలో పల్లవికే ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది అర్థ రహితమైన శబ్దాలు మాత్రమే ఉండే పాటలు కొన్ని ఉన్నాయి. చిన్నపిల్లలను కాళ్ళమీద వేసుకొని ఆడిస్తూనో, చక్కిలిగింతలు పెడ్తూ, తమాషాలు చేస్తూనో పాడే పాటలు కొన్ని. వీటిలో కొన్ని చారిత్రక ప్రాధాన్యం ఉండేవి. ఏదో ప్రదేశాన్నో వ్యక్తినో తీసుకొని అల్లబడిని పాటలివి, ఇవి పిల్లల బుద్ధిశక్తిని ప్రబోధించేవి లాలి పాటలలో ముఖ్యంగా తల్లి తనయుని గూర్చి ఎన్నివిధాలుగా అనుకుంటుందో అన్నీ ప్రేమ ప్రవాహంలా, అమృత ధారలా, రసవద్గంగలా ఆమె నోటినుంచి మాటలు పాటలుగా వెలువడడం కనిపిస్తుంది"[120] అని తెలిపారు.

పై అభిప్రాయాలవల్ల తేలిన అంశాలు :

లాలి పాటల ఎత్తుగడలోగాని, చరణాంతంలోగాని, 'లాలీ' అనేమాట ఆవృత్తి కావడం మొదటి లక్షణం. లాలిపాటల్లో బిడ్డను భగవత్స్వరూపుడుగా భావించడం

రెండవ లక్షణం. ఈ పాటల్లో సాహిత్యానికంటే సంగీతానికి ఎక్కువ ప్రాధాన్యం వుండడం మూడవ లక్షణం. విభిన్న భాషల్లో వుండే జానపద గేయాల్లో ఇతర పాటలు లేకున్నా లాలిపాటలు మాత్రం వుండి తీరుతా యనడం నాల్గవ లక్షణం.

లోక వ్యవహారంలోని లాలిపాటలు :

లోక వ్యవహారంలోని లాలిపాటల్ని రెండు విధాలుగా విభజించవచ్చు. మొదటిది శైవాత్మకాలు రెండవది వైష్ణవాత్మకాలు.

శైవాత్మకాలు :

"లాలి అనుచు వూచేరు లలన లిద్దరునూ
పాలలోచన నిన్ను పాన్పుపై నినిచె లాలీ
శ్రీగురుని పాదములు చేరి సేవింతూ
నాగ భూషణు నిన్ను నాత్మలోనుంతు
ఆ గణాధిపు పాద మమరబూజింతూ
బాగుగా ప్రమద గణభావ మర్దింతు లాలీ॥

కరచరణములు శాయి స్తంభములుగాంగ పరగ
దశవాయువులు పగ్గములు గాంగా
వురులింగమూర్తి దావుయ్యాల లూంగా ॥లాలీ॥

... ... ... ...

లాలి చిద్రూపాంగలాలియ్య లాలి
లాల సజ్జన హృదయ లానియ్యలాలీ
ఆ పిడుపర్తీశ లాలియ్యలాలి
ఆ సర్వేశ లాలీయ్యలాలీ'121

"లాలి శంకర సదాలాలిత కుమారా
లాలి పటు తాండవోల్లాస ఘన దీరా
లాలి పంచాస్య కైలాస సంచారా
లాలి మధురాలాప లాలి గంభీరా
పతిత పావన రుద్ర ఫణిరాజ భూషా
శితకాలకూట వర్ణిత భవ్యవేషా"122

వైష్ణవాత్మకాలు :

"లాలి మార్కండలాలీ
మామయ్యలాలి యోగ్యశాలీ
లాలనుచు బాడరమ్మా
ఈ బిడ్డ లక్ష్మి విలాసుడమ్మా
శ్యామలా కారుడమ్మా
ఈ బిడ్డ లీలావతారుడమ్మా
కరమునా కంకణమ్మా
ఈ బిడ్డ శిరము నాపించమమ్మా
శిరమునా పించమమ్మా
ఈ బిడ్డ వురమునా శ్రీవత్సవమ్మా
వురమునా శ్రీవత్సవమ్మా
ఈ బెడ్డ హరియనుచు బాడుడమ్మా"123

"లాలి మాధవుడ లాలీ
గోవింద లాలి అచ్యుతుడ లాలీ
లాలికేశవుడ లాలీ
హరిహరీ బాలరఘురామ లాలీ"124

అన్నమయ్య లాలిపాటలు :

అన్నమయ్య సంకీర్తనల్లో రెండు లాలిపాటలు కనిపిస్తాయి.

శ్రీరాగం - జంపె తాళం

లాలనుచు నూఁచేరులలన లిరుగడల
బాలగండవర గోపాల నినుఁజాల ॥పల్లవి॥

ఉదుటు గుబ్బల సరములుయ్యాల లూఁగ
పదిరి కంకణ రవము బహుగతుల మ్రోఁగ
వొదిఁగి చెంపల కొప్పు లొక్కింత వీఁగ
ముదురు చెమటల నళికములు తొప్ప దోఁగ ॥లాలి॥

సొంపుతెలి గన్నుగవ చూపులిరువంక
మలయు రవళులకు జలుమాఱును బెళంగ
కొలది కోవిలగములు క్రోలు మదనాంక
ముల గ్రేణి సేయు రవములు వడి దలంక ॥లా॥

సరసపదములు జలగ చాపుచే బాయ
గురులీల మీఁగాళ్ల గుచ్చెళ్ల రాయ
కరమూలముల కాంతి కడుఁజాయ జేయ
సరస సురకుసుమ వాసన లెదురు దాయ ॥లా॥

కొలఁది మనుమేను అతికూగలసియాడ
మెలఁకువతో నొక కొకరి మెచ్చిసరిగూడ
తలలూఁచి చొక్కిచిత్తరు బొమ్మలాడ
అలరి యెల్లరు మోహనాకృతులు చూడ ॥లా॥

లలిత తాంబూల రసకలితంబులైన
తళుకు దంతముల కెంపుల గుంపు లీన
మొలక వెన్నెల దాలు ముసురుకొని తోఁప
చెలఁగి నెలవుల ముద్దు చిఱునవ్వు లాన ॥లా॥

మలయ మారుత గతులు మాటికి జెలంగ
పలుకుఁగపురపు తావిపై పైమెలంగ
బలు గాన లహరి యింపుల రాల్పరగంగ
బలసి వినువారి చెవి బడలిక దొలంగ ॥లా॥

లలనాజనాపాంగ లలిత సుమచాప
జలజలోచన దేవసద్గుణ కలాప
తలపులోపల మెలఁగ తత్వప్రదీప
ఖశిర గండశేశ పరమాత్మ రూప ॥లా॥ (అ.చ.పే.పు. 68)

శంకరాభరణం

ఉయ్యాలా బాలునూఁచెదరు కడు
నొయ్య నొయ్య నొయ్యనుచు ॥పల్లవి॥

బాలయవ్వనలు పసిఁడి వుయ్యాల
బాలుని వద్దఁబాడేరు
లాలి లాలి లాలి లాలెమ్మయెల్ల
లాలి లాలి లాలి లాలనుచు ॥ఉయ్యా॥

తమ్మి రేకుఁగనుఁదమ్ముల నవ్వల
పమ్మిఁజూపులఁబాడేరు
కొమ్మలు మట్టెల గునుకుల నడపుల
దిమ్మి దిమ్మి దిమ్మనుచు ॥ఉయ్యా॥

చల్లుఁజూపుల జవరాండ్లు రే
పల్లె బాలునిఁబాడేరు
ఇల్లిదు వేంకటపతిఁజేరి యందెలు
ఘల్లుఘల్లు ఘల్లనుచు ॥ఉయ్యా॥ ( 12-246 )

మొదటి లాలి పాటతో పల్లవి ఎత్తుగడలో 'లాలనుచు' అనే మాట కనిపిస్తుంది ఈ పాటలో ఉయ్యాలవూస్తూ లాలిపాడుతున్న ప్రౌఢాంగనల సౌందర్య వర్ణనలు, వారి విలాస చేష్టాదులు వర్ణించబడ్డాయి. ఈ లాలి పాట గండవరంలోని గోపాలుని వుద్దేశించి నిర్దేశాత్మకంగా పాడినట్లు తెలుస్తుంది.

రెండవ లాలిపాట ఎత్తుగడలో 'లాలి' అనే మాట కనిపించదు. మొదటి చర ణంలోని రెండు పాదాల్లో 'లాలి' అనే మాటలు ఆవృత్తి అయ్యాయి. ఈపాట ఎత్తు గడ 'ఉయ్యా' అనే మాటతో ప్రారంభమయినా చరణాల్లో 'లాలనుచూ' ఉయ్యాల వూపడం స్పష్టమవుతుంది. కాబట్టి ఈ పాటను లాలి పాటగా పేర్కొనడం జరిగింది ఈ పాట రేపల్లె బాలుని వుద్దేశించి పాడినట్లు తెలుస్తుంది. ఈ పాటలో బాలయవ్వను లయిన స్త్రీలు లాలి పాడడం వర్ణించబడింది. ఈ పాటలో నాట్య సంబంధమయిన 'ధిమ్మి ధిమ్మి' 'ఘల్లు ఘల్లు' అనే శబ్దాల సంయోజనం కనిపిస్తుంది. ఈ రెండు పాటల్లోను శ్రుతిలలితమయిన 'ల' కారశబ్దావృత్తి కావడం విశేషం.

### 3. 3. 19 జోల పాటలు :

పిల్లల్ని నిద్రపుచ్చడానికి తల్లులు జోకొడ్తూ పాడే పాటలు జోల పాటలు. జోల పాటల ప్రసక్తి ప్రాచీన గ్రంథాల్లో కూడా కనిపిస్తుంది. పాల్కురికి సోమ

నాథుడు బసవ పురాణం (పు. 68)తో "జోసజుచుచు" పాడే జోల పాటల్ని పేర్కొన్నాడు. పోతన భాగవతంలో స్త్రీలు చిన్నిపాపడయిన కృష్ణునికి శాస్త్రోక్తపద్ధతిలో తలస్నానాదులు ముగించిన తర్వాత దీపిస్తూ జోల పాడడం కనిపిస్తుంది.

జోజోకమల దళేక్షణ
జోజోమృగరాజ మధ్య ॥జోజోకృష్ణ॥
జోజోపల్లవ కరపద
జోజో పూర్ణేందు వదన జోజోయనుచున్"

(పూర్వభాగం, పద్యం 190)

ఇల్లిందల సరస్వతీ గారు—

"జోల పాటలకు గానఫణతి, సరళత్వము రాగధోరణి ముఖ్యాలు ఈ పాటల్లో సాధారణంగా ఎత్తుగడలో గాని, చరణంలో చివరగాని, 'జోజో' అనే మాట పునరుక్తమౌతుంటుంది...... ఈ పాటలు ద్వారా విజ్ఞాన బోధ, తత్వబోధ కూడా జరిగినట్లు తెలిస్తున్నది నిద్రపొయ్యే మనస్సుశాంతిని కోరతుందనీ, గాఢసుషుప్తిలో ఏకత్వసుఖము, శాంతి ఉంటాయి. కనుక ఆ సమయంలో బిడ్డల ఆత్మను ప్రబోధిస్తూ దేహధారియై జీవుడు పరమాత్మలోని ఒక అంశమని, కర్తవ్యము నిర్దేశిస్తూ గానము చేయుట ఆచారమయినది. అదిగాక బిడ్డలు నిద్రించేటప్పుడు గాలి ధూళి బిడ్డలకు సోకకుండాను వారి అంతః కరణమును ప్రజ్వలింప జేయదానికి కూడా ఈ పాటలు తోడ్పడ్తాయి. అందుకొరకే వీరగాథలు ఈ పాటల్లో యిమిడి వున్నాయి"[125] అని పేర్కొన్నారు.

ఆచార్య బి రామరాజుగారు —

"గృహస్త్రీ కవనమున జోలపాటలు ముఖ్యములు. ఇవి శంకరాభరణం, నవరోజు, ఆనందభైరవి, శ్రీరాగము లందుండును,- ఇట్టివి పూర్వము నుండియు మన యక్షగానములందు వచ్చుచునే యున్నవి"[126] అని తెలియజేశారు.

అచార్య యస్వీ. జోగారావుగారు —

"ఇది తెనుగు దేశమున చిరప్రసిద్ధమైన పాట. ఇది ఊయెల పాటయును గనుక సంస్కృత 'డోలా' శబ్ద భవమని యొకరి అభిప్రాయము. (హిందీ తద్భవము ఝూలా) జో అను ఊత మాటకు బహువచన రూపమని మరియొకరి అభిప్రాయము,

'లాలి' వలె నిది కేవలమూయెలపాటయే కావక్కరలేదు. ఎక్కడ పడున్న పిల్లల నైనను నిద్రపుచ్చునపుడు పాడబడునదగుటయే దీని లక్షణము. జోకొట్టుటకు నిదుర పొయని, వీపు తట్టుటయని యర్థము...... జోలపాట సర్వ సాధారణముగా జంపె గతితో నడచునట్టిది"127 అని వెల్లడించారు.

కల్లూరి వీరభద్రశాస్త్రిగారు —

"పవ్వళింపు సేవలో ఉయ్యాల నూచుచూ పాడునది లాలి యనియు, జోకొట్టుచూ పాడునది జోలపాట యనియు, కొద్దిభేదము. జోలయందు కేవల విశేషణ ములే యుండును"128 అని భావించారు.

లోక వ్యవహారంలోని జోల పాటలు :

జో జో మహాదేవి శ్రీనామ నగరా
రాజవై భక్తులను పాలించు త్రిపురా ॥జో జో॥
నూత్న చింతమణి సామమును బూనూ
పత్నిసమేతుడై సురలు గెలువగనూ ॥జో జో॥

నవరత్న ఖచితమైనట్టి వుయ్యాలనూ
అవిరళంబున మల్లెపూల పాన్పుననూ
రంగుగా గోమూత్ర బ్రహ్మచారికినే
సంగతిగ ఇష్టదైవత వనుచు కొన్ని
సంగీతతాళ వాద్యముల పాడితినీ
అంగజుని మాత వినవే రామకపినీ ॥జో జో॥129

"జో అచ్యుతానంద జోజో ముకుందా
రార పరమానంద రామగోవిందా
తొలుత బ్రహ్మాండంబు తొట్టిగావించీ
నాలుగూ వేదములు గొలుసులమిరించీ
బలువైన ఫణిరాజు పానుపమరించీ
చెలియ డోలికలోన చేర్చిలాలించీ ॥జో జో॥130

"పట్టపు బాపితి పాటి
పటలింగి నిస్పురుహూడా
పరమాత్ముడ భద్రసేనుడ
పరమ దయాళుడ రామా ॥జో జో॥

జో కృష్ణ పరమా మందార
పాద రవింద ముకుందా
గరుడా నిర్మల శయ్యా
గజేంద్ర శ్రీవరదా
గజములు పంపంగ పాపంగా
గజలో శ్రీవరదా ॥జో జో॥

అభయం వాపిలి పాడీ
అభయం శ్రీలక్ష్మికిని
అభయం శ్రీరఘురాముడికి ॥జో జో॥131

ఈ జోల పాటలు కన్నడంలో కూడా కనిపిస్తాయి. కన్నడ దేశంలో బిడ్డను పన్నెండవ దినం తొట్టిలో వేసి పేరు పెడతారు. అప్పుడు ఉయ్యాల పూస్తూ జోల పాట పాడుతారు. దేవుళ్ళందరూ ఆ సమయంలో గుర్తొస్తారు.

"శండిగి తళదళ దల్లి సంగమ్మన తళ
శంభోమహాదేవ ఇందు దయనాగా ॥జో జో॥

భంగారతొట్టిల దొరితాయి కుందల
సింగర దాన శ్రీకృష్ణన ఛందాగి తూగారి ॥జో॥

కాదు బందెవు ఓణి నెరెదు బండితు మంది
బందు నింతారవ్వ కన్నిఘుత్తై ద్యాటు ॥జో॥132

అన్నమయ్య జోల పాటలు :

అన్నమయ్య సంకీర్తనల్లో రెండు జోల పాటలు కనిపిస్తాయి. ఈ రెండూ కూడా శ్రీకృష్ణుని వుద్దేశించినవే.

రాగం - ఆటతాళం

జోచ్యుతానంద జోజో ముకుంద
రావె పరమానంద రామగోవింద ॥పల్లవి॥

నందునింటను జేరి నయము మీఱంగ
చంద్రవదనలు నీకు సేవ చేయంగ
వందముగ వారిండ్ల నాడుచుండగ
మందలకు దొంగ మాముద్దు రంగ ॥జోవ॥

పాలవారాశిలో పవళించినావు
బాలుగా మునుల కభయమిచ్చినావు
మేలుగా వసుదేవు కుదయించినావు
బాలుఁడై యుండి గోపాలుఁడైనావు ॥జోవ॥

అట్టు గట్టిన మీగ డట్టె తిన్నాడే
పట్టికోడలు మూతిపై రాసినాడే
అట్టె తినెనని యత్తయడుగ విన్నాడే
గట్టిగా నిది దొంగ కొట్టుమన్నాడే ॥జోవ॥

గొల్లవారిండ్లకును గొబ్బున బోయి
కొల్లలుగా త్రావి కుండలను నేయి
చెల్లునా మగవాండ్రఁ జెలగి యీశాయీ
ఒల్ల తనములు సేయఁ జెల్లునట వోయి ॥జోవ॥

రేపల్లె సతులెల్లఁ గోపంబు తోను
గోపమ్మ మీకొడుకు మాయిండ్లలోను
మాపుగానే వచ్చి మామానములను
నీపాపడే చెఱిచె నేమందు మమ్మ ॥జోవ॥

ఒకని యాలినిఁ దెచ్చి వొకని కడబెట్టి
జగడములు గలిపించ సతిపతుల బట్టి
పగలు నలు జాములను బాలుఁడై నట్టి
మగనాండ్ర జేపట్టి మదనుఁడైనట్టి ॥జోవ॥

అంగజుఁగన్న మా యన్న యిటు రారా
బంగారు గిన్నెలోన పాలుపోసేరా
దొంగనీవని సతులు పొంగుచున్నారా
ముంగిట నాడరా మోహనాకార ॥జో॥

గోవర్థనం బెల్ల గొడుగుగాఁబట్టి
కావరమ్మున నున్న కంసుఁబడగొట్టి
నీవు మధురాపురము నేల జేపట్టి
ఠీవితో నేలిన దేవకీ పట్టి ॥జో॥

అంగుగా దాళ్ళపాకన్నయ్య చాల
శృంగార రచనగాఁజెప్పెనీ జోల
సంగతిగ సకల సంపదల నీవేళ
మంగళము తిరుపట్ల మదన గోపాల ॥జో॥

(అ. న పి పు. 61)

దేసాళం

జోజోయని మీరు జోలపాడరో
సొజపు జయంతి నేడే సఫల మిందరికి ॥పల్లవి॥

అదె చంద్రోదయమాయ హరియవతారమందె
మొదల జాతకర్మములు సేయరో
అదన పుత్రోత్సవమట పుణ్యాహము చేసి
కదిసి యిట్టె నామకరణము జేయరో ॥జోజో॥

కాయము దేవకి కిచ్చి గక్కన వాసుదేవుని
కీయరో గంధాక్షతలిట్టు వీడేలు
కాయకపు గాడిదెకు కవణము వెట్టి మరి
పీయపు చట్టాలెల్ల వీడు వెట్టరో ॥జోజో॥

షోడశోపచారముల జొక్కెనిదె శ్రీవేంకటేశుఁ
బాడరో ధర్మము నిల్పె బారమణఁచె

వోడించె గౌరవ దానవుల గంసాదుల జంపె
ఆడనే పాండవుల గాచెనని యర్ఘ్యమియ్యరో ॥జోజో॥ (9-172)

మొదటిది తిరుపతి మదన గోపాలుని మీది జోలపాట. రెండవది కృష్ణ జయంతికి సంబంధించిన జోలపాట. మొదటిది మదన గోపాలునికి జరపబడే పవ్వళింపు సేవ పాట కావచ్చును. కాని రెండవ దానిలో సాజపు జయంతి అనడం వల్ల ఇది నిర్దిష్టదినంలోనే పాడే పాటగా చెప్పవలసివుంది. అందువల్లనే 'ఆడనే పాండవుల గాచెనని' అర్ఘ్యమియ్యరో అని అర్ఘ్య ప్రస్తావన చేయబడింది.

3. 3. 10. మంగళ గీతాలు :

'మంగళశబ్దానికి' శ్వశ్రేయసం శివం భద్రం

'కళ్యాణం మంగళం శుభం' అని అమరం. 'మంగళం సుఖం లాతీతి మంగళం' సుఖమునిచ్చునది మంగళం అలాగే ధనమ్మును పొందునది కూడా మంగళమని అర్థం.

వినోదోత్సవ శుభకార్యాదుల్లో స్త్రీలు పాడే మంగళగీతాలు. ఈ మంగళగీతం చాళుక్య సోమేశ్వరుని అభిలషితార్థ చింతామణిలో "ఉత్సవే మంగళగేయశ్చార్యా యోగి జనైస్తథా"133 అని చెప్పబడింది అంటే ఉత్సవ సందర్భాల్లో ప్రయుక్తమవుతాయని అర్థం.

ఆచార్య యస్వీ జోగారావుగారు —

"మంగళము, హారతి, ఆరతి అర్త్రాతికము, సివాళి, ధవళము మొదలగు బహు విధనామములతో బహుగతులతో నీరాజన ప్రయోజన పురస్సరమైన యీ గీతము బహు యక్షగానములందు బ్రయుక్తమైనది. సామాన్యముగా షష్ట్యంతముగను, పాదాద్యంతముల మంగళ శబ్ద పురస్సరముగను ఉండును"134 అని అభిప్రాయపడ్డారు.

కృష్ణశ్రీగారు —

"పురుషుడు భావనాబలము వల్ల తన (యింటి) అనుభవాల్ని పెంచి అతిలోక దృశ్యాల్ని నిర్మిస్తాడు. స్త్రీ తన అభిమాన బలము వల్ల స్వర్లోక వాతావరణాన్ని తన యింట్లో కుప్పపోయుస్తుంది. మంగళ గీతాల్లో ఈ ప్రయత్నమే చక్కగా గోచ

రిస్తుంది... ప్రేమా, భక్తి అనే అందపు భావాల సమ్మేళనం వల్ల ఆవిర్భవించిన ఈ మంగళ గీతాలు ఏయింటిలో పాడినా అక్కడి కక్కడ చక్కగా అమరిపోతాయి. కనుక వీటిలో సార్వజనీనతదే ఎక్కువ పాలు. ఇక ఈ ఉత్సవమూ వినోదమూ తన యింటివి. ఎదురుగా ఊయెలా, గొలుసులూ, పానుపూ, చలువ మడతలూ, పాపడూ తన స్వంతము. వీటన్నిటి వల్లో ఆ పాటకి ప్రత్యేకత వాస్తవికత సమకూరు తుంది."135 అని తెలియజేశారు.

## పై అభిప్రాయాలవల్ల తేలిన అంశాలు :

ఈ పాటల్లో ఎత్తుగడలోగాని పాదాంతల్లోగానీ 'మంగళం' అనేమాట ఆవృత్తి కావడం మొదటి లక్షణం. వీటిని ఉత్సవ సందర్భాల్లోను, తదితర శుభకార్యాదుల్లోను పాడతారనడం రెండవ లక్షణం. ఇవి షష్ట్యంతాలుగ వుండడం మూడవ లక్షణం.

## లోక వ్యవహారంలోని మంగళ గీతాలు :

"అంబా జేకొను మంగళం
జగదంబా జేకొను మంగళం
వాసుబింబాదరి సతతంబు జేసెడి" ॥అంబా॥

మించూ చందురుగాంచు హాస్యము
వెంచూ మోము జూపించు ప్రొక్కెద ॥అంబా॥

వైరీ గణ సంహారీ నీవు యీసారి నాతోటి గరిశాయక ॥అంబా॥
మాతా లోక విఖ్యాతా వేద సిద్ధతా
రామా కవి హృదయ ధామా
రామా నేజేతు ప్రేమ మీవ్వాళ
అంబా జేకొను మంగళం"136

"మా గోప బాలునకు మంగాళ మనరె
శ్రీగోప బాలునకూ మంగాళ మనరె
పొందుగ మావంటి మందమతులా నెల్లా
నందముతో బ్రోచు నందానందనుడై ॥మాగోప॥

మురుగడలను భామా యిద్దరితో గూడి
మరపుల వారి పీలమేఘమయ నామించు ||మాగో||

"వరాల తంత్రికి మంగళం
మా వజ్రాల తంత్రికి మంగళం
బిరాన కరివదు మొరాలించిన
ముద్దుల మురారి తంత్రికి మంగళం ||వరాల||

"భూవలయమున జనులు
భావింపగా బలదేవి వలమేల్మంగ సేవింపగా
పావనమైన శేష పర్వాత మందు
వెలసిన శ్రీ వెంకటప్పనికి మంగళం" ||వరాల||138

తెలుగులో మంగళ గీతాలున్నట్లే కన్నడంలో కూడ మంగళ గీతాలున్నాయి

"యండావెన్నెల తేజోయాకార్తి
మంగళయూరా సాగే మంగాళం ||శివ||

లింగమూ హేళాగె మంగాళం మంగళ యారాసాగె మంగాళం
నిగమాతూ రంగాగె నిరుచి
నధిపతి చాపాగె నదా పాలాగె
గగన శిరోజాగె గణకూలార జాగె
ఖగకోడితె జాగె మంగళం"139

కన్నడ స్త్రీలు గౌరీపూజలాగే వరలక్ష్మీపూజ కూడా చేస్తారు. పూజా కార్యక్రమాదులు ముగిసిన తర్వాత మంగళం పాడుతారు.

"మంగళ జయవెన్ని మంగళ శుభవెన్ని
మంగాంగనె మహాలకుమి
కంగళుతెరెదు కటాక్షది నోడలు
ఇంగోదు సకల పాపగళు
బరడు కరెయతి బంజెగె మక్కళాగతి
కురుడగె కంగళుబరలి
ఖరహరియలి దారిద్ర్యగళింగలి
శ్రీహరి నమ్మహృదయ దొళరలి"140

అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

## అన్నమయ్య మంగళ గీతాలు :

అన్నమయ్య సంకీర్తనల్లో రెండు మంగళ గీతాలున్నాయి.

లలిత

మంగళము గోవిందునకు జయమంగళము గరుడధ్వజునకును
మంగళము సర్వాత్మునకు ధర్మ స్వరూపునకూ జయజయ
ఆదికిని నాద్యైన కచ్యుతున కంభోజనాభున
కాదికూర్మంబైన జగదాధార మూర్తికిని
వేదరక్షకునకును సంతత వేదమార్గవిహారునకు బలి
భేదికిని సామాదిగానప్రియ విహారునకు ॥మంగ॥

హరికిఁ బరమేశ్వరునకు శ్రీధరునకును గాలాంతకునకును
పరమ పురుషోత్తమునకును బహుబంధమాయనకు
సురముని స్తోత్రునకు దేవాసురగణశ్రేష్ఠునకు కమలా
కరునకుఁ గాత్యాయనీనుత కలితనామునకు ॥మంగ॥

పంకజాసన వరదునకు భవ పంకవిచ్ఛేదునకు భవునకు
శంకరున కవ్యక్తునకు సంశ్చర్య రూపునకు
వేంకటాచల వల్లభునకును విశ్వమూర్తి నీశ్వరునకును
పంకజాకుచ కుంభకుంకుమ పంకలోలునకు ॥మంగ॥ (1-46)

లలిత

చిత్తజగురుఁడ నీకు శ్రీమంగళం నా
చిత్తములో హరి నీకు శ్రీమంగళం ॥పల్లవి॥

బంగారు బొమ్మవంటి పడఁతి నురముమీఁద
సింగారించిన నీకు శ్రీమంగళం
రంగు మీఱఁ బీతాంబరము మొలఁగట్టుకొని
చెంగలించే హరి నీకు శ్రీమంగళం ॥చిత్త॥

వింతనీలముల వంటి వెలఁది నీపాదముల
చెంతబుట్టించిన నీకు శ్రీమంగళం

కాంతులకౌస్తుభమణిగట్టుక భక్తులకెల్లా
చింతామణివైన నీకు శ్రీమంగళం ॥చిత్ర॥

అరిది పచ్చల వంటి యంగన శిరసు మీద
సిరుల దాల్చిన నీకు శ్రీమంగళం
గరిమ శ్రీవేంకటేశ ఘన సంపదల తోడి
సిరివర నీకు నిదె శ్రీమంగళం ॥చిత్ర॥ (26-189)

ఈ రెండు పాటలు కూడా మహా విష్ణువునుద్దేశించినవే. మొదటి పాటలో మత్స్య, కూర్మ, వామన, కృష్ణావతార అంశాల్ని పేర్కొనడం, అనంత కల్యాణగుణ కీర్తన చేయడం విశదమవుతుంది. రెండవ పాటలో మహావిష్ణువు యొక్క వేష భూషణాదుల వైభవ ప్రశంస చేయబడింది. ఈ పాటలో 'బంగారు బొమ్మ వంటి పడతి నురము మీద సింగారించిన' 'అరిదిపచ్చల వంటి యంగన శిరసు మీద సిరులు దాల్చిన' అని వుండడం వల్ల స్వామి వారికున్న నాయికా ప్రేమానురాగం వ్యక్తమవుతుంది. మొదటి పాట ఎత్తుగడలో 'మంగళము' అనే మాట వుంది. రెండవ పాట పాదాంతాల్లో 'శ్రీమంగళం' అనే మాట ఆవృత్తి అయింది.

**జానపదగేయ వరుసలు - అనుసరణాత్మకాలు :**

ఇంతవరకు పరిశీలించిన మేలుకొలుపు మొదలయిన పాటలకు జానపదుల్లోను ప్రచారం వుంది. అన్నమయ్య సంకీర్తనలకు మూల ప్రాయంగా భావించ దగిన పాటలు జానపదగేయ రాశిలోను కనిపిస్తాయి.

అయితే అన్నమయ్య సంకీర్తనల్లో కనిపించే జానపద గేయరాశిలో కొన్నిటికి మాతృకలు కనిపించవు. అయినా ప్రసిద్ధ జానపదగేయధర్మాల పద్ధతిలోనే సాగు తుంటాయి. వస్తువు, ఆవృత్తి పదాలు, వాటి జానపదత్వాన్ని పట్టిస్తాయి. వీటిని జానపద గేయానుసరణ సంకీర్తనలని పేర్కొనవచ్చు. రాశిలో వాసిలో ఎక్కువగా కనిపించే బాలక్రీడా సంకీర్తనలు, దివ్యనామ సంకీర్తనలు వివిధ వృత్తులకు సంబంధించిన సంకీర్తనలు, కులవాచక గేయాలు ఉత్సవ కీర్తనలు ఈ విభాగంలో చేరతాయి.

### 3. 4. 1 బాలక్రీడా సంకీర్తనలు :

**అమరంలో 'బాల' శబ్దానికి వివరణ ఇలా వుంది—**

"బాలస్తుస్యాన్మాణవకః"
"ఆషోడశాబ్దా ద్బాలస్తు తరుణ ఉచ్యతే - ఇతి మనుః"
"బలతి అల్పాయాసేన బాలః బల ప్రాణనే"
"బాలం హ్రీబేర బర్హిష్టోదీచ్యం కేశామ్బునామచ"
"మూర్ఖే ర్భకే పిబాలస్స్యాత్"
"అథ బాలాస్యాః ద్యాసూః"
"స్త్రియత్వం శైశవం బాల్యం"

ఈ వివరణ బట్టి పదహారేండ్లకు లోబడిన వయస్సుగలవాడు, అల్పాయాసం చేత బ్రతికేవాడు కురువేరునామం, మూర్ఖుడు, పిన్నపడుచు పిన్నవాడు మొదలైన అర్థాల్లో బాలబాలా బాల్యశబ్దాలున్నట్లు తెలుస్తుంది.

భారతీయ సిద్ధాంతాల్ని బట్టి మానవ జీవితం నూరేండ్ల ప్రాయాన్ని బాల్య కౌమార యౌవన వార్ధక్యాలని నాలుగు విధాలుగా విభజించడం జరిగింది. కాని కొందరు బాల, యౌవన, కౌమార, వార్ధక్యాల క్రమన్ని చెబుతారు. భగవద్గీతలో కౌమార, యౌవన జరావస్థల క్రమమే చెప్పబడింది.

దేహినోఽస్మిన్ యథాదేహే
కౌమారం యౌవనం జరా
తథాదేహాన్తర ప్రాప్తి
ర్ధీర స్తత్ర న ముహ్యతి"

(శ్రీమద్భగవద్గీత) సాంఖ్య యోగం - 13.

ఈ అభిప్రాయం శంకరాచార్యుల —

"బాలస్తావత్క్రీడాసక్తః
తరుణస్తావత్తరుణీసక్తః
వృద్ధస్తావచ్చింతాసక్తః
పరమే బ్రహ్మణి కోఽపి నసక్తః"

అనే భజగోవింద శ్లోకం (7) వల్ల రూఢి అవుతుంది. మరీ బిడ్డను లాలించే విధానాన్ని గూర్చి ప్రసిద్ధమయిన శ్లోకం —

"రాజవత్పంచ వర్షాణి
దశవర్షాణి దాసవత్
ప్రాప్తేతు షోడశే వర్షే
పుత్రం మిత్ర వదా చరేత్"

ఈ శ్లోకంలో బాల. కౌమార, యౌవనావస్థల స్పష్ట నిర్దేశం లేకున్నాగాని వయః పరిమితి ఆ క్రమాన్నే సూచిస్తుంది.

ప్రాచ్యుల్లగానే పాశ్చాత్యులు మానవ జీవితంలోని దశల్ని వర్గీకరించారు. వారిలో బి హర్లాక్ (B Hurlock) ఎరిక్సన్ (Erikson) ఫ్రాయిడ్ (Freud) పియాజె (Piaget) ప్రముఖులు. మనస్తత్వశాస్త్రజ్ఞులు బి హర్లాక్ విశ్లేషణకు ప్రాధాన్యమిస్తారు. ఆమె దృష్టిలో మానవుని దశలు పదకొండు 141

ప్రసవానికి ముందుండే దశ జనన పూర్వదశ (Pre-natal stage) పుట్టుక నుంచి రెండో వారాంతం వరకు వుండే దశ నవజాతక శిశుదశ (Infancy stage) మూడవ వార ప్రారంభం నుంచి రెండు సంవత్సరాల వరకు వుండే దశ శైశవ దశ (Babyhood stage) మూడు సంవత్సరాల నుంచి ఐదు సంవత్సరాల వరకు వుండే దశ పూర్వబాల్యదశ (Early childhood stage) ఆరో సంవత్సరం నుంచి పదకొండో సంవత్సరం వరకు వుండే దశ ఉత్తర బాల్యదశ (late childhood stage) పన్రెండు నుంచి పదిహేను వరకు ఉండే దశ యౌవనారంభదశ (Puberty stage) పదమూడు నుంచి పదిహేడు వరకు ఉండే దశ కౌమారదశ (Adolescense stage) పదిహేడు నుంచి పద్దెనిమిది వరకు ఉండే దశ ఉత్తర కౌమారదశ (late adolescense stage) పద్దెనిమిది నుంచి నలభై వరకు వుండేదశ పూర్వకౌమార దశ (Early Adulthood stage) నలభై నుంచి అరవైవరకు వుండే దశ మధ్య వయోజనదశ (Middle age stage) అరవైనుంచి మరణం వరకు వుండే దశ వృద్ధాప్య దశ (Old age stage) అని బి. హర్లాక్ మానవుని దశల్ని విభజించినారు.

అన్నమయ్య సంకీర్తనల్లోని బాలక్రీడా సంకీర్తనల్ని రెండు విధాలుగా వర్గీకరించవచ్చు. మొదటిది పిల్లల్ని ఆడించేటప్పుడు తల్లిగాని, తదితరస్త్రీలుగాని పాడే పాటలు. రెండవది పిల్లలు తాము ఆడుకొనేటప్పుడు పాడుకొనే పాటలు.

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు

తల్లికి పిల్లవాడెంత పెరిగి పెద్దవాడయినా చిన్నవాడే. తల్లి ఆ పిల్లవాని యోగక్షేమాలనే కోరుతుంది. అమాయకుడని భావిస్తుంది. ఇంకా రెక్కలురానివాడని మనసులో తలపోస్తుంది పసివాడని ఆదరం చూపుతుంది. తన వాత్సల్యాన్ని కనబరుస్తుంది. ఈ దృష్టితోనే అన్నమయ్య బాలసంకీర్తనల్లో కొన్నిగోట్ల తనను తల్లిగా భావిస్తాడు గోపికగా తలపోస్తాడు. కృష్ణునివల్ల తాము పడ్డ పాట్లను ఏకరువు చేసి యశోద దగ్గర పిర్యాదు చేసే దానిలా అన్నమయ్య ఆక్రోశిస్తాడు. ఆళ్వారులల్లో మాతృవాత్సల్యాన్ని విస్తరించిన పెరియాళ్వారులాగా కృష్ణుని చేరి ఇతరుల్ని అదిలిస్తాడు కూడా.

## దేశాక్షి

ఏమిసేతుమమ్మ నేఁడు యశోదమ్మ
గామిడి తనములనే కడఁగీబాలుఁడు ॥పల్లవి॥

అందెలు మువ్వలు ఘల్లురనఁగ వీది వీదుల
నందుకవుట్లుఁ గొట్టీనదె బాలుఁడు
గొందివున్నఁ బోవీక కోలలు చాఁచి చాఁచి
పొందుగ దొంట్లు వోవఁజొకిచీ మీ బాలుఁడు ॥ఏమి॥

చుంగుల కాశతోడ సొరిది బాలులతోడ
ముంగిటివుట్లుఁగొట్టీ ముద్దు బాలుఁడు
అంగవించి గొల్లెతలు అడ్డములు రాఁగానే
యెంగిలిసేసీ మోవులు యిదిగో మీ బాలుఁడు ॥ఏమి॥

చొల్లెపుజెడ వీఁపున సోయగమై వేలఁగాను
చిల్లరవుట్లు గొట్టీఁజిన్నిబాలుఁడు
మెల్లనెసతులుదాను మేలములాడు కొంటా
ఇల్లిదె శ్రీవేంకటాద్రి యెక్కెను మీ బాలుఁడు" (27-386)

ఈ కీర్తన పాదాంతాల్లో 'బాలుఁడు' అనే మాట ఆవృత్తి అయింది.

బిడ్డఁడు :

భైరవి

ఏమీననకురే యెప్పుడు నీరు
గామిడియై కాలిపన్నుఁగదలీని బిడ్డఁడు
పొలసీఁననకురే పొడగి యిందరుఁగూఁడి
వులికి తలదీసుక వున్న బాలుని
పలుకఁదనకురే బలుమోరతో వుఁగోపి
తలఁకి నిబ్బితి గొ.. (నీఁదో) లరమ్మ బిడ్డఁడు (12-218)

ప్రళయ కాలంలో విష్ణువు శిశురూపుడై మర్రాకుపై పండుకొంటాడని పురాణాలు చెబుతాయి. నలువైపుల నీళ్లున్న రంగపట్టణం మర్రాకుగా కవికి కనిపిస్తుంది. ఆ మర్రాకుపై సాక్షాత్కరించినవాడు శ్రీరంగనాథుడు. అతడు శయన మూర్తియే. ఇక్కడ తల్లిగా అన్నమయ్య సాక్షాత్కరించాడు.

శిశువు :

మంగళ కైశిక

అబ్బురంపు శిశువు ఆకు మీఁది శిశువు
దొబ్బుడు రోల శిశువుత్ప్రి పిత్ప్రి పిత్ప్రివి
పుట్టు శంఖు చక్రములఁబుట్టిన యీ శిశువు
పుట్టక తొల్లే మాయ పుట్టువైన శిశువు
వొట్టుక పాలువెన్నలు నోలలాడు శిశువు
తొట్టెలలోని శిశువు తుప్రివి తుప్రివి తుప్రివి (12-220)

ఈ తుప్రివి అంతమందున్న పాటలు కన్నడంలో కూడా వున్నాయి. డా॥ కె సర్వోత్తమన్‌గారు— "అన్నమయ్య శ్రీపాదరాయలు, అన్నమయ్య పురందరదాసు' (పు. 32)లో శ్రీపాదరాయలవారి తుప్రివి పాటను వుదహరించారు.

"జగవను హొట్టె యొళింబిట్టె తుప్రిన్వి
జగవెల్ల నిర్మాణ మాడిదె తుప్రిన్వి

నిగమ గోచర నిత్యానందనె తుగ్రిన్వి
మగువెందు నావ్ తూగబల్లెనె తుగ్రిన్వి" (పు 167)

ఉగ్గుపాటలు :

ప్రాచీన సాహిత్యంలో ఉగ్గు ప్రసక్తి కనిపిస్తుంది పాల్కురికి సోమనబసవ పురాణంలో 'ఉగ్గులు వోసియు నవిద సంప్రీతిన్' (పు. 68) అని పేర్కొన్నాడు. పసిపిల్లలకు ఉగ్గు పెట్టేటప్పుడు పాడే పాటలు ఉగ్గుపాటలు. ఈ పాటల ఎత్తుగడలో 'ఉగ్గు' అనే మాట వుంటుంది. తల్లులు తమ బిడ్డలను విద్యనేర్పడమనేది ఉగ్గుపాట తోనే మొదలవుతుంది. బిడ్డను కాళ్ళపై పండబెట్టుకొని చిన్నగిన్నెలో కొంచెం ఆముదం, పాలు ఉప్పుగల్లు వేసి వాటిని రంగరిస్తూ శిశువును తనవైపు మరల్చుకోవడానికి ప్రయత్నిస్తుంది సహజంగా ఉగ్గు త్రాగడానికి పిల్లలు ఇష్టపడరు. అలాంటప్పుడు పాట పాడుతూ మచ్చిక చేసుకొని మెల్లగా త్రాగిపిస్తుంది ఉగ్గు పెట్టిన తర్వాత బిడ్డ చేతులు, కాళ్లు కుడి ఎడమలవైపు వంచి 'జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం' అని పాడి పొట్టనిమిరి జబ్బలు పట్టి పైకెత్తి వొడలో కూర్చుండబెట్టుకోవడమో లేదా వుయ్యాల్లో పండబెట్టడమో చేస్తుంది. పాల్కురికి సోమన బసవ పురాణంలో 'ఉగ్గులువోసియు నవిద సంప్రీతిన్' (పు. 68) అని ప్రసక్తి ఉగ్గు కనిపిస్తుంది.

లోక వ్యవహారంలోని ఉగ్గుపాటలు :

లోక వ్యవహారంలోని ఉగ్గు పాటల్ని రెండు విధాలుగా చెప్పవచ్చు. మొదటిది పిల్లలు మారాము చేస్తున్నపుడు తమవైపు త్రిప్పుకోవడానికి పాడేవి. రెండవది ఉగ్గు పెట్టిన తర్వాత అరగడానికి పాడేవి.

తమవైపు త్రిప్పుకోవడానికి పాడేవి :

'ఊకో ఉంగన్న
ఉగ్గుపాలు ఇందన్న
గుంటెడు ఉగ్గు కమ్మన్న
ఉమ్మక కక్కక మింగన్న" 142

'ఊగూ ఊగూ గంగెద్దా
ఉగ్గూ పాలే గంగెద్దా

సోలి ఊగే గంగెద్దా
సోలెడు పాలే గంగెద్దా
తాళీ ఊగే గంగెద్దా
తవ్వెడు పాలె గంగెద్దా
మారీ ఊగే గంగెద్దా
మానెడు పాలే గంగెద్దా
ఆగీ ఊగే గంగెద్దా
అడ్డెడు పాలే గంగెద్దా'143

ఉగ్గు పెట్టినతర్వాత పాడేవి :

'జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం
గుజ్జం తిన్న గుగ్గిళ్ళు జీర్ణం
ఏనుగు తిన్న ఎలక్కాయలు జీర్ణం'144

ఈ వరుసల్లో అన్నమయ్య పాటలు కనిపించకున్నా ఉగ్గు పెట్టే సంప్రదాయాన్ని విశదం చేసే సంకీర్తన వుంది.

భైరవి

ఉగ్గు పెట్టరే వోయమ్మా చె
య్యొగ్గినిదె శిశువోయమ్మా ॥పల్లవి॥

కడుపులోని లోకమ్ములు గదలీ
నొడలూచకురే వోయమ్మా
తొడికెడి సరుగ నందొలఁగఁదీయరే
వుడికెడి పాలివి వోయమ్మా ॥ఉగ్గు॥

చప్పలు వట్టుక సన్నపు బాలుని
నుప్పర మెత్తకురోయమ్మా
అప్పుడె సకలము నడిమీ నోరనె
వొప్పదు తియ్యరె వోయమ్మా ॥ఉగ్గు॥

తొయ్యలు లిటు చేతుల నలఁగించక
వుయ్యాల నిడరే వోయమ్మా
కొయ్యమాటలను కొండల తిమ్మని
నొయ్యని తిట్టకు రోరమ్మా ॥ఉగ్గు॥ (12 97)

ఈ పాటలో 'ఉగ్గు' అనే మాట పల్లవి ఎత్తుగడలో చెప్పబడింది. ఈ పాటలో తల్లి తన బిడ్డను భగవత్స్వరూపుడుగా భావించింది. ఉగ్గుకోసం తన బిడ్డ చేతులు చాస్తున్నాడు. బిడ్డకు ఉగ్గు పెట్టండి. పిల్లవాని వొళ్ళు పూచకండి. అలా పూస్తే కడుపులో వుండే లోకాలన్నీ కదలి పోతాయి. బిడ్డను పైకి విసరకండి. అలా విసరడం వల్ల సమస్తాన్నీ నోటితో చప్పరించేస్తాడు. బిడ్డను చేతుల్లో పెట్టుకొని నలపకా వుయ్యాల్లో పండబెట్టండి అని తోటి స్త్రీలకు ఆదేశించడం కనిపిస్తుంది.

దోబూచి :

చిన్న పిల్లలు ఆడుకొనే ఆటల్లో దోబూచి ఒకటి బూచి అనే మాటకి భూత మని అర్థం. తెలుగు సాహిత్యంలో బూచివాడు బూచిగాడు బూచి అనే మాటలున్నాయి.

పెద్దన స్వారోచిష మనుసంభవంలో 'బూచివోలెను న్న వాచంయముని మోము (4-32) అనే ప్రయోగముంది అల్లే బూచి లాగే కనిపించే కుక్క బూచిగాడని నామం. 'పులియడు బూచిగాఁడసుర పోతులరాజు' (4-80) అనే ప్రయోగముంది పిల్లల్ని భయపెట్టించే ఆకారం బూచి. 'ఇదిగో బూచి ఇదో బూచి' అని భయ పెట్టడం మనం చూడవచ్చు. ఈ పదజాలం ఉచ్చారణ త్వరలో లేదా శ్రవణంతో 'ఇ' తొలగిపోయి 'దోబూచి' అని వినబడుతుంది.

తల్లులు సాధారణంగా తమ కళ్ళకు అడ్డంగా చేతులుంచుకొని 'ఉండుంబూచీ' అంటూ ఉన్నట్లుండి కళ్ళు తెరచి బిడ్డల్ని ఆశ్చర్యపరుస్తుంటారు. ఇలాంటి క్రీడను 'దాగిలిముచ్చులాట' అంటారు. తల్లి దొంగ కళ్లు మూసినపుడు మిగతా పిల్లలు దాగు కొంటారు. దొంగ వాళ్ళను వెదకి పట్టుకోవడం ఆట. ఈ దాగిలి ముచ్చు లాటనే 'దోబూచి' ఆటగా చెబుతారు.

కన్నడంలో కూడా 'బూచి' పాటలున్నాయి. పురందరదాసులవారు యశోద చేత బూచి పాట పాడించారు.

'బూచి బంటదె రంగ బూచి బందిదె
చాచి కుడిదు నమ్మనే నీ పాటికోళ్ళ కృష్ణయ్య'

అనే పాటలో మూడుకళ్ళ బూచి, ఒళ్ళంతా కళ్ళున్న బూచి, ఆరుముఖాల బూచి చెట్టుమీద బూచీలు అని రకరకాలుగా గోకులంలోని పిల్లల్ని బెదరిస్తూ లాక్కెళుతున్నాయని వ్రాశాడు. ఈ బూచి పాటలో శివుడు, ఇంద్రుడు, సుబ్రహ్మణ్యేశ్వరుడు గరుత్మంతుడు మొదలయినవారు స్వామి సేవకు కాచుకుకూర్చున్నారనే విశిష్టార్థం వ్యంగ్యాంతరంగా పేర్కొనబడింది.

అన్నమయ్య సంకీర్తనల్లో దోబూచి పాట :

ధన్నాశి

బండి విరిచి పిన్నపాపలతో నాడి
దుండగీడు వచ్చె దోబూచి ॥పల్లవి॥

పెరుగు వెన్నలు ప్రియమున పే
మరు ముచ్చిలించు మాయకాడు
వెరవున్నా (పున?) దన విధము దాచుకొని
దొరదొంగ వచ్చె దోబూచి ॥బండి॥

పడుచు గుబ్బెత పరపువై పోక
ముడి గొంగు విడ్చి సుంపునను
వడియుదా(?) వద్దబపళించినట్టి
తొడుకు దొంగ వచ్చె దోబూచి ॥బండి॥

గొల్లపల్లెలో యిల్లిల్లూ చొచ్చి
కొల్లాలాడిన కోడెకాడు
యెల్లయిన వేంకటేశుడు ఇదె
తొల్లిటి దొంగవచ్చె దోబూచి ॥బండి॥ (12-227)

ఈ పాటలోని ప్రతి చరణాంతంలోను 'దోబూచి'. అనే మాట ఆవృత్తి అయింది. ఇందు గోప బాలుడు పెరుగు వెన్నలు దొంగిలించడం గోప భామినుల్ని

అల్లరి పెట్టడం మొదలయిన బాల్యక్రీడా విలాసాలు వర్ణించబడ్డాయి కూగూగు: బాల క్రీడల్లో దోబూచి లాంటిదే కూగూగు. ఈ శబ్దవిన్యాసం దొంగల్ని పట్టుకొనే ఆటల లోను, కోతికొమ్మచ్చి ఆటల్లోను నేటికీ వినబడుతుంది.

ఎవరయినా దేన్నయినా ఎలుగెత్తి పిలిచేటప్పుడు మూడుసార్లు మంద్ర, మధ్య, తార స్థాయిల్లో హెచ్చించి చెప్పడం వాడుకలో వున్నదే. 'పెరుగు, పెరుగు పెరుగో' అనడం దీనికి చక్కని వుదాహరణ.

డా॥ వేటూరి ఆనంద మూర్తి గారు-

"కోతి కొమ్మచ్చు లాడుకొనునపుడు బాలుర నేటికినీ 'గుగ్గుగూ కొమ్మంచు' ఇత్యాదిగా కొన్ని యూతపదములను బలుకుచుండుట కలదు. ఆయూత పదముల కర్థము 'అడుగడుగో కొమ్మంచున్నాడు' అనియే.

అడుగడుగో అను పదమే 'గోగోగో', గగ్గూగూ, కూగూగూగా కాలాంతర మున నేర్పడినట్లున్నది. ఆటలలో దొంగ లితరులను బట్టబోవునపుడు తటిమి తటిమి 'అగ్గో' అని చూపవలసినపుడు 'గూగూగూ' అను నూతపదమును ప్రయోగించు చుండుట పరిపాటియే...... ఈ పదమును ద్వార దొంగయైనవాడు గుడిలో దాగిన బాలకృష్ణుని 'అడుగడుగో' అని రెట్టించి పట్టబోవు సందర్భముననే పలికినట్టుగా 'కూగూగూ' అను నూతపదము చేరియున్నది"[145] అని అభిప్రాయపడ్డారు.

కన్నడంలో 'కూగు' అంటే పిలువమని అర్థం. కూగు + ఊగు 'కూగూగు' పిలుస్తుంటే కనబడకుండా అడ్డుపెట్టుకొని లేదా అడ్డంగా మరొక వస్తువో లేదా జంతు జాలమో వుంటే వాటివెనక దాక్కోవడం, అటు ఇటూ ఊగుతూ పట్టుకు దొరకక పోవడం కూడా కావచ్చు.

శంకరాభరణం

గుఱు తెలిగిన దొంగ కూగూగు పిడె
గుడిలోనె దాగేని కూగూగు ॥పల్లవి॥

నెలతల జోచేసి సీళ్లాద గానె
కొలని దరిని దొంగ కూగూగు

బలువైన వుట్ల పాలారగించేని
కొలంది వీడిన దొంగ కూగూగు
చల్లలమ్మంగ చనుకట్టు దోడికేసి
గొల్లెతలను దొంగ కూగూగు
యిల్లిల్లు దప్పక యిందరి పాలిండ్లు
కొల్లలాడిన దొంగ కూగూగు

తావు కొన్న దొంగఁదగిలి పట్టుండిదె
గోవులలో దొంగ కూగూగు
శ్రీవేంకటగిరి చెలువుండో యేము
కోవిదుఁడగు దొంగ కూగూగు (4-56)

ఈపాట పాదాంతాల్లో 'కూగూగు' అనె మాట ఆవృత్తి అయింది ఇందులో బాలకృష్ణుడు గోపికా స్త్రీలను మారాము చేయడం, వాళ్ల ఇళ్ళలోని వుట్లపై వుండే పాలు, పెరుగులు ముచ్చిలించడం మొదలయిన చిలిపి చేష్టలు చెప్పబడ్డాయి. గుడిలో దాగడం, సిగ్గాడడం. వుట్ల పాలారగించడం, గోవులలో దొంగ, మొదలయిన పదాల్లో ఊగడం' అనే అర్థం స్ఫురిస్తుంది

## 3. 4. 2 దివ్యనామ సంకీర్తనలు :

భగవంతుని నామమొక్కటే దివ్యనామం. ఇలాంటి నామాలు పాదాంతంలో గాని లేదా చరణాంతంలో గాని వుంచి భక్తులు సామూహికంగా కీర్తించడానికి అనువయినవి దివ్యనామ సంకీర్తనలు. ఇవి చతుర్వింశతి నామాలు కావచ్చు. స్తుతి పూర్వకంగావచ్చు, పిటిపల్ల కథను క్రమంగా చెప్పవచ్చు, లేదా నీతిని బోధించవచ్చు. అయినా పాటన్నిటిలోను దైవనామం చివర వుండడం ప్రధాన లక్షణం. అది సంబోధనాంతం కావచ్చు లేదా నిర్దేశాంతం కావచ్చు.

పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో 'శంకరపదాలు' (518) చెప్పాడు

ఆంధ్ర వాగ్గేయకారుల్లో ప్రథముడని చెప్పదగ్గ కృష్ణమాచార్యులు రామ నృసింహ నామాలు వ్రాసినవాడే.

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

రామనామాలు :

దశరథాత్మజ రామారామా
ధన్యచరిత్రా రామారామా
భరతాగ్రజ రామారామా
పంకజేక్షణా రామారామా
మిత్ర తేజా రామారామా
సౌమిత్రి వరదా రామారామా
శత్రు భీషణ రామారామా
శత్రుఘ్న సేవక రామారామా"146

నృసింహనామాలు:

వేదరాశి తుదను వెలుగు విశ్వభర్త శ్రీనృసింహ
ఆదిదేవ నీ చరిత్ర మద్భుతంబు శ్రీనృసింహ
వాఁడి సురల కమృతమిడఁగ వలసి సోలసి శ్రీనృసింహ
పోఁడిమిగను నీవు పూవుబోఁణివైన శ్రీనృసింహ
నిండుమది పవిత్రులందు నిలిచియున్న శ్రీనృసింహ
పుండరీక నేత్ర భూతభక్త శ్రీనృసింహ"147

లోకవ్యవహారంలోని భగవన్నామాలు :

ఈశ్వరాత్మకాలు :

ఈశ్వరా పరమేశ్వరా జగదీశ్వరా కరుణింపరా
శాశ్వతుఁడవని వేఁడితిని విశ్వాసముంచర యీశ్వరా
ముందు జేసిన పూర్వకృతముఃల ఇందుబాపుము యీశ్వరా
పొందుగా మీ పాదపద్మము పెండియుంటిని యీశ్వరా
కపట విద్యలు నేర్చి పొట్టగడుపుచుంటిని యీశ్వరా
నెప్పములెన్నక నన్ను నీ కృపనేలు మీ పరమేశ్వరా
అపగురు శత్రులునాపై కూరిరమెందిరి యీశ్వరా

పరమమంత్రము చేత శత్రులనణచవలె పరమేశ్వరా
... ... ... ...
చంకిదుద్దెమకింకరులకు జంకనేరను యీశ్వరా
అంకమందున జెప్పి సద్గురు శంక దీర్చర యీశ్వరా"148

రామనామాలు :

పాల సముద్రం మీద గోవిందరామ
భద్రాద్రీశయనూ గోవిందా
శేషపానుపు మీద రామ
లక్ష్మితో పవళించె గోవిందా
ఆదిలక్ష్మిదేవి గోవిందా రామా
శిరసు చక్కగబెట్టె గోవిందా 149

ఒకనాడు రాముడు వశిష్ఠుని బిలిచి ఒక ప్రశ్న యడిగెనె ఓ రామా
తన్నుత దెలిసితె అన్యవ్యత్తేమిటికి అది నాకు తేలుసునూ ఓ రామా
స్ఫటికంపు రాయి సాగరంబులోబడి తావుదకమాయెనే ఓ రామా
అటువలెనె తన మనసు శివుని ధ్యానము చేసి శివుకందు కలిసె ఓ రామా!150

కృష్ణనామాలు :

'అజ్ఞానదేహమ్ము యెరుగకా యున్నాను పొంగుతువున్నాను చెప్పుమా కృష్ణా
అగ్గలంబగు కామ క్రోధములచేత మగ్గుతున్నాను చెప్పుమా కృష్ణా
ఎంత తరుగనట్టి మదమచ్చరములచే బాధింపుచున్నాను చెప్పుమా కృష్ణా
ఊసరవెల్లివలె భూషణాదుల చేత పోషింపుచున్నాను చెప్పుమా కృష్ణా' 151

చతుర్వింశతి నామాలు :

వ్యూహాలంటే పరమాత్ముని విశేష రూపాలు ఇవి ప్రపంచ సృష్టి స్థితి లయార్థం కోసం, ఉపాసకానుగ్రహార్థం కోసం, నిజేచ్ఛావసరం కోసం గైకొన్న రూపాలు. వైఖానస పాంచరాత్రాగమాలు జీవకోటిని వుద్ధరించడానికి పరాస్వరూపమే వ్యూహరూపాల్ని పొందాయని వివరించాయి. పాంచరాత్రంలో పరావాసుదేవుడే వ్యూహవాసుదేవుడవునని వుంది. శుద్ధస్ఫటికాకారం వున్న ఈ వ్యూహవాసుదేవుడే

మళ్లీ సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధరూపాల్ని కూడా పొంది జీవాత్మల్ని తరింప జేస్తాడు. ఈ నాలుగు రూపాలనే చతుర్వ్యూహాలంటారు ఇనే కాక అవాంతర వ్యూహాలు కూడా వున్నాయి.

చతుర్వింశతి నామాలు వరుసగా కేశవుడు, నారాయణుడు, మాధవుడు, గోవిందుడు, విష్ణువు, మధుసూదనుడు, త్రివిక్రముడు, వామనుడు, శ్రీధరుడు, హృషీకేశుడు, పద్మనాభుడు, దామోదరుడు, సంకర్షణుడు, వాసుదేవుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, పురుషోత్తముడు, అధోక్షజుడు, నారసింహుడు, అచ్యుతుడు, జనార్ద నుడు, ఉపేంద్రుడు, హరి, శ్రీకృష్ణుడు అనే ఇరవైనాలుగు విష్ణునామాలు. అన్నమయ్య ఇటువంటి విశ్లేష రూపాలయిన వ్యూహాల్ని ఏక కీర్తనలో సు శ్లాఘించినవి వున్నాయి.

భూపాళం

ఇవియె పో ప్రద్యుమ్న యిహపరసాధనము
భవ జలధుల తేప పరమ యోగులకు ॥పల్లవి॥

వామన గోవింద విష్ణువాసుదేవ హరి కృష్ణ
దామోదరాచ్యుత మాధవ శ్రీధరా
నీమహిమ గానలేము నిన్నెంచగలేము
నామ జపమే చాలు నాలుక (కు?) సులభము ॥ఇవి॥

అనిరుద్ధ పురుషోత్తమాధోక్షజ ఉపేంద్ర
జనార్ధన కేశవ సంకర్షణా
నిను దలంచగలేము నిన్ను దెలియగలేము
ననువై నీనామమె నోటికి సులభము ॥ఇవి॥

నారాయణ పద్మనాభ హృషీకేశ
నారసింహ మధుసూదన త్రివిక్రమ
నీరూపు భావించలేము నిక్కపు శ్రీవేంకటేశ
అరయ నీనామ జపమన్నిటా సులభము (11-1-10)

ఇందు వరుసగా ప్రద్యుమ్న, వామన, గోవింద, విష్ణు, వాసుదేవ, హరి, కృష్ణ, దామోదర, అచ్యుత, మాధవ, శ్రీధర, అనిరుద్ధ, పురుషోత్తమ, అధోక్షజ ఉపేంద్ర, జనార్ధన, కేశవ, సంకర్షణ, నారాయణ, పద్మనాభ, హృషీకేశ, నారసింహ, మధుసూదన. త్రివిక్రమ, మొదలయిన ఇరవైనాలుగు పరావాసుదేవుని విశ్లేషరూపాలయిన వ్యూహాలు వర్ణించబడ్డాయి. ఇవిగాక చతుర్వింశతి నామాల్లో ఉపేంద్ర, సంకర్షణ, అనే రెండు పేర్లు తప్ప తక్కిన ఇరవైరెండు నామాల్ని పేర్కొనే ప్రత్యేక కీర్తనలు. అన్నమయ్యలో ఒక చోటనే కనిపిస్తాయి. బహుశః ఈ రెండు నామాలున్న కీర్తనలు రాగిరేకుల్లో లుప్తమైపోయి వుండవచ్చు. లేదా ఆ రేకులు కనబడకనో పోవచ్చు. ఆ పాటలుగల రేకులు ఎవరయినా కరిగించి వుండవచ్చు.

కేశవా :

కిందుపడి మొక్కెకుమీ కేశవా
కెందమ్మి రేకుంగన్నుల కేశవా॥
కీలుబొమ్మ వింతలోనే కేశవా రతి।
కేళికెమాయాడకేకా కేశవా
గేలిసేసే వేల మమ్ము కేశవానీ
కీలు నాచేత నున్నది కేశవా॥ (2-242)

నారాయణా :

నిగమ నిగమాంత వర్ణిత మనోహర రూప
నగరాజ ధరుఁడ శ్రీనారాయణా ॥పల్లవి॥
దీపించు వైరాగ్యదివ్య సౌఖ్యం బియ్య
నోపకకదా నన్ను నొడఁబరపుచు
పైపైనె సంసార బంధములఁగట్టేవు
నాపలుకు చెల్లునా నారాయణా ॥నిగ॥ (1-249)

మాధవా :

మాంటికి రావోయి మాధవా॥
మాయలెల్లఁగంటిమిదే మాధవా।

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు

ఇందు వరుసగా ప్రద్యుమ్న, వామన, గోవింద, విష్ణు, వాసుదేవ, హరి, కృష్ణ, దామోదర, అచ్యుత, మాధవ, శ్రీధర, అనిరుద్ధ, పురుషోత్తమ, అధోక్షజ ఉపేంద్ర, జనార్ధన, కేశవ, సంకర్షణ, నారాయణ, పద్మనాభ, హృషీకేశ, నారసింహ, మధుసూదన, త్రివిక్రమ, మొదలయిన ఇరవైనాలుగు పరావాసుదేవుని విశ్లేషరూపాలయిన వ్యూహాలు వర్ణించబడ్డాయి. ఇవిగాక చతుర్వింశతి నామాల్లో ఉపేంద్ర, సంకర్షణ, అనే రెండు పేర్లు తప్ప తక్కిన ఇరవైరెండు నామాల్ని పేర్కొనే ప్రత్యేక కీర్తనలు. అన్నమయ్యలో ఒక చోటనే కనిపిస్తాయి. బహుశః ఈ రెండు నామాలున్న కీర్తనలు రాగిరేకుల్లో లుప్తమైపోయి వుండవచ్చు. లేదా ఆ రేకులు కనబడకనో పోవచ్చు. ఆ పాటలుగల రేకులు ఎవరయినా కరిగించి వుండవచ్చు.

కేశవా :

కిందుపడి మ్రొక్కేకుమీ కేశవా
కెందమ్మి రేకుంగన్నుల కేశవా॥
కీలుబొమ్మ వింతలోనే కేశవా రతి।
కేళికెమాయాడకేకా కేశవా
గేలిసేసే వేల మమ్ము కేశవానీ
కీలు నాచేత నున్నది కేశవా॥ (2-242)

నారాయణా :

నిగమ నిగమాంత వర్ణిత మనోహర రూప
నగరాజ ధరుఁడ శ్రీనారాయణా ॥పల్లవి॥

దీపించు వైరాగ్యదివ్య సౌఖ్యం బియ్య
నోపకకదా నన్ను నొడఁబరపుచు
పైపైనె సంసార బంధములఁగట్టేవు
నాపలుకు చెల్లునా నారాయణా ॥నిగ॥ (1-248)

మాధవా :

మాంటికి రావోయి మాధవా॥
మాయలెల్లఁగంటిమిదే మాధవా।

త్రివిక్రమ :

పెగిరించ గంతేశి త్రివిక్రమ
వేగుంజుక్కరాని త్రివిక్రమ॥

పేసరించడం జుమ్మి త్రివిక్రమ నిన్ను
వీసమంత పనికి త్రివిక్రమ
పేసేవు పూవులను త్రివిక్రమా మేని
వేసురుంజెమటల త్రివిక్రమ॥ (2-252)

వా మ నా :

వద్దు వద్దు సటలింక వామనా నీ
వద్దనేవున్నాత మిదె వామనా॥

వరుసలు వెదకేవు వామనా నీవు
వరుంత విందరికేని వామనా
వరవాత పలపించి వామనా దే
వరవలె నున్నాడవు వామనా। (2-153)

శ్రీ ధ రా :

చెప్పరాని మహిమల శ్రీధరా నీవు
చెప్పినట్టు చేసేము శ్రీధరా
చేరదేసి కన్నుల శ్రీధరా సి
జరల మేను చూచితి శ్రీధరా
చేకువ సంతోషమబ్బె శ్రీధరా
చికుమూరాడించమి శ్రీధరా॥ (2-254)

హృషీకేశా :

యిద్దరము నిద్దరమె హృషికేశా
యిట్టె సనాకానవచ్చె హృషికేశా॥

యేటికోయి మాతో హృషికేశ
యూటువెట్టేవు సతుల హృషికేశ

యేటారదు మాపొందు హృషికేశ నీపై
యెంటదియ్య మింకమేను హృషికేశ॥ (2 255)

ప ద్మ నా భ :

బందుగుండ వన్నిటను పద్మనాభ వట్టి
బందెలు గట్టకుమమ్ము పద్మనాభ॥
పట్టిన చలపాదివి పద్మనాభమమ్ము
బట్టబయలందించేవు పద్మనాభ
పట్టితి బలిమినన్నుం బద్మనాభ
ఇుంక బట్టముగట్టుకొనేవు పద్మనాభ॥ (256)

దామోదర :

తప్పని బొంక నీయట్టి దామోదర నాకు
దప్పిదేర మోవియ్యవో దామోదర
తరితీపు మాటలెల్ల దామోదర నీకు
తరుణులు నేరిపేరా దామోదరా
దరిచేరె శంఖు నీచే దామోదరా నీవు
తరగరివె తగు దామోదర॥ (2-257)

వాసుదేవుడా :

వాడికలాయె నీపొందు వాసుదేవుండా
జాడుదేరెం గెమ్మోవి వాసుదేవుండా
వాలుచూపులు చూవి వాసుదేవుండా మమ్ము
పాలాయించితివి నీవు వాసుదేవుండా
పాలయ గొళనొత్తకు వాసుదేవుండా నీకు
వైళమే నవ్వు వచ్చును వాసుదేవుండా॥ (2-258)

ప్రద్యుమ్నా :

పంతము దప్పదునీకు ప్రద్యుమ్నా వొక్క
బంతిం గూడేవు సతుల ప్రద్యుమ్నా

బలుబలుం దెల్లనారె ప్రద్యుమ్నా యింక
బలిమి సేయవచ్చేవు ప్రద్యుమ్నా
పంచనాయె శిస్తులు ప్రద్యుమ్నా
పలుపోకలపడెనె ప్రద్యుమ్నా॥ (259)

అనిరుద్ధా :

అంతానీ లోనె అనిరుద్ధామని
యంతరంగ మెక్కటాయె ననిరుద్ధా॥
అద్దమాట జాలము నీకనిరుద్ధా
అడ్డేక మీనాడుం బోడియనిరుద్ధా
అడ్డు వెట్టనింక నేల యనిరుద్ధా
అడ్డింక లెంచకుమీ యనిరుద్ధా॥ (260)

పురుషోత్తమా :

పోనుపోకు మంకనీవు పురుషోత్తమావట్టి
బూకటు మేమెఱుంగమూ పురుషోత్తమా ॥పల్లవి॥
పొలసులాడకు నీవు పురుషోత్తమా నీ
పొలజాణ తనాలు పురుషోత్తమా
పులుసు వేశిని చెంత పురుషోత్తమా నేము
పులు గరసితిమింత పురుషోత్తమా ॥పోకు॥ (2-261)

అధోక్షజా :

ఆలనాడె కంటి నింటివధోక్షజా
అల్లుకొంటివి నీచెలులనధోక్షజా ॥పల్లవి॥
అందునిందు నీయిరవధోక్షజా
అందులు చెప్ప వచ్చేవ ధోక్షజా
అందరు నెఱుంగుదురు యధోక్షజా మాకు
నందుకొని బాసిచ్చే వధోక్షజా ॥ఆల॥ (2-262)

శ్రీనారసింహా:

సిరనెత్తం గదవయ్య శ్రీనారసింహనీ
సిరులెల్ల నేనే కానా శ్రీనారసింహ ॥పల్లవి॥
చెలుల నంపితివేల శ్రీనారసింహ నాకు
చెలువపు నవ్వునచ్చె శ్రీనారసింహ
చెలంవపు నిన్నుం జూచి శ్రీనారసింహ నీపై
చిలికితి మోహమెల్ల శ్రీనారసింహ ॥సిర॥ (2-262)

అచ్యుతా :

అసలు చెఱచకుమీ యచ్యుత
అసుద్దులె యూసుద్దులు అచ్యుతా॥
అలనాటె తొల్లి నీకు నచ్యుతా
అలుగము ఇంకనీతో నచ్యుతా
అలయకు మింక నీవు అచ్యుతా నిన్ను
సలమి పట్టెంగాని యచ్యుతా॥ (247)

జనార్ధనా :

చతురుండ వన్నిటను జనార్దనా
సతతముగా నేలితివి జనార్దనా
సమమోహాలు మనవి జనార్దనా
జమళి నున్నారమిదె జనార్దనా
సుమకూడెగా లెస్స జనార్దనా
సముకమెవ్వరి కబ్బు జనార్దనా॥ (2-248)

హరి :

పేటొక చోట లేడు పీడివో హరి
పీటిడియై చేయవనే పీడివో హరి ॥పల్లవి॥
మునుకాని వెదకితే ముక్కునూర్పు గాలికాన
వెనవెనక దిరిగి పీడివో హరి

పెనగి వెదక బోతే పెడచెవుల మంత్రమై
వినవచ్చి మాటలతో వీడివో హరి ॥వేడో॥ (8-57)

కృష్ణా :

ఎప్పుడును నాకు లోనె (నై?) యేనా కృష్ణా
చెప్పేవు ప్రియమప్పుడే చెలువపుఁగృష్ణా ॥పల్లవి॥
మాటల సిన్నారసితి మంతనానకు రమ్మని
బాటేవేల సరసాలు జంగిలి కృష్ణా
బాటుతోనే నవ్వితిని యిద్దర మొక్క దేయని
వోటమి నీకెందూలేదు వున్నతపు కృష్ణా॥ (26-417)

అన్నమయ్య దివ్యనామ సంకీర్తనల్ని రెండు రకాలుగా విభజింప వచ్చు. మొదటిది సంబోధనాంతాలు. రెండవది నిర్దేశనామాంతాలు. ఈ రెండింటిని మళ్లీ రెండు విధాలుగా విభజింపవచ్చు. మొదటిది మూర్తి సూచకాలు, రెండవది క్షేత్ర మూర్తి నిర్దేశాత్మకాలు

సంబోధనాంతాల్లో మూర్తి సూచకాలు :

వాగ్గేయకారుడో లేదా భక్తుడో తాను ఏ దేవుణ్ణి ఆరాధిస్తున్నాడో ఆ దేవుని పేరును సంకీర్తనలోని పాదాంతాల్లో గానీ చరణాంతంలోనీ నిలిపి పాడేవి, నిర్దిష్ట దేవునిమూర్తి కీర్తి వైభవాలకు మాత్రం ప్రాధాన్యం ఇచ్చేవి మూర్తి సూచకాలు. ఏ స్థలంలోని దేవుణ్ణి గూర్చి పాడుతున్నాడో ఈ కీర్తనల్లో వుండదు.

నరసింహాత్మకాలు :

కంబమురాయ :

కరుణించవయ్య మమ్ముఁగంబమురాయ
వెరెదేవుని కాలువ పెద్దకంభమురాయ ॥పల్లవి॥
కలకల నవ్వేదేరే గంభమురాయ ఇంతి
కలికితనాలు చూడు కంభమురాయ
కలిమికాంత తొడెక్కెఁగంభమురాయ నీపై
గలువదండలు వేసెఁగంభమురాయ ॥కరు॥ (24-420)

ప్రహ్లాద నరసింహా :

నర (వ?) రూప ప్రహ్లాద నరసింహా
అవిరళ తేజ ప్రహ్లాద నరసింహా॥ (10-233)

ప్రహ్లాద వరదా :

అనసుమ్మీ నీకును ప్రహ్లాద వరదా ॥నిన్ను॥
నానితిఁగుచముల ప్రహ్లాద వరదా॥ (23-203)

విజయ నారసింహా :

అచ్చాలపు బ్రహ్మాండ మదినీకు బెద్దగుహ
చెచ్చెర నహోబలాద్రి సింహాసనము
అచ్చుటఁగనక దైత్యుఁడాహారపు మెగము
విచ్చనవిడిఁజెలఁగు విజయనారసింహా ॥ఎందు॥ (8-154)

శ్రీనరసింహా :

చిత్తగించు మామాట శ్రీనరసింహా
చిత్తజజనక వో శ్రీనరసింహా ॥పల్లవి॥ (13.495)

సుగ్రీవ నరసింహా :

నమో నమో లక్ష్మీనరసింహా
నమో నమో సుగ్రీవ నరసింహా (7-114)

సుగ్రీవనారసింహా :

అవధారు సకలలోకైక నాథ
సువర్ణరూపమైన సుగ్రీవ నారసింహా (9-215)

రామానామాలు :

రామా :

సౌమిత్రి సహోదర దశరథరామా
చేముంచి గుత్తిలో వెలసిన రఘురామా ॥పల్లవి॥

చెలిమి సుగ్రీవుతోడుచేసిన రామ తొల్లి
శిలను బడఁతి గావించిన రామా
చెలరేఁగిన వానర సేనల రామా
శిలుగు మాయా మృగముఁజంపిన రామా ॥సౌమి॥ (9-201)

రామచంద్ర :

రాజపు నీకెదురేది రామచంద్ర
రాజీవ నయనుండ రామచంద్ర (25-165)

రామరామ :

ఎంతని నుతియింతు రామ రామ యిట్టె నీ ప్రతాపము రామరామ
పంతాన సముద్రమును రామరామ బంధించవచ్చునా రామరామ
(11-16190)

రామా రామా రామా :

సతతము నేఁజేయు ననాచారములకుఁ గడయెక్కడ
మతినసుఁగని కావుము రామా రామా రామా (11-3-129)

హనుమంత :

మగటి మిగుల హనుమంతరాయ
దిగువ పట్టణము లోని దేవ హనుమంత (7-16)

హనుమంతా :

అదివో నీప్రతాపము హనుమంతా
యెదురు లేదు నీకు నెక్కుడా హనుమంతా ॥పల్లవి॥

యెత్తిన నీకుడిహస్తమిల నసురలు చూచి
హత్తిరి పాతాళము హనుమంతా
చిత్తగించి నీ యెడమ చేతి పిడికిటి
తత్తరించి చిక్కిరదె దైత్యులు హనుమంతా ॥అది॥ (9-211)

హనుమంతరాయ :

కలశాపురముకాడ గంధపు మాకుల నీడ
నలరేవు మేలు మేలు హనుమంతరాయ॥ (9-282)

కృష్ణాత్మకాలు :

ఓ కృష్ణుడా :

చిట్టగురుగులతో చిలుపాలు గొల్లెతలు
వుట్లపైఁ బెట్టినారు వోకృష్ణుఁడా॥ (26-161)

కృష్ణా :

ఎప్పుడును నాకు లోనై (నై?) యేరా కృష్ణా
చెప్పేవు ప్రియము మప్పుడే చెలువవుఁగృష్ణా॥ (26-417)

అర్చామూర్తులు :

గోవిందరాజా :

కొప్పువంక కిదెంతైనా గోవిందరాజా పైఁడి
కుప్పెకతారము వట్టి గోవిందరాజా ॥పల్లవి॥

నిద్దిరించేనంటాను నేలఁతలచే బాదాలు
గుద్దించుకొనే విప్పుడు గోవిందరాజా
సుద్దులు చెప్పేనంటా చొక్కించితిని మేనులు
కొద్దిమీరె వలపులు గోవిందరాజా ॥కొప్పు॥ (29-204)

చెన్నకేశవ :

చెల్లునానీకిపనులు చెన్నకేశవా
కొల్లకాఁడ వౌరగండిగోట చెన్నకేశా ॥పల్లవి॥

అంగవించి మగనాలి కాసపడే విందరిలోఁ
జెంగలింపుఁజూపులతోఁ జెన్నకేశ
రంగుమీర నిదువంక రమణు లిద్దరుండఁగా
అంగనలింకానా ఔరా చెన్నకేశా ॥చెల్లు॥ (26-50)

చొక్కనాథా :

చొల్లెపుఁజుట్ల వో చొక్కనాథానీ
చల్లరి చేతలు గంటిఁజొక్కనాథా ॥పల్లవి॥
చూడ వెగన్నలు నిన్నుఁజొక్కనాథా నీకు
జోడు భూమియును లక్ష్మిఁజొక్కనాథా
సూడిదె నాపాయమిదె చొక్కనాథానీతో
సూడువట్టి నారతులు చొక్కనాథా ॥చొల్లె॥ (27-439)

జగన్నాథా :

అరుదరుదు నీమహిమతిమానుషము చూడ
పురుషోత్తమనుదివ్యపుర జగన్నాథా ॥పల్లవి॥
పసులఁగాచే దేడ బ్రహ్మనుతియించు టేడ
సిసువౌటేడ నాలుగుచేతు లేడ
కొసరి వేలనే యేడ కొండగొడగెత్తుటేడ
వసమా నిన్నుఁబొగడ నరజగన్నాథా ॥అరు॥ (7-195)

వేంకటేశ్వరాత్మకాలు :

తిరువెంగళప్పడా :

చేవదేరె వలపులు చేతిలోని పిడెము
తేవోయి భూపతి చెయ్వి తిరువెంగళప్పఁడా ॥పల్లవి॥
బీరము లాడఁగ నీతోఁబెనఁగు లాడేమా
చేరినీవు నవ్వఁగానే చెనకేఁగాక
రారాదా ఇంకనైన దంతులేల మాయింటికి
ధీయఁడ విన్నిటా నీవు తిరువెంగళప్పఁడా ॥చేవ॥ (24-371)

శ్రీవేంకటరాయ :

నేనేయందుకు రానటరా
పోసీ పోసీ యింతసేసి వట్టిపొందులనే నిందవేసితి
అట్టే కానీ కానీ శ్రీ వేంకటరాయా॥ (25-414)

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

శ్రీ వేంకటేశుఁడా :

పట్టము గట్టితి వింక బ్రదుకరయ్యా
చిట్టకాలు లేవు మీకు శ్రీవేంకటేశుఁడా (27-152)

వేంకట విభుడు :

అదిమపూరుషుఁ డచ్యుతుఁడనంతుం డమలుడు
ఆదేవుఁడీతఁడేపో హరి వేంకట విభుఁడు (1-80)

సంబోధనాంతాలు-క్షేత్రమూర్తి నిర్దేశాత్మకాలు :

ఏస్థలంలోని దేవుణ్ణి గూర్చి కీర్తనలు పాడారో ఆ క్షేత్రాన్ని మూర్తినామంతో కలిపి పాదాంతాల్లో నిలిపి పాడడం వీటిలో స్పష్టంగా తెలుస్తుంది.

అహోబలేశ :

ఒక్కటై మీరిద్దరు నహోబలేశ
వుక్కళమై కాచుకొండహోబలేశ ॥పల్లవి॥

మారుకొండ లెక్కి వచ్చి మంకు వాపె లకిమమ్మ
వూరెనీసేలవినవహోబలేశ
తేరి చూచి నీమారు దేవతలఁగరుణించె
వూరటాయ నీకాపె యహోబలేశ (27-202)

కంభమురాయ :

ఘనుఁడవు చింతకుంట కంభము రాయ మముఁ
గనుఁగొని రక్షించు కంభమురాయ ॥పల్లవి॥

కంతునిగుకుఁడ వోకంభమురాయ శ్రీ
కాంతఁదొడపై నిడిన కంభమురాయా
కాంతులు నీమేనెల్లఁ గంభమురాయ యే
కాంతమాడే వింతులతోఁ గంభమురాయ ॥ఘను॥ (29-209)

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు

గండికోట కేశవా :

చేపట్టుఁగుంచమపై చేరి ఇట్టె నాతోను
కాఁపురము సేయవోయి గండిగోట కేశవా ॥పల్లవి॥

మన్ననలనె చొక్కి మంతనాన నీవొద్ద
కిన్నెర వాయించితిఁగెల్లు రేఁగి
చన్నులపై నీవు లేఁత చందురులు నించితివి
కన్నుల మెచ్చితి నోయి గండిగోట కేశవా ॥చేప॥ (24-367)

నల్లఁబల్లి చెన్నుఁడా :

భావ మెఱిఁగిన నల్లబల్లి చెన్నుఁడా
నావద్ద సేవుండుమీ నల్లబల్లి చెన్నుఁడా ॥పల్లవి॥

వేసరక నీవు నాతో వేమారు బేసినట్టి
బాసలు నమ్మితి నల్లబల్లి చెన్నుడా
వాసికి వన్నెకు నీకు వలచి చొక్కితి నేను
నాసూటి కే మన్నించు నల్లఁబల్లి చెన్నుఁడా ॥భావ॥ (19-329)

పండరంగిరాయ :

అడుగడుగుకు నీ పాడఁగాను మా
బడలికింతయుఁదోయ పండరంగి రాయ ॥పల్లవి॥

పాదకెత్తు మెఱుఁగారు బంగారు గుండు
సేదదేర మెడఁగట్టి చిత్తగించితి
యేదెస కాసిక దెచ్చి యిచ్చిరి నీకెవ్వరో
పాదపు గజ్జెలు మోయ పండరంగి రాయ ॥అడు॥ (12 219)

పొదటూరి చెన్నరాయా :

కరుణించవయ్య యిఁక కడు జాణ పొదువు
వారసేరింతలు పొదటూరి చెన్నరాయా ॥పల్లవి॥

దగ్గరి కొలని దరి తరుణులెల్లాఁగూడి
నిగ్గుల జాఁచేరదివో చేతులు నీపై
వెగ్గళించీ కన్నుల వెడనవ్వులు నవ్వుతా
వొగ్గేరు వలపు పొదటూరి చెన్నరాయా ॥కరు॥ (13-587)

విట్టలాత్మకాలు :

విట్టలా :

వలపించి తిప్పేవు వాడవాడలను మమ్ము
యిలగొంత గుట్టు వద్దా యేలోయి విట్టలా ॥పల్లవి॥ (26-67)

విట్టలేశ్వరా :

వెరగయ్యీ నీ చేఁతకు విట్టలేశ్వరా
విరులుచల్లే వప్పటి విట్టలేశ్వరా ॥పల్లవి॥

వేడుకకాఁడవు నీవు విట్టలేశ్వరా మాకు
పేడె మియ్యఁగదవోయి విట్టలేశ్వరా
పీడవు మన పొందులు విట్టలేశ్వరా
పీడుటో డాడీ వలపు విట్టలేశ్వరా ॥వెర॥ (24-216)

విట్టలేశా :

పీదుల పీదుల నేఁగేవిట్ట(ట్ట) లేశా వట్టి
వెదలెల్లాఁబాసె నిఁక విట్టలేశా ॥పల్లవి॥

వేడుక కాఁడవైతివి విట్టలేశా నీకు
పీడె మందుకో వోయి విట్టలేశా
వీడు జోడు నగవుల విట్టలేశా నీపై
వేడె వెట్టి మా వలపు విట్టలేశా ॥పీదు॥ (26-449)

విట్టల రాయ :

కట్టిన చిక్కపు బుత్తి కచ్చుకాయల తిత్తి
చుట్టిన పింఛెపుఁబాగ చుంగుల సోగ

ఇట్టి సింగారము సేయ నింత నీకుఁ బ్రియమాయ
వెట్టి నీచేతల మాయ విట్టలరాయ ॥పసులు॥ (12-96)

వేంకటగిరియనంతుఁడా :

ఎదుటి నిధానమ వెటుచూచిన నీ
వదె వేంకట గిరియనంతుఁడా
పొగిసి బాద్రపద శుద్ధ చతుర్దశి
తగువేడుక నిందరు గొలువ
పగటు సంపదలు బహుళ మొసఁగునీ
వగు వేంకట గిరి యనంతుఁడా (1-344)

నిర్దేశ నామాంతాల్లో మూర్తి సూచకాలు :

భగవంతుణ్ణి సంబోధించే పద్ధతిలో లేనవి, నిర్దేశాంతంగా ప్రథమా విభక్త్యంతంగా వుండేవి దేవుని కీర్తి, మూర్తి, వైభవాల్ని ప్రదర్శించేవి ఈ వర్గంలో చేరతాయి.

ఆది నారాయణుఁడు :

త్రిజగముల నెరుఁగు దేవదేవుఁడు
అజుని జనకుఁడైన ఆదినారాయణుఁడు ॥పల్లవి॥

గరుడని మీఁద నెక్కి ఘనచక్రము చేఁబట్టి
పరమపదాన నుండి పరలెంచి
మురిపేన కరిఁగాచి మొసలి దుంచినవాడు
అరుదైన ప్రతాపపు ఆదినారాయణుఁడు ॥త్రిజ॥ (9-234)

నరసింహాత్మకాలు :

నగు మొగము తోడి వో నరకేసరి
నగ రూప గరుడాద్రి వర కేసరి ॥పల్లవి॥

అమిత దానవహరణ ఆదినరకేసరి
నమిత బ్రహ్మాదిసుర నరకేసరి
కమలాగ్రహమాంక కనక నరకేసరి
నమో నమో పరమేశ నరకేసరి ॥నగు॥ (1-421)

నరసింహుఁడు :

నంటు చేసీ సిరితోడ నరసింహుఁడు
జంట సరసములాడీ సారె నరసింహుఁడు ॥పల్లవి॥

జవ్వనిఁదనతొడపై సంతసాన నిడుకొని
నవ్వులు నవ్వీఁదె నరసింహుఁడు
నివ్వటిల్లుఁజూపులు నెలత చన్నులమీఁద
కువ్వని వేరులవలెఁగుచ్చీ నరసింహుఁడు ॥నంటు॥ (19-204)

నరసింహ దేవుఁడు :

సింగారాల మించీ నరసింహదేవుఁడు
చెంగట నున్నాఁడు నరసింహ దేవుఁడు ॥పల్లవి॥

సురలు జయజయ వెట్ట నసుర లెల్ల మొరవెట్ట
సిరితో మెలఁగీ నరసింహ దేవుఁడు
ధరణి వంవెట్టఁబ్రతిధ్వనులు మిన్నులు ముట్ట
సిరసెత్తె నతి నరసింహదేవుఁడు ॥సింగా॥ (6-228)

ప్రహ్లాద వరదుఁడు :

కొలువై తానల్లనాఁడే కూచున్నాఁడు గద్దెమీఁద
బలవంతుఁడితఁడు ప్రహ్లాద వరదుఁడు ॥పల్లవి॥

చిడుముడిగోళ్ళతోడ సింహపు మోముతోడ
తొడమీద గూచున్న తొయ్యలితోడ
కడలేని నవ్వుతోడ కడు రాజసముతోడ
అడరించీ బంతము ప్రహ్లాదవరదుఁడు ॥కొలు॥ (10-168)

సుగ్రీవ నరసింహుఁడు :

బలవంతుఁడితఁడు బంట్లమై బ్రతుకుదము
కిలకిలనవ్వీ సుగ్రీవనరసింహుఁడు ॥పల్లవి॥

దేవదేవుఁడితఁడు తేజోరాశి యితడు
భావించ నలవిగాని బ్రహ్మమీతఁడు
శ్రీ వల్లభుఁడితఁడు జీవరక్షకుఁడితఁడు
కేవలమయిన సుగ్రీవ నరసింహుఁడు ॥బల॥ (24-302)

రాముఁడు :

దీన రక్షకుఁడఖిల వినుతుఁడు దేవదేవుఁడు రాముఁడు
జానకీ పతి గొలువుఁడీ ఘన సమర విజయుఁడు రాముఁడు ॥పల్లవి॥

హరుని తారక బ్రహ్మ మంత్రమై యమరిని యర్థము రాముఁడు
సురలఁగాచి యసుర నడిచిన సూర్యకులజుఁడు రాముఁడు
సరయునందును ముక్తి చూరలు జనుల కొసగెను రాముఁడు
హరియె యీతఁడు హరివిరించుల కాదిపురుషుఁడు రాముఁడు ॥దీన॥
(6-178)

పవనజుఁడు :

పంతగాఁడు మిక్కిలినీ పవనజుఁడు
రంతుకెక్కె మతంగపర్వత పవనజుఁడు ॥పల్లవి॥

వాలాయమై యెంత భాగ్యవంతుఁడో దేవతలచే
బాలుఁడై వరములందెఁబవనజుఁడు
పాలజలనిధి దాటి పరగసంజీవి దెచ్చి
యేలిక ముందరఁబెట్టె నీపవనజుఁడు ॥పంత॥ (10-273)

పెద్ద హనుమంతుఁడు :

ఏమని నుతించవచ్చు నితని రూపము
భీమ విక్రముఁడితఁడు పెద్దహనుమంతుఁడు (7-116)

కృష్ణాత్మకాలు :

వినవమ్మ యశోద గోవింద కృష్ణుఁడు
చెనకి యెన్ని పనులు చేసెనమ్మ కృష్ణుఁడు ॥పల్లవి॥
పుట్టులుఁదా గొట్ట గాను వుపదలు దిట్టగాను
అట్టాయ వీధులలోను బక కృష్ణుఁడు
పట్టినకోలల గొల్ల పోఱు లిరువంక రాగ
పట్టుకొన్న గొల్లెతల భ్రమయించీఁగృష్ణుఁడు ॥విన॥ (15-173)

బాలకృష్ణుఁడు :

బడిబడిఁదిగిగాడీ బాలకృష్ణుడు
యెడయని జాణ గదె యీ బాలకృష్ణుఁడూ ॥పల్లవి॥
సొక్కుచు సోలుచు వచ్చి సుదతులుయెత్తుకొంటె
పక్కనసనవ్వులు నవ్వీ బాలకృష్ణుఁడు
యిక్కువకుఁజేయి చాఁచీ నేడనైనఁ దొంగిచూచి
మొక్కుడుగామిడి గదెయీ బాలకృష్ణుఁడు ॥బడిబడి॥ (17-141)

అర్చావతారాత్మకాలు :

గోవిందరాజు :

కొలువై వున్నాడు వీఁడే గోవిందరాజు
కొలకొలనేఁగె వచ్చె గోవిందరాజు ॥పల్లవి॥
గొడుగుల నీడల గోవిందరాజు
గుడికొన్న పడగెల గోవిందరాజు
కుడియడమ కాంతల గోవిందరాజు
కుడిసాగే పవుఁజుల గోవిందరాజు ॥కొలువై॥ (19-168)

శ్రీ వేంకటేశుడు :

ఏడనుండి వచ్చినాఁడే యీడకుఁదాను
వీడె మిచ్చిఁజూడవే వేసాలవాడు ॥పల్లవి॥

వెలలేని వలపుల వేడుక కాఁడు
కలికి తనాల మంచి గయ్యాళి వాఁడు
చెలమరి సరసాల జాజరకాఁడు
చెలువుఁడు నీఁడు గదె శ్రీవేంకటేశుఁడు ॥ఎద॥ (29-92)

తిరువెంగళప్పఁడు :

పట్టిన చలముతోడఁబైకొనీఁ
దిట్టగదే పేరువళి తిరువెంగళప్పఁడు ॥పల్లవి॥
విరహపు కాఁకచేత వేసరి నేఁగసరితే
గరిమ నవ్వులు నవ్వి కాఁగిలించీని
సరసపు లాడేసి సాదనలు సేసీని
తెరలోనే పేరువళి తిరువెంగళప్పఁడు ॥పట్టి॥ (22-365)

శ్రీవేంకటేశ్వరుఁడు :

మతంగ పర్వతము మాల్యవంతము నడుమ
సతతమై శ్రీవేంకటేశ్వరుఁడున్న వాఁడు ॥పల్లవి॥
కొలచిన వారికెల్లా కోరిన వరములిచ్చి
తలఁచిన వారినెల్లా ధన్యులఁజేసి
పొలుపు మిగుల మంచి పువ్వుల తోటలనీడ
విలసిల్లీ నదినో శ్రీవేంకటేశ్వరుఁడు ॥మతం॥ (10-165)

నిర్దేశనామాంతాలు - క్షేత్రమూర్తినిర్దేశకాలు :

భక్తుడు ఏ క్షేత్రంలోని దేవుణ్ణి కీర్తిస్తున్నాడో ఆ క్షేత్రంలోని దేవుని పేరును పాదాంతాల్లోగాని చరణాంతాల్లోగానీ నిర్దేశించి పాడినవి ఈ వర్గంలో చేరతాయి.

అహోబలేశుఁడు :

సగము మానిసి రూపు సగము మెగమురూపు
అగణిత ప్రతాపు దహోబలేశుఁడు ॥పల్లవి॥

గద్దెమీదఁగూచున్నాఁడు కంబములోఁబుట్టినాఁడు
కొద్దిమీరఁగడునవ్వుకొంటా నున్నాఁడు
వొద్దనె శ్రీసతి చన్నులొరయుచు నున్న వాఁడు
అద్దివో చూడరమ్మ అహోబలేశుఁడు ॥సగ॥ (24-208)

కలశాపుర హనుమంతుఁడు :

సరిలేడి తనికిని సాహస విక్రముఁడితఁ
డరయ కలశాపుర హనుమంతుఁడు ॥పల్లవి॥

ఉదధి లంఘించినాడు వుబ్బున మైనాకముచే
పొదలి నట్టనడుమఁబూజగొన్నాఁడు
సదరాననే లంక సాధించి వచ్చినాఁడు
అదివో కలశాపుర హనుమంతుఁడు ॥సరి॥ (11-1-204)

తిల్లగోవిందరాజు :

అమ్మలాల అక్కలాల అతివలాల
దిమ్మరి గదవే వీడుతిల్లగోవిందరాజు ॥పల్లవి॥

యీవలనావల సతులిరుమేల నుండఁగాను
చేవమీర నవ్వు నవ్వ సిగ్గువడఁడు
పూవుల నొకతె వేసీ పొంచొకతెతో మాటాడే
దేవర గదవే వీఁడు తిల్ల గోవిందరాజు ॥అమ్మ॥ (20-143)

శ్రీరంగ శిశువు :

తొల్లియును మఱ్ఱాకు తొట్టిలనె యూఁగీ గన
చెల్లుబడి నూఁగీని శ్రీరంగ శిశువు॥పల్లవి॥

కలికి కావేరి తరగల బాహులతలనే
తలఁగ కిటు రంగ మధ్యపు తొట్టెలన్
పలుమారుఁదనునూఁచి పాడగా నూఁగీని
వెలుపాల సెలవితో శ్రీరంగ శిశువు ॥తొల్లి॥ (11-2-1)

### 3. 4. 3. వృత్త్యాత్మక సంకీర్తనలు :

అన్నమయ్య పాటలన్నీ స్థూలంగా స్తుత్యాత్మకాలే, వాటిలో వృత్త్యాత్మక సంకీర్తనలు కూడా వున్నాయి. అన్నమయ్య పండిత పామర వాగ్గేయకారుడు. పైగా భక్తిమత ప్రచారానికి కంకణం కట్టుకొన్నవాడు. ఆకారణంవల్లనే తంబూరాచేత బట్టుకొని వాడవాడల పూరూర తిరుగుతూ వారిని ఆకర్షించే విధంగా వారికి అనరక్తి ఏర్పడే విధంగా విషయాన్ని మలుచుకొంటూ పాడడంతో వారి మనసుల్ని కరిగించే విధంగా బాణీలు ఎన్నుకొంటూ రచనలు చేసినవాడు. అందువల్ల అన్నమయ్య పాటల్లో వృత్త్యాత్మక సంకీర్తనల కెంతో ప్రాధాన్యం కనిపిస్తుంది. వీటిలో కర్షకవృత్తి, వర్తకం, చల్ల అమ్మకం, వైద్యానికి సంబంధించిన పాటలున్నాయి.

భారతదేశం ప్రధానంగా నాడూ నేడూ వ్యావసాయిక దేశం. పైగా గ్రామ జీవనానికి ఆనాడు నేడూ ప్రాధాన్యం వుంది. అన్నమయ్య పొలం పాటలు వ్రాయడానికి ప్రధానంగా మూడు కారణాలున్నాయి.

మొదటిది - అన్ని వృత్తులూ కర్షకవృత్తిని ఆశ్రయించినవి కావడం. రెండవది అన్నమయ్య వంశీయులు వ్యవసాయ వృత్తిచేసేవారు కావడం. కనుకనే

> 'కాపులము మేము కర్తవు నీవు
> దాపు దండై మమ్ము నిట్టే దయఁజూడవయ్య' (9-198)

అని చెప్పుకొన్నాడు. చిన్నన్న 'అన్నమాచార్య జీవిత చరిత' లో –

> 'జననియు నన్నయు జనకుండు వదనె
> యును గొన్న పసులు సేయుచుఁదన్నుఁబిలిచి
> పసులకు కసవుఁదేఁజనుమ బాలుండు
> వెసనేఁగి వాఁడి లవిత్రంబు పూని' (పు 12)

అని ఉల్లేఖించడాన్ని ఇక్కడ అనుసంధానించుకోవచ్చు.

మూడవది విజయనగర రాజులు వ్యవసాయాన్ని ప్రోత్సహించారనడానికి సాక్ష్యాధారాలుండడం.

రైతు జీవనానికి పాడిపంటలు ప్రధానాధారాలు. వాటిలో మొదటిదయిన 'పాడి' కి సంబంధించిన ప్రస్తావన అన్నమయ్య రచనల్లో చాలచోట్ల కనిపిస్తాయి.

'ఏవల నరుఁడు లేక యెద్దై తా దున్నునా
నీవు సేయించక వేరే నేఁబుణ్యము సేసేనా' (6-130)

'కొల్లయెద్దు లెప్పటివే గోనెలే కొత్తలెనట్టు
చల్లని నేనొకఁడనే జన్మము లే వేరు' (17-284)

'గోనెలె కొత్తలు కోడెలెప్పటివి
నానిన లోహము నయమయ్యీనా' (10-60)

'పసిమి బాపమనేటి బందెలు మేసితిని
కసరి దేహపు కట్టుగాడి నుంటిని
కొసరి కర్మపు మెడ గుదియమోచితిని
పసురము వంటి వాఁడఁబాలించవే' (10-227)

భక్తిలో పరమాత్ముని పీఠోచిత కృత్యాల వర్ణన కీర్తన ప్రాధాన్యం వహిస్తుంది. అన్నమయ్య 'ఎద్దు' అని నిర్దేశిస్తూ వేంకటేశ్వర స్వామి దివ్య వైభవాన్ని ఈ క్రింది కీర్తనలో స్పష్టం చేశాడు.

శ్రీరాగం

పొలమెల్ల దిరిగిన బోడెద్దు
గరిమెలో (తో?) నెవ్వరికి దగ్గరి రానియెద్దు ॥పల్లవి॥

పురములు సాధించఁబూనినప్పుడు భూమి
భరమెత్తి నిలిచిన బండెద్దు
పరివోని మందం పసులంబో దోలి శ్రీ
వరుడై రోలంగట్టుపడినెద్దు ॥పొల॥

ఒడలెత్తి నాలుగు యుగములంబడి
బడి ధర్మదేవతై పరగినెద్దు
తడవి దేవదులను దామెర (న?) లనుంగట్టఁ
గడఁగి మానిని రూపు కలిపెద్దు ॥పొల॥

గోవైన భూదేవి నూరిమిఁజేకొని
లావైన వృషభాచలపుటెద్దు
మోపఁగ వేదాలు మొల్లమై సిరితోడె
శ్రీవేంకటాద్రి మించిన మాయలెద్దు ॥పౌల॥ (11-2-74)

శ్రీ వేంకటేశ్వరుని వృషభాచలపు టెద్దుగా నిరూపించడం అన్నమయ్య ఆశయం. వృషభాచలంలో వేంచేయడం ఈ ఔపమ్యంలోని సమానధర్మం. ఈ ఔపమ్యంతో స్వామిచేసిన త్రిపురసుర సంహారం, ఉలూఖలబంధం, భూదేవి వరణం లాంటివి జత చేయడం ఇందులోని విశేషాలు.

పాడి తర్వాత రైతుకు ప్రధానమయింది పంట. పంటకు పొలం ఆధారం. అన్నమయ్యలో పొలం పాటలుకూడా వున్నాయి. పల్లెటూళ్ళలో జానపదులు వరి నాటేటప్పుడు, కలుపు తీసేటప్పుడు, మోటతోలేటప్పుడు, తూర్పారబెట్టేటప్పుడు, కసవు తొక్కించేటప్పుడు కలిగే శ్రమను వుపశమనం చేసుకోవడానికి పాటలు పాడుకుంటారు. ఇవన్నీ పొలం పాటలే.

సామంతం

తిమ్మిరెడ్డి మాకు నిచ్చె దిష్టమైన పొలము
బొమ్మిరెడ్డి కప్పగించి పొదిసేసెఁబొలము ॥పల్లవి॥

నిండినట్టి మడుగుల నీరువంక పొలము
కొండలు మోఁచిన పెద్ద గొబ్బరపు బొలము
అండనే పొలము రాజులుండేటి పొలము
పెండివేసి మాకునెల్లా పెలగిన పొలము ॥పల్లవి॥

ఆసపడి వరదానమడిగిన పొలము
బాసలతోఁగడు నెత్తుపట్టమైన పొలము
దాసికెక్కి మునులు రచ్చైన పొలము
వేసరక నాఁగేటి వేగిరైన పొలము ॥తిమ్మి॥

మంచిగురుతైన రావిమాసి చేసి పొలము
చంచెన గుట్టము తోలే వయ్యాళి పొలము

యెంచఁగ శ్రీవేంకటేశునిరవైన పొలము
పంచుకొని లోకులెల్లా బ్రతికేటి పొలము ।తిమ్మి॥ (10-52)

ఈ కీర్తనలో తిమ్మిరెడ్డి, బొమ్మిరెడ్డి, అనే రైతుల పేర్లు వున్నాయి. ఇందులో నీటి మడుగుల పొలం, కొండలు మోచిన పొలం, రాజులుండేటి పొలం, మాకు లెల్లా సెలగిన పొలం అని రకరకాల పొలాలు చెప్పబడ్డాయి. బాహ్యంగా పొలం వర్ణన కనిపించినా అంతర్యంగా చూస్తే వరుసగా మత్స్య, కూర్మ, వరాహ నరసింహ, వామన పరశురామ, రామ బలరామ, బుద్ధ, కల్కి అవతారాలు గోచరిస్తాయి.

దేవ గాంధారి

పంటల భాగ్యులు వీరా బహు వ్యవసాయము
అంటి ముట్టియిట్లఁగాపాడుదురు ఘనులు ॥పల్లవి॥

పొత్తుల పాపమనేటి పోడు నఱకి వేసి
చిత్తమని యెడు చేను చేనుగా దున్ని
మత్తిలి శాంతమనే మంచి వానపదనున
విత్తుదురు హరిభక్తి వివేకులు ॥పంట॥

కామ క్రోధాదులనే కలుపు దవ్వి చేసి
వేమరు వైరాగ్యమనే వెలుఁగు వెట్టి
దోమటి నాచార విధుల యెరువులు వేసి
వోముచున్నారు. జ్ఞానపుఁబైరుబ్యోగ జనులు ॥పంట॥

యెందు చూచిన శ్రీవేంకటేశుఁడున్నాడనియెడి
అందిన చేని పంట లనుభవించి
సందడించె తమవంటి శరణాగతులుఁదాము
గొందె నిముడు కొందురు గురుకృప జనులు ॥పంట॥ (9-70)

పోడునరకడం, దున్నడం, పదును కోసం ఎదురు చూడటం, విత్తనాలు వేయడం, కలుపు తీయడం, వెలుగు పెట్టడం, ఎరువులు వేయడం, జాగ్రత్తగా కాపాడడం అన్నిటికీ భగవంతుడున్నాడని అందిన పంటను అనుభవించడమనేవి రైతులు సాధారణంగా చేసే కృత్యాలు.

పాపచ్ఛేదనం, చిత్తస్వాస్థ్యం, శాంతం సిలువుదల, భక్తిపాదుకొల్పడం, కామ క్రోధాదులు తొలగించు కోవడం, ఆచార విధులు పాటించడం, సుజ్ఞానం అలవరచు కోవడం, అన్నిటికీ భగవంతుడున్నాడనే భావన ముక్తిపథానికి మార్గాలు. ఇవన్నీ ఉపమేయాలు. పోడు నరకడం లాంటివి ఉపమానాలు.

ధన్నాసి

కాయముల కాణాచి కాఁపులము
చాయల మా సుఖము జయమేఁటిదయ్యా ॥పల్లవి॥

పంచమహాపాతకాల పైరు విత్తి దేహాల
కంచపుఁగొలుచులుగా గాదెలెఁబోసి
చంచలాలు జవ్వనాలు చవులైన కూరలుగా
నించిభుజియించే మానిజమేఁటి దయ్యా ॥కాయ॥

ఉడివోని లంపటాన నూళ్ళ బల్లెలు నెక్కి
యిడుమల మమతల నిండ్లుఁగట్టి
గౌడవలానానసల (?) కూరిమి సంపదల
పొడవైన మామతి పొందేఁటి దయ్యా ॥కాయ॥

పనిలేని మదుతల్ల పాపములు బందాలు
గొనకొని ధనములుఁగూడ పెట్టి
కనినేడు తిరువేంకటపతి కృపతోడ
తనియని మాతోడి తగు వేటిదయ్యా ॥కాయ॥ (11-2-10)

పైరు విత్తడం, ధాన్యాన్ని గాదెల్లో పోయడం, రుచికరమైయున వంటకాల్ని భుజించడం, ఆయా వూర్లలో విహరించడం, ఇండ్లు కట్టడం, ధనం కూడబెట్టడం అనేవి భగవంతుని కృపవల్ల పంట ఫలించినపుడు రైతు నిర్వర్తించే సుఖ సంతోష కార్యక్రమాలు.

పంచమహా పాతకాలు చేయడం యౌవనంతో చాంచల్యంతో ప్రవర్తించడం నానా విధ సౌఖ్యాల్ని అనుభవించడం అనేవి భగవంతుని లీలావినోదాలవల్ల

సామాన్య మానవుడు పొందే సౌఖ్యాలు, ఇవి ఉపమేయాలు. పైరు విత్తనం, మొద లయినవి ఉపమానాలు.

రా. భౌళి

అంతటనె వచ్చి తమ నాపద్బంధుఁడు హరి
వంతుకు వాసికి నతనివాఁడ నంటేఁజాలు ॥పల్లవి॥

బంతిఁగట్టి నురిపేటి పసురములెడ నెడఁ
బొంత నొక్కొక్క గవుకవుచ్చుకొన్నట్టు
చెంతల సంసారము సేయు నడుఁమందులోనె
కొంత గొంత హరి నాత్మఁగొలుచుటే చాలు ॥అంత॥

వరుసఁజేదుఁడినేవాడు యెడనెడఁగొంత
సరసవితోడుతఁదీపు చవిగొన్నట్లు
దురిత విధులు సేసి దుఃఖించు మానవుడు
తరువాత హరిపేరు దలఁచుటే చాలు ॥అంత॥

కడుఁజేదైనవాఁడు కాలకర్మవశమున
అడుగులోనె నిధాన మటు గన్నట్టు
యెడసి శ్రీవేంకటేశు నెరఁగక గురునాజ్ఞ
పొడగన్నవాని భక్తి పొడముటే చాలు ॥అంత॥ (10-201)

ఈ కీర్తనలో కసువును బంతులు కట్టి తొక్కిస్తున్నపుడు ఎద్దులు అప్పు డప్పుడు కొంత కసువు పోచల్ని పుచ్చుకొన్నట్లు సంసార జలధిలో సతమతమవు తున్న మానవుడు భగవంతుని అప్పుడప్పుడు తలచుకొన్నా చాలు అనే తత్త్వబోధన కనిపిస్తుంది.

ప్రోగు చేసిన ధాన్యాన్ని ఒకచోట పోసే ప్రదేశాన్ని 'కొటారు' అంటారు. అలాంటి కొటారుకు సంబంధించిన కీర్తనలు కూడా అన్నమయ్యలో కనిపిస్తాయి.

'కోరు వంచరో కొటారు
ఆరసి మనసా అంతరాత్మకు॥

కొండల పొడవుల కోరికకుప్పలు
పండిన పంటలు భవములివి
నిండిన రాసులు నిజకర్మంబులు
అండనెంబుల మాయారంభములు, (11-3-173)

## వర్తకం :

అన్నమయ్య కాలంలో దేశీయ అంతర్దేశీయ వర్తక వ్యాపారాలు విరివిగా సాగుతుండేవి. ఈ వర్తకం భూమిమీద వర్తకం, సముద్రవర్తకం అని రెండు రకాలు. భూమిమీద వర్తకంలో చీరల వర్తకం ప్రధాన మయింది.

మనిషి జీవించటానికి కావలసిన అత్యవసర మయిన వృత్తుల్లో వ్యవసాయం తర్వాత ప్రధానమయింది నేత వృత్తి. ఈ వృత్తికి ఈనాడేకాకుండా ఆనాడు కూడా కడప మండలంలోని పుల్లంపేట వగైరా గ్రామాలు, చిత్తూరు మండలంలోని నారాయణవనం మొదలయినవి ప్రసిద్ధాలు. అదీగాక సంచార ధర్మయుతయిన అన్నమయ్య వివిధ ప్రదేశాల్లో నేత వృత్తిని పరిశీలించి వుండవచ్చు. అందువల్ల భక్తి మత ప్రచారానికి నేత వృత్తిని ఆసరా చేసుకున్నాడు.

### వరాళి

వాడల వాడల వెంట వాడిదివో వాడిదివో
నీడ నుండి చీరలమ్మే నేత బేహారి ॥పల్లవి॥

పంచభూతములనెడి పలువన్నెనూలు
చంచలపు గంజివోసి చరిసేసి
కొంచెపు కండెల నూలి గుణముల నేసి
మంచి మంచి చీరలమ్మే మాయబేహారి ॥వాడ॥

మట మాయముల నందనమగువ పసిండి నీరు
చిటి పొటి యలుకలఁజిలికించ గా
కుటిలంపు చేఁతలు కుచ్చులుగాఁగట్టి
పటవాళి చీరలమ్మే బలుబేహారి ॥వాడ॥

మచ్చిక కర్మమనేటి మైల సంతలలోన
వెచ్చపుకర్మధనము వెలువ చేసి
పచ్చడాలుగాఁగుట్టి బలువేంకటపతి
ఇచ్చకొలదులనమ్మె ఇంటి బేహరి ॥వాడ॥ (5-178)

వన్నెనూలు, గంజిపోయడం, కొంచెపు కండెలు, పసిడినీరు చిలికించడం, కుచ్చులుగా కట్టడం, మైల సంతలు, వెలువచేయడం, పచ్చడాలు కట్టడం మొదలయినవి నేత వృత్తికి సంబంధించిన అంశాలు. ఇవి ఉపమేయాలు.

పంచభూతాలు, చాంచల్యం, గుణాలు, మటమాయలు, చిటిపోటి అలుకలు, కుటిల చేష్టలు, మచ్చికకర్మ, వెచ్చపు కర్మ ధనం మొదలయినవి ఉపమానాలు, అన్నమయ్య పంచ భూతములనెడి పలువన్నెనూలు వంటి వాటితో ఆరోపణ చేసి పచ్చడాలమ్మె నేత బేహారిగా వేంకటేశ్వరుని వర్ణించాడు.

బౌళి

కొలఁది షణ్మ పాపాలే కొంగు రొక్కములు పెట్టి
వెలదెంచి బేరమాడ వేగిరమే రారో ॥పల్లవి॥

జననాలు మరణాలు సంసార భోగములును
అనిశము భూమి మీఁద నగ్గువలు
కొనేవారుఁదినేవారు కూడికూడిమూఁకలై
దినసంత లెక్కెనిదే దేహులాల రారో ॥కొల॥

అంగనల వలపుల అంగళ్ళు వెట్టిరదే
చెంగట వయసులనే చింతల కింద
సంగతిఁగాయ మనే సంచుల నించుకొందము
చెంగి పోరాదు మనకు జీవులాల రారో ॥కొల॥

లంపటాలు సంపదలు లలినంబారాసులాయ
యింపుల ముంచి తలల కెత్తుకోరో
దింపక యిందులోనవే తిరిగి శ్రీవేంకటేశు
పంపున లాభము చేరె ప్రాణులాలరారో ॥కొల॥ (8-170)

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

అన్నమయ్య కాలంలో నగరాల్లోను, గ్రామాల్లోనూ దినసంతలు, మైలసంతలు వుండేవని ఈ కీర్తన వల్ల తెలుస్తుంది. ఇందులో చింతల కింద అంగళ్లు పెట్టడం వంచులు నించుకోవడం, తలలకెత్తడం మొదలయినవి ఉపమానాలు. చెంగటవయసులు, అంగన వలపులు, సంగతి కాయం, లంపటాలు, పాపపుణ్యాలు మొదలయినవి ఉపమేయాలు.

### రామక్రియ

కాంతల మానమనేటి కరవట్నాలకు దిగె
మంతనాన జీవుడనే మంచి మరకాడు ॥పల్లవి॥

అరిది సంసారమనే యంబుధిలోనఁదిరిగి
పురుగతి దేహపు వోడమీఁద
సరిఁబాపపుణ్యముల సరకులు నించుకొని
దరిచేరి జీవుఁడనే తలమరకాఁడు ॥కాంత॥

కదలేని పుట్టువు గాలి విసరగాను
జడియుఁగోరికలనే చాపలెత్తి
అది బరవుగ మాయ అందు నిండానించుకొని
యెదతాఁకె జీవుఁడనె యీమరకాఁడు ॥కాంత॥ (9-99)

సరకుల్ని ఓడలో నింపుకొని గాలి వీచినపుడు తెరచాపలెత్తుతూ సముద్రంలో తిరిగే నావికుని ధర్మం జీవునిలో ఆరోపించ బడింది. సంసారమే సముద్రం. దేహమే ఓడ పాప పుణ్యాలే సరకులు. కోరికలే చాపలు.

### చల్ల అమ్మకం :

పల్లె ప్రాంతాల్లోని వారు ప్రాతఃసమయాన్నే పట్టణాదుల్లోకి వచ్చి చల్లి అమ్ముతుంటారు. వీరికి సంబంధించిన పాటలే చల్ల అమ్మకపు పాటలు. ఈ చల్లి లమ్మే పాటల్నే చల్లలమ్మేవారు పాడే పాటలని, చల్లలమ్మే వారిని గురించిన పాటలని వర్గీకరించవచ్చు.

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు

అన్నమయ్య కీర్తనల్లో కేవలం చల్ల అమ్మక ప్రసక్తి వచ్చినవి :

"మట్టెలనే గిలుకొట్టి మణుల పెండెము వెట్టి
దిట్టనడపుల వీధిఁదిరుగకువే
జట్టిగొను చూపుల జంకెన గొల్లెతవు
పెట్టెడుఁజిక్కాల నిన్ను బిత్తరీఁడు కృష్ణుడుఁ" (12-270)

'సంపెఁగల తురుముతో చల్లలమ్మేనిదొవో
వంపుమోము గొల్లెత వాడలను
యింపుల కోరికెతో నిందిరాపతి యెదుట
జంపుల నటనలతో సాళగింపుచును' (12-372)

'వేరడిగా సాళగపు పెద్దయెలుఁగులతోడ
కోరికెఁజల్లలమ్మేరు గొల్లెతలు
బీరానఁబెక్కు రాగాలు పిల్లగోవిఁగురిసేవు
కూరిమి రెంటికి సుతి గూడెవినవయ్యా' (19-206)

### చల్లనమ్మే(స్త్రీ)లు పాడేవి

### పాడి

పిల్లగ్రోవి పట్టుకుంటా బెరరేఁచీనిమా
గొల్లవారి పిల్లఁగ్రోవి కోరో చల్లా ॥పల్లవి॥

పాడుమంటా దండె మీఁటెఁబలుమారు సుందా
వేడుక నెవ్వతె పాట వినవచ్చెనో
వాడలో జల్లలమ్మే వనిత నింతే ప్రీతిఁ
గూడినేఁబాడేటిచల్ల కోరో చల్లా ॥పిల్ల॥

చేరి నన్ను నాడుమంటాఁజెక్కు నొక్కిని తా
గారవాన నెవ్వత టఁగన వచ్చెనో
మాయకు మారాడేటి మందహారము మేము
కోరికి నాడేటి చల్లకోరో చల్ల ॥పిల్ల॥

కిన్నెరమీటు మంటా గెలసీని తన్నుఁ
గిన్నెర మీట్ల నేది గిలిగించెనో
కన్నుల కలికి వెంకటపతిపై వెట్టి
గొన్న కిన్నెర గుబ్బల కోరో చల్లా ॥పిల్ల॥ (4-109)

ఇందులో అమ్మక వృత్తి చేసి జీవించే ఒక వనిత పాట పాడుతూ వీధులవెంట తిరిగి చల్ల అమ్మడం చెప్ప బడింది. చరణాంతాల్లో కోరో చల్లా అని ఆవృత్తి అయింది.

చల్ల అమ్మే స్త్రీల నుద్దేశించి పాడేవి :

ఆ హి రి

కుందణంపు మై గొల్లెత తా
నెందును బుట్టిన యేతకి జాతి ॥పల్లవి॥

కప్పులు దేరేటి కస్తురి చంకలు
కొప్పెర గుబ్బల గొల్లెత
చప్పుడు మట్టెం చల్లలమ్మెడిని
అప్పవి ముందట హస్తిణి జాతి

దుంప వెంట్రుకల దొడ్డ తురుముగల
గంపెన నడపుల గొల్లెత
జంపుల నటనలఁజల్లలమ్మెడిని
చెంపల చెమటల చిత్తిణిజాతి ॥కుంద॥

పేఁపున నఖములు వెడవెడ నాఁటిన
కోపపుఁజూపుల గొల్లెత
చాఁపున కట్టిగఁజలలమ్మెడిని
చావేటి యెలుగున శంకిణి జాతి ॥కుంద॥

గౌరవమున వేంకటపతి కౌఁగిట
కూరిమిఁబాయని గొల్లెత
సారెకు నతతో చల్లలమ్మెడిని
ఖారపుటలపుల పద్మిణి జాతి ॥కుంద॥ (12-92)

పాడి

మూలమూల నమ్ముడుఁజల్ల ఇని
రేలుఁబగలుఁగొనరే చల్ల ॥పల్లవి॥

పిక్కటిల్లు చన్నుల గుబ్బెత వొక కడు
జక్కనిది చిలికిన చల్ల
అక్కనఁజెమటగార నమ్మీని యిది
యెక్కడఁబుట్టదుఁగొనరే చల్ల ॥మూల॥

వడచల్లు మేని జవ్వని వొకతి కడు
జడియుచుఁజిలికిన చల్ల
తడఁబడు కమ్మని తావులది మీ
రెడయ కిపుడుఁగొనరే చల్ల ॥మూల॥

అంకుల కరముల వొయ్యారొకతి కడు
జంకెనలఁజిలికిన చల్ల
వేంకటగిరిపతి వేడుకది
యింకానమ్మీ గొనరే చల్ల ॥మూల॥ (12-229)

ఈ రెండు పాటల్లోను చల్ల అమ్మే వనితల సౌందర్య విలాసాలు వర్ణించబడ్డాయి. 'కుందణంపుమై గొల్లెత' అనే పాటలో చతుర్విధ శృంగార నాయికలయిన హస్తిణి, చిత్తిణి, శంకిణి, పద్మిణి జాతి స్త్రీల లక్షణాలు వర్ణించబడ్డాయి. దీనివల్ల పల్లెప్రాంతాల్లోంచి రకరకాల స్త్రీలు పట్టణాలకు వచ్చి చల్లలమ్మడం, వారి శారీరక సౌందర్య లక్షణాల్ని ఇతరుల సాముద్రిక లక్షణాలతో సమన్వయించుకోవడం ఈ పాటల్లోని విషయం.

## వైద్యం:

శారీరక బాధల్ని ఆ బాధల నివారణను గూర్చి తెలియజేసేది వైద్యం. రోగాల్ని నివారించడానికి ఔషధాలు, అనుపానాలు, ఉపశాంతికర పదార్థాలు ఆయుర్వేదంలో చెప్పబడ్డాయి. ఆయుర్వేదంలో భస్మాలు, లేహ్యాలు, చూర్ణాలు, రసాయనాలు, కషా

యాలనేపి రోగ నివారణ మందులు మందు పుచ్చుకొన్న తర్వాత దానివల్ల నయం కల్పించటం, రోగ దోషాలు పోనటం జరుగుతుంది. ఇలాంటి వైద్యవృత్తి అంశాలకు సంబంధించిన కీర్తనలు అన్నమయ్యలో కనిపిస్తాయి

అన్నమయ్య వైద్యవృత్తి పాటల్ని వ్రాయడానికి మూడు కారణాల్ని చెప్ప వచ్చు. మొదటిది శ్రేష్టులయిన భక్తాదులు గణన, రెండవది విష్ణునామ మహాత్మ్యకీర్తన మూడవది మధుర భక్తి ప్రదర్శన.

భక్తాదుల గణన :

శంకరాభరణం

కొనరో కొనరో మీరు కూరిమి మందు
వునికి మనికి కెల్ల నొక్కటే మందు ॥పల్లవి॥

ధ్రువుఁడు గొనిన మందు తొల్లి యుఁ బ్రహ్లాదుఁడు
చవిగాఁగొనిన మందు చల్లని మందు
భవరోగములు వీడి పారఁగఁ బెద్దలు మున్ను
జవకట్టి కొనిన నిచ్చలమైన మందు ॥కొన॥

నిలిచి నారదుఁడు గొనిన మందు జనకుఁడు
గెలుపుతోఁగొని బ్రతికిన యా మందు
మొలచి నాలుగు యుగముల రాజులు ఘనులు
కలకాలముగొని కడగన్న మందు ॥కొన॥

అర్జునకుఁ బరమాయువై యొసగిన మందు
నిజమై లోకములెల్ల నిండిన మందు
త్రిజగములు నెఱఁగ తిరువేంకటాద్రిపై
ధ్వజమెత్తెఁ గోనేటిదరినున్న మందు ॥కొన॥ (1-237)

సాధారణంగా మందులు అమ్ముకొని జీవించే వాడు ఆ మందులకున్న విలువ తెలియజేస్తూ వీధుల వెంట తిరుగుతాడు. అప్పుడు ఆ మందుల్ని ఎవరెవరు కొనుక్కొని రోగ విముక్తులయ్యారో వారిని కూడా పేర్కొంటాడు.

ఈ కీర్తనలో అన్నమయ్య భవరోగాల్ని పోగొట్టే కోనేది దరినున్న మందు గుణాలు చెబుతున్నాడు. ఆ మందును ధ్రువుడు ప్రహ్లాదుడు, నారదుడు, తదితర పెద్దలు నాలుగు యుగాల రాజులు మొదలయినవారంతా కొని భవరోగ విముక్తులయ్యారు. అలాంటి పరమానంద దాయకమయిన మందును అందరూ కొని ముక్తులు కావాలని వుద్బోధించడం జరిగింది.

నామ మహాత్మ్యం :

ముఖారి

వేదమంత్ర మిఁక నేల వేరువెల్లంకులు నేల
పుడమిధరుఁడు మాకు భవౌషధము ॥పల్లవి॥

హరి యచ్యుతాయంటే నణఁగుఁబాపములు
నరసింహా యని యంటే నాఁటిన దుఃఖములు మాను
పురుషోత్తమా యంటేఁబుండ్లు బూచులు మాను
పరమౌషధ మీతఁడే పాటింప మాకు ॥వేద॥

వాసుదేవ యనియంటే వదలు బంధములెల్లా
వాసికిఁగృష్ణాయంటే వంతల రోగాలు మాను
శ్రీసతీశ యని యంటే చింతలిన్నియును మాను
గాసిదీర నితఁడే పో ఘనదివ్యౌషధము ॥వేద॥

గోవిందా యని యంటేఁగూడును సంపదలు
యీవల మాధవయంటే నిహముఁబరముఁజేరు
దేవ నారాయణ యంటే దేహము సుఖియై యుండు
శ్రీ వేంకటేశుఁడే మాకు సిద్ధౌషధము ॥వేద॥ (I-461)

ఈ కీర్తనలో హరి, అచ్యుతా, నరసింహా, పురుషోత్తమా, వాసుదేవ మొదలయిన దివ్య నామాల్ని జరిపించడం వల్ల పాపాలు, దుఃఖాలు బంధాలు, చింతలు, వంతల రోగాలు మొదలయిన మానసిక రోగాలు పోతాయని అట్టి వాసిని పోగొట్టే దివ్యౌషధమయిన భగవంతుని స్మరించి ఇహపర సౌఖ్యాల్ని పొందుడని ఉద్బోధించడం జరిగింది.

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

వైద్య వృత్తికి సంబంధించిన పాటల్ని కన్నడంలో పురందరదాసు కూడా రచించారని డా॥ కె. సర్వోత్తమన్ గారు 'అన్నమయ్య - శ్రీపాదరాయలు అన్నమయ్య - పురందరదాసు' (పు 58) లో వుదహరించారు.

'ఇదుకొళ్ళి భవరోగ కౌషధము
ఇంద్రియవ వైసువదె ఉదకె ఇచ్ఛాపథ్య
వాసుదేవన నామ వాతవిధ్వంసిని
జనార్దనననామ జ్వరాంకుశ
మాధవన నామవే మనగంద మండూర
మంగళాత్మన నామ మాల్యవసంత'
ఇవనుకొండవర పెసరను పేళువనుకేళి
ముపడి ప్రహ్లాద ముచికుంద ధ్రువను
సదమలె ద్రౌపదియు అజామిళను బదుకిదరు
పరమాత్మ పురందర విఠల నెంబౌషధవు' (కీ. 419)

అన్నమయ్య 'శ్రీహరి పాదతీర్థమే చెడని మందు' అనే కీర్తనలో 'గురుతైన రోగములు గుణము చేసే మందు' అని స్పష్టం చేశారు. పురందరదాసు ఆ రోగాలేమిటో వాటికి తగిన మందులేమిటో ఈ కీర్తనలో విశదీకరించారు. ఇందులో కేశవాది దివ్యనామావళికి కూడ చెప్పబడింది.

మధుర భక్తి :

ఆహిరి

నెలంత జీవనానకు నీవే మందు
చెలి మోహపు విభుడ చేకొనవయ్యా ॥పల్లవి॥

సతిమేని చిత్తజబాసటము మానుపమాటు
తతితో నీయధరామృతము మందు
సతతము చందురుని శాఖాశైత్యము మాన్ప
రతివేళ తాంబూల రసము మందు ॥నెల॥

కాంత కెత్తిన వాయువు కసరు మానుప మాటు
మంతనాన సరసపు మాటలు మందు
రంతుకెక్క విరహతాపము మాన
కాంతుల నీ సోయగపు కనుచూపే మందు ॥నెల॥

అంగనకు కర్పూర పారటము మాన మాటు
కంగులేని యిప్పటినీ కౌఁగిలే మందు
సంగతి శ్రీవేంకటేశ సతి నీవుఁగూడితివి
సంగతి మరపులకు చెనకలే మందు ॥నెల॥ (22-145)

ఇందులో నాయిక విరహాపస్థలనే మానసిక రోగాలకు నాయకుని అధరామృతం సరసపు మాటలు, సోయగపుకనుచూపులు మొదలయిన విలాస చేష్టలే తగిన మందులుగా వర్ణించడం జరిగింది. ఇది మధుర భక్తికి చెందిన కీర్తన. ఇవేగాక అన్నమయ్య 'గురుడిచ్చిన మందు'ను, దాసులు చేపట్టే మందును కూడ వర్ణించాడు. గురుడనడం వల్ల శిరోధార్యమనే భావం. దేవుడనడం వల్ల ఆత్మార్పణ భావం వ్యక్తమవుతుంది.

దేపాక్షి

వెదవేద్యులు వెదకేటి మందు
ఆదినంత్యము లేని ఆ మందు ॥పల్లవి॥

అడవి మందులుఁగషాయములు నెల్లవారు
కడగానక కొనఁగాను
తొడిఁబడనొక మందు దొరకె మాకు భువి
నడియాల మైనట్టి ఆమందు ॥వెద॥

లలిత రసములుఁ దైలములు నెల్లవారు
కలకాలము గొనఁగాను
చెలువైన దొకమందు బేఁటెమాకు భువి
నలవిమీఱిన యట్టియామందు ॥వెద॥

కదిసిన జన్మరోగముల నెల్లవారు
కదలలేక వుండఁగాను
అదన శ్రీ తిరువేంకటాద్రి మీఁది మందు
అదివో మాగురుఁడిచ్చినామందు ॥వేద॥ (1-2)

శంకరాభరణం

శ్రీహరి పాద తీర్థమే చెడని మందు
మోహపాశాలఁగోసి మోక్షమిచ్చే మందు ॥పల్లవి॥

గురుతైన రోగములు గుణము చేసే మందు
దురితములు వెడ బాపే దొడ్డమందు
నిరతము బ్రహ్మాదులు నేరుపుతో సేవించేమందు
నరకము సొరనట్టి నయమున మందు ॥శ్రీహరి॥

పొంకముతో భయములు పొందనియ్యనిమందు
మంకు బుద్ధులు మాన్పించే మందు
పంకజాక్ష వెంకటరమణ ప్రసన్నుని మందు
సెంకించక తన దాసులఁజే పట్టేమందు ॥శ్రీహరి॥
(అన్నమాచార్య చరిత్రఁ పీఠిక, పు. 35)

3. 4. 4 కులవాచక గేయాలు :

కులాలనేవి ప్రారంభంలో వ్యక్తులు చేసే వృత్తుల మూలాన ఏర్పడ్డవే గానీ వ్యక్తుల్ని బట్టి ఏర్పడవి కావు శ్రీకృష్ణ భగవానుడు కూడా —

'చాతుర్వర్ణ్యం మయాసృష్టం
గుణకర్మ విభాగశః
తస్య కర్తారమపిమాం
విద్ధ్యకర్తారమవ్యయమ్' (శ్రీమద్భగవద్గీత కర్మయోగము, 4-13)

అని చెప్పాడు. అంటే మనుషుల్లో వుండే సహజ గుణాలు, వాటివల్ల చేసే క్రియలు, వాటి భేదాల్ని అనుసరించి మనుష్యుల్ని నాలుగు వర్ణాలుగా విభజించడం జరిగిందని అర్థం.

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

ఈ చాతుర్వర్ణ్యాలయిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతల వారు రాను రాను వారి ఇష్టానుసారం వృత్తుల్ని మార్చుకొన్నాగానీ కులాలపేర్లు మాత్రం మారకుండా స్థిరంగా నిలిచాయి. ఈ నాలుగు కులాల్లోను ఒక్కొక్క దానిలో ఎన్నో శాఖోపశాఖలు ఏర్పడసాగాయి. ఈ విధంగా చీలికలు ఏర్పడే సరికి వాటిలో హెచ్చుతగ్గు భేదాలు కూడా ప్రారంభమయ్యాయి. వీటివల్ల మనుష్యుల్లో తారతమ్య భేదాలు కలగడంతో సమాజికంగా అసమానతలు పెరిగాయి. ఇలాంటి భేదాలు కేవలం మనుష్యులకేగాని భగవంతుడికి అందరూ సమానులే.

### అన్నమయ్య కులవాచక గేయాలు వ్రాయడానికి కారణాలు :

అన్నమయ్య కేవలం ఒక్కప్రాంతంలోనే స్థిరంగావుండి జీవితం గడిపినవాడు కాక పోవడం, విస్తృత సంచారం చేసినవాడు కావడం, విభిన్న జాతులతో పరిచయం కలిగినవాడు కావడం, ఆయా ప్రాంతాల్లోని ప్రధాన కులాలవాళ్లలో భక్త్యానురక్తిని పెంపొందించడం, వుదాహరణకు అనంతపురం జిల్లాలో బోయవాళ్లు, కర్నూలు జిల్లాలో చెంచులు ఎక్కువగా వుండడం వల్ల వాళ్ళకు ప్రాధాన్యమివ్వడం భగవంతుడు సర్వాంతర్యామి అని భగవంతునికి కులమతన్యూనతాధిక్యతా భేదాలుండవని నిరూపించడం ప్రధానోద్దేశ్యం. అవతార కథనానికి బాపనయ్య అనే పదాన్ని అన్నమయ్య కీర్తనల్లో వాడుకొన్నాడు. ఈ క్రింది కీర్తనలో నరసింహావతారం, వామనావతారం, పరశురామావతారాలు భంగ్యంతరంగా ఇక్కడ చెప్పబడ్డాయి.

### బ్రాహ్మణ :

అన్నమయ్య సంకీర్తనల్లో బ్రాహ్మడు, బ్రాహ్మలు, బ్రాహ్మణ్యము, బాపనయ్య అనే పదాలు పల్లవి అంతంలో, పాదాంతంలో చరణాంతంలో నిలిపినవి చాలా వున్నాయి. నేటి నిత్య వ్యవహారంలో ఇవన్నీ నిర్దిష్ట కులానికి సంబంధించినవి అయినప్పటికిని అన్నమయ్య వీటిని జాతి మాత్రంగా వాడలేదు. అన్నమయ్య పై పదాలతో వ్రాసిన కీర్తనల్లో మూడు విశేషాలు కనిపిస్తాయి మొదటిది అవతార కీర్తనలు' రెండవది జన్మ చేత కాకుండా వర్తనం చేత బ్రాహ్మలుగా వుండేవారి పద్ధతుల్ని విశదీకరించినవి, మూడవది పరబ్రహ్మ పర్యాయంగా వాడడం.

## కాంబోది

పేగుల జంద్యాలు వేసి పెంచపు నెమలి పురి
పొగగాఁజుట్టిన నా బాఁపనయ్య వీఁడివో ॥పల్లవి॥
బిత్తరై పరువులిడి పిన్నబోడితలతోడ
కొత్తబొమ్మచారియై గోచిగట్టెను
నెత్తురు దానము సేసి సిందిన జడల తోడ
బత్తుఁడైన చక్కని నా బాఁపనయ్య వీఁడివో ॥పేగు॥
... ... ... ...
... ... ... ...
మచ్చిక వేంకటగిరి మరిగి నా కౌఁగిట
పచ్చని దోవతి నా బాపనయ్య వీఁడివో ॥పేగు॥ (12-254)

## శ్రీరాగం - జంపె

అణురేణు పరిపూర్ణుఁడైన శ్రీవల్లభుని
ప్రణుతించు వారువో బ్రాహ్మలు ॥పల్లవి॥
హరినామములనె సంధ్యా విధు లొనరించు
పరిపూర్ణమతులువో బ్రాహ్మలు
హరిమంత్ర వేదపారాయణులు హరిభక్తి
పరులైన వారువో బ్రాహ్మలు ॥అణు॥
ఏది చూచినను హరి యిన్నిటా గలఁడనుచు
భావించు వారువో బ్రాహ్మలు
దేవకీనందనుఁడె దేవుఁడని మతిఁదెలియు
పావనులు వారువో బ్రాహ్మలు ॥అణు॥
ఆదినారాయణు ననయంబుఁదమయాత్మఁ
బాదుకొలిపిన వారు బ్రాహ్మలు
వేదరక్షకుఁడైన వేంకట గిరీశ్వరుని
పాదసేవకులు వో బ్రాహ్మలు ॥అణు॥ (11-3-151)

'బ్రాహ్మణః కులే భావత్వాద్వా బ్రాహ్మణః' అని వ్యుత్పత్తి. బ్రాహ్మణి పర బ్రాహ్మణి విష్టావత్వాత్ బ్రాహ్మణః' పరబ్రహ్మ మందు నిష్ఠగలవాడు బ్రాహ్మణుడు. అట్టి నిష్ఠ గలిగిన వాడుండవలసిన తీరును అన్నమయ్య ఈ కీర్తనలో స్పష్టంచేశాడు

పాడి

ఇట్టి బ్రాహ్మణ్య మెక్కుడు యిన్నిటిలోన
దట్టమై తదియ్యులకె తగును బ్రాహ్మణ్యము ॥పల్లవి॥

..............................

..............................

హరిణోర్ధ్వపుండ్ర దేహులౌటే బ్రాహ్మణ్యము
తిరుమంత్ర విధులదే తేఁకువ బ్రాహ్మణ్యము
సతమై చక్రాంకితుల చకితే బ్రాహ్మణ్యము
పతి శరణాగతియే బ్రాహ్మణ్యము

... ... ... ...

... ... ... ...

అంచఁబరమభాగవతాధీనము బ్రాహ్మణ్యము
పంచసంస్కారాదులదే బ్రాహ్మణ్యము

... ... ... ...

... ... ... ...' (7-252)

మొదటి కీర్తనలో సామాన్య విషయాలు ప్రస్తావింపబడగా, ఈకీర్తనలో వైష్ణవ బ్రాహ్మణ్యం వ్యక్తం చేయబడింది.

మాళవి గౌళ

'పాప మెరఁగని బ్రాహ్మఁడు - యెందుఁ
జూపరాని చోటు చూపేనయ్యా పల్లవి॥

తనివోక జీవము తలకాయనంటుఁడు
పసివడితిని తిన్న బ్రాహ్మఁడు
యెనసి యెదిరి దన్ను నెఱఁగక విభుఁడై

ఘనవంశము మంటఁగలసీనయ్యా ॥పాప॥
ఎవ్వారు నెఱఁగనె యెముకల యింటిలో
పవ్వళింపుచునున్న బ్రాహ్మఁడు
... ... ... ...
... ... ... ... ॥పాప॥

..................................
..................................
తెలిసి వేంకటాదివుని దాసుఁడై
పలుగు పంజరానఁబొదిగీనయ్యా ॥పాప॥ (11-3-80)

ప్రతి జీవిలోను పతమాత్ముడున్నాడు. మక్షికంలోను, మాతంగంలోను వున్న వాడొకడే ఆకారంలో మాత్రం తేడా. ఆత్మలోలేదు. అందువల్ల దేహనిష్టమైన 'బ్రిహ్మను' 'బ్రాహ్మడు'గా లన్నమయ్య కీర్తించాడు.

బౌళి

ఎంత జాఁపనా సోదమింత గలదా
అంతయు నీమహిమే హరిభట్లూ ॥పల్లవి॥

సూరిభట్లొక వంక చొరని చోట్లు చొచ్చి
వారబియ్య మెత్తి యెత్తి వడదాఁకి
నీకు వట్టుగొని భూమి నీళ్లెల్లా వారవట్టీ
కేరికేరి నగవయ్య క్రిష్ణభట్లూ ॥ఎంత॥

దేవరాజు లొకవంక దిక్కులలోఁజాలగూడు
టీవెసతో నాదరగించి తీపుమరిగి
యీవలఁబెట్టిన వారి కేమైనా నొసఁగీని
వేవేలు మాయలు విష్ణుభట్లూ ॥ఎంత॥

సోమయాదు లొకవంక సొరిదె సురలకెల్లా
నామనితో విందు వెట్టీ ననుదినము
హోమపు విప్రులసొమ్ము లొడిసితాఁబుచ్చుకొనీ
వేమరు శ్రీవేంకటాద్రి వెన్నుభట్లూ' ॥ఎంత॥ (6-70)

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

అన్నమయ్య సంకీర్తనల్లో ఒకచోట మాత్రం 'భట్టారక' బిరుదాంకితులయిన బ్రాహ్మణుల పేర్లు రమ్యంగా కూర్చడం జరిగింది.

బోయనాయడు :

గౌళి

పొడవైన శేషగిరి బోయనాయఁడు
విడువ కిందరిఁగాచు వెడబోయనాయఁడు ॥పల్లవి॥

పొలసి మీసాల పెద్దబోయనాయఁడు
మలిగి పేఁపునఁగట్టే మంకు బోయనాయఁడు
పొలము రాజై తిరిగే బోయనాయఁడు
వెలయ మోటున నుండే వేఁట బోయనాయఁడు ॥పొడ॥

పొట్టి పొట్టి యడుగుల బోయనాయఁడు యెందుఁ
బుట్టపగ సాధించే బోయనాయఁడు
బొట్టుల మెకము సేసే బోయనాయఁడు
పుట్టపునెమలి చుంగుబలు బోయనాయఁడు
పొంచి శిగ్గెగ్గెఱఁగని బోయనాయఁడు
మించి రాలమీఁద దాఁటే మెండు బోయనాయఁడు
అంచెల శ్రీవేంకటేశుఁడనే బోయనాయఁడు
పంచఁగాలవేలముల బలుచుబోయనాయఁడు ॥పొడ॥ (1-460)

ఈ కీర్తనలో మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, కృష్ణ, బుద్ధ, కల్క్యాద్యవతారాలు రమ్యంగా తీర్చబడ్డాయి. పైగా బోయీల వేషం, గుణాదుల్ని రమ్యంగా తీర్చాడు. సొలసిన మీసాలు, పొట్టి పొట్టి అడుగులు నెమలి చుంగుల ధారణ మొదలగునవి బోయీల వేషాలు. మంకుతనం, మోటు నివాసం, పగసాధించేగుణం, సిగ్గుబిడియం లేకపోవడమనేవి వారి గుణాలకు సంబంధించినవి. పొడవైన బోయనాయడనడంలో మామూలు బోయీలవంటి వాడు కాడని వేంకటేశ్వరుని కీర్తించడం తెలుస్తుంది. బోయీలను నిందించినట్లు వ్రాయడంతో అన్నమయ్య కవితా రామణీయకత ప్రదర్శితమౌతోంది.

బోయతి :

భగవంతుడొక్కడే పురుష శబ్దవాచ్యుడు. అతడొక్కడే పురుషోత్తముడు. ఇతరులందరు వేషం చేత దేహం చేత పురుషులయినా స్వభావం చేత స్త్రీలే. అందువల్లనే మధుర భక్తిలో భక్తుడు తనను స్త్రీగా భావించి అర్చిస్తాడు. ఆ అర్చనలో తానే నాయిక కావచ్చు. ఇది మధుర భక్తిరీతిలో సాగిన రచన.

కొండ మలహరి

భోగీంద్ర శయనుని బోయతి దివ్య
భోగాలు మరిగిన బోయతి ॥పల్లవి॥

పొదిగొన్న పెనుఁగొప్పు బోయతి మించుఁ
బొదలిన గుబ్బల బోయతి
పొదలఁబూవులు చూచి బోయతి యంప
పొదిసవి వెరచెనె బోయతి ॥భోగీ॥

పొదల గంధపు మేని బోయతిపచ్చి
పొడి కప్పురపుఁబూఁత బోయతి
పొడవైన హరిఁజూచి బోయతి నేఁడు
పుడుకు పేఁదురు గొన్న బోయతి ॥భోగీ॥

పొందైన రచనల బోయతి పతిఁ
బొందక పొందిన బోయతి
పొందులెరఁగని బోయతి రతిఁ
బొందె వేంకటపతి బోయతి ॥భోగీ॥ (12-175)

శ్రీవేంకటేశ్వరుని దివ్య మనోహరాకారాన్ని దర్శించి ముగ్ధురాలై, విరహం పాలై చివరికి అతనిని చేరుకొన్న నాయిక స్థితి ఈ కీర్తనలో వర్ణించబడింది.

చెంచెత :

పారువేట కథల పేరుతో శ్రీమన్నారాయణుడు వేంకటేశ్వరుడు, వేటకు వెళ్ళి రావడం, అమ్మవారు, అతనితో వాదించడం మొదలయిన విషయాలుండే పాటలు

దేవాలయాల్లో పాడతారు. అలాంటి వాటిలో 'వేంకటేశ్వరులవేట' ఒకటి. స్వామివారు అమ్మవారితో కొలువు చేసివున్నప్పుడు చెంచు స్త్రీలు స్వామిని వేటకు రమ్మని పిలవడం. స్వామి అమ్మవారి అనుమతితో వారితో కలసి వేటకు వెళ్ళడం, అమ్మవారికి చేసిన బాసను అతిక్రమించి స్వామివారు అందమయిన ఒక చెంచు స్త్రీని వివాహమాడి రావడం, అందుకు లక్ష్మీదేవి అతనితో వాదులాడడం లోక ప్రసిద్ధమే.

అన్నమయ్య సంకీర్తనల్లో కూడా చెంచు వనితలకు సంబంధించిన కీర్తనలు కనిపిస్తాయి. అన్నమయ్య అహోబల నృసింహ స్వామిపై చాలా కీర్తనలు వ్రాశాడు ఈ అహోబలం కర్నూలు జిల్లా, శిరివోలు తాలూకా నల్లమల శ్రేణిలో వుంది. ఈ అహోబల నృసింహస్వామిని కీర్తించే చాల సంకీర్తనలలో చెంచెతల ప్రసక్తి కనిపిస్తుంది.

సామంతం

సింగార రాయనిఁ (జిట్టి)జెంచెత వేలి
వుంగరాలచేత నన్నొత్తకు నీవనుచు ॥పల్లవి॥

గురువింద పూదమరఁగున నుండి బిగిసీని
సిరివరు నెదుటనే చెంచెత
దొరలకే కాక నెత్తురు మన్ను మాకేల
బురద చెమట నామై పొలసుకఁ పనుచు ॥సింగా॥

గుదిగొన్న మొగలిరేకుల యెన్నుకొనగోరఁ
జిదిమి దేవునిలేసీఁ జెంచెత
గదరుఁ బిల్లుల నేతి కంపు నీవొళ్ళెల్ల
కదియకు నామేను కంటగించీననుచు ॥సింగా॥

కప్పురపుఁ దావి వేంకటపతి కౌఁగిట
జెప్పక యేతులే చెప్పీఁ జెంచేత
దప్పిదేరు తేనెల తనివార నీమోవి
యెప్పుడుఁ బాయక ఇట్టె ఇచ్చేవో యనుచు ॥సింగా॥ (12-146)

ప్రణయకోపం వహించిన నాయిక (చెంచిత) చేష్టల్ని అన్నమయ్య ఈ కీర్తనలో వర్ణించాడు.

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

శ్రీకృష్ణుడు యాదవుల మధ్య పెరిగినవాడు. శ్రీకృష్ణుని బాల్యమంతా రేపల్లె లోనే గడిచింది. అందుచేతనే గొల్లెతలు శ్రీకృష్ణుని వలచడం, కృష్ణుడు వారిని ఏడిపించడం లాంటివి భాగవతంలో బహుధా వర్ణించబడ్డాయి. అన్నమయ్య ఈ దృష్టితోనే గొల్లెతలకు సంబంధించిన కొన్ని కీర్తనలు వ్రాశాడు

గొల్లడా / గొల్లెత :

లలిత

కానీవె గొల్లెతా గబ్బి గొల్లెతా
అనుక తెలుసుకొంటి వవునవురా గొల్లడా ॥పల్లవి॥

పంతకారి గొల్లెతా పదరకు గొల్లెతా
రంతుల నట్టే కానీరా గొల్లడా
యింత గట్టు (ట్టి?) వాయవౌతయెరిగితినే నేను
సంతలోనే వింటిరా నేసాదుడనా తెల్లను ॥కానీ॥

మతకారి గొల్లెతా మంకులాడి గొల్లెతా
రతులకు మా యింటికి రారా గొల్లడా
కతకారివౌత ఇట్టె కానవచ్చెనే నేడు
చతురతలు మోమున జడిసేరా నీకును ॥కానీ॥

చనవరి గొల్లెతా చనవిమ్మి గొల్లెతా
కెలయకు శ్రీ వేంకటగిరి గొల్లడా
పొలతు లందరు నేడు పొగడేరే విన్నును
కలపితి వౌర నిన్ను కమ్మటి మెచ్చితిని ॥కానీ॥ (25-13)

గొల్లెత :

పాడి

వచ్చె (చ్చే) రా మాయమ్మతోడు వన్నెలుగావు నీ
మచ్చరము లెల్ల మాని మందకేగ నియ్యరా ॥పల్లవి॥

సొనబట్టేవె మాటలే చల్లజంపు గొల్లెతా
నేనేమి బాతిరా నీకు నేరజాణా

కానిలే రావైతివిగా గబ్బిచూపు గొల్లెతా
మానము వంకఁజూడక మందకేఁగ నియ్యరా ॥కచ్చె॥ (12-72)

గొల్లకొసరు :

రామక్రియ

కొచ్చి కొచ్చి కొసరేనే గొల్లకొసరు
కుచ్చి యెత్తనే చన్నుల గొల్లకొసరు ॥పల్లవి॥

చేరువనుండి నన్నుఁజెనకీ నదివో వాఁడు
గోఁకొనల నొత్తవే గొల్లకొసరు
మారుకొని నీతోనిట్టె మాఁట లాడ వచ్చీని
కూరిమఁదిట్టగదవే గొల్లకొసరు ॥కొచ్చి॥ (13-489)

గొల్ల బోయిడా :

భైరవి

కొంగు వట్టకంత గొల్లబోయిఁడా
కుంగక నీకు మొక్కేము గొల్లబోయిఁడా ॥పల్లవి॥

పొలసు మాటలు గొల్లబోయిఁడా నీ
కోఁము దాఁచకు పోయి గొల్లబోయిఁడా
పొలము మేపకు గొల్లబోయిఁడా
కొలువు కంబము చాటు గొల్లబోయిఁడా ॥కొంగు॥ (28-98)

**3. 4. 5 ఉత్సవ కీర్తనలు :**

'ఉతవ్యాతే సుఖమితి ఉత్సవ' సుఖమును బుట్టించునది. సువతి సేరయతి జనానితినా ఉత్సవః' జనులను ప్రేరేపించునది. అని అమరంలోని ఉత్సవ శబ్దవివరణ. భగవంతునికి సంబంధించిన ఉత్సవాలు జాతి మత కుల భేదం, వున్నత నీచ వర్గ వ్యత్యాసం లేకుండా జరుపబడేవి కాబట్టి అందరికీ సంతోషాన్ని కలిగించేవి. ఇలాంటి సందర్భాల్లో వేడుక చూడడం, పాటలు పాడడం సహజం.

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

అన్నమయ్యలో ఉత్సవాన్ని తెలియజేసే కీర్తనలున్నాయి. వాటిలో రథోత్సవ మొకటి. అన్నమయ్య రథోత్సవ కీర్తనలు చాలా వ్రాశాడు. వాటిలో మచ్చుకు కొన్ని —

### శ్రీ

దేవదేవోత్తముని తిరుతేరు
దేవతలఁ గొలువఁగా తిరుతేరు ॥పల్లవి॥
తిరువీధులేగీని తిరుతేరు
తిరుపుఁగొన్నట్లాను తిరుతేరు
తెరలించె దనుజులఁదిరుతేరు
తిరిగె దిక్కులనెల్ల తిరుతేరు ॥దేవ॥

ధిక్కరించే మోతలఁదిరుతేరు
దిక్కరి కుంభాలదరతిరుతేరు
తక్కము తేరి కుచ్చుల తిరుతేరు
తెక్కులఁ బ్రతాపించీఁదిరుతేరు ॥దేవ॥

తీరిచెఁగలక వెల్లఁదిరుతేరు
ధీర గరుడ వాహపుఁదిరుతేరు
చేరి యలమేలుమంగతో శ్రీవెంకటేశ్వరుని
తీరున నెలకున్నట్టి తిరుతేరు ॥దేవ॥ (11-1-24)

### సాళంగ నాట

మిన్ను నేలా నొక్కటైన మేటి తేరు
కన్నుల పండు వయిన శ్రీకాంతుని తేరు ॥పల్లవి॥
పలధుల మీఁదను చక్కఁగా నేఁగెను తేరు
బలిమిఁగులాద్రులపైఁబారెను తేరు
వెలుచు లంక ముంగిట పేరెలు వారెను తేరు
చెలఁగె దిగ్విజయపు శ్రీహరి తేరు ॥మిన్ను॥ (6-227)

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

మాళవి గౌళ

రెక్కల కొండవలె మీఁద బ్రహ్మాండము వలె
వెక్కసమైన తేరుపై వెలసీని దేవుఁడు ।పల్లవి॥

బిఱబిఱఁదిరిగేటి పెనుబండికండ్లతో
గుఱుతైన పడగెల గుంపులతో
తఱితో ధరణిఁ గ్రక్క దలఁగదలెను తేరు
మెఱసీ వీధివీధుల మేటియైన దేవుఁడు (॥రెక్క॥ 8-145)

పాడి

అప్పఁడైన హరి యెక్కి నడివో తేరు
యిప్పుడు తిరువీధుల నేఁగీ తేరు ॥పల్లవి॥

సముద్రాలమీఁదఁ దోలె సర్వేశ్వరుఁడు తేరు
భ్రమయ జరాసంధువైఁ బరపెఁ దేరు
తిమురుచు రుక్మకుపైఁ దిరుగఁ దోలెఁ దేరు
ప్రమదాన సృగాలునిపైఁ దోలెఁ దేరు ॥అప్ప॥ (10-35)

మాళవి గౌళ

నానావర్ణముల నడగొండ వలెను
దానవారి తేరదె తగ తిరు వీధుల
కదలె కదలె నదె గరుడధ్వజుని తేరు
అదె మిన్ను మోచిన నీలాద్రి వలెను
యెదిరె నెదిరె నదె యిందిరాధిపుని తేరు
కదిసి చుక్కలు మోచె కనకాద్రి వలెను ॥నానా॥ (10-55)

ఈ కీర్తనలన్నిటిలోను 'తేరు' అనే మాట ఆవృత్తి అయింది. బహుశః వీటిని రథోత్సవ సమయంలో అన్నమయ్య పాడి వుండవచ్చు: లేదా కొంతమంది భక్తులు కలిసి సామూహికంగా పాడివుండవచ్చు.

పెళ్ళి పాటలు :

స్వామికి జరిగే ఉత్సవాల్లో కల్యాణోత్సవం కూడా ఒకటి. ఆ సమయంలో పాడే పాటలు పెళ్ళిపాటలు వీటిలో కల్యాణపాటలు, గంధం పాటలు, నలుగు పాటలు, కొట్నాల పాటలు, అక్షతలు చల్లే పాటలు, వధూవరుల పాటలు, అలుక పాటలు, కట్నాల పాటలు, పతిభక్తి పాటలు మిథున విడెములపాటలు అయిరేణి పాట లన్నీ బాగాలే.

ఉత్సవ సమయంలో పాడే పెళ్ళిపాటలు :

నేడు తిరుమల తిరుపతి దేవాలయాల్లో కల్యాణోత్సవం అతివైభవంగా జరగ డానికి దీన్ని ఆధారంగా తీసుకొని తెలుగు ప్రాంతాల్లోని వైష్ణవాలయాలల్లో ఈ వుత్సవం జరిపే ఆచారం కొత్తగా వెలయడానికి తాళ్ళపాక కవులే ముఖ్యకారకులు. స్వామికి జరిపే కల్యాణోత్సవ సందర్భంలో పాడిన పెళ్ళిపాటలు అన్నమయ్య కీర్త నలలో వున్నాయి.

సామంతం

పసిఁడి అక్షంతలివె పట్టరో వేగమె రారో
దెసలఁ బేరంటాండ్లు దేవుని పెండ్లికిని ॥పల్లవి॥

శ్రీ వేంకటేశ్వరునికి శ్రీమహాలక్ష్మికి
దైవికపుఁబెండ్లి ముహూర్తము నేఁడు
కావించి భేరులు మ్రోసె గరుడ ధ్వజంబెక్కె
దేవతలు రారో దేవుని పెండ్లికిని ॥పసి॥

కందర్ప జనకునికి కమలా దేవికిఁబెండ్లి
పందిలి లోపలఁదలఁబాలు నేఁడు
గందము విడెమిచ్చేరు కలువడాలు గట్టిరి
అందుక మునులు రారో హరి పెండ్లికిని ॥పసి॥

అదె శ్రీవెంకటపతి కలమేలు మంగకును
మొదలి తిరునాళ్లకు మొక్కేము నేడు
యెదుట నేఁగేడు వీరె యిచ్చేరు వరములివె
కదలి రారో పరుషమునుల పెండ్లికి ॥పసి॥ (8-194)

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

ఈ కీర్తనలో గరుడధ్వజారోహణం, తలంబ్రాలు, గంధవిడెం ఇవ్వడం మొద లైన ఆచారాలు వర్ణింపబడ్డాయి. దీన్ని మొదలి తిరుణాళ్లుగా పేర్కొనడం జరిగింది. ఇది చైత్రమాసంలో జరిగేది కావచ్చు. సంవత్సరంలో తొలి వుత్సవం కావడం మొదలి తిరుణాళ్లయి వుండవచ్చు.

ఇలాగే వుత్సవ పెళ్ళి పాటలకు సంబంధించిన మరికొన్ని కీర్తనలు :

'గరుడ ధ్వజం బెక్కె కమలాక్షు పెండ్లికి
పరుషలదివో వచ్చె సేవించను' (8-21)

'దేవకామినులాడఁతో దివ్యదుందుభులు మోసె
దేవుఁడు కోనేటి దండఁదిరువీధి మెరసే' (18-4)

సిగ్గరి పెండ్లికొడుకు చెలుల ముందర నెల్లా
యెగ్గెరఁగక మెరసీ నిదివో యనుచు' (24-73)

ఈ కీర్తనల్లోని వధూవరులు అలమేల్మంగా వేంకటేశ్వరులు. పేరంటాండ్లు సరస్వతి, పార్వతి మొదలయిన దేవతా స్త్రీలు. రంభాది అప్సరసలు, దేవతలు మునులు పరిచార జనం.

### లోక వ్యవహారంలోని పెళ్లి పాటలు :

'రాములు చూడరారమ్మ, రఘువంశాబ్ధిసోముని పెండ్లి నేడమ్మ
సీతాకల్యాణ మహోత్సవ సమయము చూతాము రారే చెలీ
లక్ష్మీకల్యాణ వైభోగమే, రామా కళ్యాణ వైభోగమే
రుక్మిణీ కృష్ణుల కల్యాణము వారిజాక్షులార చూడరారే
శ్రీ పార్వతీ శంకరుల కల్యాణము, సేవించరే వేడుకా'151అ

### నలుగు పాటలు :

'కమ్మలు కడియాలు కస్తూరి బావిరీలు
నలుగూకు రావె సీతమ్మ
నీపాలిటి దేవుడు ఏను గోపాలసామి
నీకంటెచ్చయినోడె పిలిచి ఉండాడు

నలుగూకు రావె సీతమ్మ
అత్తారు పన్నీరు సిత్తారి గిన్నెలతో
ఏగఏగను రావె సీతమ్మ
నలుగూకు రావె సీతమ్మ
గుండూ పళ్లెములోన గుమతాయె హా నలుగు"152

'నలుగూకు రారా నాదిపినోదా
వేగమే రావయ్యా వేణుగోపాలా
మల్లెపువ్వులే చెండ్లు గట్టారే
మనముడ నాచేతి చెండ్లందుకోరా ॥నలుగూకు॥

చేమంతి పువ్వులే చెండ్లు గట్టారే
సరసుడ నాచేతి చెండ్లందు కోరా
పారిజాతములే చెండ్లు గట్టారే
పద్మడ నాచేతి చెండ్లందుకోరా' ॥నలుగూకు॥513

'నలుగిడరారా దశరథ రాజకుమారా సతితో నీవు
దశరథునింటిలో శిశువుగ నుంటివి
సురులయాగము లెల్లకాచీ రక్షించితివి ॥నలుగిడ॥

తల్లి కైకేయి మాట తప్పక వింటివి
అరణ్యమునకు బోయి సీతను పోగొట్టి
ఆ జటాయువెల్లా రావణుడిని తెలిసి
సేతుబంధన చేత లంకకు బోతిని ॥నలుగిడ॥154

అన్నమయ్యలోని వధూవరుల్ని పరిహసిస్తూ పాడే పాటలు :

వధూవరుల వేషధారణలు, అలంకరణలు, వారి విలాసాదుల్ని పరిహాస పూర్వకంగా వర్ణిస్తూ యువతులు పాడే పాటలు.

శ్రీ రాగం

'పిడికిటి తలంబ్రాల పెండ్లి కూంతురు కొంత
పెడమరలి నవ్వీనె పెండ్లి కూంతురు ॥పల్లవి॥

పేరుకల జవరాలే పెండ్లి కూఁతురు పెద్ద
పేరుల ముత్యాల మేడ పెండ్లి కూఁతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లి కూఁతురు విభుఁ
బేరుకుచ్చ సిగ్గువడీఁబెండ్లి కూఁతురు'
బిరుదు పెండెము వెట్టె బెండ్లి కూఁతురు నెర
బిరుదు మగనికంటెఁ బెండ్లి కూఁతురు
పిరిదూ (పిరుఁదూ?) రినప్పుడె పెండ్లి కూఁతురు పతిఁ
బెరరేఁచీ నిదివో పెండ్లికూఁతురు ॥పిడి॥

పెట్టెనె పెద్దతురము పెండ్లి కూఁతురు నేఁడె
పెట్టెఁడు చీరలు గట్టెఁ బెండ్లి కూఁతురు
గట్టిగ వేంకటపతి కౌఁగిటను వడి
వెట్టిన నిధానమైన పెండ్లి కూఁతురు ॥పిడి॥ (12-185)

ఈ కీర్తనలో ప్రతి పాదాంతంలోను పెండ్లి కూతురు అనే మాట అవృత్తి అయింది. ఇందులో పేరంటాండ్ల మధ్య కూర్చొని సిగ్గుపడుతున్న పెండ్లి కుమార్తెను మగని పేరు చెప్పమని యువతీ జనం వుడికించడం వర్ణించబడింది.

ఇలాగే పెండ్లి కుమార్తె రూప సౌందర్యానికి, ముగ్ధ స్వభావానికి సంబంధించిన మరికొన్ని కీర్తనలు :

'ఎంత తపము చేసితో యీకెకు గాను
మంతు కెక్కె నీకు గల్గె మంచి పెండ్లి కూఁతురు' (20 529)
'ఎవ్వరి నేరుపు కెంచే మిందులోనను
వువ్విళ్లూరి మీలో మీకు వొనదగూడె వలపు' (24-76)

పెండ్లికొడుకు నుద్దేశించి పాడినవి :

బౌళి

పెట్టని కోటిందరికిఁబెండ్లి కొడుకు బొమ్మఁ
బెట్టె నసురలనెల్ల బెండ్లి కొడుకు ॥పల్లవి॥

పెల్లగించి భూమెత్తీ పెండ్లికొడుకు వాఁడె
పిల్లఁగోవి రాగాల పెండ్లికొడుకు
పెల్లైన యావుల పెండ్లికొడుకు వాఁడె
పిల్లఁదీపు పెన్నుద్ది పెండ్లి కొడుకు ॥పెట్టసి॥

పెంచెపు శిరసుపాగ పెండ్లి కొడుకు గుం
పించిన కోపగించేఁబెండ్లి కొడుకు
పెంచకప్పుఁడే పెరిగెఁబెండ్లి కొడుకు వల
పించేఁజక్కని సిరిఁబెండ్లి కొడుకు ॥పెట్టసి॥

పెంటపెరుగుల దొంగ పెండ్లి కొడుకు భూమి
బెంటిపోతులఁగూరిచెఁబెండ్లి కొడుకు
గెంటులేని వేంకటగిరి మీఁదను వాఁడె
పెంట పెట్టుకున్నవాఁడు పెండ్లి కొడుకు ॥పెట్టసి॥ (12-186)

ఈ కీర్తనలో ప్రతిపాదాంతంలోను 'పెండ్లికొడుకు' అనే మాట ఆవృత్తి అయింది. ఇందు వరహావతారం, కృష్ణావతారం, రామావతారం, పరశురామావతారం వామనావతారం, మొదలైన భగవంతుని అవతార అంశాలు పేర్కొనబడ్డాయి.

వివాహ కార్యక్రమాల్ని గూర్చి పేరంటాండ్లు పాడే పాటలు :

వివాహ సందర్భంలో వధూ వరులకు చేయవలసిన ఆచారాల్ని నిర్వర్తించమని స్త్రీలు పేరంటాండ్లకు ఆదేశించడం వీటిలో కనిపిస్తుంది.

సాళంగ నాట

పేరఁటాండ్లు వాడరే పెండ్లివేళ
సారెసారె నిద్దరికి సంతోషవేళ ॥పేర్ల వి॥

చిత్తజు తల్లికి వేగ సింగారించరె మీరు
తత్తరించే రతి ముహూర్తపు వేళ
హత్తితలఁబాలు నారాయణునిఁబోయుమనరే
బొత్తుల నిద్దరికిని బువ్వపువేళ ॥పేర॥

పాలవెల్లి కూఁతురుకు పసపులు నలఁచరే
చాలించరే జోలి పీడు చదివేవేళ

పాలుపడి పరపులు పరచరే దేవునికి
నాలుగో దినము నేఁడు నాగవెల్లి వేళ ॥పేర॥

అంది బాగాలియ్యరే అలమేలు మంగకును
కందువ శ్రీవేంకటేశుఁగలసే వేళ
గందమూఁగస్తూరి నీరె ఘనరతి నలసిరి
కుందక యిద్దరు సేఁకగొలువుండే వేళ ॥పేర॥ (20-182)

ఈ కీర్తనలో అలమేల్మంగా వేంకటేశ్వరులకు జరుగుతున్న శుభసందర్భంలో పాటలు పాడమనడం, పెండ్లికుమార్తెకు పసుపు సింగారించ మనడం, పెండ్లికొడుకును తలంబ్రాలు పోయమనడం మొదలైన వైవాహిక సంబరాల్ని వర్ణించడం జరిగింది.

ఇలాగే మరొక కీర్తన —

సాళంగం

అదె వేంకటపతి అలిమేలు మంగయును
కదిసివున్నారు తమకమున బెండ్లికిని ॥పల్లవి॥

బాసికములుఁగట్టరో పైపై దంపతులకు
శేసపాలంచియ్యరో చేతులకును
సూసకాల పేరంటాండ్లు సోబాన బాడరో
మోసపోక యిట్టే ముహూర్త మడుగరో ॥అదె॥ (20-366)

కోడతిరునాళ్ళ పాటలు :

తమిళంలో 'కోడై' అంటే వేసవి అని అర్థం. వేసవికాలంలో జరిగే ఉత్సవాలు కోడ తిరునాళ్ళు. ఇవి చిత్తిరైపంగుణి మాసాల్లో జరుపబడుతుండేవి. అన్నమయ్యలో కోడతిరునాళ్ళకు సంబంధించిన కీర్తనలు కనిపిస్తాయి.

సాళంగ నాట

శ్రీవేంకటేశ్వరుఁడు శ్రీయలమేల్మంగ తోడ
కోవిదుఁడై విహరించె కోడతిరుణాళ్లు ॥పల్లవి॥

వెల్లవిరిగా పీదుల వెన్నెలలు గాయఁగా
చల్లని పూవులవాన జడి మించఁగా
వొల్లనే సతులుఁదన్ను వుగ్గళించి పొగడఁగా
కొల్లలాడీ వలపులు కోడతిరుణాళ్లు ॥శ్రీ వేం॥

ఆటల పాటల వాఁడు అండనే వినిపించఁగా
పాటించి యారగింపులు పైపై జేయఁగా
గాటముగ పీడెములు గండములు నందుకొంటా
కోటి భోగాలు భోగించి కోడతిరుణాళ్ల ॥శ్రీ వేం॥

చేరి పన్నీరు కప్రము శిరసున గులుకఁగా
వూరక యిందరు కొలుపులు సేయగా
యీరీతి శ్రీవేంకటేశుఁడిందరు సతుల గూడి
కోరికల వెదచల్లి కోరతిరుణాళ్ల ॥శ్రీ వేం॥ (20-240)

సామంతం

అప్పుఁడు వేంకటరాయఁడలమేలుమంగఁగూడి
కుప్పలుగా భోగించేఁ గోడతిరునాళ్ల ॥పల్లవి॥

చిలి చీనాంబరముల సింగారపు మేడనుండి
వీథుల సన్నగాళెలు విసుకొంటాను
పూని విహరించి, వచ్చి పొందుగా నుయ్యాలలూఁగి
కోనేటిదరి మెరసీఁగోడతిరుణాళ్ల ॥అప్ప॥

ఆముకొన్నపన్నీట సద్దిన దుప్పటి తోడ
దోమటి పూవుదండలు దూలాడఁగా
కోమలపు టెలుఁగుల కొమ్మలు లావులు వాడ
గోమున నవధరించీఁగోడ తిరుణాళ్ళ ॥అప్ప॥

అడగడుగుకు విడేలందు కొంటా సంకీర్తన
తడయక భాగవతులెచ్చి పాడఁగా

గొడుగులు బడగలు కోటి చామరము లిడ
గుడిచిన వినోదించీ గోద తిరుణాళ్ళు ॥అప్ప॥

నానావాద్యాలతో నట్టువలు గడించఁగా
పాఁపట్టి మంచిమంచి పాత్ర లాడఁగా
అనుక కోలాటములు అంతనింతఁ జూచుకొంటా
కోనేటిరాయఁడు మెచ్చీఁ గోద తిరుణాళ్ళు ॥అప్ప॥

వరుసతో విణ్ణాపఁజిపాడు తాళము లొత్తుచు
పొరిఁ బొరి ద్రావిడాన బొగడఁగాను
విరులు యేకాంగులు విన వీధిఁ జల్లగాను
గురుతరముగ మించీఁ గోదతిరుణాళ్ళు ॥అప్ప॥

పప్పులు సుడ్డెనలును పావకాలు ఫలములు
అప్పటిప్పటికిఁ బై పై నారగింపుచు
చెప్పరాని మహిమల శ్రీవేంకటేశ్వరుఁడు
కుప్పళించీ వాసనలఁ గోదతిరునాళ్ళు ॥అప్ప॥ (24-281)

ఈ కీర్తనల్లోని చరణాంతాల్లో 'కోదతిరుణాళ్ళు' అనేమాట ఆవృత్తి అయింది. ఇవి ఒకరు ఒకపాదం పాడుతుంటే మరొకరు మరొక పాదం పాడే పద్ధతిలో లేదా పాదాంతంలోని పదాల్ని సామూహికంగా వుచ్చరించే పద్ధతుల్లో వున్నట్లు అనిపిస్తాయి.

## 3. 4. 6. పరిశిష్టం :

జానపదగేయాల్లోని అనేక పల్లవుల్ని అన్నమయ్య తీసుకొన్నాడు. ఆ పల్లవులకు అర్థం వుండవచ్చు. లేకనూ పోవచ్చు. కాని ప్రసిద్ధమయిన పల్లవులతో (ఆవృత్తి పదాలతో) కూడినవే మూడవ ప్రకరణంలో చర్చించడం జరిగింది. జానపదాల్లోని పల్లవుల్ని కూడా గ్రహించి జానపద గేయధోరణిలో వ్రాయడం అన్నమయ్య ప్రత్యేకత. వీటిలో జాలిపాట, సొసముఖాలు మొదలయిన వాటిని చెప్పవచ్చు. తుమ్మెద చిలుక పదాలు చివర గలిగిన వాటిని తుమ్మెద పదాలు, చిలుక పదాలన్నట్లు వీటిని కూడా జాలిపాటలు, సొసముఖాలు అని చెప్పడానికి వీలుంది. మచ్చుకు కొన్ని —

జా లి పా ట :

శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు శెట్టిగారు —

జాలవారు అంటే కాపలా కాసేవాళ్లని అర్థం. వాళ్లు పలికే వూతపదంగా 'జాలి' ఏర్పడినట్లుందని' అభిప్రాయపడ్డారు 154అ

డా॥ ఆర్వీయస్ సుందరంగారు —

'జాలో జాలి'కి పాటలో సూచింపబడిన అర్థాన్ని తీసుకోవడం భావ్యంకాదు పాటలో పల్లవికి అర్థం తప్పక ఉండాలనే నియమంలేదు. లాలి, వుయ్యాల, జాజర ఇలాంటివన్నీ అర్థం వుంటే వుండవచ్చు లేకున్నా లేకపోవచ్చు. జానపద గేయాల్లోని అనేక పల్లవుల్ని అన్నమయ్య తీసుకొన్నాడు. బహుశా 'జాలి' అనే పల్లవి ఆయన కాలంలో వుండివుండవచ్చు 'పంట' లాంటి పల్లవి ఈనాడు కనిపించదు. కాని అన్నమయ్యలో వుంది, 'తుమ్మెద' అనే పల్లవి వుంటే ఆ పాటలోని భావానికి సంబంధముందని చెప్పలేం కదా. అలాగే 'జాలి' అన్నది అన్నమయ్య కాలపు ఒక పల్లవి అనవచ్చు.

'జాలి' అంటే కన్నడంలో తుమ్మచెట్టు. తెలుగులోనూ ఆ అర్థం వుంది. బెట్ల పేరుగల కొన్ని వూతపదాలున్నాయి. 'జాలి' అంటే కుచ్చు (గొడుగు మొదలగువాటి చివర వుండేది (బంగారు కుచ్చు మొదలైన అర్థాలు చెప్పుకోవచ్చు. కన్నడంలో కూడా 'జాలి' అనే పల్లవి జానపదగేయాల్లో ఎక్కడా కనిపించలేదు' అని జాలిపాటను గూర్చి అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు 154ఆ

పై అభిప్రాయాన్ని బట్టి చూస్తే జాలి పాటలకు ప్రత్యేకించి ఒక నిర్వచనం చెప్పడానికి వీలుబడదు. ఎందుకంటే ఇంతవరకు వెలువడిన జానపద సాహిత్య గ్రంథాల్లోగానీ, పూర్వ కవుల కావ్యాల్లోని జానపదగేయాల ప్రసక్తుల్లోగానీ, 'జాలి' అనే పదం వున్నట్లు కనిపించదు. కాబట్టి 'జాలి' అనే మాట కేవలం వూతపదంగా కల్గిన పాటగా చెప్పవచ్చు.

రా మ క్రి య

తెండో ఒండో మాటాలించరో మీరు
కొండల రాయనినే పేర్కొన్నదిదె జాలి ॥పల్లవి॥

మితిమీరెఁజీకట్లు మేటి తలవరులాల
జతనము జతనము జాలో జాలి
యితవరులాల వాయించే వాద్యాలకంటె
నతి ఘోషముఁ దోడ ననరో జాలి ॥వెండో॥

గాములు వారెడి పొద్దు కావలి కాండ్లాల
జాము జాముఁదిరుగరో జాలో జాలి
దీమసపు పారివార దివెపంజులు చేఁబట్టి
యేమరక మీలో మీరు యియ్యరో జాలి ॥వెండో॥

కారుకమ్మెనదుగోయి గడచెఁగట్టిక వరి
సారె సారెఁబలుకరో జాలో జాలి
యీరీతి శ్రీ వేంకటేశుఁడిట్టె మేలుకొన్నాఁడు
గారవానసిఁక మానఁగదరో జాలి' (10-166)

ఈ కీర్తనలో ప్రతి చరణాంతంలోనూ 'జాలి' అనే మాట, ప్రతిచరణంలోని రెండవపాదాంతంలో 'జాలోజాలి' అనే మాట పూతగా కనిపిస్తుంది.

రాజప్రాసాదాల్లో రాత్రులందు తలారులు, కావలికాండ్రు, పెండె బెత్తాలవాళ్ళు రకరకాలు చప్పుళ్ళు చేస్తూ, చేతుల్లో దివిటీలు పట్టుకొని గస్తీ తిరుగుతారు. అప్పుడు వాళ్ళు ఒకరికొకరు 'జాలో జాలి' అని హెచ్చరించుకుంటూ కర్తవ్యాన్ని నిర్వహించడం వ్యక్తమవుతుంది.

ఈ కీర్తనను అంతరంగికంగా పరిశీలిస్తే ఆధ్యాత్మికతత్త్వం గోచరిస్తుంది. మానవ శరీరమే ఒక ప్రాసాదం. తలారులు, కావలికాండ్లు, పారివారు, వాద్యాలవాళ్ళు మొదలయినవాళ్ళే పంచభూతాలు, అజ్ఞానాంధకారంలో కామక్రోధాది అరిషడ్వర్గాలనే అంతశ్శత్రువులకు లోబడి అలమటిస్తున్న మానవునికి ఈ కీర్తన ఒక హెచ్చరిక అవుతుంది.

సాసముఖాలు :

డా॥ వేటూరి ఆనందమూర్తిగారు — ఇది పరాకు హెచ్చరిక వంటి పదబంధమని, సంబుద్ధి పదం కాదని, 'సాసముఖా' అంతం గల సవరచనలే సాసముఖాలని అభిప్రాయపడ్డారు.[154అ]

శ్రీ. గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు — సముఖము + సముఖము (సముఖ + సముఖ) అని పరాకు వచనానికి అన్నమయ్య చేసిన తెలుగు అమ్రేడితసంధి రూపముగా వ్యాఖ్యానించారు.[154] ఈ

వీటిని స్వామివారి ఉత్సవ కీర్తనలుగా చెప్పుకోవచ్చు.

'షోడశకళానిధికి షోడశోపచారములు
జాడతోడ నిచ్చలును సమర్పయామి' (16-134)

అనే కీర్తనలో క్రమంగా స్వామివారి అర్ఘ్యపాద్యాచమానాల్లో మంత్రాసనం, మజ్జనమందు స్నానాసనం, వస్త్రాలంకారాల్లో అలంకారాసనం, నైవేద్యంలో భోజ్యాసనం వర్ణింపబడ్డాయి. ఈ వివిధాసనాల్లోని స్నానాసనంలో స్వామివారున్నప్పుడు తాళ్ళపాకవారి కాలంలో వీటిని పాడేవారని తెలుస్తుంది.

ధన్నాసి

సందడి విడువుము సాసముఖా
మందర ధరునకు మజ్జనవేళా ॥పల్లవి॥

అమరాధిపులిడు డాలపట్టములు
కమలజపట్టము కాళాంజి
జమలి చామరములు చంద్రుడు సూర్యుడు
అమర నిడుదురు పరమాత్మునకు ॥సంద॥

అణిమాది సిరుల నలరెదు శేషుడు
మణిపాదుకలిడు మతి చెలగా
ప్రణుతింపు కదిసి భారతీ రమణ
గుణాధిపు మరుగురు బలుమరు ను ॥సంద॥

వేదఘోషణము విడువక సేయుదు
ఆదిమునులు నిత్యాధికులు
శ్రీదేవుండగు శ్రీ వేంకటపతి
ఆదరమున సిరులందీవాడె ॥సంద॥ (1-12)

ఈ కీర్తనలో పల్లవి మొదటి పాదాంతంలో 'సాసముఖా' అనే పదం ప్రయోగింప బడింది. ఇందులో వేంకటేశ్వర స్వామి స్నానమాడే వేళలో దేవేంద్రుడు,

లక్ష్మీదేవి, సూర్య చంద్రులు, ఆదిశేషుడు, మునులు మొదలైన వాళ్ళు తమకు తగిన ఉపచారాలు చేయడం వర్ణింపబడింది.

సామంతం

సింగారమూరితివి చిత్తజగురుడవు
సంగతిఁజూచేరువిలిమ్ము సాసముఖా ॥పల్లవి॥

పూవుల తెప్పల మీఁద పొలతులు నీవు నెక్క
పూవులోకసము మోవఁబూచి చల్లుచు
దేవ దుందుభులు మ్రోయ దేవతలుఁగొలువగా
సావధాన మగు నీకు సాసముఖా ॥సింగా॥

అంగరంగవైభవాల నమర కామినులాడ
నింగినుండి దేవతలు నిన్నుఁజూడ గా
సంగీత తాళవాద్య చతురతలు మెరయ
సంగడి దేలేటి మీకు సాసముఖా ॥సింగా॥

'పరగఁగోనేటిలోన పసిఁడి మేడ నుండి
అరిది నిండరయు నీవారగించి
గరిమ శ్రీవెంకటేశ కన్నుల పండువగాఁగ
సరవి నోలాడు మీకు సాసముఖా ॥సింగా॥ (7-237)

ఈ కీర్తనలో 'సాసముఖా' అనే పదం ప్రతి చరణాంతంలోను ఆవృత్తి అయింది. ఇందులో దేవతలు కొలుస్తుంటే అప్సరసలు అతి వైభవంగా నాట్యం చేస్తుంటే, సంగీత తాళ వాద్యాలు మ్రోగుతుంటే శ్రీ వెంకటేశ్వర స్వామివారు కోనేటి సమీపంలోని పసిడి మేడలో కన్నుల పండువుగా తులతూగడం వ్యక్తమవుతుంది.

ఇలాగే మరికొన్ని కీర్తనలు :

'సాసముఖా నడె సాసముఖా
ఆసల పరివారము అవధారు దేవా' (9-97)

'సముఖా యెచ్చరిక వో సర్వేశ్వరా
అమరె నీ కొలుపు ప్రహ్లాద వరదా' (11-1-194)

'సముఖా అవధారు సర్వేశ రాఘువేంద్ర
అమరులు హరి వో చిత్తావధానా' (18-527)

ఇంత వరకు అన్నమయ్య సంకీర్తనల్లోని జానపద గేయ వరుసల్ని దిఙ్మాత్రంగా పరిశీలించడం జరిగింది. ఇంక సంగీత విశేషాలు అనే అంశం నాల్గవ ప్రకరణంలో చర్చింపబడుతుంది.

'సారంబులు హరి కరుణా
సారంబులు విబుధ నికర సంపూర్ణ సుధా
హారంబులు బహు దేశ వి
హారంబులు తాళ్ళపాక యన్నయ పదముల్'

## సంఖ్యాసూచి

1. తాళ్ళపాక కవుల పదకవితలు, భాషా ప్రయోగ విశేషాలు. పుట. 3
2. ,, ,, పుట. 3-4
3. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము, పుట 53
4. అన్నమాచార్య చరిత్ర, పుట. 11
5. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము, పుట. 50
6. ,, పుట 51
7. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 400-403
8. తెలుగులో కొత్తవెలుగులు (మొ. సం) పుట. 185-188
9. మేలుకొలుపులు (వ్యాసం) పు. 202-203
10. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 340
11. మేలుకొలుపులు (వ్యాసం), పుట. 24
12. ఏగంటి వారి వచనాలు, కాశపత్రపతి, డి. 24-94
13. తెలుగు కన్నడ జానపద గేయాలు, పుట. 81
14. వ్యాస సంగ్రహము, పుట. 258

15. మధుర కవితలు, పుట 478
16. అన్నమయ్య పాటలలో జానపద రీతులు, (వ్యాసం)
17. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 318
18. తాళ్ళపాక కవుల పదకవితలు భాషా ప్రయోగ విశేషాలు, పుట 340-342
19. శ్రీ జగన్నాథర దార కృతి గళు, పుట. 6
20. స్వీయ సేకరణ
21. వ్యాస సంగ్రహము, పుట 241
22. తెలంగాణా గ్రామిక గేయాలు, పుట. 113
23. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట 349
24. అన్నమయ్య పాటలలో జానపద రీతులు, (వ్యాసం)
24. అ. తెలుగు జానపదగేయ సాహిత్యము, పుట. 436
25. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 311
26. తాళ్ళపాక కవుల పదకవితలు - భాషా ప్రయోగ విశేషాలు, పుట 340-48
27. వివేచన (వ్యాసం) పుట. 119-129
28. తెలుగు స్త్రీల పాటల వైశిష్ట్యం (వ్యాసం) పుట. 91
29. వివేచన, పుట. 119-129
30. ఆంధ్ర దేశపు జానపద పాటలు. పుట. 34
31. జానపద సాహిత్యోద్ధారకుడు (వ్యాసం) పుట. 39-40
32. తెలుగు జానపదగేయ సాహిత్యము. పుట. 457-558
33. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 321
34. తాళ్ళపాక కవుల పదకవితలు, భాషాప్రయోగ విశేషాలు, పుట. 342
35. వ్యాస సంగ్రహము, పుట. 261.
36. స్త్రీల పాటలుం పుట. 11
37. స్వీయ సేకరణ
38. శ్రీవాదిరాజర కృతిగళు, పుట. 342
39. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము, పుట. 69-76
40. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 51
41. తాళ్ళపాక కవుల పద కవితలు - భాషా ప్రయోగవిశేషాలు. పుట, 346

42. తెలుగు - కన్నడ జానపద గేయాలు, పుట. 162:
43. తెలుగు జానపద సాహిత్యము, స్త్రీల గేయములలో సంప్రదాయము, పుట. 250
44. తెలుగు జానపద సాహిత్యము స్త్రీలగేయములో సంప్రదాయము, పుట. 250
45. తెలంగాణా పల్లెపాటలు (మొదటి భాగం) పుట. 53
46. దేశి సారసత్వము పల్లెపదాలు పుట. 63
47. ఆంధ్ర జ్యోతి. (వారపత్రిక)
48 పల్లెపదాలలో ప్రజా జీవనము, పుట 3 0
49. తెలుగు జానపదగేయ సాహిత్యము. పుట.
50. మధుర కవితలు, పుట. 524
51. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 51
52. జానపద గేయాలు, పుట. 166
53' ఏగంటి వారి వచనములు, డి. 2195 తాళపత్రప్రతి
54. మధుర కవితలు, పుట. 494
55. మధుర కవితలు, పుట. 5'3
56. ఏగంటి వారి వచనాలు, తాళపత్రప్రతి డి బి. 938
57. ,, ,,
58 వైష్ణవ పదములు కాగితపు వ్రాతప్రతి, పుట 227
59. అ. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట 327
58. అ. అన్నమాచార్య సంకీర్తనామృతము, ద్వితీయభాగము, పుట. 2
59. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 276
60. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 327
61. స్త్రీల పాటలు, పుట. 103
62. సెలయేరు. పుట. 4
63. అన్నమయ్య పాటలలో జానపద రీతులు, (వ్యాసం)
64. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 281
65. తాళ్ళపాక కవుల పదకవితలు, భాషాప్రయోగ విశేషాలు, పుట. 359
66. పల్లెపదాలు, పుట. 92

67. మధుర కవితలు, పుట. 29
68. అన్నమయ్య పాటలలో జానపద రీతులు, (వ్యాసం)
69. మధుర కవితలు, పుట. 277
70. మధుర కవితలు, పుట. 278
71. తాళ్ళపాక కవుల పదకవితలు - భాషాప్రయోగ విశేషాలు, పుట. 364
72. వ్యాస సంగ్రహము, పుట. 6
72. అ అన్నమయ్య పాటలలో జానపద రీతులు (వ్యాసం)
72. ఆ. అన్నమయ్య పాటలలో జానపద రీతులు (వ్యాసం)
73. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 387-398
74 ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 246
75. త్యాగరాజ కీర్తనలు విశేష వివరణము (ప్రథమ సంపుటము) పుట. 66
76. తెలుగు కన్నడ జానపద గేయాలు, పుట. 163-164
77. పల్లెపదాలలో ప్రజా జీవనము, పుట 225-227
78. జానపద సాహిత్య సంపద-కోలాట పాటలు (వ్యాసం) పుట. 18
79. మావూరి కోలాటం (వ్యాసం) పుట. 26
80. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 398
81. తెలంగాణా పల్లె పాటలు, (మొదటి భాగం) పుట. 90
82. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 399
83. సెలయేరు పుట.
84. తెలంగాణా పల్లె పాటలు, (మొదటి భాగం) పుట. 91
85. మధుర కవితలు, పుట. 87
86. ఏగంటివారి వచనాలు, తాళపత్ర ప్రతి, డి. ఓ. 939
87. స్త్రీల పాటలు (రెండవ భాగం) పుట. 42
88. పల్లెల పొద్దు పొడిసింది. పుట. 17
89. జానపద గేయాలు (రెండవ సంపుటి), పుట. 17
90. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 572
91. పల్లె పదాలలో ప్రజా జీవనము, పుట. 402
92. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 574

93. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 347
94. ఆంధ్ర దేశపు జానపద పాటలు పుట. 11
95 స్వీయ సేకరణ
96. తెలుగు జానపద గేయ సాహిత్యము. పుట 403-408
97. వివిధ మంగళహారతులు, పుట. 57
98. స్వీయ సేకరణ
99) సువ్వాలి పాట (వ్యాసం) పుట. 77-78
100. తాళ్ళపాక కవుల పదకవితలు భాషా ప్రయోగ విశేషాలు. పుట. 339
101 సువ్వాలి పాట (వ్యాసం) పుట. 77-78
102. ఏగంటివారి వచనాలు తాళపత్రప్రతి
103. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర. పుట 334
104. తాళ్ళపాక కవుల పదకవితలు - భాషా ప్రయోగ విశేషాలు, పుట. 337
105. వివిధ మంగళ హారతులు, రెండవ భాగం
106. వివిధ మంగళ హారతులు. రెండవ భాగం
107. తెలుగు కీర్తనములు వ్రాతప్రతి 149 9
108. కన్నడ ఛ్ఛందస్సిన చరిత్రె, పుట. 651
109. కన్నడ ఛ్ఛందస్సిన చరిత్రె, పుట. 651
110. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 315
111. మధుర కవితలు, పుట. 107-109
112 త్యాగరాజ కీర్తనలు, విశేష వివరణము, (ప్రథమభాగము) పుట. 200
113 తెలంగాణా పల్లె పాటలు, మొదటిభాగం పుట. 3
114. స్వీయ సేకరణ
115. తెలుగు కన్నడ జానపద గేయాలు, పుట. 137
116. ఆంధ్ర దేశపు జానపద పాటలు, పుట. 49
117. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 472
118. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 342
119. లాలి పాటలు (వ్యాసం) పుట. 199-203
120. తెలుగు కన్నడ జానపద గేయాలు, పుట. 136

121. ఏగంటివారి వచనాలు, తాళపత్ర ప్రతి
122. వ్యాస సంగ్రహము, పుట. 239
123. స్వీయ సేకరణ
124. దేశి సారస్వతము, స్త్రీల రామాయణపు పాటలు, పుట. 53
125. ఆంధ్ర పత్రిక, పుట. 18
126. తెలుగు జానపదగేయ సాహిత్యము, పుట. 172
127. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 324
128. త్యాగరాజ కీర్తనలు, విశేష వివరణము (ప్రథమ భాగము) పుట. 219
129. తెలుగు కీర్తనలు, కాగితపు వ్రాతప్రతి
130. స్వీయ సేకరణ
131. ఆంధ్ర దేశపు జానపద పాటలు, పుట. 47
132. తెలుగు కన్నడ జానపద గేయాలు, పుట. 144
133. తాళ్ళపాక కవుల పదకవితలు భాషా ప్రయోగ విశేషాలు పుట. 336
134. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 338-340
135. మంగళ గీతములు (వ్యాసం) పుట. 421-423
136. తెలుగు కీర్తనములు కాగితపు వ్రాతప్రతి, 149/9
137. తెలుగు కీర్తనములు కాగితపు వ్రాతప్రతి,
138. వివిధ మంగళ హారతులు (రెండవ భాగము)
139. ఏగంటివారి వచనాలు తాళపత్రప్రతి.
140. తెలుగు కన్నడ జానపద గేయాలు, పుట 101
141.
142. స్వీయ సేకరణ
143. తెలంగాణా పల్లె పాటలు, మొదటి భాగం, పుట. 1[illegible]
144. స్వీయ సేకరణ
145. అన్నమయ్య శ్రీపాదరాయలు
అన్నమయ్య పురందరదాసు, పుట. 61
146. తాళ్ళపాక కవుల పదకవితలు భాషాప్రయోగ విశేషాలు, పుట. 34

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

147. తాళ్ళపాక కవుల పదకవితలు భాషప్రయోగ విశేషాలు, పుట 31

148. దేశి సారస్వతము పల్లెపదాలు, పుట. 248

149. దేశి సారస్వతము స్త్రీలరామాయణపు పాటలు, పుట. 19

150. దేశి సారస్వతము, స్త్రీలరామాయణపు పాటలు, పుట. 377

151 దేశి సారస్వతము స్త్రీల రామాయణపు పాటలు, పుట. 391

151.అ. తెలుగు జానపదగేయ సాహిత్యము, పుట 479

152. తెలుగు కన్నడ జానపద గేయాలు, పుట. 156

153. స్వీయ సేకరణ

154. స్వీయ సేకరణ.

154.అ. ఆంధ్రప్రభ, వారపత్రిక, పుట. 26

154.ఆ. ఆర్వీయస్. సుందరంగారు నాకు వ్రాసిన లేఖ తేదీ. 28-9-83

154.ఇ. తాళ్ళపాక కవుల పద కవితలు - భాషా ప్రయోగ విశేషాలు.

పుట. 478

154.ఈ. అధ్యాత్మిక సంకీర్తనలు, సంపుటము-1, పుట. 42.

# ౪. అన్నమయ్య సంకీర్తనల్లో సంగీత విశేషాలు

## 4. 1. సంగీతక్రమ వికాశం :

లలిత కళల్లో సంగీతం హృద్యమయింది. 'గీతం వాద్యం తథానృత్తం త్రయం సంగీత ముచ్యతే' గీతం, వాద్యం, నృత్తం ఈ మూడింటిని సంగీత మంటారు. సంగీతం ఆపాత మధుర మయింది. భారతీయ సంగీతం పాశ్చాత్య సంగీతం కన్నా ప్రాచీనమయింది అట్టి ప్రాచీన సంగీతక్రమ వికాసాన్ని ఎనిమిది యుగాలుగా విభజించవచ్చు. చరిత్రాతీతప్రాచీన యుగం, వేదయుగం, గాంధర్వ యుగం, ఆఖ్యానయుగం, ధృవాగానయుగం, రాగకావ్యయుగం, గీతగోవిందయుగం, దేశభాషా సంకీర్తన యుగం

### 4. 1. 1. చరిత్రాతీత ప్రాచీన యుగం :

ఋగ్వేద కాలానికి ముందు నుంచీ కూడా వేదమంత్రాల్ని ఒకే స్వరంతో పలికేవారు. దీన్ని ఆర్చికపద్ధతి లేదా ఏకస్వర గాయన పద్ధతి అంటారు. తర్వాత ఋగ్వేదకాలంనాటికి గాథిక పద్ధతి లేదా ద్విస్వర గాయనపద్ధతి, ఆ తర్వాత సామికము లేదా త్రిస్వర గాయన పద్ధతే రానురాను 'స్వరాంతర' లేదా చతుస్వరి గాను, పంచస్వరి గాను, షట్స్వరిగాను ఓవరికి సప్తస్వరి గాను పరిణామం చెందింది.

### 4. 1. 2. సామగానయుగం :

వేదాల్లో సామవేదం సంగీత ప్రధానమయింది. సామగానానికి వికార, విశ్లేష వికర్షణ, అభ్యాస విరామ స్తోభ మొదలయిన విన్యాసాలున్నాయి. ప్రబంధాలు, ఋక్కులు, గాథలు, ఈ యుగంనాటివే. ఈ యుగంలోనే స్వరసప్తకంతో కూడిన స్థాయి పరిజ్ఞానం కలిగింది. దీనివల్ల సంగీత శాస్త్రాభివృద్ధికి ప్రధాన బీజారోపణ జరిగిందని చెప్పవచ్చు. మంద్ర, మధ్య తారాలనే మూడు స్థాయిలూ, ఒక్కొక్క స్వరసప్తకం, ఇత్యాది పరిజ్ఞానం ఋక్ ప్రాతిశాఖ్యలో మొదటిసారి వెల్లడి అయింది.

### 4. 1. 3. గాంధర్వయుగం :

ఈ యుగానికే మార్గయుగమని కూడా పేరు. నాలుగు ఓటాలే గాకుండా సామవేదం నుండి బయలుదేరిన సంగీతాన్ని 'గాంధర్వవేద' మన్నారు. సదాశివుడు,

బ్రహ్మ, నారదుడు, తుంబురుడు, కంబళుడు, అశ్వతరుడు, ఆర్జునుడు, ఆంజనేయుడు మొదలయిన పురాణపురుషుల పేర్లతో సంగీత, నాట్య శాస్త్రాలు వెలువడ్డాయి. మార్గసంగీత రచనలు శివస్తుతి పరాలు. బ్రహ్మచేత వెదకబడి 'మృగయతే' సంపాదింపబడ్డవి కాబట్టి వీటిని మార్గాలన్నారు

4. 1. 4. ఆఖ్యానయుగం :

ఇతిహాసాలయిన రామాయణ మహాభారతాది గ్రంథాల్ని ఆఖ్యాన గానానికి వుపయోగించేవారు. ఇద్దరు గాయకులు వీణను వంతగా పెట్టుకొని ఏడు విధాలైన జాతుల్లో ఆఖ్యానాల్ని గానం చేసేవారు. సప్త స్వరాల్లోని షడ్జం నుంచీ మధ్యమం నుంచీ, గాంధారం నుంచీ ఒక్కొక్క దాన్ని ఆధార శ్రుతిగా తీసుకొని పై ఏడు స్వరాలతో కలుపుకొని, గ్రామమని ఆనాడు రాగాల్ని వ్యవహరించేవారు. క్రమేణ భరతుని నాట్యశాస్త్రం వచ్చేసరికి గాంధార గ్రామం వ్యవహారంలో లేకుండా పోయింది

4. 1. 5 ధ్రువాగాన యుగం :

దేశ భాషల్లోని ప్రబంధ రీతుల్ని పరిశీలించి వాటిని ఆదరంతో స్వీకరించి వాటికి లక్షణాలు చెప్పడం ఈ యుగంలోని ప్రత్యేకత. ఈ యుగంలో భరతుడు, నారదుడు, మతంగుడు, మమ్మటుడు, పార్శ్వదేవుడు చాళుక్య సోమేశ్వరుడు ప్రసిద్ధులు భరతుడు తన నాట్య శాస్త్రంలో సంగీత శాస్త్ర విషయాల్ని ఆరు అధ్యాయాల్లో చెప్పాడు. అవి జాతి లక్షణ విధానం, ఆతోద్యజాతి విధానం, సుషిరాతోద్యాధికారం, తాళ విధానం, ధ్రువాధ్యాయం, పుష్కర వాద్య విధానం, వీటిలో మొదటిమూడు అధ్యాయాల్లోనూ మూర్ఛనల ప్రసారం ద్వారా జాతుల్ని ఎలా గ్రహించాలో, వాటిని ఆయా వాద్యాలపై ఎలా ప్రయోగించాలో వివరించాడు. తాళ విధానంస్పష్టం, ధ్రువాధ్యాయం ఆనాటి ధ్రువాగానం అనబడే గేయ రచనల ఫణితుల్ని గురించి చెప్పింది. శ్రీ, ప్రతిష్ట, సుప్రతిష్ట, విద్యుద్భ్రాంతి, భూతలమాన్య, కమలముఖి, ఘనపంక్తి, తనుమధ్య, శాలిని, మకరక శీర్ష, విమల, సునంద, లలిత, పంక్తి, నలిని, సిలతోయా, ద్రుతగతి, భ్రమరమాల భోగవతీ మొదలయిన దరువులు ఒకటి రెండు వందల వరకు ధ్రువారీతుల్ని భరతుడు సలక్షణంగా వివరించాడు. భరతుని ధ్రువారీతులు చాలవరకు సంస్కృత ప్రాకృత ఛందస్సుల్లో వుంటాయి. భరతుని తరువాత ప్రసిద్ధుడు నారదుడు.

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

నాట్యశాస్త్రం తర్వాత ప్రసిద్ధ గ్రంథం నారదీయ శిక్ష. దీన్ని నారద మహర్షి వ్రాశాడని ప్రతీతి రాగాల ప్రశంస తగుమాత్రంగా కనబడే తొలి గ్రంథం. నారదీయ శిక్ష. ఇందులో షాడ్జి, మాధ్యమి అను గ్రామరాగాలు రెండు ఆరు స్వరాలు మాత్రమే తీసుకొనే షాడవపంచమం, సాధారితం, కైశికం. కైశికమధ్యమం, వివరింపబడ్డాయి.

త్యాగరాజుకు వుపదేశ గురువుగా దర్శనమిచ్చి 'స్వరార్ణవ' మనే లక్షణ గ్రంథాన్నేగాకుండా 'సంగీత మకరంధం' 'చత్వారింశచ్ఛత రాగ నిరూపణం' అనే సంగీత గ్రంథాల్ని కూడా నారదుడే రచించినట్లు ప్రతీతి సుహతీ వీణాగానలోలుడు, విష్ణుభక్తుడు, త్రిలోకసంచారి అనిపించుకొన్న నారదుడే ఈ గ్రంథాల్ని రచించాడో లేకుంటే ఆపేరుగల్గిన వేరే వ్యక్తులు రచించారో తెలియదు.

నారదుని తరువాత ప్రసిద్ధుడయిన లాక్షణికుడు మతంగుడు. ఇతని గ్రంథం బృహద్దేశి, శృతి నిర్ణయం, స్వరనిర్ణయం, మూర్ఛనా తానాలు, 33 అలంకారాలు గమకాల్ని పోలి వుంటాయి. జాతులు, రాగలక్షణం. భాషా లక్షణం, ప్రబంధాధ్యాయం బృహద్దేశిలో వున్న అధ్యాయాలు.

మార్గపద్ధతికి భిన్నంగా దేశ వ్యవహారసిద్దంగా లక్షణాలు చెప్పడం బృహద్దే ప్రత్యేకత. వాటి నుండి భాషా రాగాలు, విభాషారాగాలు, అంతర భాషా రాగాలు వచ్చాయని పేర్కొన్నాడు గ్రంథంపేరు రాగాల్లో టక్కటోట్ల, సౌరాష్ట్రి, గుజ్జరి, ఆంధ్రి, మాలవి, షోడ్డోదీచ్య, గాంధారోదీచ్య, సౌవీర, ఆభీరి. హిందోలక మొదలయినవి చాలవరకు ఆయా దేశాలకు సంబంధించిన పేర్లను కలిగి వుండడం గమనిస్తే అనాడు దేశంలో బహుళ్రితంగా వుంటున్న రాగాల్ని మతంగుడు క్రోడీకరించాడని తెలుస్తుంది. అతడు తనకు ముందున్న గ్రామ, జాతి పద్ధతితో సమన్వయం చేసుకుంటూ, రాగలక్షణాన్ని ప్రత్యేక పద్దతిలో శాసించి తర్వాత లక్షణ కర్తలకు మార్గదర్శకుడయ్యాడని తెలుస్తుంది.

మతంగుని తరువాత ప్రసిద్ధుడు మమ్మటాచార్యుడు. ఇతడు 'కావ్యప్రకాశిక' అనే అలంకార శాస్త్రాన్ని రచించడమేగాకుండా 'సంగీతరత్నమాల' అనే లక్షణ గ్రంథం కూడా వ్రాసినట్లు తెలుస్తుంది. (1050-1150, ఇందులో షడ్దవరాటి,

ద్రవిడ వరాటి, దేశ వరాటి, దక్షిణ, సౌరాష్ట్రి గుజ్జరలు టక్క, ఘంటారవ, నట్ట నారాయణ, శంకరాభరణ మొదలయిన దేశిరాగాల ప్రశంస కనబడుతుంది.

మమ్మటుని తరువాత ప్రసిద్ధుడు పార్శ్వదేవుడు. ఇతడు (క్రీ.శ. 1165) 'సంగీతసమయసారం' అనే గ్రంథాన్ని రచించాడు. ఈ గ్రంథంలోని చాలా అంశాలు శార్ఙ్గదేవునికి సంగీత రత్నాకరానికి కల్లినాథసింహ భూపాలుడు రచించిన వ్యాఖ్యానాల్లో వుల్లేఖింపబడ్డాయి.

పార్శ్వదేవుని తర్వాత ప్రసిద్ధుడు చాళుక్య సోమేశ్వరుడు. ఇతడు క్రీ.శ. 1174-77 ప్రాంతంలో కల్యాణి నగరం రాజధానిగా పరిపాలించాడు. ఇతడు అభిలషితార్థ చింతామణి లేదా మానసోల్లాసం, సంగీత రత్నావళి అనే సంగీత శాస్త్ర గ్రంథాలు రచించాడు. చాళుక్య సోమేశ్వరుని తరువాత సోమనాథుడు వ్రాసిన స్వరార్ణవం, స్వరరాగ సుధారసం గ్రంథాలున్నాయి. కాని ఇతడు పాల్కురికి సోమనయో కాడో తేలని అంశం.

సోమనాథునికీ, శార్ఙ్గదేవునికి ఇంచుమించు సమకాలికుడు. ఆతడు ఆంధ్రదేశాన్ని ఏకచ్ఛత్రంగా ఏలిన కాకతీయ గణపతి దేవుని కొలువులో గజసైన్యాధిపతి. 'నృత్త రత్నావళి' అనే నాట్యశాస్త్ర గ్రంథాన్ని 'గీతరత్నావళి' అనే సంగీత లక్షణ గ్రంథాన్ని రచించాడు. నృత్తరత్నావళిలో 40 విధాల దేశిలాస్య విశేషాల్ని వర్ణించాడు. 5వ అధ్యాయంలో 'పదాసాభిః స్ఫుటం గీత రత్నావళ్యాం ప్రపంచితః' అని వ్రాశాడు. పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో వివరించిన దేశి యగాన విశేషాలకు గీత రత్నావళి చాలా దగ్గరగా వుండవచ్చు. వాద్యరత్నావళి అనే గ్రంథాన్ని కూడా జాయపసేనాని రచించినట్లు ప్రతీతి. కాని గీత, వాద్య రత్నావళి గ్రంథాలు అలభ్యాలు. భారతదేశానికంతకూ ప్రామాణికుడయిన సంగీత లక్షణకర్త అయిన శార్ఙ్గదేవునికి సమకాలికుడుగా ఆంధ్రదేశీయుడయిన జాయపసేనాని నాట్యసంగీత లక్షణ గ్రంథాలు వ్రాయడం గొప్పవిషయం.

జాయపసేనాని తర్వాత ప్రసిద్ధుడు శార్ఙ్గదేవుడు. ఇతడు 1200-1247 ప్రాంతంలో దేవగిరి రాజధానిగా పరిపాలించిన యాదవ వంశరాజయిన సింహళ భూపాలుని ఆస్థాన పండితుడు. ఆంధ్ర దేశీయులయిన కల్లినాథుడు, దరిమిలా సర్వ

జ్ఞసింహభూపాలుడు సంగీత రత్నాకరానికి వ్యాఖ్యాతలు కావడం బట్టి చూస్తే గ్రంథం పుట్టుక మహారాష్ట్రంలో అయినా, దీనిలోని సంప్రదాయం దేశంలోని అన్ని రాజ్యాల గాన పద్ధతుల్ని పరిశీలించి రచించినట్లు తెలుస్తుంది ఈ గ్రంథంలో సర్వ గతాధ్యాయం, రాగవివేకాధ్యాయం ప్రకీర్ణక, ప్రబంధ, తాళ, వాద్య, నృత్తాధ్యాయాలనే ఏడు అధ్యాయాలున్నాయి.

## 4. 1 6 రాగకావ్యయుగం :

అభినవ గుప్తాచార్యుడు తన అభినవ భారతిలో రాగకావ్యాలనే ప్రబంధాల్ని గూర్చి చెప్పాడు ఇతడు టక్కరాగంలో పాడవలసిన రాఘవవిజయ కావ్యం, కకుభరాగంలో మారీచ వధకావ్యం దృష్టాంతాలుగా వుదహరించాడు.

## 4. 1. 7. గీతగోవింద యుగం :

ధ్రువపదయుగంనాటి లక్షణాలు, రాగకావ్య లక్షణాలు కలుపుకొని అనేక రాగాలలో అనేక ధ్రువాపదాల్ని మధ్యమధ్య శ్లోకాలతోను, భక్తి శృంగారాత్మక ఇతివృత్తంలో సర్గలుగా విభజింపబడ్డ ఈ గీత గోవిందం తరువాతి యుగ లక్షణానికి మార్గదర్శి అయింది.

## 4 1. 8 దేశ భాషాసంకీర్తన యుగం :

ఇది 12వ శతాబ్దం దేశిగేయ రచనా రీతుల్ని గ్రహించి వాగ్గేయకారులు తమ తమ మాతృభాషల్లో సంకీర్తనల్ని రచించడం ప్రారంభించిన కాలం. కృష్ణమాచార్యుని సింహగిరి నరహరి వచనాలు, ఆంధ్రభాషలో తొలిగేయరచనలు. ఇవి తాళగ్రంథాలే గాని తాళ బద్ధాలుకావు. ఈ యుగంలో కన్నడంలో హరిదాసులు, తెలుగులో తాళ్ళపాక కవులు వేలాది సంకీర్తనలు వ్రాశారు.

## 4. 2. సంగీతంలో మార్గ దేశి విభాగాలు :

సంగీత శాస్త్ర గ్రంథాల్లో 'మార్గ-దేశి' భేదాలకు లక్షణ నిర్దేశం చేయబడింది. గీతం, వాద్యం, నృత్తం అనే మూడును సంగీత మనబడుతుందని ఆ సంగీతం మార్గ-దేశి భేదాలచే ద్వివిధాలని, బ్రహ్మాదులచే సృష్టించబడి, పరమేశ్వరసముఖంలో భరతా

దులచేత సంస్కృతంలో ప్రయోగింపబడింది. 'మార్గ' అని ఆయా భాషల్లోఆయా దేశీయులయిన ప్రజలకు హృదయ రంజకమయ్యేది 'దేశి' అని శార్ఙ్గదేవుడు (క్రీ.శ. 1230) సంగీత రత్నాకరంలో ఇలా చెప్పాడు —

"గీతం వాద్యంతథా నృత్తంత్రయం సంగీతముచ్యతే
మార్గోదేశీతి ద్వ్యధాతత్రి మార్గస్స ఉచ్యతే
యోమార్గితో విరించాద్యైః ప్రయుక్తోభరతాదిభిః
దేవస్యపురతశ్శంభోః నియతోభ్యుదయప్రదః
దేశేదేశే జనానాం యదుచ్యాహృదయరంజకం
గీతంచవాదనం నృత్తం తద్దేశీత్యభిధీయతే"

(సంగీతరత్నాకరము ప్రథమ భాగము, పు. 188)

నియమ సహితములు, శాస్త్రీయమయినది మార్గరాగమని, స్థిర నియమ రహితమయినది దేశి రాగమని కూడా శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరంలో మార్గదేశి రాగాల్ని వివరించాడు. బుద్ది గమ్యమయినది మార్గసంగీతం. హృదయ రంజకమయినది దేశి సంగీతం

వాల్మీకి విరచిత రామాయణాన్ని కుశలవులు 'మార్గ విధానం'లో పాడినట్లు వాల్మీకి రామాయణంలో వుంది

తతస్తుతారామవచః ప్రచోదితా
వగాయతాం మార్గవిధానసంపదా
సచాపి రామః పరిషద్గతశ్శనై
ర్బుభూషయా సక్తమనాబభూవ'

(బాలకాండము, చతుర్థ సర్గ, శ్లో. 31)

దీన్నిబట్టి వాల్మీకి రామాయణ కాలం నాటికే సంగీతంలో మార్గ దేశి భేదాలు ప్రచారంలో వున్నట్లు తెలుస్తుంది. తంత్రీలయ బద్ధంగా నియమపూర్వకంగా సంప్రదాయ సిద్ధంగా సంస్కృత భాషా రచితాలయిన కావ్యాల్ని గానం చేయడం 'మార్గ పద్ధతి' అని, ప్రాకృత భాషా రచితాలయిన గేయాల్ని పాడడం 'దేశిపద్ధతి' అని రామాయణ వ్యాఖ్యాతలు అభిప్రాయపడ్డారు.

ఈ విభేదాలకు అనుబంధమయిన సంకీర్తనం, పదం, కీర్తన, కృతి, స్వరూపం పరిశీలించడం సమంజసం.

సంకీర్తనం :

మన నిత్య వ్యవహారంలోని 'పాట' అనే మాటకు దైవత్వ ధర్మం జోడయినపుడు సంకీర్తనం, పదం కీర్తన, కృతి అనే పర్యాయ పదాల రూపం పొందుతుంది.

'కృాత సంశబ్దనే' కీర్తించేది సంకీర్తనం. సమ్యక్ కీర్తనమ్ సంకీర్తనమ్' 'గీయత ఇతి గీతం' అని సంకీర్తన శబ్దానికి వ్యుత్పత్తి.

క్రీ. శ. 13వ శతాబ్దంలో వెలసిన కృష్ణమాచార్యుడు తన వైష్ణవవచన రచనల్ని సంకీర్తనలని, ధ్యాన సంకీర్తనలని పేర్కొన్నాడు. చిన తిరుమలాచార్యుడు 'మహనీయంబగు సంకీర్తన నామకపద సంప్రదాయం బెట్టిదనిన'155 అని పేర్కొనడం వల్ల సంకీర్తన, పదం, అనేవి పర్యాయ పదాలని తెలుస్తుంది.

డా॥ వేటూరి ఆనందమూర్తిగారు —

'అవాఙ్మానసగోచరమగు దివ్యశక్తిని కీర్తించి పాడునది కీర్తనము లేక సంకీర్తనమైనది. ఇట్లు గేయమానమగు కీర్తనమే భక్తుని హృదయమును పరమాత్మునిసాన్నిధికి గొంపోవునది'156 అని అభిప్రాయపడ్డారు.

పదం :

పద శబ్దానికి 'పదగతౌపద్యతే అనేన ఇతి పదమ్' అని వ్యుత్పత్తి. అంటే పొందబడింది అని అర్థం. 'పదం వ్యవసితి త్రాణస్థాన లక్ష్మాంఘ్రివస్తుషు' అని అమరం. పద శబ్దానికి ఉద్యోగం, రక్షణ, స్థానం, చిహ్నం, అడుగు, వస్తువు అనే అర్థాలున్నాయి

పద శబ్దానికే పాదం, పద్యపాదం, పద్య చరణం, అడుగుపెట్టిన గుర్తు ఇసుకలోనయిన చోట్ల కనబడే పాద చిహ్నం, ఆశ్రయం, అధికారాదిస్థానం, వాక్యం, సుబంత తిజంతాలు, వేదమంత్రాల విభాగం, వ్యాజం, కపటం, త్రాణం, ప్రయత్నం, పాట, గీతి భేదం మొదలయిన అర్థాల్ని సూర్యరాయాంధ్ర నిఘంటువు పేర్కొంది. పదమనే మాట చాలా ప్రాచీనమయింది. భరతుడు తన నాట్య శాస్త్రంలో —

'గాంధర్వం యన్మయా ప్రోక్తం
స్వరతాళ పదాత్మకం
పదం తస్య భవేద్వస్తు
స్వరతాళాను భావకం
యత్కించిదక్షర కృతం
తత్సర్వం పద సంజ్ఞికం'[157]

అని పేర్కొన్నాడు. సర్వ తాళ పదాత్మకమయింది గాంధర్వమని, సర్వ తాళాను భావకమయిన పదమే వస్తువని, అర్థసహితమయిన అక్షరాలతో కూడింది 'పద' మని అర్థం.

రంగాజమ్మ మన్నారు దాసవిలాస నాటకంలో —

"శృంగార రసతరంగిత పద కవితాస్ని మహనీయమతి స్ఫూర్తితో" (పు. 52) రచించినట్లు తెలుస్తుంది.

శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు —

"రాగము తాళము రెండును సమాన బలముగల మూల ద్రవ్యములు పదకవితకు. ఇట్టిరచనకు 'పదము' అను పేరు తెలుగులో చాలా ప్రాతది. పాల్కురికి సోమనాథుని కాలముననే ఆ సంకేతనామము స్థిరమైనట్లు ఆతడు పేర్కొన్న 'నిబాళి పదములు గొబ్బిపదములు' మొదలైన ఎన్నో వివిధ రచనలు స్పష్టంగా తెలుపు చున్నవి... తెలుగు నందును కన్నడమునందును భాగము అను అర్థను పోయి 'పదము' అనగా నిండుపాట అనియే అర్థము నిలిచినది. తాళ్ళపాక బయకారులు పదము అను సంకేతము నెరిగియున్నను తమ రచనలకు 'సంకీర్తనములు' అనియే పేరు పెట్టుకొన్నారు. ఆ రచనల ప్రధానోద్దేశం భగవద్గుణాను గానముగనుక. కాని యీవల శృంగార రసమయమై రాగతాళనిబద్ధమైన రచనకు 'పదము' అను సంకేత నామము వాడుట సంగీత రసికుల సంప్రదాయమైనది'[158] అని పేర్కొన్నారు.

కె. వి. శ్రీనివాసయ్యంగారు —

'పదకవిత అంటే చాలా కాలంగా కీర్తనలు గేయాలు వంటి కవిత మాత్రమే నన్నభావం కవి పండిత విమర్శకుల్లో పొరపాటుగా ఏర్పడివున్నది.' పాటల పరంగా

'పద' శబ్దంచేత అనేక విధాలైన పాటలు ఛందోపరంగా - రసాలపరంగా భావాల పరంగా, రాగ తాళాల పరంగా ఎన్ని విధాలైన పాటలున్నాయో అన్నీ గ్రాహ్యాలే అవుతాయని'159 అభిప్రాయపడ్డారు.

కీర్తన :

కీర్తన అంటే కథనం, పొగడిక, యశస్సు, కీర్తి అనే అర్థాల్ని సూర్యరాయాంధ్ర నిఘంటువు పేర్కొంది. నవ విధ భక్తిమార్గాల్లో 'కీర్తన' కూడా ఒకటి.

'శ్రవణం కీర్తనం విష్ణోః
స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం
సఖ్యమాత్మ నివేదనమ్' (శ్రీమద్భాగవతమ్, 7-5-23 శ్లో)

కె. వి. శ్రీనివాసయ్యంగారు —

అఖిల భువన సృష్టిస్థితిలయ కారణభూతుండైన సర్వేశ్వరుని నామ సంకీర్తనం చేయుటకై ఒక ధాతుశైలిని అనుసరించి వ్రాయబడిన సాహిత్యము కీర్తనమన బడును'160 అని పేర్కొన్నారు.

శ్రీ ఎన్. సి పార్థసారథిగారు, శ్రీమతి ద్వారక పార్థసారథిగారు —

'కీర్తనలోని సాహిత్యం భక్తుల గూర్చిగాని, మతాన్ని గూర్చిగాని, దైవాన్ని గూర్చిగాని లేదా పురాణ గాథల గూర్చిగాని తెలిపేదిగా వుంటుంది'161 అని అభిప్రాయపడ్డారు.

కృతికి పునాది కీర్తన. ఇది పురాతనరచన. కీర్తనలు మతాన్ని, భక్తిని వ్యాపింపజేయడానికి చేయూతగా తీసుకొను రచనలు. కీర్తన పూర్తిగా పుణ్యరచన అని చెప్పవచ్చు. కీర్తనలో సంగీతం కన్నా సాహిత్యమే ప్రధానం.

కృతి :

సాధారణంగా కృతికి రచన అని అర్థం. నేరపేర్చుకొన్న పనిగలవాడు, ధన్యుడు, కుశలుడు, పండితుడు, పని, ప్రబంధం, గ్రంథం, ఇరవై అక్షరాలు గలిగిన ఒకానొక ఛందస్సు అని సూర్యరాయాంధ్ర నిఘంటువు పేర్కొంది.

కృతిలో సాహిత్యం కన్నా సంగీతానికే ప్రాధాన్యం వుంటుంది కేవలం సంగీత ప్రధానమయిన త్యాగయ్య రచనల వంటి వాటిని నేడు కృతులనిపిలుస్తారు

4. 2. 1 సంకీర్తనల్లో మార్గ సంగీత లక్షణాలు :

అన్నమయ్యలో మార్గ సంగీత లక్షణాలు, జానపద సంగీత లక్షణాలు రెండూ వున్నాయి. ఇక క్రమంగా అన్నమయ్య మార్గ జానపద సంగీత లక్షణాలు ఎంత వరకు అనుసరించాడో పరిశీలించడం జరుగుతుంది.

మార్గ సంగీత లక్షణాల్లో పదాల విభేదాలు, పదాల అంగాలు, పదాల అవయవాలు ప్రాధాన్యం వహిస్తాయి.

పదాల విభేదాలు - అంగాలు, అవయవాలు :

పదాలు లక్షణ భేదాన్ని బట్టి వృత్తపదం నిబంధపదం, అనిబంధ పదం అని మూడు రకాలు. వీటిలో వృత్తపదాలు సంస్కృత ఛందస్సులో ప్రసిద్ధమయిన 26 ఛందః ప్రక్రియల నుంచి రూపొందింపబడిన పదాలే.

ఈ వృత్తపదం విషమం, సమం, అర్ధసమం అని మూడురకాలు.

విషమం :

పదంలోని చరణాల్లో నాలుగు పాదాలు నాలుగు విధాలుగా వుండడం.

'తగవులు చెప్పఁబోతే తమలోని మాటలకు
తగులునాడె నన్నుఁదగునేతాను
మొగములు చూచినేను మొక్కులు మొక్కఁగఁబోతే
చిగురుఁజేతులు వట్టి చెనకులు నించీనే' (27-69)

ఈ నియమం సంస్కృత సంకీర్తనల్లో కూడా కనిపిస్తుంది.

సం. సం. 'పంకజాసన నుత భవ్య నిర్మల పాద
పంకజ పరమ పరాత్పర
వేంకటశైల నివేశ శు
భంకరా క్షేమంకరా' (1-267)

సమం :

చరణంలోని నాలుగు పాదాలు ఒకే విధంగా వుండడం.

'జలధి కన్యాపాంగ లలితేక్షణములతో
కలసి వెలుగు చునున్న కజ్జలంబితడు
జలజాసనుని వదనజలధి మధ్యమునందు
అలర వెలువడిన పరమామృతం బితడు' (1-170)

సం. సం. జనసుత చరణా శరణ్య శరణా
దనుజ హరణ లలితస్వరణా
అనఘా చరణా యతభూభరణా
దినకర సన్నిభ దివ్యాభరణా' (1-268)

అర్థసమం :

చరణంలోని విషమ పాదాలొక రీతిగా సమపాదాలొక రీతిగా వుండడం.

'నారీమణి చిరునవ్వులు నవ్వఁగ
ఆరీతి నీకవి అందినవి
సారెకు సరసము చవిగా నాడఁగ
పేరడి యాసలు పేరినవి' (20-178)

సం. సం. బలభద్రానుజా పరమ పురుషదుగ్ధ
జలధి విహార కుంజర వరద
సులభ సుభద్రా సుముఖ సురేశ్వర
కలిదోషహరణ జగన్నాథా' (11-3-111)

నిబంధపదం : అంగాలు :

'యతులం బ్రాసములుం బదంబులును మాత్రానీకముల్ తాళసంగతులుం' గల్గినవేనిబంధపదాలు. నిబంధ పదాలకు యతి, ప్రాస, మాత్రాగణాలు, మార్గదేశి తాళాలు, ముద్ర అనేవి అంగాలు,

యతి :

పాదాది అక్షరానికి పాదమధ్యంలోని నిర్ణీత స్థానాక్షరానికి సంబంధం కల్పించడం.

'జగదేకబంధు డవట సకల జీవులకును గుఱుడుగ
మొగము చూపవయ్యా మీకు మొక్కెదనిదె నేను
తగులైన చుట్టరికము దాచగనికనేలా
తెగరాని మమకారము తెలుపఁగవలె గాని' (7-64)

సం. సం. గహనే ద్వావపి గత్వా గత్వా
దహసి రతిం ప్రేరయతి సతి
విహరత స్సదా విలసంతౌ
విహత గృహాశౌ వివశౌతౌ' (12-166)

ప్రాస :

పాదంలోని ద్వితీయాక్షరం ప్రాస అనబడుతుంది. నాలుగు పాదాల్లోని రెండవ అక్షరం ఒక్కటే అయి వుండడం.

'ఇందు హరిగల డందు లే దనేటి
నిందకు బాయుచే నీపూజ
కొందరు చుట్టాలు కొందరు పగనే
అందదుకు మానుటదియే నీపూజ' (6-31)

సం. సం. 'కంసం హనిష్యామి ఖలమితివ్యాజేన
సంసారోయమాచరితః పురా
హింసాదూర నచ హితమిదం వ్రజవధూ
సంసరణ లీలాం ప్రసక్తుం తత్ర' (12-374)

ప్రాసయతులు :

యతి విభేదాల్లో ఒకటయిన ప్రాసయతి నియమం కూడా అన్నమయ్య సంస్కృత సంకీర్తనల్లో కనిపిస్తుంది.

'నిత్యాయవిబుధ సంస్తుత్యాయనిత్యాది' (5-172)
'అక్షరాయాతి నిరపేక్షాయ' (5-172)

మాత్రాగణాలు :

నిర్దేశాత్మకమయిన ఆయా మాత్రాగణాలతో నడక సాగడం.

'చలిగాలి వేఁడేల చల్లినె కప్పురపు
మలయజముతానేల మండీనే
వాయెత్తి చిలుకేల వదరీనెపలుమారు
కోయిలలు దామేల గొణఁగీనే
రాయడికి నలులేల రాసీనె మాతోను
కాయజుఁడు తానేలకసరీనే' (13-101)

సం సం. 'దేవ దేవంభజే దివ్య ప్రభావం
రావణాసురవైరి రఘుపుంగవం
రాజవర శేఖరం రవికుల సుధాకరం
ఆజానుబాహుం నీలాభ్రకాయం
రాజారికోదండ రాజదీక్షాగురు
రాజీవలోచనం రామచంద్రం' (4-299)

మార్గ దేశి తాళాలు :

భావాన్ని వ్యక్తపరచడానికి రాగమెంత ముఖ్యమో తాళంకూడా అంత ముఖ్యమయింది. దీన్ని పాట నడకను బట్టి నిర్ణయిస్తారు. లభ్యమయినంత వరకు అన్నమయ్య తెలుగు, సంస్కృత సంకీర్తనలన్నిటికి రాగిరేకుల్లో ముద్రిత గ్రంథాల్లో రాగాల నిర్దేశం వుందిగాని, తాళ నిర్దేశం కొన్నిటికి తప్ప అన్నిటికీ కనపించదు

| ఉదా :- కీర్తన | | రాగం | తాళం |
|---|---|---|---|
| 'నీమతకములన్నియు' | 17-599 | సామంతం | ఏక |
| 'మందర ధర మధుసూదన' | 1-267 | కురవంజి | ఆట |
| 'విచ్చేయవమ్మా వెన్నెలబొమ్మా' | 4-104 | రామక్రియ | రూపక |
| 'సొగియునామతియు' | 1-242 | బౌళి | జంపె |

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

అన్నమయ్య సంకీర్తనల్ని స్వరపరచిన శ్రీమాన్ రాళ్ళపల్లివారు శ్రీ నేదునూరి కృష్ణమూర్తిగారు కొన్ని సంకీర్తనలకు 'తాళ్ళపాక అన్నమయ్య పాటలు' అనే పుస్తకంలో తాళ నిర్దేశం చేశారు.

ఉదా :-

| కీర్తన | రాగం | తాళం |
|---|---|---|
| అదిగో అల్లవిగో | హిందోళం | ఆది |
| అలమేలు మంగ | భైరవి | ఖండచాపు |
| అలరులు | శంకరాభరణ | ఆది |
| ఆకటి వేళల | ముఖారి | రూపక |
| ఇప్పుడిటు | భూపాళం | జంపె |
| ఉగ్గు పెట్టరే | కమాస్ | ఆది |
| ఉయ్యాలా | మధ్యమావతి | ఆది |
| ఏమొకో చిగురు | తిలంగ్ | ఆది |
| ఎలరాడమ్మ | కాంభోజి | త్యశ్ర, త్రిపుట |
| కంటి శుక్రవారము | ఆనంద భైరవి | ఆది |
| కులుకక నడవరో | అఠాణా | ఆది |
| కొలనిదోపరికి | యదుకులకాంభోజి | ఆది |
| చక్కని తల్లికి | పాడి | ఆది |
| చేరి కొల్వరో | శ్రీరాగం | మిశ్ర |
| జయజయరామా | మణిరంగు | ఆది |
| తెప్పగా | లలిత | రూపక |
| దిబ్బలు వెట్టుచు | కాంభోజి | ఆది |
| దీనుడనేను | నీలాంబరి | ఆది |
| నానాటి | రేవతి | ఆది |
| పలుకుతేనెల | కర్ణాటక దేవగాంధారి | ఖండచాపు |
| భక్తికొలది | రామక్రియ | రూపక |
| భావములోన | శుద్ధ ధన్యాసి | ఆది |

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

| కీర్తన | రాగం | తాళం |
|---|---|---|
| మలసీ జూడరో | శంకరాభరణం | రూపక |
| ముద్దుగారే | కురంజి | ఆది |
| మొత్తకురే | కాంభోజి | రూపక |
| మోపుల చిగురుల | వరాళి | ఆది |
| విన్నపాలు | భూపాళం | రూపక |
| సామాన్యమా | ధన్యాసి | జంపె |
| సువ్విసువ్వి | కేదారగౌళ | మిశ్రచాపు |

### సంకీర్తనల్లో గతుల వరుసలు :

సంకీర్తనల్లోని గతుల్ని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. అక్షరాల సంఖ్యను బట్టి చేయడం ఒక పద్ధతి, తాళానికనుగుణంగా చేయడం మరో పద్ధతి. అక్షరాల కనుగుణంగా చేయడమనేది ఛందస్సుకు సంబంధించినది. ఆ దృష్టితో సంకీర్తనల్ని ద్విపద పాదాలుగానో, సీస పాదాలుగానో మరికొన్ని దేశిచ్ఛందో రీతులుగానో వర్గీకరించడం కాని ఇది రాగ తాళ ప్రాధాన్యం కలిగిన సంకీర్తనలకు అతికే పద్ధతికాదు

సంగీత శాస్త్రం ప్రకారం తాళాలు ఏడు విధాలు. అవి ధ్రువ, మఠ్య రూపక ఝంప, త్రిపుట, ఆట. ఒక్కొక్క తాళానికి ఆరు అంగాలున్నాయి. లఘువు, ధృతం, అనుధృతం, గురువు, ప్లుతం, కాకపాదం. వీటిలో ప్రధానంగా లఘువు, ధృతం, అనుధృతం మాత్రం ఎక్కువగా వాడబడతాయి. ధృత మంటే చేతితో ఒక దెబ్బ. లఘువులో రెండు భాగాలుంటాయి. చేతితో ఒక దెబ్బ ప్రేళ్ళను ఎంచడం ధృతానికి రెండక్షరాల విలువ, అనుధృతానికి ఒక అక్షరం విలువ వుంటుంది. అక్షరాల లెక్కను బట్టి గతులు ఐదు. అవి త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర ప్రకీర్ణాలు.

సామాన్యంగా ధ్రువ, మఠ్య రూపక, తాళాలకు చతురశ్రగతి, ఝంపెకు మిశ్రగతి, త్రిపుటకు త్రిశ్రగతి, ఆటకు ఖండగతి, వాడడం జరుగుతుంది. జానపద గేయాల్లో త్రిశ్ర, చతురశ్ర గతులే ఎక్కువగా పాటించ పడతాయి.

త్రిశ్రగతి :

తకిట - తకిట అని మూడేసి మాత్రలకు తాళం పడుతుంది. పాదానికి ఎనిమిదేసి ఆవృత్తాలుంటాయి. ఇది త్రిపుట తాళానికి సంబంధించిందిగా వుండవచ్చు అభిరుచిని బట్టి రాగాన్ని మార్చుకోవచ్చు అయా పాటలు చేసేటప్పుడు విరామ స్థానాన్ని బట్టి తాళం మారుతుంటుంది

ఆచార్య బి. రామరాజుగారు —

"భారమైన వేపమాను పాలు పోసి పెంచినాను
తీరని చేదేకాక తియ్యనుండీనా"

వంటి త్రిశ్రగతి పాటలన్నమయ్యగారు పాడినను సువ్విపాటలు మాత్రము పాడక పోవుట వింతగనేయున్నది'[183] అని పేర్కొన్నారు.

భైరవి

'వెంక[1] టాద్రి[2] విభుని[3] బాసి[4] విరహి[5] యైన[6] రమణి[7] జూచి[8]
ఱంకె[9] వేయ[10] నేటి[11] కమ్మ[12] రాజ[13] సమున[14] నూ[15] ఱు[16]' (3-381)

ఈ కీర్తన పాదానికి ఎనిమిదేసి వంతున తకిట-తకిట ఆవృత్తాలతో సాగింది.

డా॥ వేటూరి ఆనందమూర్తిగారు — 'మహిత నాయక సంబుద్ధి మధ్యమగు నేల పదము కూడ నీగతిలో సాగునదే' [84] అని చెప్పారు.

చతురశ్రగతి :

నాలుగు మాత్రల ఆవృత్తాలు ఎనిమిది గాని, నాలుగుగాని, గలిగిన పాదాలతో వుంటుంది కిటతక-కిటతక అని తాళగతి సాగుతుంది, పాల్కురికి సోమనాథుడు 'కోలాట గొడియలు' అని కోలాటకు సంబంధించిన వస్తుసామగ్రిని సూచించాడు. తక్కిన నృత్య విలాసాల్ని వర్ణించినంత వివరంగా కోలాటను వర్ణించకుండడం వల్ల కోలాట తర్వాతి కాలంలోనే అభివృద్ధి చెందిందని భావించవచ్చు.

ఆచార్య బి. రామరాజుగారు —

"ఛాంగుభళా, గొబ్బిళ్ళో, పావము, వృథావృథా ...... వంటి మాటలతో

ప్రతిపాదంతమగు పాటలు కూడా కోలాట పాటలే. ఐనను అన్నమయ్యగారివి మాత్రము చతురశ్రగతి కోలాటపాటలే'185 అని అభిప్రాయపడ్డారు.

సాళి

'ఎక్కడి1 మానుష2 జన్మం3 బెత్తిన4 ఫలమే5 మున్నది6
నిక్కము7 నిన్నే8 నమ్మితి9 నీ చిత్తం10 బిక11 నూ12 (ఊ)

కీర్తన పాదానికి ఆరేసి కిటతక-కిటతక అవృత్తాలతో సాగింది.

కేదార గౌళ

సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెదరోలాల ॥పల్లవి॥

వనితల మనసులు కుందెన చేసిటు
వలపులు తగనించోల
కనుసన్నలనెడు రోకండ్లను
కన్నెలు దంచెద రోలాల ॥సువ్వి॥ (12 353)

భూపాళం

సువ్వి సువ్వి సువ్వాలమ్మ
నవ్వుచు దేవకి నందనుఁగనియె ॥పల్లవి॥

కావిరి విరిసె కంసుడుఁగినినే
వావిరి బువ్వుల వానలుఁగురిసె ॥సువ్వి॥ (12-361)

ఇవి చతురశ్ర గతిలో సాగిన పాటలని ఆచార్య బి. రామరాజుగారు పేర్కొన్నారు.

ఖండగతి :

ఐదేసి మాత్రల ఆవృత్తాలతో సాగడం ఖండతి.

ఆచార్య బి. రామరాజుగారు – "ఐదు మాత్రల్ని ఒకదానితో ఒకటి ప్రత్యేకమయిన చేరిక లేకుండా వేరువేరుగా పలుకుతూ, ఐదేసి మాత్రల్ని ఒక్కటిగా పలక

కలిపి వస్తే దీని గతిని కిటతకిట - కిటతకిట అని సూచిస్తారు. స్త్రీల పాటలు అధికంగా ఖండగతిలో సాగుతాయి. గోవింద నామాలు .........తుమ్మెద పాటలు, ఉయ్యాలా, చిలుకా, కోలపాటలు పెండ్లి పాటలు మొదలయిన పాటలన్నీ కూడా ఖండగతిలో సాగినవి'[186] అని పేర్కొన్నారు.

డా॥ వేటూరి ఆనందమూర్తి గారు —

"సువ్వి పాటలన్నియు, ప్రధానముగా తొలి నాళల నుండియు ఖండగతిలోనే సాగుచున్నవి. "సువ్వి సువ్వి రామచంద్ర" వంటి రచనలొకకొన్ని త్ర్యస్ర గతిలో గూడ నడచినవి లేక పోలేదు. దంపుళ్ల సువ్వి పాటలకు ఖండగతియే ప్రసిద్ధము గావున తాళ్ళపాక వారును అట్లే సువ్వులను రచించినారు'[187] అని పేర్కొన్నారు

ఆ హి రి

అలరజం[1] చలమైన[2] ఆత్మలం[3] దండసీ[4] యలవాట[5] సేసెసే[6] వుయ్యాలా[7]
పలుమారు[8] నుచ్ఛ్వాస[9] పవనమం[10] దండనీ[11] భావంబు[12] దెలిపెనీ[13] వుయ్యాలా[14]
(2-68)

ఈ కీర్తన పాదానికి ఐదేసి వంతున కిటతకిట ఆవృత్తాలతో సాగింది.

శ్రీ రా గం

ఎన్ని బాధలఁబెట్టి యేఁచెదవు నీవింక నెంత కాలము దాఁక గగ్గ్మమా
మన్నించుమనుచు నీ మఱఁగు చొచ్చితిని మామాటాలకింకనో కర్మమా (1-281)

వంటి కీర్తనల్లో కూడా ఐదేసి మాత్రల ఆవృత్తాలు సాగతాయి.

మి శ్ర గ తి :

ఏడు మాత్రల ఆవృత్తాల పాటలు ఈగతిలో నడుస్తాయి. ఏడుమాత్రల్ని 'తకిట కిటతక'గాను, కిటతక తకిట గాను చెప్పుకోవచ్చు కాని 'తకిట కిటతక' ఆవృత్తాలే వుండడం సహజం.

ఆచార్య. బి. రామరాజుగారు —

'దేశిగేయములు మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు, ఎనిమిది ఆవృత్తములతో నడచు' నన్న వాక్యము వాని ఛందస్సును చక్కగా వివరించు లక్షణము.

అన్నమయ్య సంకీర్తనములందు మిశ్రగతి సంకీర్తనములు చిక్కలేదు ఈపైన పేర్కొన్న వివరణము కేవలము సరళములకు తొలి దినముల కీర్తనములకే వర్తించును. రానురాను పాటలను పల్లవిని బెంచుకొని క్లిష్టములైపోయినవి' అని అభిప్రాయపడ్డారు.[188]

డా॥ వేటూరి ఆనందమూర్తిగారు —

"మన గుమ్మడి పాటలును, మఱికొన్ని మేలుకొల్పులును, నిట్టి మిశ్రగతితో నడచునవే... మిశ్రగతిలో సాగు రచనలు మేలుకొలుపులకే అధికముగా నుపయుక్తములగు చుండినవేమో అని తలపవచ్చును భూపాల రాగముననే "వేగ నాలుగు గడియలనగా వెదవేద్యులు వేచి సరగున నాగమోక్తవిధులను తమ దేహానుగుణములుగా" (11-2-45) అని మొదలుగా నున్న వీరకీర్తనము అచ్చముగా గుమ్మడి పాటవంటిదే" అని పేర్కొన్నారు[189].

### భూ పా ల ం

ఏమిచిత్రం[1] బేమిమహిమలు[2] ఏమినీమా[3] యావినోదము[4]

వామనాచ్యుత[5] నిన్ను దెలియఁగ[6] వసుధలోమా[7] తరములా[8] (అ) (2-226)

ఈ కీర్తన తకిట తకతక అని ఏడు మాత్రల ఆవృత్తాలతో సాగింది.

డా॥ వేటూరి ఆనందమూర్తిగారు ఇవిగాకుండా ద్విత్ర్యశ్రగతి ద్విచతురశ్ర గతుల్ని పేర్కొన్నారు.[190]

ద్విత్ర్యశ్ర గతి :

మూడు, నాలుగు, ఐదు, తర్వాత ఆరుమాత్రల ఆవృత్తాల పాటలు లెక్కకు వస్తాయి. ఈ పాటల్ని త్రిశ్రగతి పాటలుగనే చెప్పుకోవచ్చు. కాని ఒక్కొకప్పుడు ఆరుమాత్రల ఆవృత్తాలు 'తక కిటతక' అని నడువవచ్చు

### ఆ హి రి

సతతమునేఁ[1]జేయు ననా[2]చారములకు[3]ఁ గడయెక్కడ[4]

మతిననుఁగని[5] కావుము రామా[6] రామా[7] రామా[8] (అ) (1-341)

ఈ కీర్తన 'తకకిటతక' అని ఆరేసి మాత్రల ఆవృత్తాలతో సాగింది.

ద్విచతురస్రగతి :

ఎనిమిదేసి మాత్రలు గలిగిన ఆవృత్తాలతో సాగే రచనలు ఈ గతిలో చేరతాయి

భైరవి

హరి శరణాగతి[1] యందులకౌషధ[2]
మిరవుగ నెఱింగి[3]న నెక్కుడు విషము[4] ॥పల్ల వి॥

చందున నొడిసేటి సర్పము వంటిది
కంచములో తన కర్మము
అంచే జనన మరణాదులే కొరలు
పంచల నాడును పట్టంగరాదు ॥హరి॥

బలుసంసారము పడిగ దీసికిని
పొలసి దేహమను పుట్టంబడే
నలినహోరాత్రపు నాలికలు గొడయు
బలిమి నూక పట్టంగరాదు ॥హరి॥

మహి సుఖదుఃఖములు మొలకలుమలకలు
సహజపుంబొరలే సంపదలు
యిహమున్న శ్రీ వెంకటేశుండాడించి
బహుగతి నేమిటం బట్టంగరాదు ॥హరి॥ (2-67)

ఈ కీర్తన పాదానికి నాలుగేసి వంతున 'తకిట కిటతక' అనే ఆవృత్తాలతో సాగింది.

ఈ విధంగా 3, 4 5, 6, 7, 8 మాత్రల కాలంలో సాగే ఆవృత్తాలు గలిగి సంకీర్తనల్ని అన్నమయ్య భిన్న గతుల్లో రచించాడు. ఇవే గాకుండా తొమ్మిదేసి మాత్రల ఆవృత్తాలతో సాగే ప్రకీర్ణ జాతిలో అన్నమయ్య సంకీర్తనల్ని గుర్తించ డానికి వీలుపడదు.

ముద్ర :

ఫలానా కీర్తన ఫలానా వారిదని తెలియటానికి వీలయిన అంశాల్లో ముద్ర

ఒకటి. దీన్నే కన్నడిగులు 'అంకిత పదమంటారు'. ఈ అంకిత పదాలు మూడు రకాలు

1. స్వయంగా తానే నిర్ణయించుకోవడం :

'నరహరి తీర్థులు "రఘుకుల తిలక" అని, శ్రీపాదరాయలు "శ్రీరంగ విఠల" అని, వ్యాసరాయలు "శ్రీకృష్ణ" అనే ముద్రతో 'దేవర నామగళు' వ్రాశారు

2. దైవదత్తం కావడం :

శ్రీనివాసాచార్యులు పండరిపురంలో స్నానం చేస్తుండగా ఒక పలకపై 'జగన్నాథవిఠల' అని కనిపిస్తుంది. దీన్నే అంకిత పదంగా గ్రహించి కీర్తనలు వ్రాశారు.

3. గురుదత్తం కావడం :

వ్యాసరాయలు పురంధరదాసుల వారికి 'పురందర విఠల' అని, పురందరదాసుల వారు దాసప్పగారికి 'విజయవిఠల' అని, ముద్ర ప్రసాదించారు. అలాగే ముద్రల్ని మూడు వర్గాలుగా విభజించవచ్చు.

1. స్వనామాంకితాలు :

త్యాగరాజ కృతుల్లో స్వనామాంకిత ముద్ర కనిపిస్తుంది.

2. స్వనామాంకితం, దైవనామం జతకావడం :

పురందరదాసు, విజయదాసు, ప్రసన్న వేంకటదాసు, గోపాలదాసు, జగన్నాథదాసు, హెళవనకట్టి మొదలైనవారికీర్తనల్లో వరుసగా పురంధర విఠల, విజయ విఠల, ప్రసన్న వేంకట, గోపాలవిఠల, జగన్నాథవిఠల, హెళవన కట్టియరంగ అనే ముద్రలు కనిపిస్తాయి.

3. ఆరాధ్య దేవాశ్రితాలు :

శ్రీ పాదరాయలు, వ్యాసరాయలు, వాదిరాజు, కనకదాసు, అన్నమయ్య, క్షేత్రయ్య మొదలైనవారి కీర్తనల్లో 'శ్రీరంగ విఠల, శ్రీకృష్ణ, హయవదన, కాగినెలె ఆదికేశవ, వేంకటేశ్వర, మువ్వగోపాల అనే ముద్రలు కనిపిస్తాయి.

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

అన్నమయ్య ఏ దైవాన్ని దర్శించినా వేంకటేశ్వర ముద్రతోనే కీర్తనలు రచించాడు. ఈ ముద్ర ఒకే రకంగా వుండదు. దీన్ని నాలుగు భంగిమలుగా వర్గీకరించవచ్చు.

1. శ్రీసహితం :

| | |
|---|---|
| 'శ్రీవేంకటాచల శ్రీనివాసాయ' | (5-148) |
| 'శ్రీవేంకట పతి' | (7-116) |
| 'శ్రీవేంకట నిలయము' | (9-130) |
| 'శ్రీవేంకటేశునామము' | (11-1-79) |
| 'శ్రీవేంకటేశుడు' | (14-153) |

2. తిరుసహితం :

| | |
|---|---|
| 'తిరువేంకట గిరిదేవుని' | (1-6) |
| 'తిరువేంకటేశ' | (1-33) |
| 'తిరువేంకటాద్రీశ' | (1-147) |
| 'తిరువేంకటాచల స్థితం' | (5-79) |
| 'తిరువేంకట గిరి నిలయ' | (11-3-111) |

3. శ్రీ తిరుసహితం :

| | |
|---|---|
| 'శ్రీతిరువేంకటాద్రీశ' | (1-34) |
| 'శ్రీ తిరువేంకటపతి' | (1-48) |
| 'శ్రీ తిరువేంకటగిరిదేవ' | (1-155) |
| 'శ్రీ తిరువేంకటగిరిదివ్యవినోదీ' | (4-45) |
| 'శ్రీ తిరువేంకటేశ' | (11-2-5) |

4. శ్రీతిరువిరహితం :

| | |
|---|---|
| 'వేంకట గిరి రాయుని' | (1-10) |
| 'వేంకటనాథ' | (4-85) |
| 'వేంకటగిరిరమణ' | (11-2-42) |

'వేంకటాద్రి విభుఁడు' (12-55)
'వేంకటగిరిపతి' (12-195)

అన్నమయ్య సంకీర్తనల్లో ముద్ర నిర్దిష్టస్థానంలో వుండదు. ముద్ర ప్రయోగంలో వైవిధ్యం కనిపిస్తుంది. కొన్ని కీర్తనల్లో చివర చరణం మొదటి పాదంలోను, కొన్నింటిలో రెండవపాదంలోను, కొన్నింటిలో మూడవ పాదంలోను, మరికొన్నింటిలో చివరి పాదంలోను ఈ ముద్ర వుంటుంది. సంస్కృత సంకీర్తనల్లోను ఈ పద్ధతి గుర్తించవచ్చు.

మొదటి పాదంలో :

శ్రీ వేంకటేశుఁడు :

'శ్రీవేంకటేశుఁడు నేనూఁజేరి తెరలో నుండఁగా
సేవలకు దగ్గరేవు చెల్లదే నీకు
కైవశమై నా కితఁడు గలసి మెలఁగుండఁగా
నీవుఁ (వూ?) జెప్పుకొనే వేఁటినేరుపరివే' (24-13)

సం.సం. 'తిరువేంకటాచలాధీశ్వరం కరిరాజ
వరదం శరణాగత వత్సలం
పరమ పురుషం కృపాభరణం న భజామి
మరణ భవ దేహాభిమానం వహామి' (1-265)

రెండవ పాదంలో :

శ్రీ వెంకట ప్రచుర నిలయా

'అణువులోపలి నీవు ఆది మహత్తును నీవు
ప్రణుత శ్రీవెంకట ప్రచుర నిలయా
అణిమాది విభవా ఆద్యంతరహితా
గణుతించి నాపాల గలుగవే నీవు' (17-148)

సం. సం.

తిరు వేంకటాధిప :

'సరసో యం పరసరప్రియో౽యం
తిరువేంకటాధిపో౽యం
చిరంతనో యం చిదాత్మకో౽యం
శరణాగతవత్సలో౽యం (1.264)

మూడవ పాదంలో :

శ్రీ వెంకట దయివము :

'జగమున నీదే స్వతంత్రమెల్లా
నెగడిన జీవులు నీవారు
తగు శ్రీవేంకటదయివము యిన్నియు
తెగి నీదాసులు తెలిసిన చిక్కా (9-276)

సం. నం.

వేంకట విభుని :

'సరవి సంపదలిచ్చు సంకీర్తనం
సరిలేని దిడియ పో సంకీర్తనం
సరుస వేంకట విభుని సంకీర్తనం
సరుగనను దించు'డీ సంకీర్తనం' (1-843)

చివరి పాదంలో :

శ్రీవేంకటాద్రి శ్రీపతి :

నిచ్చలును భవనాశినీట నోలలాడితి వండు
పచ్చినా చెమటనీరు పతి యిదివో
లచ్చనల గరుడాద్రి లక్ష్మీపతివినాఁడు
చెచ్చెర శ్రీవేంకటాద్రి శ్రీపతివి నేడు' (27-472)

పల్లవి చరణాల్లో వైవిధ్యం :

అన్నమయ్య సంకీర్తనల్లో పల్లవి, చరణాలకు సంబంధించిన ప్రత్యేకాంశాలు అనేకం కనిపిస్తాయి.

పల్లవి రచనల్లో వైవిధ్యం :

పాటకు పల్లవి ప్రాణం. అట్టి పల్లవిని గూర్చి సంగీతచూడామణిలో పల్లవులున్నచో శిఖాపదం వుండదని, శిఖాపదం వుంటే పల్లవులుండవని చెప్పబడింది. అన్నమయ్య సంకీర్తనల్లోని పల్లవుల్ని మూడు రకాలుగా వర్గీకరించవచ్చు

1. రెండు పాదాల పల్లవి కలవి —

'ప్రలపనవచనైః ఫలమిహకిం
చలచల కుడ్య శాఖనయాకిం' (8-39)

2. శిఖాపదం మాత్రమువున్నవి —

'డోలాయాంచల డోలాయాం హరిడోలాయాం' (7-140)

3. పల్లవి, శిఖాపదం కలవి —

'చెలినేడు తానేమి సేయు నమ్మ' —శిఖాపదం
'చెలియేమిసేయు నీచెలులేమిసేయుదురు
చెలువైన విభుమేని చెలువింతసేయంగ' -పల్లవి (2-344)

ఇక పాదాల దృష్టితో చూచినప్పుడు పల్లవిని నాలుగు విభాగాలుగా వర్గీకరించవచ్చు.

1. ఒకపాదం పల్లవి గల్గినవి —

'జగమంతా నీమయము సర్వం విష్ణుమయంబు గాన' (7-147)

2. రెండుపాదాల పల్లవి గలవి —

'ఎండగాని నీడగాని, యేమైనగాని
కొండలరాయండే మాకులదైవము' (1-214)

3. మూడు పాదాల పల్లవి గలవి —

'లేఁత మాయలు నీకు నింతేసి
పూఁత సిగ్గులే భూమిలో వారికి
యీఁత వలపు చిత్తములోన నెవ్వరికైనఁదెలుసునే' (12-85)

4. నాలుగు పాదాల పల్లవి గలవి —

'చల్లనై కాయఁగదా చందమామా నీ
వెల్ల (ల్లి?) గాఁదివు వేంకటేశు నెదుర
మొల్లమిగ నమృతంపు వెల్లి గొల్పుచులోక
మెల్ల నినుఁగొనియాడఁగాను' (12-228)

## చరణాల్లో వైవిధ్యం :

సాధారణంగా కీర్తనకు మూడు చరణాలుండడం పరిపాటి. కన్నడ హరిదాస వాఙ్మయంలోకూడా శ్రీపాద రాయలవారి సంకీర్తనల్లో మూడు చరణాలున్న పాదాలే ఎక్కువ. సకృత్తుగా ఎనిమిది, పది చరణాలుకూడా వున్నాయి. ఇలాగే అన్నమయ్య చరణాల విషయంలోను వైవిధ్యం కనిపిస్తుంది. వీటిని 12 విభాగాలుగా వర్గీకరించ వచ్చు.

1. 1 పాదం పల్లవి 3 పాదాల 3 చరణాలు —

గుజ్జరి

'జగమంతా నీమయము సర్వం విష్ణుమయంబుగాన ॥పల్లవి॥

యెనయుచు నేఁగర్మమార్గముల నితర దేవతల భజియించెదను
అని యపరాధం బెంచకుమీ అన్యము నీకంటే మరి లేదు
పనివడి 'మత్తః పరతరం' అని పలికితి విన్నియు నీయాజ్ఞలు ॥జగ॥

దేవ నా వుదరపోషణకు తివిరి హింస చేసెదను.
నీ విడి నావల నెంచకుమీ నీవే అఖండ చేతన్యుఁడవు
భావమిదు 'నైతేన వినాత్మనా గ్రమపి' యని శ్రుతి వొగడెడిని ॥జగ॥

భువిలో నాకట పూర్వకర్మ మట పొసఁగదు నే నీ సరణి నీయడను
అవి నాకేమియు బనిలేవు అంతరియామివి నీవు
అవలను 'త్వమేవ శరణం గతి' యనుటది నమ్మితి శ్రీవేంకటనిలయా ॥జగ॥
(7-147)

2. 2పాదాల పల్లవి 2పాదాల 2చరణాలు —

దేవగాంధారి

ఆదిదేవ పరమాతుమా
వేద వేదాంత వేద్య నమోనమో ॥పల్లవి॥

పరాత్పరా భక్తభవభంజనా
చరాచర లోకజనక నమోనమో ॥ఆది॥

గదాధరా వేంకటగిరి నిలయా
సదానందా ప్రసన్న నమోనమో ॥ఆది॥ (1-289)

3. 2పాదాల పల్లవి 2పాదాల 11 చరణాలు —

శ్రీ రాగం

నేనెందు వోయె తా (యేఁదా?) నెందు వోయీ
రానీలే రానీలే రానీలే ॥పల్లవి॥

మీనైన నాఁటి తన మిడుకెల్ల దిగవలె
కానీలే కానీలే కానీలే ॥నేనెం॥

తలచూపేనాఁటి తలఁపెల్ల దిగవలె
తలఁచనీ తలఁచనీ తలఁచనీవే ॥నేనెం॥

కిరియైన నాఁటి కిటుకెల్ల దిగవలె
తిరుగనీ తిరుగనీ తిరుగనీవె ॥నేనెం॥

హరియైన నాఁటి అదటెల్ల దిగవలె
జరగనీ జరగనీ జరగనీవె ॥నేనెం॥

వడఁగైన నాఁటి వస విడువంగ వలె
తడవకు తడవకు తడవకువే ॥నేనెం॥

కలుషించే నాఁటి కడమెల్ల దిగవలె
అలుగనీ అలుగనీ అలుగనీవే ॥నేనెం॥

సతి బాసేనాఁటి చలమెల్ల దిగవలె
తతిగానీ తతిగానీ తతిగానీవే ॥నేనెం॥

ముసలైన నాఁటి ముసురెల్ల దిగవలె
విసుగనీ విసుగనీ విసుగనీవే ॥నేనెం॥

మోనైన నాఁటి మదమెల్ల దిగవలె
పోనీవే పోనీవే పోనీవే ॥నేనెం॥

కలికైన నాఁటి గజరెల్ల దిగవలె
చెలఁగనీ చెలఁగనీ చెలఁగనీవె ॥నేనెం॥

వేడుకతో నాఁటి వేంకటపతి నన్నుఁ
గూడనీ కూడనీ కూడనీవె ॥నేనెం॥ (12-276)

4. 2 పాదాల పల్లవి, 4 పాదాల 2 చరణాలు -

ధన్నాసి

ఘోర దురితములచే గుణవికారములచే
నీరీతిఁబడు[illegible]కు నేది దెరువు ॥పల్లవి॥

హరి జగన్నాథు లోకారాధ్యు
నెరఁగనేరని వాని కేది దెరువు
పరమ పురుషుని జగద్భరితు నంతర్వ్యాప్తి
నిరవు కొలువని వాని కేది దెరువు ॥ఘోర॥

శ్రీవేంకటేశ్వరుఁ దలఁచిన వెనక సకలంబు
సేవగింపని వారి కేది దెరువు

దేవోత్తముని మహిమ దెలిసి తెలియఁగలేని
యీ వివేకంబునకు నేఁడి దెరువు' (1-363)

5. 2 పాదాల పల్లవి, 4 పాదాల 4 చరణాలు —

లలిత

అయ్యో వికల్పకాదు లంతటా సిగ్గు పడరు
యియ్యెడ నెట్టు గలిగె నీయసుర మతము ॥పల్లవి॥

నీముద్రలూ నొల్లరు నీదాసోహము నొల్లరు
కామించి నీమీఁది భక్తి కడునొల్లరు
నామ మంత్రము నొల్లరనామయుండవనెం (నం?) దురు
తాము వైష్ణవులమంటాఁ దర్కింతురు ॥అయ్యో॥

పైతృకవేళ నీ ప్రసాదమూ నొల్లరు
ఘాతల నూర్ధ్వపుండ్రముగా దందురు
జాతరదైవాల నిన్ను సరిగా బూజింతురు
అతలవైష్ణవులు దామనుకొందురు ॥అయ్యో॥

శ్రీవైష్ణవుల గంటే జేతులెత్తి మొక్కరు
భావింతురు పగవారి బలె గన్నట్టు
ఆవల వైకుంఠమూ నవిత్యమందురు
కావించి వైష్ణవులము కామా శేమందురు ॥అయ్యో॥

వరుస రావణాదులవలె నేజ్ఞాలు సేతురు
సరుస నట్టే వేదమూ జదువుదురు
నిరతి శ్రీవేంకటేశ నీమహిమ లెఱఁగక
అరిదీ వైష్ణవులమే యని యాడుకొందురు ॥అయ్యో॥ (8-52)

6. 2 పాదాలు పల్లవి, 4 పాదాలు 5 చరణాలు —

పాడి

అందరి బ్రతుకులు నాతనివే
కందువెల్ల శ్రీకాంగునిదే ॥పల్లవి॥

వేమరుఁజదివెడి విప్రుల వేదము
సోము (మ?) కవైరి యశోవిభవం
శ్రమించు నమరుల జీవనమెల్ల సు
ధామథనుని సంతతకరుణే ॥అందరి॥

హితవగు నిలలో నీసుఖమెల్లను
దితిసుత దమనుఁడు దెచ్చినదే
తతి తల్లిదండ్రి తానై కాచిన
రతి ప్రహ్లాదవరదుని కృపే ॥అందరి॥

అలరిన యమరేంద్రాదుల బ్రదుకులు
బలిబంధనుకృపఁబర గినవే
బలసి మునుల యాపదలు వాపుటకు
బలు నృపభంజను పరిణతలే ॥అందరి॥

పూని యనాథుల బొందుగఁగాచిన
జానకీవిభుని సరసతలే
నానాభూభరణంబులు నందుని
సూనుఁడు చేసిన సుకృతములే ॥అందరి॥

తలకొని ధర్మము తానై నిలుపుట
కలుష విదూరుని గర్వములే
నిలిచి లోకములు నిలిపిన ఘనుఁడగు
కలియుగమున వెంకటపతివే ॥అందరి॥ (11-3-123)

7. 2 పాదాల పల్లవి 4 పాదాల 7 చరణాలు —

మాళవి గౌళ

సీతక పడుసు దోసిటి పాల మగఁడు
బాతి పడిన నగపడువాడె వీఁడు ॥పల్లవి॥

మూ ( ? )డు గాళ్ళ పెద్దముసలి సవులుగొన్న
పాఁడి మేకల పాల పాళము

పేడి జుట్టిన తల్లి పేఁకటియై కన్న
వాఁడు వీఁడు శిన్న వాఁడటె వీఁడు ॥సీత॥

కొండలంత సను గుబ్బలరాకాశి
మిండెత గపిశిపై మింగ రాఁగా
గుండె వగుల నొక్క కోలనె సరగన
సెండివేసినట్టి సిసు వటె వీఁడు ॥సీత॥

వుడుకు నుదుటి వాఁడు వుదటున దా (  ) సిన
బెడిదపు మోకల పెనుపిల్లు
తొడికి విరిశివేశి దోమటి నునుఁబాల
కడుపుల లొలి పెండ్లి కొడుకటె వీఁడు ॥సీత॥

మారుదల్లి సేతిమాటలఁబడలేక
వూరు విడిశి యడవులకేఁగి
సేరవచ్చిన యింతి సెవులు ముక్కుగోశి
పేరువారిన పెద్దబిడుదటె వీఁడు ॥సీత॥

పొగదాగు తపసుల పుల్ల వెలుగు మంట
లగడు శేయఁగ ముగురసురల
సగము సాయసంపి సడిఁబెట్టి విడిశిన
బడిడికాఁడు సిన్నపడుసటె వీఁడు ॥సీత॥

మిస మిస మెరసేటి మొగము మేనిపై
పసల దగిలి వెంటఁబారి పారి
గసిక వింటికోల గరిగాఁడనేసిన
మసిమాయల నలమరి గదె వీఁడు ॥సీత॥

రవ్వల సేఁతల రాకాశినాయని
కొవ్విన మదము తెక్కొలుగొని
యివ్వలఁ దిరువేంకటేశుఁడై యున్నాఁడు
సువ్వేక సిను జట్టి గొనెఁగదె వీఁడు ॥సీత॥ (12-378)

8. 2పాదాల పల్లవి, 4పాదాల 8 చరణాలు —

శంకరాభరణం

అహో సురత విహారోయం
సహజ పరాజయ శంకానాస్తి ॥పల్లవి॥

యమునాకూలే సుమలతా గృహే
విమలసైకత వివిధస్థలే
రమణీరమణౌ రమతస్తయో:
ప్రమదస్య పరాత్పరం నాస్తి ॥అహో॥

రజనీకావా ప్రాతః కింవా
త్వజనం భజనం తత్కింవా
విజయః కోవాపజయః కోవా
భుజపరిరంభస్ఫుటం నాస్తి ॥అహో॥

చీనాంయక రంజిత మేఖలావి
తానే జఘనం తరతి సతి
మానవికలనే మానినీ మణే (??)
హీనాధిక పరిహృతిం నాస్తి (తిర్నాస్తి?) ॥అహో॥

కింవా మిళనం కింవా మిళనం
త్వంవా హంవా తన్నాస్తి
సంవాదోవా సరసః కోవా
కింవా వాచ్యా క్రియా నాస్తి ॥అహో॥

ఆదిదేవ పీతాంశుక బద్ధా (?)
స్వేద సురభి కాశ్మీర జలం
సౌదురంహ్యా (రూహ్యా?) లజ్జా వివశతయా
ఖేదేన వచః కించిన్నాస్తి (?) ॥అహో॥

వర కుచాగ్ర సంవ్యానం కరేణ
హారాపరం పరిహరతి సతి

సరస లోచనం చల (నాంచల?) వివశతయా
తరుణ్యాం చైతన్యం నాస్తి ॥అహో॥

సురతాంత శ్రమ సుఖం కింవా
వరలజ్జా సావా కావా
పరవశతను వైభవం కింవా
నిరతాం తయో నికృతిం నాస్తి (?)
పరిమళ భరిత ప్రచుర సుశీతల
వరమృదువాయౌ వాతి సతి
తిరువేంకట గిరిదేవ రాధయో
స్సరసరతి సుఖ శ్రాంతిర్నాస్తి ॥అహో॥ (12-78)

9. 2 పాదాల పల్లవి 4 పాదాల 10 చరణాలు —

రామక్రియ

వెట్టులాల మీకు వేడుక గలి(గి?) తేను
అట్టు వంచి తడుకల్లంగ రాదా ॥పల్లవి॥

ముడిచి వేసిన పువ్వు ముడువయోగ్యముగాదు
కుడిచి వేసిన పుల్లె కుడవఁగాఁగాదు
బడి నొకరు చెప్పినఁ బ్రతి చెప్పఁబోతేను
అడరి శ్రీహరికది అదుహముగాదు ॥వెట్టు॥

గంపెఁడు ముక దినఁగా నొక్క వరి గింజ
తెంపునఁగలసితే తెలియ నెట్టు వచ్చు
జంపులఁబలవరించఁగ నొక మంచిమాట
యింపైతే హరి యందుకిచ్చునా వరము ॥వెట్టు॥

వుమిసిన తమ్మలో నొకకొంత క్రమము
సమకూర్చి చవిగోన చప్పరించినేల
అమరఁగ ఛాయాపహారము సేసుక
తమమాటఁగూర్చితే దైవము నగఁడా ॥వెట్టు॥

చిటకి వేసిన గింజ చేతఁ బట్టఁగ నేల
గటుక కెంగిలి బూరె గడుగఁగ మరియేల
తొటుక కవిత్వాల దోషాలఁ బొరలితే
దిటుకార సర్వజ్ఞుఁడా దేవుఁడైనాను ॥వెఱ్ఱి॥

మించు చద్దికూటి మీఁద నుమిసి నట్టు
మంచి దొకటి చెప్పి మరి చెప్పనేరక
కంచుఁబెంచు నొక్కగతి నడికితే ముట్టు
పెంచువలెనే చూచు పెరుమాళ్లు వాని ॥వెఱ్ఱి॥

పుచ్చినట్టి పండుఁబూజి లోననే వుండు
బచ్చన కవితలు బాఁతిగావు యెందు
ముచ్చుఁగన్న తల్లి మూల కొదిగినట్టు
ముచ్చిమినుతు లేల మొక్కరో హరికి ॥వెఱ్ఱి॥

వుల్లి దిన్న కోమటి పూరక వున్నట్టు
జల్లెడ నావాలు జారిపోయినట్టు
కల్లలు చెప్పి యాకథ కుత్తరము లేక
మెల్లనే వుండితే మెచ్చునా దైవము ॥వెఱ్ఱి॥

నేతి బీరకాయ నేయి అందు లేదు
రాతి పేరునికి బీరము యించుకా లేదు
ఘాత బూరుగుఁబండు కడుపులోన దూది
యేతుల నుడుగులు యెక్కునా హరికి ॥వెఱ్ఱి॥

యిరుగు వారెరఁగరు పొరుగువారెరఁగరు
గొరబైన మాటలు గొణఁగుచు నుందురు
పరులఁగాదందురు బాఁతిగారు తాము
విరసులట్టివారి విడుచు దేవుఁడు ॥వెఱ్ఱి॥

యెన్నఁగ శ్రీ వేంకటేశుఁదాళ్లపాక
అన్నమాచార్యులు అఖిల దిక్కులు మెచ్చ

నున్నతితోఁబాడి రొకఁడెవ్వడో తాను
సన్న నోరసునట సమ్మతా హరికి ॥వెఱ॥ (    )

10. 2పాదాల పల్లవి 4పాదాల 11 చరణాలు —

సాళంగ నాట

శరణని బ్రతుకరో జనులాల
గరిమ మెరసె నిదె కనక సింహము ॥పల్లవి॥

ఆహారమును బ్రహ్లాదుఁడు దొరకొని
బహువిధముల హరిమహిమలు వొగడఁగ
కహకహ హిరణ్యకసిపుఁడు నగి హరి
సహజ మేదియని చఱచెఁ గంభము ॥శర॥

అటమరి పెటపెటమని బెట్లగని
చిటచిట రవముల జిరుత పొగలెగసి
తటతటమనుచును తరలి బ్రవయ్యాలై
పటపటమనుచును పగిలె గంభము ॥శర॥

బెడిదపు చూపుల మిడు గురు లెగయఁగ
పుడమి యదర నూర్పులు చెల్లఁగ
గడగడ వడకి దిక్తటము లల్లాడగ
వెడలె గంభమున విజయసింహము ॥శర॥

నగవుల నుడిపడెనభోంతరంబులు
పొగలెగసెను పెను బొమముళ్ళ
పగటు నార్పులను పగిలెను గొండలు
వెగటుగ వెడలెను వీరసింహము ॥శర॥

తెఱచిన నోర బ్రతిధ్వను లెసగఁగ
కఱకు గతుల చుక్కలు చెదర
నెఱి హుంకృతులను నిఖిలము బెదరఁగ
వెఱచఱవ గెరలె విమల సింహము ॥శర॥

పటు విహారముల బ్రహ్మాండమగల
గుటగుట రవళి నాకులు వొగడ
నిటల నేత్రమున నెఱమంటలడర
పటుగతి మెరసెను భయదసింహము ॥శర॥

పెదపెద కోఱల పిడుగులు రాలఁగ
తుదనఖముల నెత్తురు దొరుగ
గుదిగొను కసరుల కులగిరులూఁటాడ
వుదయించె నదినో వుగ్రసింహము ॥శర॥

అట్టహాసమున నసురలు వారగ
ముట్టి వాయువులు మొగ తిరుగ
దట్టములై జలధరములు ముసరఁగ
దిట్టయై వెడలె ధీర సింహము ॥శర॥

జలధులు గలగెను జడిసె లోకములు
తల కెసప్తాకాశములు
వులికిపడ దొడఁగె నూర్ధ్వలోకములు
కొలువున నిలిచెను ఘోర సింహము ॥శర॥

అప్పుట హిరణ్యు నదరంట బట్టి
యిచ్చల దొడపై నిడి చించి
కుచ్చి వానిపేగులు జంధ్యములుగ
విచ్చి వేసుకొనె విష్ణు సింహము ॥శర॥

పొగడిరి దివిజులు భువనములు వెలసె
పగ యుడిగి చెలఁగె బ్రహ్లాదుఁడు
మిగుల శాంతమున మించె శ్రీవెంకట
నగమున నహోబల నారసింహము ॥శర॥ (8-239)

11. 2 పాదాల పల్లవి 4 పాదాలు 13 చరణాలు —

రీతి గౌళ

రాధామాధవ రతిచరితమితి
బోధావహం శ్రుతిభూషణం ॥పల్లవి॥

గహనే ద్వావపి గత్వా గత్వా
రహసి రతిం ప్రేరయతి సతి
విహరతస్తదా విలసంతౌ
విహత గృహాశౌ తౌ ॥రాధా॥

లజ్జాశబళ విలాసలీలయా
కజ్జలనయన వికారేణ
హృజ్జావ్యవహృన (హిత?) హృదయా రతి
సజ్జాసంభ్రమచపలా జాతా ॥రాధా॥

పురతో యాంతం పురుషం వకుళైః
కురంటకైర్వాకుటజైర్వా
పరమం ప్రహరతి పశ్చాల్లగ్నా
గిరం వినాపి వికిరతి ముదం ॥రాధా॥

హరి సురభూరుహ మర్వాతివస్వ (మరోహతీవ?)
చరణేన కటిం సంవేష్ట్య
పరిరంభణ సంపాదిత పులకై
ప్పలయచిర్జాతా సుమలతికేవ ॥రాధా॥

విధుముఖదర్శన విగళితలజ్జా
త్వధరబింబఫలమాస్వాద్య
మధురోపాయనమార్గేణ కుచౌ
నిథివద (ద్ద?) త్వానిత్యసుఖమితా ॥రాధా॥

సురుచిరకేతక సుమదళ నఖరై
ర్వరచిబుకం సా పరివృత్య (వర్త్య?)

తరుణిమసింధౌతతీయద్వ్గల
చరయుగళం సంసక్తం చకార ॥రాధా॥

వచన విలాసైర్వశీకృత (త్యా?) తం
నిభలకుంజ మానిత దేశే
ప్రచుర సైకతే పల్లవశయనే
రచిత రతికళా రాగేణాస ॥రాధా॥

అభినవ కల్యాణాంచిత రూపా
వభినవేశ సంయత చిత్తా
బభూవతు స్తత్పరౌ వేంకట
విభుణా (నా?) సా తద్విదినా సతయా ॥రాధా॥

సచలజ్ఞావీక్షణో భవతి తం
కచభరం (ర?) గంధం ఘ్రాపయతి
నచలతి చేన్మానవతీ తథాపి
కుచసంగాదనుకూలయతి ॥రాధా॥

అవనత శిరసాప్యతి సుభగం
వివిధాలాపై ర్వివశయతి
ప్రవిమల కరరుహరదన విలాసై
ర్భువనపతి (తిం?) తం భూషయతి ॥రాధా॥

లతాగృహమేళనం నవసై
కతవైభవ సౌఖ్యం దృష్ట్వా
తతస్తతశ్చరసౌ (శ్చరతస్తౌ) కేళ్
ప్రవతచర్యాం తాం వాంఛాంతౌ ॥రాధా॥

వనకుసుమ విశద వరవాసనయా
ఘనసార రజోగంధైశ్చ
జనయతి పవనే సపది వికారం
వనితా పురుషౌ జనితాశౌ ॥రాధా॥

ఏవం విచరన్ హేలా విముఖ
శ్రీ వేంకటగిరి దేవో యం
పావన రాధా పరిరంభ సుఖ
శ్రీ వైభవసుస్థిరో భవతి ॥రాధా॥ (12-183)

12. 4పాదాల పల్లవి, 8పాదాల 3 చరణాలు —

శ్రీ రాగం

నిత్యాత్ముఁడై యుండి నిత్యుఁడై వెలుఁగొందు
సత్యాత్ముఁడై యుండి సత్యమై తానుండు
ప్రత్యక్షమై యుండి బ్రహ్మమై యుండు సం
స్తుత్యుఁడీతిరువేంకటాద్రి విభుఁడు ॥పల్లవి॥

ఏమూర్తి లోకంబులెల్ల నేలెడు నాతఁ
డేమూర్తి బ్రహ్మాదులెల్ల వెదకెడు నాత
డేమూర్తి నిజమోక్షమియ్యఁజాలెడు నాతఁ
డేమూర్తి లోకైక హితుఁడు
యేమూర్తి నిజమూర్తి యేమూర్తియునుఁగాఁడు
యేమూర్తి నిజమూర్తి యేమూర్తియునుగాఁడు
యేమూర్తి త్రైమూర్తు లేకమైన యాతఁ
డేమూర్తి సర్వాత్ముఁడేమూర్తి పరమాత్ముఁ
డామూర్తి తిరువేంకటాద్రి విభుఁడు ॥నిత్యా॥

యేదేవు దేహమున నిన్నియును జన్మించె
నేదేవు దేహమున నిన్నియును నణఁగె మరి
యేదేవు విగ్రహం బీసకల మింతయును
యేదేవు నేత్రంబు లినచంద్రులు
యేదేవుఁడీ జీవులన్నింటిలో నుండు
నేదేవు చైతన్య మిన్నిటికి నాధార
మేదేవుఁడవ్యక్తుఁడేదేవుఁ డద్వంద్వుఁ
డాదేవుఁ డీవేంకటాద్రి విభుఁడు ॥నిత్యా॥

యే వేల్పు పాదయుగ మి యు నాకాశంబు
యె వేల్పు పాదకేశాంతం బనంతంబు
యే వేల్పు విశ్వాస మీమహామారుతము
యే వేల్పు నిజదాసు లీపుణ్యులు
యే వేల్పు సర్వేశుఁడేవేల్పు పరమేశుఁ
డేవేల్పు భువనైక హిత మనోభావకుఁడు
యే వేల్పు కడుసూక్ష్మమేవేల్పు కడుఘనము
ఆ వేల్పు తిరువేంకటాద్రి విభుఁడు ॥నిత్యా॥ (1-75)

నిబంధపదాలు - అవయవాలు :

ఈ నిబంధ పదానికే అయిదు అవయవాలున్నాయి. అవి ఉద్గ్రాహ, మేళాప, ధ్రువ, అంతరి, ఆభోగాలు ఉద్గ్రాహమంటే ప్రబంధం మొదటి భాగం. అంటే ఆరంభం. ధ్రువం ప్రబంధంయొక్క ముగింపు ఉద్గ్రాహ ధ్రువాల్ని కలిపేది మేళాపకం. ఆభోగమంటే ప్రబంధ రచయిత నామమో లేదా అంకితమిచ్చిన దేవతా నామమో ముద్రగా కలిగిన తుదిభాగం. ఈ ధాతువుల కూర్పువల్ల ఏక ధాతుక, ద్విధాతుక, త్రిధాతుక, చతుర్ధాతుక నిబంధ పదాలేర్పడతాయి. ఉద్గ్రాహ, ఆభోగ పల్లవులతో కూడింది త్రిధాతుకం, ఉద్గ్రాహ, మేళాపక ధ్రువ ఆభోగాలతో కూడింది చతుర్ధాతుకం. అన్నమయ్య కీర్తనల్లో ఈ రెండే ఎక్కువగా వున్నాయి.

త్రిధాతుక పదం :

సామంతం

తానే కాకెవ్వరు మాకు దాతయు దైవము తన
లోనబెట్టుకొని మాకు లోనైన వాఁడు } ॥పల్లవి॥

చదివించి కూడువెట్టి జారకుండ సిల్లు గట్టి
బెదురులేని బుద్ధి పిన్ననాడే చెప్పి
యెదిరినడగి ద్రవ్యమిడిగొమ్మనుచు నిచ్చి
పదిలమై తమ్ము బాలించువాఁడు ॥తానే } ఉద్గ్రాహం

మోహపు మోచమ్ము మోహానురాగమ్ము
దేహవిభాగంబు దెలిసిన కలికి
వైహికమున వేంకటాధీశుడై సర్వ
దేహరక్షకుడై తిరుగు చున్నాడు ॥తానే॥ } ఆభోగం

(11-3-63)

చతుర్ధాతుక పదం :

పాడి

సీరువట్టుగొన్న చోటనేత దీరునా
సారె నాతని పొందులే చలిమందులు నాకూ } ఉద్గ్రాహం ॥పల్లవి॥

కప్పియాతడు నవ్వితే గాకలుమానీ గాక
కప్పురమేల చల్లరే కాంతలాల
తప్పకాతని మోవినే దప్పులు దేరీ గాక
యిప్పుడింత పన్నీరు ఇచ్చిరే నాకూ ॥సీరు॥ } మేళాపం

పొరి బొరి నాతని పూర్పుల జెమటార్చి గాక
సురటేల విసరేరే సుదతులాలా
సరినాతని మేలమే విరహ మార్చీ గాక
విరులేల పోసేరే వేమారు నాపైని ॥సీరు॥ } ధ్రువం

సొగినాతని పాదాలు సోకి చల్లనయ్యా గాక
చిగురేల పరచేరే చెలియలాల
నిగిడి శ్రీవేంకట నిలయుడు నన్ను గూడె
జిగివట్టి కతలేల చెప్పేరే యింకాను ॥సీరు॥ } ఆభోగం

(18-242)

సంకీర్తన గ్రంథాల్లో చెప్పబడినవి, మరి అన్నమయ్యలో కనిపించే వివిధ నామక పదాలు :

1. అర్ధ చంద్రిక పదం :

ఉద్గ్రాహం, ధ్రువం, ఆభోగం, సగమె పలికి పల్లవి సంబంధించి తాన ప్రతానా కాంక్షిత మయ్యేది.

'అతిశోభితేయం రాధా
సతత విలాసవశా రాధా
దర్పక బలబోధా రాధా
తర్పణ గంధవిధా రాధా
దర్పయుతక్రోధా రాధా
దర్పకరసవేధా రాధా (4-48)

సుగ్రీవ విజయ యక్షగానంలో —

'చదువులు తెచ్చిన జలచరపతికిన్
కుధరము మోచిన కూర్మంబునకున్
కన్నులనశ్రులు కమ్మగవగచున్
ఔరావిధివశమని తలయూచున్
ఏటికి ప్రాణములికనని తలచున్'

మొదలైన అర్ధచంద్రికల పదాల్ని పోలిందే పై రచనకూడా. ఇది పాదాంతంలో ప్రాసలు కల్గి, తానప్రతానః ఆకాంక్షితమై చతుష్పాదాకృతిని గల్గివుంది.

అష్టపది :

గీతగోవిందంలో జయదేవుడు రచించిన విధంగా ఎనిమిది పదాలు, పల్లవి వుండే రచన.

శంకరాభరణం

అహో సురత విహారోయం
సహజ పరాజయ శంకానాస్తి
యమునా కూలే సుమలతా గృహే
విమలసైకత వివిధ స్థలే
రమణీరమణౌ రమతస్తయో ః
ప్రమదస్యపరాత్పరం నాస్తి
పరిమళ భరిత ప్రచుర సుశీతల
వరమృదువాయౌ వాతిసతి

తిరువేంకట గిరిదేవరాథాయో
స్మరసరతి సుఖ శ్రాంతిర్నాస్తి (12-78)

ఈ పదం వస్తువులోను, రచనా రీతిలోను అచ్ఛంగా జయదేవుని అష్టపదుల్ని పోలిన రచనగానే వుంది.

దరువు :

ద్రుత మధ్యమానం, చిత్రవర్ణం, తాళం కలిగి ముందు పాడిన పదవాక్యాలతో ద్విచతుష్పాదాకృతితో ఒప్పుతుంది.

'కూరిమెరిఁగి కైకోవు నీ
బీరములే నెరపేవు
రంతులె సేసిటు రావు
యెంతైనాఁ జనవీవు
చెంతలెకడు దలఁచేవు
ఇంతలో నెరవయ్యేవు (12-310)

పదమాలిక :

సొగసైన పల్లవిని గూర్చుకొని అర్థచాతురితో బహువిధాల పదమాలిక సీస మాలిక లాగా శోభిల్లుతుంది.

ముఖారి

ఎంత వేగిర కాడవేమోయి
పంతగాడ వింతలోన వదరకువోయి ॥పల్లవి॥

చెక్కునొక్కంబొద్దులేదో చెంతసేయంబొద్దులేదో
అక్కర దీరంగ మాటలాడవోయి
యిక్కువంటం బొద్దులేదో యేటికైనా బొద్దులేదో,
యెక్కువ కప్పుర పిడెమందవోయి॥
చెయిచాచంబొద్దులేదో కేసవెట్టంబొద్దులేదో
సోయగపు నీమొగము చూపవోయి

మోయ నప్పంబొద్దులేదో మోదయానంబొద్దులేదో
నీయలపు దీరం గొంత నెత్తమాడవోయి॥

పచ్చిసేయం బొద్దులేదో పైకొనంగం బొద్దులేదో
యిచ్చగాగం గిన్నెర వాయించవోయి
గుచ్చినన్నుం గౌగిటనుం గూడితి శ్రీవేంకటేశ
మచ్చికె యీప్రేమ మిట్టెమఱవకువోయి॥ (13-230)

భాసుర వాక్యం :

తానాంచితంగాను, విలంబమానంగాను తాళవిరహితంగాను వుండి ద్విచతుష్పాదాకృతితో వుండేవి.

గీతం - నాట

'ఏ దైవము శ్రీపాదన్న (న?) ఖమునంబుట్టిన గంగ
త్రిలోకపావనము చేయను త్రిపథగామినియాయెను'
ఏదైవము నాభినలినంబున జనియించిన అజుండు
అఖిలాండంబులు సృజియింప నధిపతియాయెను
ఏదైవంబు పురస్థలంబు తనకును మందిరమైనయిందిర
మాతయయ్యె యీజగంబులకెల్లను
ఏదైవము అవలోకన మింద్రాది దిగ్జగణంబుల
కెల్లప్పుడును సుఖంబులాపాదించును' (11-3-34)

ఈ పదంపై 'గీతం - నాట' అని వుంది. ఈ గీతమే భాసుర వాక్యమేమో అని వేటూరి ఆనందమూర్తిగారు అభిప్రాయపడ్డారు[162].

శరభపాద పదం :

ఎనిమిదేసి పాదాలున్న పదం. ఇది అష్టపదికన్నా భిన్నంగా వుంటుంది.

శ్రీ రాగం

నిత్యాత్ముండై యుండి నిత్యుండై వెలుంగొందు
సత్యాత్ముండై యుండి సత్యమై తానుండు

ప్రత్యక్షమై యుండి బ్రహ్మమై యుండు సం
స్తుత్యుఁడీ తిరువేంకటాద్రి విభుఁడు ॥పల్లవి॥

ఏ మూర్తిలోకంబు లెల్లనేలెడు నాతఁ
డేమూర్తి బ్రహ్మాదులెల్ల వెదకెడు నాతఁ
డేమూర్తి నిజమోక్షమియ్య జాలెడు నాతఁ
డేమూర్తి లోకైక హితుఁడు
యేమూర్తి నిజమూర్తి యేమూర్తియును గాఁడు
యేమూర్తి త్రిమూర్తులేకమైన యాతఁ
డేమూర్తి సర్వాత్ముఁడే మూర్తి పరమాత్ముఁ
డా మూర్తి తిరువేంకటాద్రివిభుఁడు ॥నిత్య॥ (1-75)

రాగవిశేషాలు :

'రంజయతీతిరాగః' అని రాగానికి వ్యుత్పత్తి అంటే రంజింపజేసేది అని అర్థం. అహోబల సంగీత పారిజాతంలో 'రంజకః స్వర సందర్భోరాగ ఇత్యభిధీయతే' అని చెప్పబడిందని పి. సాంబమూర్తి గారు పేర్కొన్నారు.163

రాగాల్ని గూర్చి మొట్టమొదటగా ప్రస్తావించినవాడు మతంగుడు. ఇతడు తన బృహద్దేశిలో 'రాగలక్షణం' అని ప్రత్యేకంగా ఒక అధ్యాయాన్ని పేర్కొన్నాడు

ఇతని తర్వాత సోమరాయ్యడనే అతడు స్వరార్ణవం (స్వరరాగ సుధారసం) గ్రంథం వ్రాశాడు. ఇతని తర్వాత పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్ర - పర్వత ప్రకరణంలో సంగీత శాస్త్ర విషయాల్ని వివరించాడు. దేశిగాన పద్ధతిలోని రాగాలు, 108 తాళాలు, ప్రబంధాలు, ఇతర ప్రదర్శనీయాంశాలు, గతులు, గమకాలు, ఆలాపనలు, వాచకాలు, దరువులు, విహాణులు, తాయాలు, సాళగ తాళ గతులు, వాద్య చూడాదులు మొదలయిన వాటిని పేర్కొన్నాడు.

ఇతని తర్వాత శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరంలో 'రాగవివేకం' అని ప్రత్యేకించి ఒక ప్రకరణం వ్రాశాడు. ఇందులో గ్రామరాగాలు, ఉపరాగాలు, శుద్ధరాగాలు భాషావిభాషా అంతర భాషా రాగవిభేదాల్ని వివరించాడు. షడ్జగ్రామంలోని గౌడ భేదాలు, బోట్ట, మాలవ భేదాలు, మధ్యమ గ్రామంలోని టక్కరాగ భేదాలు,బాంగాలీ,

వరాటికా భేదాలు, సౌవీర, భైరవా, నట్టానాయానట్టూ, రామకృతి దేవకృతి, ఛాయా తోడి గుర్జరీ భేదాలు, మొదలయిన సుమారు 100 రాగాలకు పైగా చెప్పి వాటి లక్షణాల్ని వివరించాడు.

విద్యారణ్యుడు (1320-1380) తన సంగీతసుధలో 15 మేళకర్త రాగాల్ని నిర్ణయించి, 50 ప్రచురప్రయోగం వున్న రాగాల్ని నిర్దేశించాడు.

అన్నమయ్య వేదాంత గురువు వదివన్ శఠగోపయతి. కాని అతని సంగీత గురువు లెవరో తెలియదు బహుశః శ్రుతపాండిత్యం, అద్వితీయ పరిశ్రమ, అన్నమయ్య సంగీత వికాసానికి దోహదం చేసి వుండవచ్చు. అన్నమయ్య సంగీత సాహిత్యాలకు సమానగౌరవం కలిగించిన వాగ్గేయకారుడు.

ఇంతవరకు వెలువడ్డ సంకీర్తనల్ని పరిశీలించడం వల్ల అన్నమయ్య 95 రాగాల్ని ప్రయోగించినట్లు తేలింది

అన్నమయ్య ప్రయోగించిన రాగాలు :

అహిరి, అమరసింధు, ఆందోళి ఆరభి, ఆహిరి, ఆహిరినాట, కన్నడగౌళ, కన్నడ బంగాళం, కాంబోది, కుంతలవరాళి, కురంజి కేదారగౌళ, కౌశి, కొండమలహరి, కోకిల పంచమం, గంభీరనాట, గుండక్రియ, గుజ్జరి, గుమ్మకాంబోది, గౌళ, ఘంటారవం జాళ, చెంచుమలహరి, చాయ, ఛాయానాట, తెలుగు కాంబోది, తోడి, దేవక్రియ, దేవగాంధారి, దేసాక్షి, దేసి, దేసాళం, ద్రావిడభైరవి, ధన్నాసి, నట్టనారాయణి, నాగగాంధారి, నాగవరాళి, నాట, నాదరామక్రియ, నారాయణి, నారణి, నారణిదేశాక్షి, నారాయణదేసాక్షి, నీలాంబరి, పడమంజరం, పాడి, ప్రతాపనాట, పిసాళం, పూరభి, పూర్వగౌళ, బలహంస, బౌళి, బౌళిరామక్రియ, భంగాళం, భల్లాటి, భూపాళం, భైరవి, మనోహరి, మలహరి, మంగళకౌశిక, మధ్యమావతి, మాళవి, మాళవిగౌళ, మాళవశ్రీ, ముఖారి, ముఖారిపంతు, మేఘరంజి మేచబౌళి, రామక్రియ రేవగుప్తి, రాయగౌళ, రీతిగౌళ, లలిత, వరాళి, వసంతం, వసంతవరాళి, వేళావళి, శంకరాభరణం. శ్రీరాగం, శుద్ధదేశి, శుద్ధరామక్రియ, శుద్ధవసంత శోకవరాళి, సామంతం, సామరాగం, సామవరాళి సాళంగం, సాళంగనాట, సింధురామక్రియ, సౌరాష్ట్రం, సౌరాష్ట్రగుజ్జరి, హిందోళం, హిందోళవసంతం, హిజ్జిజి మొదలయిన తొంభై అయిదు రాగాల్ని ప్రయోగించాడు,

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

అధిక సంఖ్యలో ప్రయోగించినరాగాలు : ఆహిరి, కాంబోది, దేసాళం, నాద నామక్రియ, పాడి, బౌళి, భైరవి, ముఖారి, రామక్రియ, లలిత, వరాళి, శంకరాభరణం, శ్రీరాగం సామంతం, సాళంగనాట. వీటిలో అత్యధికంగా సామంతరాగం 661 కీర్తనల్లో కనిపిస్తుంది.

అల్పసంఖ్యలో ప్రయోగించిన రాగాలు : అబాతి కన్నడ బంగాళం, కౌళి, కోకిలపంచమం, గుమ్మకాంబోది, ఘంటారవం, జాళి, చెంచుమలహరిఛాయ, దేవక్రియ, నారణిదేశాక్షి, నారాయణదేసాక్షి, ప్రతాపనాట పిసాళం, పూరిబి, భంగాళం, భల్లాటి. మనోహరి, ముఖారి, ముఖారిపంతు, రేవగుప్తి, రాముగౌళ, శుద్ధరామక్రియ, సామరాగం. వీటిలో అత్యల్పంగా గుమ్మకాంబోది, ఘంటారావం. జాళ, చెంచుమ లహరి, నారణి దేశాక్షి, పిసాళం, ముఖారిపంతు, శుద్ధరామక్రియ, ఒక్కొక్క కీర్తన లోనె కనిపిస్తుంది.

అన్నమయ్య కాలం నాటికి చాలావరకు సంగీత శాస్త్రం లక్ష్యాశ్రితంగాని, లక్షణాశ్రితం గాదు. జన్యరాగాలు, జనక రాగాలు, గమకాలు, భావానుకూలమయిన రాగ ప్రయోగం లాంటివి శైశవావస్థలోనే వుండేది. తరువాతి వాగ్గేయకారులు రచ నకు వృత్తిరీతి శయ్యాపాకాల లాగే రాగానికి అనుగుణమయిన రస సాహిత్యాలు అవసరమని గుర్తించారు. ఈనాటి లక్షణాలతో అన్నమయ్య కీర్తనల్ని జోడించి చేయడం సరికాదు. అయినా అన్నమయ్య రాగాల్లోని కొన్ని విశేషాల్ని ఇక్కడ పరిశీలించడం జరిగింది.

భూపాళం :

ఇది ఇప్పటి రివ మేళమయిన తోడి రాగానికి జన్యం. ఈ రాగాన్ని ఉత్తర దేశీయులు భూపాల తోడి అని వ్యవహరిస్తారు. ఇది ప్రాతః కాలంలో పాడదగిన రాగం. ఇది పురుష రాగం. సూర్యాంశతో పుట్టడం వల్ల దీన్ని పూర్వయామంలో పాడాలని నియమం. ఆమేలుకొలుపు పాటల్ని ఈ రాగంలో పాడతారు. అన్న మయ్య కీర్తనల్లో మేలుకొలుపులు ఎక్కువగా భూపాల రాగంలోనే కనిపిస్తాయి.

'భోగిశయనమును బుస కొట్టెడిని
యోగనిద్రపాయును మేల్కొనవే' (1-139)

కానీ అక్కడక్కడ తాత్త్విక కీర్తనలు ఆరగింపు సువ్వి పవళింపులకు కూడా భూపాలం వాడటం గమనించవచ్చు.

తాత్త్వికం :

మొదలనే యెచ్చరికతో మోసపోక, యేపొద్దు
వెదక హరికథలే వినుచుండవలయు ॥పల్లవి॥

వెలఁదులసుద్దులు వీనులను వింటేను
పెలుచుఁజూపులఁజూడఁ బ్రేమ పుట్టించు
మలసి యా చూపులు మనసున దగిలించు
తలఁపు మాటలాడఁదమి రేఁచును ॥మొద॥ (7-33)

ఐహిక లంపటత్వానికి కారణమయినవి, వైరాగ్య, ప్రవృత్తి కలగడానికి ప్రతిబంధక మైనవి అయిన కాంతాకనకాదులపట్ల వ్యక్తులు జాగ్రత్తగా వుండవలసిన స్థితిని, తత్త్వాన్ని పై కీర్తనలో స్పష్టం చేశాడు. ముక్తి సాధనకు హరికథా శ్రవణం దోహదం చేస్తుందని చెప్పాడు. భూపాలం మేలుకొలుపు రాగం కావడం వల్ల హరికథ శ్రవణం నెపంతో భక్తుడు మేల్కొవాలనే తత్త్వాన్ని అన్నమయ్య విశదం చేశాడు.

ఆరగింపులు :

వేఁకువఁదిరుపళచ్చి విష్ణునికి జేయరో
ఆఁకటి కొదగినట్టి ఆరగింపులు
అతి బ్రహ్మాండాలు గుక్షి నటుధరించిన యట్టి
అతనికిఁజేయరో ఆరగింపులు
ప్రతిలేని క్షీరాబ్ధిఁబవళించి లేచినట్టి
చతురునికిఁజేయరో చవి నారగింపులు' ॥వేకు॥ (9-8)

సువ్వి :

సువ్వి సువ్వి సువ్వలమ్మ
నవ్వుచు దేవకి నందనుఁగనియె

శశివొడచె అలసంబులుఁగడచె
దిశల దేవతల దిగుళ్లు విడిచె ॥సువ్వి॥ (12-361)

పవళింపు :

అలపు దీర్చుకోరాదా అన్నీ నయ్యా గాని
నిలువెల్లా జెమరించి నీళ్ళు గారీని ॥పల్లవి॥

పీడెమందు కొనరాదా వెనుక విచ్చేతుగాని
బీడై నీకెమ్మోవి పిప్పిగట్టెను
చూడరాదా మమ్ము గొంతచొక్కి కన్నుమూతుగాని
ఆడనీడా నుమ్మదాఁకి యలపుదేరీని ॥అల॥ (26-38)

పవళింపుకు 'భూపాలం' వాడడం చిత్రం. అయినా మేలుకొలుపులు, పవళింపులనేవి పుట్టుక చావులమధ్య కొట్లాడే జీవులకుగాని పరమాత్మునికి లేవు. అందు వల్ల భూపాలం వాడడం తప్పుకాదు.

నీలాంబరి :

ఈ రాగం 29వ మేళానికి చెందిన ధీరశంకరాభరణ జన్యరాగం. ఈరాగంలో జోల పాటలు, పెండ్లి పాటలు పాడతారు. అన్నివేళల్లో పాడదగిన రాగం. కాని అన్నమయ్యలో, ఈ రాగంలో పాడిన జోల, పెండ్లి పాటలు కనిపించవు. కాని దైన్య వ్యక్తీకరణకు ఈ రాగాన్ని అన్నమయ్య వాడినట్లు తెలుస్తుంది.

'ప్రియమాతోడుత నిన్ను బిలువ నంపెను మమ్ము
రయమున నిఁకనైనా రావయ్య మావెంటను
మచ్చిక నీ వాడిన మాటలు దలఁచుకొని
ఇచ్చల నేదుపు చూచు నింత నీకును
పచ్చ తోరణాలు గట్టి పండుగ నాటి వలెనే
విచ్చేతు వంటా నీకువిండాలు యెత్తిపెట్టెను' ॥ప్రియము॥ (18-406)

ఈ కీర్తనలో నాయికా నాయకులు ప్రణయ కోపం, నాయకుడు బిగుసుకోవడం, నాయిక పశ్చాత్తాపపడి చెలుల్ని పంపడం, చేలికత్తెలు నాయిక మనోగతాభిప్రా

యాన్ని మరి ప్రియుడికోసం చేసిన సింగారాల్ని విశదం చేసిరమ్మని బతిమాలడం కనిపిస్తుంది.

ఆరభి :

ఇది 29వ మేళానికి చెందిన ధీరశంకరాభరణ జన్యరాగం. ఇది మంగళకరరాగాల్లో ఒకటి. గాయకులు దైవస్తుతుల్ని ఈరాగంలో పాడతారు. కాని అన్నమయ్య వీటిని శృంగార భక్తి ప్రదర్శకంగా త్రిప్పుకొన్నాడు. ప్రేయసీ ప్రియుల అభిమతాల్ని, వారి సరసచేష్టల్ని వర్ణించడానికి ఈ రాగాన్ని ఎన్నుకొన్నాడు.

ఏమయ్యా ఆపె మీఁద నింత బత్తి గలిగితేను
కామించి పెండ్లాడరాదా కాదనేరా నిన్నును ॥పల్లవి॥

పలచగా నవ్వునవ్వి పాపట దువ్వుకొంటా
కొలువు సేసేయాపె గోరి చూచేవు
వలిద పయ్యదలోని వట్రువ గుబ్బల మీఁద
కలువ పువ్వులు వేసి కాంతాళించేవు ॥ఏమ॥ (18-186)

నీకు నిరంపైన వారినే నేము పొగడేముగాక
పై కొలిపిన వలపు పనికి వచ్చీనా ॥పల్లవి॥

మనసు వచ్చినవారే మంచి గుణములవారు
తనువట్టినవారే చక్కని వారలు
యెనయని వనితల నెందరి నీకు జెప్పినా
పెనగులాటే కాక ప్రియమయ్యీనా ॥నీకు॥ (18-303)

సావేరి :

ఇది మాయామాళవ గౌళ అనే 15వ మేళకర్త జన్యం. ఇది కరుణ రసాన్ని వెదజల్లే రాగం. ఇది ఉషః కాలంలో పాడదగిన రాగం.

కాసీవమ్మ యీపుణ్యము గట్టుకోవమ్మా
పూని యాతని కెంతేసి బుద్ధులు చెప్పేవు ॥పల్లవి॥

నేనాతడు రాకుండఁగా నేరము లెంచిన వెల్లా
కానుకగా బెట్టితివి కాంతుకి
మేనిపై మచ్చము చూచి మెల్లనే నేనవ్వితేను
దాసికిఁగా నాతని పంతము రేఁచేవు ॥కానీ॥ (19-631)

## ధన్యాసి :

ఇది శివ మేళానికి చెందిన హనుమత్తోడి రాగ జన్యం. ఇది భక్తిభావాల ప్రదర్శనకు అనుగుణమయిన రాగం. ఉదయకాలంలో పాడదగినరాగం. ఇది స్త్రీరాగం. వీర రసానికి ధన్యాసి వాడదగింది. అన్నమయ్య కీర్తనల్లో ధన్యాసి రాగంలో ఎక్కువగా ఆధ్యాత్మిక శృంగార భక్తి భావాలకు సంబంధించిన కీర్తనలే కనిపిస్తాయి.

## ఆధ్యాత్మిక భక్తి :

ఉప్పవడము గాకున్నా రిందరు
యెప్పుడు రేయి నీకెప్పుడు పగలు ॥పల్లవి॥

కన్నుల చంద్రుడును కమల మిత్రుఁడును
వున్నతినివి నీకుండఁగను
వెన్నెల యెండలు వెలయఁగ మేల్కొను
టెన్నఁడు నిద్దుర యెన్నఁడు నీకు ॥ఉప్ప॥ (1-148)

శబ్దరత్నాకరంలో 'ఉప్పవడము' అంటే మేలుకొనుట, అవబోధము అనే అర్థాలున్నాయి సూర్యశశినేత్రుడయిన మహావిష్ణువును మేలుకొల్పడం ఇందులో కనిపిస్తుంది

'నీవే మాకు దిక్కు నిన్నే తలఁతుము
కావు మానేర మెంచకు కరుణానిధీ
నెట్టన స్సూర్యునిలో నెలకొన్న తేజమా
గట్టిగా జంద్రునిలోని కాంతి పుంజమా
పుట్టి రక్షించే యజ్ఞపురుషుని ప్రకాశమా
వొట్టుక దేవతలలో నుండిన శక్తి ॥నీవే॥ (7-95)

శృంగార భక్తి :

'ఇందరిలో నీ ముద్దులు యేమి చెప్పేవు
కందువతో నేకతానఁగరుణించరాదా ॥పల్లవి॥

చెంగలువ కన్నులను చెలి నిన్నుఁజూచితేను
అంగమెల్లఁబులకించెనని యాడేవు
యింగితాన వలపులు ఇంత నీకు గలిగితే
కంగుదీర నీ విట్టే కాఁగతించరాదా ॥ఇంత॥ (29.478)

ముఖారి :

ఇది ఖరహర ప్రియ అనే 22వ మేళకర్త జన్యం. కరుణ రసాన్ని వెదజల్లే రాగం. సంగీతమకరంధం, చతుర్దండి ప్రకాశిక అనే ప్రాచీన గ్రంథాల్లో పేర్కొనబడింది. ముఖారి రాగానికి కాలనియమం లేదు.

'చిత్తములో నిన్నుఁజింతించ నేరక
మత్తుఁడనై పులుమానిసి నైతి ॥పల్లవి॥

అరుత లింగము గట్టియగి నమ్మఁజాలక
పరువత మేఁగిన బత్తుఁడనైతి
సరుస మేఁక పిల్ల జంకఁబెట్టుక సూఁత
నరయు గొల్లని రీతి నజ్ఞాని నైతి ॥చిత్త॥ (1-19)

ఈ కీర్తనలో భగవంతుని పట్ల భక్తి నిలుపుకోలేక కాలమంతా వ్యర్థంగా గడిపిన జీవుని ఆవేదన, ఆత్మార్పణ చక్కగా పలకడం చేయడం జరిగింది.

ఎక్కడో నున్నడో చిత్తమేమిఁ దలఁచెనో యింతి
చెక్కులెల్లాఁజెమరించీఁజెప్పరమ్మా చెలులు ॥పల్లవి॥

ఆతని సుద్దులు చెప్పే అతివలే చుట్టాలు
ఆతనిని వద్దనిన వారందరుఁబగ
రాతి రెల్లా నిద్దురేరఁగదు పాదము లొత్తి
చేతులెల్లఁబొక్కెనేమీ సేతమమ్మా చెలులు ॥ఎక్కడ॥ (12-28)

ఈ కీర్తనలో నాయకుని పట్ల మమకారం పెంచుకొని, అతన్ని మరచి పొమ్మని మందలించే వారిపట్ల పగనూ, అతని గుణ కీర్తనం చేసే వారిపైన అభిమానం కురిపిస్తూ అహోరాత్రాలు ప్రియుని ధ్యానించే నాయిక స్థితి కరుణరసాత్మకంగా వర్ణించబడింది.

'అతఁడే యజమానుఁడు ఆదినారాయణుఁడు
అతని బంట్లము మాకు నన్నిటా నిశ్చింతము ॥పల్లవి॥

యేలిక గల బంటుకు యెక్కడిది విచారము
పాలించే మగఁడు గల పడఁతి కేట చింత
కోలు ముందై తండ్రి గల కొడుకుది తొడుసు
యీలీల హరిదాసుని కెక్కడి కోరికలు ॥అత॥ (7-3)

ముఖారి శోక రాగమని ప్రసిద్ధి అయినా భక్తునికి ఏర్పడ్డ నిశ్చింతను వర్ణించడానికి అన్నమయ్య ఈ రాగం ఎన్నుకొన్నాడు.

'అనుమానపు బ్రతుకది రోఁతా తన
మనసెనయని కూటమి మరి రోఁతా' (1-26)

అనే కీర్తనలో సంసారం మీద కల్గిన విహ్వ భావం వ్యక్తమవుతుంది.

తోడి :

ఇది ప్రసిద్ధి చెందిన రాగం దీన్ని హనుమత్తోడి 'జనతోడి' అని కూడా అంటారు. భక్తిరస ప్రధానమయిన కీర్తనలు ఈ రాగంలో పాడతారు. తోడిరాగాన్ని సర్వాంగ సుందరంగా వాద్యాల్లో వాయించడం, గాత్రంతో పాడడం వైదుష్యంగా ఈ నాటికి పండితులు భావిస్తారు. తోడిరాగానికి కాలనిర్దేశంలేదు. హద్దానికి 'తోడి' పాడదగింది.

ఆధ్యాత్మిక భక్తి :

స్వతంత్రుఁడవు నీవు సరిలేని దొరవు నే
నతికమై యాడినట్లు ఆడ బోయేనా ॥పల్లవి॥

యెంత నీ మనసు సనుయెట్టుండె నట్లనే
అంతయుఁజేయవశ్యు మాకదె చాలు
అంతకంటే నెక్కుడు నేమంటిమివోయట మీఁదఁ
జెంతల మాచెప్పినట్టు సేయఁబోయేవా ॥స్వతం॥ (11-136)

'సుగ్రీవ నారసింహ సులభుఁడ వందరికి
నగ్రేసరుఁడ నీవవధారు దేవా ॥పల్లవి॥

సనకాదు లొక వంక జయవెట్టు చున్నారు
ఎనసి సురలు చేతులెత్తి మొక్కేరు
మును లిరుమేలా నుండి మునుకొని నుతించేరు
అనుపమాలంకార అవధారు దేవా ॥సుగ్రీ॥ (11-1-174)

ఇదె నేఁజేసిన భాగ్య మేమి చెప్పేది
పొదిగొని వలపుతె పోడి సేసేవు ॥పల్లవి॥

వంతుల వాసుల వారు వద్దఁగాచుకుండఁగాను
చెంతల నాపై నేల చేయి వేసేవు
సంతలో బేరములే సరసమే కురియఁగా
పొంత నుండి నాతోనే పొందుసేసేవు ॥ఇదె॥ (29-237)

తమిళంలో 'తోళి' అంటే చెలికత్తె అని అర్థం. 'తోడు' అనే మాటకు తమిళం, తెలుగు కన్నడంలో సహాయపడే వాడని భావం.

ఈ కీర్తనలో తోడు కోరేవాడు శ్రీవేంకటేశ్వరుడు. అతడు శ్రీయుతాకారుడు ఆతనిని వలచిన వనితలెందరో వుండగా వారలో ఒక్కతెను చేరదీశాడు. జీవు లెందరో వుండగా పరమాత్ముని దృష్టి ఒకానొక వ్యక్తిపై పడడం, అతడు భక్తితో తాదాత్మ్యం చెందడం జరుగుతుంది. ఈ అభిప్రాయాన్నే అన్నమయ్య భంగ్యంత రంగా వ్యక్తం చేశాడు.

కాంభోజి :

కాంభోజ మనే ప్రాంతం నుండి వచ్చింది కాబట్టి ఈ రాగానికి 'కాంభోజి' అనేపేరు వచ్చినట్లు కొందరి వూహ. ఈ రాగాన్నే కాంభోది రాగమని కూడా

అంటారు. కేరళీయులు ఈ రాగాన్ని 'కామోదరి' అని పిలుస్తారు. ఇది హరి కాంభోజి అనే 28వ మేళ కర్తజన్యం. అన్ని సమయాల్లోను పాడదగిన పెద్ద రాగాల్లో ఒకటి. శ్లోకాలు, పద్యాలు ఈ రాగంలో పాడుకోవచ్చు. అన్ని రకాలైన రచనలు కూడా ఈ రాగంలో కనిపిస్తాయి. ఇది వర్ణనలకు వుపయుక్తమయిన రాగం

తాత్త్వికం :

సంతలే చొచ్చితిఁగాని సరకుఁగాననైతి
యింతట శ్రీహరి నీవే యిటు దయఁజూడవే ॥పల్లవి॥

తెగి సంసార జలధి దిరుగులా డితిఁగాని
అగడై వైరాగ్య రత్న మదిదేనైతి
పొగరు జన్మాల రణభూములు చొచ్చితిఁగాని
పగటుఁగామాదుల పగ సాధించనైతి (6-27)

ప్రణయ కీర్తనలు :

చెప్పినట్లు సేయవే చెలుపునికి
కప్పురపు నవ్వులచే కరఁగీనీయెదుట ॥పల్లవి॥
మాటాడితే వెంగెమే మగుడి చూచే చూపులూ
గాటముగ రాలేటి కాముననమ్ములు
యేటికి నింత సేసేవే యెంత నేరుచుకొంటివే
చేటిమ్మంటూ రమణుఁడు సొలసీని నిన్నును ॥చెప్పి॥ (20-34)

'ఏమనున్నదో నీ చిత్తమెఱఁగ నేను
దీముగా నింకా మీద దెలుసుకొమ్మీ' ॥పల్లవి॥

మొగసక్కెనకు నిన్ను నేమైనా నందు గాని
పగటు నీమీద నాకు ప్రాణము సుమ్మీ
ఆగడ య్యోనని నీతో నాడుకోవెఱతు గాని
మిగుల వలచినట్టి మెలఁతఁ జుమ్మీ ॥యేమి॥ (18-21)

దేవ గాంధారి :

ఇది 29వ మేళకర్త అయిన ధీర శంకరాభరణంలో జన్యం. ఇది వీరరసాన్ని వెదజల్లే రాగం. దీన్ని అన్ని వేళలా పాడవచ్చు. తనను తన దేహాన్ని నిందించు కొనే భక్తుని మనస్తత్వాన్ని విశదీకరించడానికి అన్నమయ్య 'దేవగాంధారి' ఎన్నుకొన్నాడు.

'ఇంకనైనా రోయ రాదా యీపాటి వార మింతే
మింకు దనమేల మామాట వినరాద ॥పల్లవి॥
తోలు బొంతగట్టుకున్న దొర గింతే నన్నునీవు
కూళ సంసారమూ యేల కొసరేవు
యీలకొన్న యెముకల యింటిలో కాపురమింతే
యేల మాయవెంట బెట్టేవేమీ గద్దు నీకును ॥ఇంక॥ (9-45)
'విధి నిషేధములకు వెఱవఁగఁబనిలేదు
మధుసూధన నీ మన్నన దాసుఁడైతే ॥పల్లవి॥
విడువ రాని ధర్మ విధుల పురుషులను
విడిచి గోపికలు వెచ్చనపడి
బడినిన్నుఁదగులుటే పరమధర్మమాయ
యెడయు నితర ధర్మాలిక నేఁటికయ్యా ॥విధి॥ (1-893)

అనే ఈ కీర్తనలో భగవంతునికి మనస్సును అర్పితంచేసి, అతనికి దాసుడుగా బ్రతికే మానవులకు ఎలాంటి భయాందోళాలుండవని చెప్పడకే జరిగింది.

## 4. 2. 2 సంకీర్తనల్లో జానపద సంగీత ధర్మాలు :

సంప్రదాయ బద్ధమయిన సంగీతం శాస్త్రీయ సంగీత మయినట్లే జానపదుల సంగీతం జానపదసంగీతమవుతుంది. దీన్నే దేశి సంగీతం అని చెప్పడం సంప్రదాయం.

### జానపద సంగీతం - పుట్టుక - వికాసం :

సుఖదుఃఖాలతో కూడిన మానవ జీవితంలో మానవుడు అప్రయత్నంగా

ఆలాపించిన కూని రాగాలే జానపద సంగీతానికి, ఆ తర్వాత శాస్త్రీయ సంగీతానికి మూలమని చెప్పవచ్చు.

పల్లెటూరి పడుచులు తమ ఇళ్ల లో రోళ్ల దగ్గర ధాన్యాన్ని దంచేటప్పుడు పిండి తిరుగలిలో విసురుతూ, తమ భర్తకు, అన్నదమ్ములకు, సహాయపడుతూ, పెరలో కలుపుతీస్తూ, నిద్రకోసం ఏడ్చే పిల్లల్ని జోకొట్టుతూ పాడే పాటలే మన సంగీతానికి ఆధారాలు. చిన్న పిల్లలు పాటలు మొదలుకొని స్త్రీల పాటలు, కర్షకులు, కార్మికులు, శ్రామికులు, వీరులు, ప్రేమికులు, యోగులు, అబాలగోపాలం ఆడిపాడుకొనే పాటల్లో జానపద సంగీతం ప్రత్యక్షమవుతుంది.

జార్జ్ లిస్ట్ George List) సంగీతాన్ని గూర్చి 'The term Folk music is often loosely applied to cover all traditional or rurally transmitted music, music that is passed on by ear and performed by memory rather than by the written or printed music score. From the scholarly point of view, genuine folk music exhibits a number of traits in addition to that of aural transmission'[164] అని అభిప్రాయపడ్డారు.

పింజమూరి సీతాదేవి జానపద సంగీతాన్ని గూర్చి —

'Folk music is a very sense is the composition of the race that produced it who composed the tune or the song is neither known nor is it important. All that matter and all that we need is that they are spontaneous and beautiful expressions And 'the traditional singer, if he is a true artist unconsciously adds something to what he sings. The folk tunes is neither old nor new-because it is continually taking new shape'. It is an individually flowering on a common stem'[165] అని అభిప్రాయపడ్డారు.

ఆర్. రమణి గారు —

"Folk music is a spontaneous out flow of the heart and the product of the innote artistic instinct in the people and every nation or country has its ours folk songs, which richly and truly portray the characteristics of the nation"[166]

అని పేర్కొన్నారు.

ఆచార్య పి. సాంబమూర్తి గారు శాస్త్రీయ-జానపద సంగీత భేదాల్ని గూర్చి-

"The function of folk music is primarily entertainment. It is a pleasant type of light music. It just stops withmaking a superficial and temporary appeal to our emotions Classical music has a purpose higher than mere entertainment. Besides its appeal to our entellect and emotions, it takes us to the realm of the supreme and helps us to taste something of the celestail bliss. Classical music enlarges our imagination, purges, the mind of unclean feelings and elenates us. The creation of Ananda rasa (emotional joy) is the purpose of classical music"[167] అని తెలియజేశారు.

## శాస్త్రీయ సంగీతం - జానపద సంగీతం :

ఆచార్య బి. రామరాజుగారు శాస్త్రీయ, జానపద సంగీతాలకున్న అంతరాన్ని గూర్చి —

"The basic difference between the classical music and folk music is more in the spirit than in the outward form. Folk music is born of the rustic's heart, whereas classical music is the product of the thinking mind of elite musicians ..................................The natural simplicity and the glow of human heart, so evident inthe rural folk form an important aspect in the style and form of folk music"[168] అని వివరించారు.

శాస్త్రీయ సంగీతం లక్షణ బద్ధం. జానపద సంగీతం లక్షణ బద్ధం కాదు. లక్ష్యజ్ఞానంతో పెరిగింది. శాస్త్రీయ సంగీతంలో అపూర్వరాగాలెన్నో వున్నాయి. జానపద సంగీతంలో ఎవరెవరికి ఏయే భావాలు స్ఫురిస్తాయో ఆయా భావాలకు అనుగుణంగా మెట్లను సమకూర్చడం జరుగుతుంది

శాస్త్రీయ సంగీతానికి స్థిరమయిన సాహిత్యంవుంది. జానపద సంగీతానికి స్థిర సాహిత్యంలేదు. అందువల్ల జానపద గేయంలో లాగే ఇది మార్పుచెందుతూ వస్తుంది. శాస్త్రీయ సంగీతానికి కర్తృత్వం చెప్పడానికి వీలుంది. జానపద సంగీతానికి కర్తృత్వం నిర్ణయించడానికి వీలుపడదు.

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

సంగతులు, గమకాలు, అపూర్వతాళాలు, శాస్త్రసంగీతంలో కనిపిస్తాయి. కాని జానపద సంగీతంలో సామాన్య సంగీత సంకీర్తనరాగాలు వుంటాయి. జానపద సంగీతాచ్చాయల్లో కొన్ని క్రమంగా మార్గసంగీతంలో స్థిరపడతాయి. ఇవే గాకుంటా స్వరపరిమితి తక్కువగా వుండటం, ప్రతిమధ్యమ స్వరంలోపించడం, సాహిత్యంలో మాటలు ఎక్కువగా వుపయోగించడం, వ్యపస్థితమయిన సంగతులు గాని, స్వరదీర్ఘకరణాలుగాని లేకపోవడం, సాహిత్యం ద్విపాద చరణాలుగాని, చతుష్పాదాలుగా గాని వుండడం మొదలయినవి జానపద సంగీత ధర్మాలే.

## జానపద సంగీత వర్గీకరణ :

జానపద సంగీత వికాసాన్ని ఆచార్య బి. రామరాజుగారు 3 దశలుగా వర్గీకరించారు. మొదటిది ఆటవిక జాతులకు చెందిన సంగీతం. ప్రాచీన కాలంనుండి నేటి వరకు జీవన వ్యవస్థలో ఎలాంటి మార్పు చెందని గోండులు, సవరలు, భిల్లులు, మొదలయినవారి పాటల్లోని సంగీతం ఈ వర్గానికి చెందింది. వాటిలో 3, 4 స్వరాల కంటె అధిక స్వర వ్యాప్తిలేదు

రెండవది అచ్చమయిన జానపదులకు చెందిన సంగీతం. గ్రామీణ వ్యవస్థలో స్థిర నివాసం ఏర్పరచుకొన్న వారి జీవితంలో భాగంగా నిలిచి పోయిన సంగీతం. వీరి ఆటపాటల్లో వేడుకల్లో 4 స్వరాల కంటే విస్తరించిన సంగీతం వినిపిస్తుంది.

మూడవదశ సంస్కార వంతులయిన జానపదుల సంగీతం. వీరి పాటల్లో ఏకస్థాయి పరిధిపోయి సప్తస్వర పరిమితి ప్రాధాన్యం వహిస్తుంది. శాస్త్రీయ సంగీత ప్రభావం వీరి పాటల్లో స్పష్టంగా గుర్తించడానికి వీలవుతుంది'169 అన్నమయ్య సంకీర్తనల్లోని జానపదగేయవరుసలు మూడవ దశకు సన్నిహితమయినవి. మరియన్ బావర్ (Marion Baver) ఎథల్ ఆర్ పేసర్ (Ethil R. Peyser) అనే జగద్విఖ్యాత సంగీత విమర్శకులు, తమ మ్యూజిక్ త్రూ ఏజస్ (Music through Ages) అనే గ్రంథంలో జానపదసంగీతాన్ని నాలుగు ఘట్టాలుగా విభజించారని, వాటిని వింజమూరి సీతాదేవిగారు - 1. ఆదిమవాసులైన ఆటవిక జాతులవారు పెట్టే పొలికేక (Savage Yell), అది 2, 3, స్వరాలు కలిగిన ధ్వని. 2. తర్వాత, ఆ నాదపుతునకనే మరల రెట్టించి (repetition) పలికే అసంపూర్ణ సంగీతవాక్యం

Musical phrase), 3. ఆపైని సురావపూరితమైన అటువంటి వాక్యాలను కొన్నింటిని కూర్చి పాడడము (Balance of phrases), 4. తుదకు ఒక ప్రత్యేక శ్రుతిని (tonal centre) ఆధారం చేసికొని ప్రధాన సంగీత వాక్యాన్ని (Principal phrase) అదేపాటలో పల్లవి పదే పదే రెట్టిస్తూ మిగిలిన వాక్యములను కలిపి పాడడము (అవే పాటకు చరణాలు) అని చెప్పారు.170

ఈ విభాగాన్ని బట్టి అన్నమయ్య సంకీర్తనల్లోని జానపదగేయవరుసల్ని నాల్గు వరుసలో చేర్చవచ్చు

సూళాది :

కన్నడవాగ్గేయకారుల్లో ప్రసిద్ధంగాను, ఆంధ్ర వాగ్గేయకారుల్లో అన్నమయ్య రచనల్లోను కనిపించే జానపద సంగీత ధర్మం కలిగిన రీతుల్లో సూళాది ఒకటి.

డా॥ ఎం. వి. కృష్ణారావుగారు — సూళాదుల్ని గూర్చి

"Sula Hadi - easy path 'for the attainment of the eternal bliss'171 అని పేర్కొన్నారు.

ఆర్. సత్యనారాయణగారు —

'సంగీత గ్రంథాల్లో చెప్పబడ్డ సాలగసూడ ప్రబంధవిభేదమే సూళాదిగా మారింది'. అని అభిప్రాయపడ్డారు172

శ్రీ ఎస్. ఆర్. జానకిరామన్‌గారు —

"Suladi is a desya word for gita, Suda is Suddha Suda or chayalaga or Salaga Suda. Salaga Suda is dealt with in detail in musical treatises"173 అని పేర్కొన్నారు.

పుండరీక విఠలుడనే సంగీత శాస్త్రజ్ఞుడు —

'నిర్దిష్ట ఛందస్సులో నిర్దిష్ట తాళం ఇమిడేలా పాడడాన్ని నిర్యుక్తమంటారు. అందువల్ల తాళమాలికా ప్రబంధాలు సూళాదులవుతాయి. ధ్రువ, మఠ్య, రూపక, ఝంపక, త్రిపుట, అడ్డ, ఏక తాళాల్లో పాడాలని ఆదేశించాడు'.174

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు

సుబ్బరాయదీక్షితులు —

'సూళాది అన్నది ప్రసిద్ధాలంకార సప్తతాళంబులును, రగడ మత్త్యంబును ఉద్గ్రాహ, ధ్రువ, ఆభోగ ధాతువులతో ఏకంగా (యథాక్షరముగా) ఏకంబ మధ్యము లయలు గలదియై వర్ణక్రమంబులలో సాహిత్య రూపమై యుండును. ఈ సూళాదులు శ్రీపురందర విఠల దాసులవారు గాక దక్షిణ వారెవరును చూచినట్లు కనబడలేదు. పురందరదాసుల కాచార్యులైన శ్రీవ్యాసరాయస్వామి రచించిన సూళాదులున్నవి'[175] అని పేర్కొన్నారు.

హెచ్. ఎస్. వెంకటేశ మూర్తిగారు —

'ఏడు తాళాల్లో ఏదయినా రావచ్చు. ఆ తర్వాత ఆదితాళం చివర రెండు పాదాల 'జతె' వస్తుంది. సూళాది సారమంతా జతెలో వుంటుంది. పాదాల్లో సంఖ్యా నియమం లేదు. ఇవన్నీ తత్త్వ ప్రధానాలు. ప్రతి చరణం తాళ గమకంగా సాగు తుంది. చివర జతెలో అంకితం వుంటుంది. ఆద్విప్రాస నియమం. అంత్యప్రాసలు కూడా వుండవచ్చు అని తెలియజేశారు'.[176] ఇట సూళాదులు తాళ ప్రధాన రచనలని పై చర్చలవల్ల తేలిన అంశం. కన్నడంలో వ్యాస, పురందర, కనక దాసాదులు సూళాదులు వ్రాశారు. అన్నమయ్యలో ఒక్క సూళాది మాత్రం లభ్యం.

1. మాళవి గౌళ - ధ్రువతాళం :

వలె వలె నని వలచితి నట తన
వలలకు లోఁగా నటరే ఇఁక
ఫలమో చలమో నాకును
పతితో జగడములా
నెంతలు తన కెందరు గలిగిన
నేనే సతమని తెలియరె
పొలమెల్లా విరిగిన తేఁటికి
పూఁబోదయే నెలవు గదే

పల్లవి

అనగదరే ఓ చెలులాల
అతని తోడుత నీమాటలె

వినయంబున నే నడవఁగ శ్రీ
వేంకటపతి కిది దగవా

వాక్యం

అల్లనా డొకతె తోడ
నట్టెమాటలాడఁగాను ...
చల్లఁగా నేనే చూచి
జంకించితినా
పల్లదమాడితి నటె
పైడివంటి మాటనైన
చిల్లరలే మానఁడాయె
శ్రీవేంకటేశ్వరుఁడు

2. రామక్రియ - మర్త్యతాళం :

తానాడిన మాఁటలెల్లా దలచుమని
కోనేటి రాయనికి నాగుబ్బల మీఁదటను అనపెట్టతే.

3. వరాళి - రూపక తాళం :

వెగ్గళముగ సారెకు నీఁక వెంగెములాడఁగ జాలను
శిగ్గరితనమున గొసరెద శేషాచలపతిని

4. బౌళి - ఝంపె :

అలిగి సాధించఁదగఁదంజనాద్రీశ్వరుని
గలికి చూపులనె మది గరగఁజేసెదను

5. పాడి - త్రిపుట :

చనవు గలిగిన సరస మన్మథుడను
సముఖమున్ననే మనస్సు దెలిసెద

మునుప నడుగరె మదన జనకుని
ముద్దుటుంగరము

6. నాట - ఆటతాళం :

మాయింటికి దానే రాఁగా
మంకులూ బొంకులు దేలె
పయినేల నే మొక్కనే
వేంకటరాయనికి

7. శ్రీరాగం - ఏకతాళి :

అలరిన రతులఁదోయ్యాలు లాల నన్ను
గలసె వేడుక శ్రీవేంకట విభుఁడు

(శృం. సం. రేకు. 15(6))

ఇదీ దేశిసూళాది, రాగతాళమాలిక. ఇందులో రామక్రియ, వరాళి, మాళవి గౌళ, బౌళి, పాడి, నాట, శ్రీరాగాలున్నాయి. తాళాదులు వరుసగా ధ్రువ, మఠ్య, రూపక, జంపె, త్రిపుట, అది, ఏక తాళాల్లో వున్నాయి. కన్నడంలోలేని 'వాక్యం' అన్నమయ్య ప్రత్యేకత. ఇది ఆలాపఖండానికి చెందింది. మధుర భక్తికి ప్రాధాన్యం ఇవ్వడం ప్రత్యేకత.

అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయాలకు తగిన ప్రాధాన్యముంది. మూడవ ప్రకరణంలో ప్రసిద్ధ పదాల్ని పేర్కొనడం జరిగింది జానపదులలో లేనివి కాని, జానపదసంగీత ధర్మం కూడినవి కాని ఈ విభాగంలో చేరతాయి. ప్రధానంగా జానపద సంగీత వాద్య గాత్ర సంయోగ సన్నివిష్టం. సంగీతం ప్రారంభ దశలో నాట్యం, సంగీతం, అభినయం మూడూ కూడా చేరి వున్నవే. ఈ మూడూ చేరిన సంకీర్తనలు అన్నమయ్యలో కనిపిస్తాయి చిందు అనడానికి సి. పి. బ్రౌన్ తెలుగు-ఇంగ్లీషు నిఘంటువులో **'A dance hop, jig'** 'చిందాడు', 'చిందులు తొక్కు' అనే అర్థాలున్నాయి. శబ్ద రత్నాకరంలో 'చిందు' అనడానికి 'గీత ప్రబంధవిశేషము' అని వుంది. వెన్నెలకంటి సూరన విష్ణుపురాణంలో

'గీతంబు దరువు జక్కిణి చిందు మొదలుగా నొక్కొక్క వర్ణంబునుగ్గడించి' (7-279) అనే ప్రయోగం ఉంది. చిన్నన్న ఉషాపరిణయంలో ఉషాకన్యవీణ వాయిస్తూ 'సంకీర్తనముచిందు జక్కిణి మంకెంటి శబ్దంబు లలర మీటుచును' (పు. 21) సిద్ధపోయినట్లు చెప్పబడింది. శ్రీ ఎస్. పి. పార్థసారథిగారు శ్రీమతి ద్వారక పార్థసారథిగారు కావడి చిందు. నొంటి చిందు, శరుకనొంటి చిందు, వండిచిందు, వనదై చందు'177 అని చిందులరకాల్ని పేర్కొన్నారు.

డా॥ వేటూరి ఆనందమూర్తిగారు —

'భజన పరులు కీర్తనములను బాడునపుడు భక్తి పరవశమున సాధారణముగా నాలపించుటయేగాక యెడనెడ చిఱుతల చేతులు బైకెత్తియు, మేనులు వంచియు, నడుగులు మార్చియు, వలమట్టియు, పలుగతుల నాడుచుండుటయు గలదు. గతిభేదము గలిగి, యభినయానుకూలములగు నిట్టి కీర్తనములను 'చిందు'లనియు వ్యవహరించుట గలదు. వేడుకతో జిందు వాడంగ నుబ్బి కోణంగి యాటలగునిసెడివారు' అని పాల్కురికి సోమనాథుడు కోణంగి యాటలతో గునిసి యాడదగు చిందులను పేర్కొనియున్నాడు. 'వాడు చిందులు త్రొక్కుచున్నాడు' అనునొక నానుడియే పై గేయ రచనా ప్రభేదమును బట్టి యేర్పడియున్నది. 'గీతార్థాభినయో పేతైర్ద్విపదైశ్చిందు సంజ్ఞకైః' అని జాయసేనాపతి లక్షణమున్నది. చిందులు వెన్నెల వేళల స్త్రీల అభినయపూర్వకముగ నాడుచు తిరుగుచు పాడునట్టి పాటలని తెలియనగును'178 అని అభిప్రాయపడ్డారు.

ఈ చిందు పాటలు కోలాట పాటల గతుల్లోనే సాగుతాయి. కాని కోలాట పాటలు ఆడుతూ పాడేవి. చిందులు అలాగాకుండా అభినయపూర్వకంగా ఆడుతూ పాడడానికి వీలుగా వుంటాయి. అన్నమయ్య సంకీర్తనల్లో 'చల్లనై కాయగదో చందమామ' (12-228) అనే పాటలో 'చిందులకు నాదేటి సీమంతినీ మణులు చెలఁగి యిరుగడఁగొలువగాను' అని 'అలరులు గురియగ' (12-24) అనే పాటలో 'చందుల పాటల సిరిపొలయాటల- అందెల మ్రోతల నాడెనదె' అని నృత్యాన్ని వర్ణించడం జరిగింది. దీన్నిబట్టి చూస్తే ఈ పాటన్ని స్త్రీలు పాడేటివిగా తెలుస్తుంది. ఈ చిందుల్లో వున్న గతి మాధుర్యానికి ముగ్ధులు కావడం వల్ల భక్తి పరవశత్వంతో భజనపరులయిన పురుషులుకూడా వీటిని పాడడం ప్రారంభించారు.

ధన్యాసి

గోవింద నందనందన గోపాల క్రిష్ణనీ
భావము మాకుంజిక్కె గోపాలక్రిష్ణ ॥పల్లవి॥

కొంగు వట్టిన దేమోయి గోపాలకృష్ణమా
వంగెన కోపుదువా గోపాలకృష్ణ
దొంగతనాల నవ్వేవు గోపాలకృష్ణ
బంగారు కాశితోడి గోపాలకృష్ణ ॥గోవిం॥

కొమ్మల చీరలంటిన గోపాలకృష్ణ
పమ్మి నిన్నుండిట్టేము గోపాలకృష్ణ
కుమ్మరించేవేల శిగ్గు గోపాలకృష్ణ
బమ్మెరపోతిందుల గోపాలకృష్ణ ॥గోవిం॥ (3-174)

ఇందులో శ్రీకృష్ణుని తమనాయకుడుగా భావించి స్త్రీలు ఆడుతూ పాడుతున్నప్పటి భావం స్పష్టంగా తెలుస్తుంది. ఇలాగే చిత్తగించు మామాటలు శ్రీనారసింహ చిత్తజ జనకవో శ్రీ నారసింహ' (2-236) వంటి పాటలన్నీ చిందులే.

గాన విధానం అనుసరించి అన్నమయ్య పదరచనల్ని 3 రకాలుగా వర్గీకరించవచ్చు. 1. వ్యక్తిగానం, 2. సంవాదగానం, 3. బృందగానం.

వ్యక్తిగానం :

ఈ విభాగంలో పాడేవాడు ఒకడే ఇతరులు మౌనశ్రోతలు. ఇందులో సంవాదాలకు అవకాశంలేదు ఎక్కువ వాద్యాల అవసరమూ వుండదు. సాధారణంగా వ్యక్తిగానాల్లో ఆనందానుభూతి, నైరాశ్యం, నిర్వేదం ఆత్మసమర్పణం వంటివి కనిపిస్తాయి.

భూపాలం

ఇప్పుడిటు కలగంటి నెల్లలోకములకు
నప్పుడగు తిరువేంకటాద్రీశుఁగంటి ।పల్లవి॥

అతిశయంబైన శేషాద్రి శిఖరముఁగంటి
ప్రతిలేని గోపుర ప్రభలుఁగంటి
శతకోటి సూర్యతేజములు వెలుఁగఁగఁగంటి
చతురాస్యుఁబొడగంటి చయ్యన మేలుకంటి ॥ఇప్పు॥

కనక రత్న కవాట కాంతులిరుగడఁగంటి
ఘనమైన దీపసంఘములుఁగంటి
అనుపమ మణిమయమగు కిరీటముఁ గంటి
కనకాంబరము గంటి గక్కన మేలు కంటి ॥ఇప్పు॥

అరుదైన శంఖచక్రాదు లిరుగడఁగంటి
సరిలేని అభయ హస్తము గంటిని
తిరువేంకటాచలాధిపుఁజూడఁగఁగంటి
హరిఁగంటి నంతట మేలు కంటి (1-?8)

మ ల హ రి

అన్నిటా నీవె వుందు నందువు గాన
యిన్ని నీవు పుట్టించినవి నీసొమ్మ్మలే ॥పల్లవి॥
నిలచిన రూపులెల్లా నీగుహ్యగాఁదలఁతు
మెలగేటి చైతన్యము మిమ్ముఁగాఁదలఁతు
యిలలోని ధ్వనులు నీపలుకులుగాఁదలఁతు
కలపంచ భూతాలుపకరణాలుగాఁదలఁతు ॥అన్ని॥ (7. 90)

మ ల హ రి

ఎట్టయినాఁజేయుము యిఁక నీచిత్తము
కిట్టననీ సంకీర్తన పరుఁడ ॥పల్లవి॥
కొందరు జ్ఞానులు కొందరు భక్తులు
కొందరు వైరాగ్య కోవిదులు
యిందరిలో నేనెవ్వఁడఁగాను గాదె
సందడి హరి నీ శరణాగతుఁడ ॥ఎట్టు॥ (1-499)

ముఖారి

నాకు నీవు గలవు హరి నాలోపలనుండి
పైకొని యిన్నియు బదుకనీవయ్యా ॥పల్లవి॥

పసిగొని పణాను బంధము కొలఁదె
పసులునుఁబడతులు బహుసుతులు
వసము గావు తమ వంతులు దీరిన
పసగా నవియే బదుకనీవయ్యా ॥నాకు॥ (7-188)

సామంతం

నారాయణాచ్యుతానంత గోవింద హరి
సారముగ నీకు నే శరణంటినే ॥పల్లవి॥

చలువయును వేఁడియును సటల సంసారంబు
తొలఁకు సుఖమొకవేళ దుఃఖమొకవేళ
ఫలము లివె యీరెండుఁబాపములు పుణ్యములు
పులుసుఁదీపు నుఁగలపి భుజియించినట్లు ॥నారా॥ (7-189)

కన్నడ గౌళ

నీవు నన్ను రక్షించితే నిందనీపైఁబడదు
భావించి నన్నెట్టయినా బ్రదికించుకొనవే ॥పల్లవి॥

సంతతము నన్నెంచితే సర్వాపరాధినేను
యెంత నీవేమి చేసినా నంత కర్తుఁడ
అంతటిలోక జననియైన లక్ష్మిఁజూచి కాని
అంతరాత్మ నిన్నుఁజూచియైనా మన్నించవే ॥నీవు॥ (6-192)

జో (బొ ?) ళి

సర్వాత్మకుఁడవు సర్వేశ్వరుఁడనా
పూర్వాపరాలు నీకే భువి సమర్పయామి ॥పల్లవి॥

వేగి లేచి నేఁజేసేవెడ చేఁత నీచేఁతే
ఆగడపు మాటాడిన నది నీమాటే
ఆగము భోగములు నాయన్న పానాదులు మరి
శ్రీ పరుఁడ నాలోని చింతయు నీచింతే ॥సర్వా॥ (9-182)

గా ళ

హా ! నీ వాఁడనే కానా ఆదికాలమున నేను
గరిమ నీమాయలోనే కల గంటి గాక ॥పల్లవి॥

యీమేనే కాదా పెయ మెల్లా మోచినది
ఆమీఁదఁ బుణ్యతీర్థము లాడే గాక
కామించి యీరెంటి సంగాతంబు నేఁజేసి
గామిడినై యెందు వాఁడా గానైతిఁగాక ॥హరి॥ (10-44)

సంవాదగానం :

'సంవాదం' చాలా ప్రాచీనమయిన పదం. వేదాల్లో సంగచ్ఛధ్వమ్ సంవాద ధ్వమ్' అని వుంది. 'సంవాదం' అనడానికి సంస్కృతాంగ్ల నిఘంటువులో 'to speak together or at the same time' అనే అర్థాలివ్వబడ్డాయి. అందువల్ల సంవాదమంటే కలసి మాట్లాడే వాక్యాలకూర్పో లేదా ఒకే సమయంలో మాట్లాడే వాక్యాల కూర్పోకావచ్చు. గేయ సాహిత్యంలో 'సంవాద' గీతాలకు ప్రచారం ఎక్కువ.

ఆచార్య యస్వీ జోగారావుగారు - 'ఇవి పద ప్రక్రియను బట్టి ప్రత్యేకత గలవికావు సందర్భమును బట్టి బహు ప్రత్యేకత గలవి. యక్షగాన ప్రత్యేక శాఖ లగు భామ కలాపము, గొల్లకలాపము, కొఱవంజి అనువానియందు జనరంజక సంప్రదాయిక పాత్రలచే ప్రవర్తితములగుచు తరముల తరబడి ఆంధ్ర జనసామాన్యము నాబాల గోపాలము నుల్లాసవారాశిలో నోలలాడించుచు ప్రచుర ప్రచారము పొందినట్టివి. వీనియందు ఒక విధమైన మోటుదనము, మోటుదనముతోపాటొక హాస్యపు వాటము, ఒక విధమైన వెటకారము, వెటకారముతో పాటొక చమత్కారమును గలవు. అవి యీనాటి జనులకు వినోదపు విందులు గూర్చినట్టివి' అని వివరించారు 179

శ్రీ ఎల్లోరాగారు —

'సంవాదాలు అన్న పదంలోనే ఇద్దరి మధ్య చర్చ అని ధ్వనిస్తుంది. అయితే యివి పాటల రూపంలో మాటలు పొదిగిన సంవాదాలు. ఈ సంవాదాలు ఎక్కువగా పౌరాణిక గాథలతోనే నడుస్తాయి. దేవదేవుల మధ్యనే కుటుంబాలలోని కలతలూ, అనుమానాలూ కూడగట్టుకొని భర్తను భార్య, భార్యను భర్త సలసేసి బిగిగీసి అడగడం, హడలు గొట్టడం చివరకు సరేలే! అన్న పద్ధతిలో సంవాదం ముగియడం జరుగుతుంటుంది' అని అభిప్రాయపడ్డారు [180]

డా॥ వేటూరి ఆనందమూర్తి గారు —

'తాళ్ళపాకవారి సంకీర్తన వాఙ్మయమంతయు జీవాత్మపరమాత్మల నడమ సాగు సంవాదరూపమే. కనుక వీరి రచనలలో సంవాదములుండుట వింతగాదు. శృంగార భక్తి భావములు నిండార్లుగా గల వీరి సంవాదములు పలు తెఱగులైనవి కలవు' అని పేర్కొన్నారు [181]

పై అభిప్రాయములవల్ల ఇవి సందర్భాన్ని బట్టి ప్రత్యేకతను సంతరించుకొనేవని, మోటుగాను, హాస్యంగాను వుండేవని, వీటిలో వాదప్రతివాదాలుండడం చివరలో ఐక్యత వుండడం ప్రధానలక్షణాలు. అన్నమయ్య సంకీర్తనల్లో సంవాదగేయాలెక్కువ అవి చాలవఱకు ప్రణయాత్మకాలు. వాటిని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు మొదటిది బాంధవ్యసంవాదగేయాలు, రెండవది బాంధవ్యేతర సంబంధ గేయాలు.

## బాంధవ్య సంవాద గేయాలు :

వీటిలో రక్తసంబంధం ప్రాధాన్యం వహిస్తుంది బావమరదళ్ల సంవాదం, అత్తాకోడళ్ల సంవాదం, సవతుల సంవాదం, భార్యాభర్తల సంవాదం ఈ వర్గంలో చేరతాయి.

**పాడి**

ఏలేయేలే మరదలా చాలుఁజాలు చాలును
చాలునీతోడి సరసంబు బావ ॥పల్లవి॥

గాఁటపు గుబ్బలు గదలఁగఁగులికేవు
మాటలఁదేటల మరఁదలా
చీటికి మాటికిఁజెనకే వేవట్టి
బూటకాలు మానిపోవే బావ ॥ఏలే॥

అంఁదిందె నన్ను నదలించి వేసేవు
మందమేలుపు మరఁదలా
సందుకోఁదిరిగేవు సటకారి వో బావ
పొందు గాదిఁకఁబోవే బావ ॥ఏలే॥

చొక్కపు గిలిగింత చూపుల నన్ను
మక్కువసేసిన మరఁదలా
గక్కున నను వేంకటపతి కూడితి
దక్కించు కొంటివి తగులైతి బావ ॥ఏలే॥ (12-189)

ఈ కీర్తనలో బావను ఉడికించే మరదలి చేతలు, మరదల్ని ఏడిపించే బావ నయగారాలు వర్ణింపబడాయి.

అత్తాకోడళ్ల సంవాదం :

పాడి

రావే కోడల రట్టడి కోడల
పోవేపోవే అత్తయ్యా, పొందులునీతోఁజాలును ॥పల్లవి॥

రంకెలు వేయుచు, రాజులెదుట నీవు
కొంకుగొసరు లేని కోడల
పంకజముఖి నీవు పలుదొడ్డవారిండ్ల
అంకెలఁదిరిగేవు అత్తయ్యా ॥రావే॥

ఈడాడ నలుగురు నేగుతు మొగలతో
కూడి సిగ్గులేని కోడల
వాడకుఁబదుగురి వలపించుకొని నీవు
ఆడాడఁదిరిగేవు అత్తయ్యా ॥రావే॥

బొడ్డున బుట్టిన పూవపు కే న్ను
గొడ్డేమ తెస్తనే కోడల
గుడ్డము పయినున్న కోనేటి రాయని
నడ్డగించు కొంటి వత్తయ్య ॥నా॥ (12 310)

ఇది పౌరాణికమయిన సంవాదం. ఇందులో అత్తాకోడళ్ళయిన లక్ష్మీసరస్వతులు తమ తమ ఆధిక్యతల్ని నిరూపించుకోవడం ఒకరితో నొకరు పోట్లాడడం చెప్పబడింది

సవతుల సంవాదం :

పాడ్

నేరుచుకొంటివే మేలు నేఁడే యింతేసి
మేరమీరి సేసినదే మేలు బంతిగాదా ॥పల్లవి॥

నేనాతనితో నవ్వితే నీకేమనేవే వోసి
కానిదే అన్నియు నీఁక గనుకొనేవు
దాసికేమి మాఁటలేల దగ్గరి రానే వోసి
మైనము సున్నమౌనటే మావుదాఁకాను ॥నేరు॥

కాంతునికి నేమొక్కితే కాదనేవటే వోసి
యింత బలవంతురాల వెందువొయ్యేవె
పంతములన్నియు నేరుపరచేతే నేవోసి
యెంత తొందరనున్నాదోమ యేనుగవునటే ॥నేరు॥

శ్రీవేంకటేశుఁడుఁగూడే చింత నీకేలే వోసి
కైవశము తొల్లే నాకు గదే ఇతఁడు
రావె అక్క చెల్లెండ్లము రవ్వమైతిమే వోసి
నీవు నీరడిచితేను నేఁడు రెండౌనటవె ॥నేరు॥ (13-191)

ఇది సవతుల కయ్యానికి సంబంధించిన సంవాదము. ఇందులో సవతులిద్దరు తమ భర్తపై తనకే అధికారం వుందని ఒకరి నొకరు వాదించుకోవడం, చివరిగా మనం అక్కాచెల్లెళ్ళం మనకెందుకు జగడాలు అని సవరించుకోవడం వ్యక్తమవుతుంది

భార్యాభర్తల సంవాదం :

ముఖారి

ఆపలేక నిను చూచేనంతెకాక
యేపున గూడేటి పొందులేలయ్యా విభుడా ॥పల్లవి॥

కోపగించుకొన్న చోట కూరిమితో వినయమే
చూపిననామాట నీకు సొగసీనటే
యేపురేగి నీకు ప్రియమెక్కడనో వుండగాను
తాపమయ్యేపొందు నీకు దగదయ్యా విభుడా ॥ఆప॥

నేరములెన్నగనేను నిజములు వలికిన
వైరములే యౌగాక వలపౌనటే
ఊరు నీయందేమచ్చినీక నేలమాటలు నీ
వారము మమ్మికదడవకుమయ్యా విభుడా ॥ఆప॥

ననిచి కూడిన యంపు నమ్మక ప్రియుని మీద
కనలి యాడిన మాట కసరౌనటే
ఘనుడవు తిరువేంకటరాయ మనలోని
కినుకలిన్నియు నిట్టె గెలుపయ్యా విభుడా ॥ఆప॥ (12-111)

ఇది భార్యాభర్తల సంవాదం. ఇందులో భార్య తన భర్తపై కలిగిన సందేహాన్ని సాదరంగా ప్రశ్నించడం, వాటికి తగిన విధంగా భర్త ప్రత్యుత్తర మివ్వడం మొదలయిన విషయాలు వ్యక్తమవుతాయి.

బాంధవ్యేతర సంవాదం :

ఈ గేయాల్లో రక్త సంబంధం నియతం కాదు వంశానుబంధం వుండవచ్చు. లేదా పరిచయానుబంధం వుండవచ్చు

గొల్లెతా గొల్లడు సంవాదం, ప్రేయసీ ప్రియుల సంవాదం, చెంచితా, గొల్లడు సంవాదం, చెలికత్తెల సంవాదం ఈ వర్గంలో చేరతాయి.

గొల్లెతా గొల్లఁడుల సంవాదం :

ల లి త

కానీవే గొల్లెతా గబ్బి గొల్లెతా
అనుక తెలుసుకొంటి వవునవురా గొల్లఁడా ॥పల్లవి॥

పంతకారి గొల్లెతా వదరకు గొల్లెతా
రంతుల నట్టే కానీరా గొల్లఁడా
యింతగట్టు (ట్టి?) వాయవౌతయెఱఁగితి ! నేను
సంతలోనె వింటిరా నీసాదుఁదనా లెల్లను ॥కానీ॥

మతకారి గొల్లెతా మంకులాఁడిగొల్లెతా
రతులకు మాయింటికి రారాగొల్లఁడా
కతకారి వౌత ఇట్టె కానవచ్చెనే నేఁడు
చతురతలు మోమున జడిసేరా నీకును ॥కానీ॥

చనవరి గొల్లెతా చనవిమ్మా గొల్లెతా
కెలయను శ్రీవేంకటగిరి గొల్లఁడా
పొలతులందరు నేఁడు పొగడేరే నిన్నును
కలపితి వౌర నిన్ను కమ్మటి మెచ్చితిని ॥కానీ॥ (25-13)

ఇది గొల్లెతా గొల్లఁడుల సంవాదం. ఇందులో గొల్లఁడు 'కానీలేవేనీవు పంత కారివి, మతకారివి, మంకులాడివి' అని గొల్లెతను కసరుమాటలనడం, గొల్లెత నీ చేష్టలన్నీ నాకు తెలుసులే అన్నట్లు భావగర్వితంగా అనడం వ్యక్తమవుతుంది.

ము ఖా రి

అదివో నిన్నంటిగా అప్పుడే నిన్ను వోసి
తుదమొదలెఱఁగక వోసమే లాడేవే ॥పల్లవి॥

అట్టె కోపించకుమీ అడిగే నేనొక మాట
యిట్టెనెదుర వున్నావె యేమౌరా నీకు
ఉట్టిపడివోసి పోవె వొకటి కొకటి గట్టేవు
చుట్టపువరుసవారి సోకనాడవచ్చునా ॥అది॥

సిగ్గు వడకు మీ వారి చెప్పేరా నేనొకమాట
దగ్గరి కూచుండనాపె తనకేలరా
వొగ్గి మాటలాడితే పూరకే నిందవేసేవు
సిగ్గుల వారితో వాదునీకింత వలెనా ॥అది॥

నవ్వకు శ్రీవేంకటేశ నమ్మించే నేనొకమాట
యివ్వలఁబండుఁడ ఆమె యేమౌరా నీకు
పువ్వక పూచెననేవు పొరుగిరుగులవారి
రవ్వసేయకువే యింత రతి నిన్నుఁగూడను ॥అది॥ (13-84)

ఇది ప్రేయసీ ప్రియుల సంవాదం. ఇందులో ఒక ప్రేయసి ఒక స్త్రీ పట్ల తన ప్రియుని సందేహించడం, ప్రియుడు తన ప్రేయసి సందేహించిన స్త్రీకి తనకు గల సత్సంబంధాన్ని తెలిజేయడం వ్యక్తమవుతుంది.

చెంచితా గొల్లడుల సంవాదం :

పాడి

ఊరకుండేవో లేదో నోసి చెంచెతా! వోరి
కోరి నిన్ను నెంచుకొంటి గొల్లఁడవుగదరా ॥పల్లవి॥

జముళి పీకిలి దండ సరి నీకేలే
నెమలి చుంగుల పాగా నీకేలరా
అమరెనె సంకుఁగటె ముంచుకుఁదోడు
భ్రమసి నీవేల గుల్ల పట్టుకున్నాఁడవురా ॥ఊర॥

పలుమేకాల వెంటను పొరేపేలే। నీవు
యెలమిఁబులుగునేల యెక్కితివిరా
పలచని పారెటాకు పయ్యదేఁటికే
అలమట్టేకు పానువు అది నీకు నేలరా ॥ఊర॥

కాకిపైఁడిబొట్టు నీకుఁగడు ప్రియమా
అకుఁదొలసి దండ నీ కడిబాఁతా

కైకొంటి శ్రీవేంకటాద్రి ఘనుఁడ నిన్ను
నేకమైతిగదరా సీయిందిరాదేవిని ॥ఉంటి॥ (25-418)

ఇదొక గొల్లచెంచితల సంవాదగేయం. ఈ గేయంలోని గొల్లడు వేంకటేశ్వరుడు చెంచిత లక్ష్మి గావచ్చు. లేదా సామాన్య జాతి చెంచితే కావచ్చు. పీకిరి దండ చెంచెత కెంత ఇష్టమో, నెమలి చుంగుల పాగా కృష్ణునికంత ఇష్టం. సంకు కడియాలు పెట్టుకోవడం చెంచెత కెంత సౌభాగ్యమో కౌస్తుభమో లేదా కౌమోదకం ధరించడం నారాయణునికంత భాగ్యదాయకం. అడవిలో మృగాల్ని పట్టడం చెంచిత కృత్యమైతే పులుగు నెక్కడం దేవుని వంతు పారిహాస పద్మద చెంచితకు అందమయితే మత్స్యాంక పానుపు ముకుందునికందం. కాకిపైడిబొట్టు చెంచిత కిష్టమయితే తులసీమాల ధరించడం నారాయణునికి ఇష్టం. ఈ కీర్తనలో మొదట రచ్చకెక్కింది గొల్లడు. మాటమాటకు బదులిచ్చిన వనిత చెంచిత

చెలికత్తెల సంవాదం :

నాదరామక్రియ

ఏమొకో చిగురుటధరమున యెడనెడఁ గస్తూరి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా ॥పల్లవి॥

కలికి చకోరాక్షికిఁ గడకన్నులు గెంపై తోఁచిన
చెలువంబిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువునఁ బ్రాణేశ్వరుపై నాఁటిన యాకొన చూపులు
నిలువునఁ బెరుకఁగ నంటిన నెత్తురుగాదు గదా ॥ఏమొ॥

పడఁతికి చనుఁగవ మెఱుఁగులు పైపైఁ బయ్యెద వెలుపల
కడుమించిన విధమేమో కనుఁగొనరే చెలులు
ఉడుగని వేడుకతోఁ బ్రియుఁ డొత్తిన నఖ శశి రేఖలు
వెడలఁగ వేసవి కాలపు వెన్నెల గాదు గదా ॥ఏమొ॥

ముద్దియ చెంపల కెలంకుల ముత్యపు జల్లుల చేర్పుల
వొద్దిక లాగు లివెమో వూహింపరె చెలులు
గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున
అద్దిన సురతపు జెమటల అందముగాదుగదా ॥ఏమొ॥ (2-83)

ఇది చెలికత్తెల సంవాదం. ఇందులో చెలికత్తెలిద్దరు నాయిక శృంగారావస్థను సంవాదరూపంలో ముచ్చటించుకోవడం వ్యక్తమవుతుంది. శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు శెట్టిగారు ఈ పాటకు వివరణ ఇలా చెప్పారు[1 2]

'పల్లవాధర అధరం మీద అక్కడక్కడ కస్తురి నిండినది అది భామ తన విభునకు వ్రాసిన పత్రికయట. కలికి కనుగొనలు ఎర్రవారినవి. అవి వింత అందాన్ని సంతరించుకొన్నవి. సతి పతిపై నాటిన కొనచూపులను నిలువుగ వెరికినపుడు అంటిన నెత్తురట. వనితకు చనుగవ మెరుగులు పయ్యెద చెరగుమించి వ్యాపించినవి వేడుకతో ప్రియుడు తన మగువ చనుగవపై ఒత్తిన నఖ శశిరేఖలు వెదజల్లిన వేసవికాలపు వెన్నెలలు ఆ ముద్దియ చెంపల కిరువైపుల ముత్యాల జాలరుల ఆభరణాలు అమరినట్లైనవి అవి తిరువేంకట పతి కామినిని కౌగిట చేర్చి అద్దిన సురతపు వేళల చెమటల అందమట"

మరికొన్ని సంవాదగేయాలు :

'ఓహో అదేమోయి వో బావయింక
నోపనంటే బోవునటె వోరో మరందలా (15.51)
'వేట కాడనంటా నా వెంటబాయవు వోరి
చీటకపు చెంచెత నా చేతిలాగె రంగా' (12-217)
'నిక్కమటే యీ మాట నిజమనేవు
నిక్కముగాక బొంకనేర్తుమా బాలుండా' (12-105)
'బయలీ దించేటి గొల్లపడుచా యీ
పాలకుండలవి లోలోపలనున్నవి' (12-197)
'నవ్వితినేనీమాటకు నాలోనేను
నవ్వులలోనున్నది నాటుకొన్నవలపు' (13-40)

'ఎందుకెందుఁ బోతివే యింతి వోరి
అందుకే కాదా నీయడియాసలు' (15-43)
'ఎప్పుడూ నీ వోజమానవేరా వోరి
చొప్పుగా నావలె నిన్నుఁజూచుకోఁగదవే' (20-208)

బృందగానం :

ఇద్దరికంటె ఎక్కువయినవారు కలిసి పాడేవి సమూహగేయాలు. ఈ గేయాల్లో నిర్వేదం వస్తువు కావచ్చు. లేదా స్తుతి కూడా ప్రాధాన్యం వహించవచ్చు. భజన గేయాలన్నీ సామూహిక గేయాలే.

ముఖారి

గోవిందాది నామోచ్చరణ కొల్లలు దొరకెను మనకిపుడు
ఆవల నీవల నోర గుమ్ములుగ నాడుద మీతని బాడుదము ॥పల్లవి॥
సత్యము సత్యము సకల సురలలో
నిత్యుఁడు శ్రీహరి నిర్మలుడు
ప్రత్యక్ష మిదే ప్రాణుల లోపల
అత్యంతము శరణనరో యితని ॥గోవిం॥
చాటెడి చాటెడి సకల వేదములు
పాటించిన హరి పరమమని
కూటస్థుఁడితఁడు గోపవధూపతి
కోటికి యీతనిఁగొలువరో జనులు ॥గోవిం॥
నిలుచున్నాఁడిదె నేఁడును నెదుటను
కలిగిన శ్రీవెంకట విభుఁడు
వలసిన వారికి వరదుండితఁడు
కలఁడు గలఁడితనిఁగని మనరో ॥గోవిం॥ (8-43)

లలిత

ఆడుతా బాడుతా నీతో నిట్టెముద్దు గునుసుతా
వోడక నీదండ చేరి వున్నారమయ్యా ॥పల్లవి॥

ఆసందల్లి దండ్రి మోము అట్టె చూచి శిశువులు
యే సుఖదుఃఖములుందా మెరఁగనట్టు
వాసుల శ్రీపతి మమ్మువడి నాత్మ దలఁచు
బాసుల పుణ్యపాపము లెఱఁగమయ్యా ॥ఆడు॥ (9-101)

పా డి

ఒఱపో మెఱుపో నొయ్యారమో నీకు
వెఱతుమయ్యా గోవిందుఁడా ॥పల్లవి॥
కపటమో నిజమో కరుణయొ కోపమో
వుపచారమో వుపతాపమో
నిపుణతత (ద?) నపై నెయ్యమే సేసేవు
విపరీతము గోవిందుఁడా ॥ఒఱ॥ (12-129)

ల లి త

ఓపితే దానే తగిలి వోపకున్న దానే మాని
మాపురేపు నలయించే మాయ మాకేలా ॥పల్లవి॥
చింతాయకుంటగు (?) హరి చిత్రములో నుండఁగాను
వింత వింత విచారాల వెట్టి మాకేలా
చెంతల పరుసవేది చేతిలోనే వుండగాను
దొంతర విద్యల తోడి దోవ మాకేలా ॥ఓపి॥ (8-190)

కన్నడగౌళ

తల లేదు తోఁక లేదు దైవమా నీమాయలకు
తెలిసియుఁదెలియక తిరిగేము నేము ॥పల్లవి॥
తనువేఁటిదో యీకలపోత లేఁటివో
యెనయు సంసార సుఖమిదియేఁటిదో
వెనక ముందేఁటిదో వివేక మెరఁగక
దిన దినమును నేమో తిరిగేము నేము ॥తల॥ (11-731)

దేసాక్షి

దేవుఁ డొక్కఁడే మాకు దిక్కుఁగాని
కావ నెవ్వరును లేరు కతలింతేకాని ॥పల్లవి॥
పచ్చివోళ్ల మోచితిమి పాపమెల్లా జేసేమి
హెచ్చిన మీఁదటి సుద్దులేటివో కాని
రచ్చలఁబడె మాగట్టు రమణుల చేఁత బెట్టు
అచ్చమై యిందుకుఁబరిహార మేదోకాని ॥దేవు॥ (9-243)

హిందోళ వసంతం

దైవమొకఁడె మాతలఁపు నొకటే
పావనమైతిమి పదరేమా ॥పల్లవి॥
హరి యెటు దలఁచిన నటయీ (ట్టయ్యీ?) ని
పరుగుఁగోరికల పనులేలా
ధర నభయ మొసఁగు దైవము బంట్లము
మఱలి యితరులకు మఱివెరచేమా ॥దైవ॥ (10-214)

వాగ్గేయకారుల్లో త్యాగయ్య ప్రవేశ పెట్టిన భజన సంప్రదాయం నేటికీ సురక్షితంగా ఏకాకారంగా వుంది. కానీ అన్నమయ్యకు శిష్యకోటి లేకపోవడంచేతనో, లేదా అన్నమయ్య సంకీర్తనల్ని ఏ పద్దతిలో పాడేవాడో అనడాన్ని గ్రంథస్థం చేయని కారణంవల్లనో మరి కీర్తనలకు రాగ నిర్దేశం వుందిగాని తాళ నిర్దేశం లేక పోవడం వల్లను, సాహిత్యానికి ఇచ్చిన విలువ సంగీతానికి ఇవ్వని కారణంవల్లను అన్నమయ్య సంకీర్తనల్ని పాడే పద్ధతి ఈ నాటికీ దురవగాహనంగానే వుంది. కొన్ని సంకీర్తనలు జానపద గేయ ఫణితులకు లొంగినట్లు కొన్ని మార్గ సంగీత లక్షణాలకు ఇమడడం లేదు. అన్నమయ్య సంకీర్తనల్లోని సంగీత విశేషాలు సాహిత్య సంగీత కోవిదులు పరిశీలించదగ్గ విపుల మయిన అంశం.

ఇంక సంకీర్తనల్లో జానపద ధర్మాలు అనే అంశం ఐదవ ప్రకరణంలో చర్చింపబడుతుంది.

'లక్షణములు పద కవితా
ర క్షణములు వివిధ కుకవిరాజీమదస
మ్మోక్షణములు వేంకటపతి
వీక్షణములు తాళ్ళపాక విభు సత్కృతుల్'

## సంఖ్యా సూచి


155 సంకీర్తన లక్షణము, పుట. 140
156. తాళ్ళపాక కవుల పదకవితలు. భాషా ప్రయోగ విశేషాలు, పుట. 2
157. నాట్యశాస్త్ర, అధ్యాయము, 32
158. సాహిత్యోపన్యాసాలు, పుట. 11 .12
159. మార్గదేశి పుట. 125
160. గాన భాస్కరము, పుట. 161
161. గానకళాబోధిని, పుట. 92
162. తాళ్ళపాక కవుల కృతులు, వివిధ సాహితీ ప్రక్రియలు, పుట. 454
163. South Indian Music, Book-3, Page. 1-2
164. Folklore and Folk life, page. 363
165. Folk Music of Andhra Desa, page 1-7
166. Comparative Music, page 195
167. South Indian Music, Book - 3, page, 226
168 Folklore of Andhra Pradesh, page. 107
169. తెలుగు జానపదగేయ సాహిత్యము, పుట. 823
170. జానపద కళల ప్రత్యేక సంచిక, (వ్యాసం)
171. Purandara Haridasa Movement, page 213
172. కన్నడ ఛందస్సనచరిత్రె, పుట. 323
173. Desi Suladi
174. కన్నడ ఛందస్సన చరిత్రె, పుట. 323
175. సంగీత సంప్రదాయప్రదర్శిని మొదటి సంపుటము, పుట. 110
176. కన్నడ ఛందస్సనచరిత్రె - పుట. 323

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

177. గానకళా బోధిని, పుట. 104
178. తాళ్ళపాక కవుల పదకవితలు, భాషా ప్రయోగ విశేషాలు, పుట. 352.
179. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 351
180. మధుర కవితలు, పుట. 439
181. తాళ్ళపాక కవుల పదకవితలు, భాషా ప్రయోగ విశేషాలు, పుట. 387,
182. తాళ్ళపాక అన్నమయ్య పాటలు, పుట. 149
183. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 831
184. తాళ్ళపాక కవుల పద కవితలు, భాషాప్రయోగ విశేషాలు, పుట. : 17
185. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 831
185. అ. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 831
186. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 114-116
187. తాళ్ళపాక కవుల పదకవితలు, భాషాప్రయోగ విశేషాలు, పుట. 341
188. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 817
189. తాళ్ళపాక కవుల పద కవితలు-భాషాప్రయోగ విశేషాలు పుట. 319
190. తాళ్ళపాక కవుల పదకవితలు-భాషాప్రయోగ విశేషాలు, పుట 319-320

# 5. అన్నమయ్య సంకీర్తనల్లో జానపద ధర్మాలు

## 5. 1 జానపద ధర్మాల వర్గీకరణ :

అన్నమయ్య సంకీర్తనల్లో జానపద ధర్మాల్ని రెండు రకాలుగా వర్గీకరించ వచ్చు. మొదటిది జానపద భాషాగత ధర్మాలు. రెండవది జానపదుల సాంఘిక ధర్మాలు

### 5. 1. 1 సంకీర్తనల్లో జానపద భాషా విశేషాలు :

భాషకు సంబంధించిన బాహ్యరూపమంతా ఇందులో ప్రధాన భాగం. భావ ప్రకటనకు భాషవాహిక. ఆ భాష స్థూలంగా ఏకాకారంగా కనిపించినా పండితులు, శిష్టులు, పామరుల్లో విభిన్న రూపాల్లో వ్యక్తమవుతుంది. జానపద కవిత్వంలో పామరుల భాషకే ప్రాధాన్యం ఎక్కువ జానపద ధర్మాల్ని పాటించే వాగ్గేయకారుల్లో గ్రాంథికం, శిష్ట వ్యావహారికం, పామర భాషల కీర్తనలు గుర్తించవచ్చు. గ్రాంథిక భాషకు శ్యామాశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితర్, శిష్టవ్యావహారిక భాషకు, రామదాసు, క్షేత్రయ్య, త్యాగయ్యలు పామర ప్రజల వాడుక భాషకు సారంగపాణి మొదలయిన వారు ప్రాధాన్య మిచ్చారని చెప్పవచ్చు.

అన్నమయ్య గ్రాంథిక, శిష్టవ్యవహారిక సామాన్య ప్రజా వ్యవహారం లోని భాషలకు మూడింటికీ ప్రాధాన్యమిచ్చాడు. అటు పండితుల్ని మెప్పించడానికి, సంస్కృత భాషను, శిష్టులకు ప్రీతి కల్గించడానికి శిష్టవ్యావహారిక భాషను ఇటు జానపదుల్ని అలరింపజేయడానికి గ్రామ్యభాషను, సంకీర్తనల రచన కుపయోగించాడు

భాషా దృష్టితో పరిశీలిస్తే అన్నమయ్య రచనల్లో తెలుగు కీర్తనలతో పాటు సంస్కృత కీర్తనలు కూడా వున్నాయి. తెలుగు సంకీర్తనల్లో గ్రాంథిక భాషకు ప్రాధాన్యమిచ్చినవి కొన్ని, శిష్టవ్యావహారిక భాషలో వ్రాసినవి, జానపద సరళిలో వ్రాసినవి కొన్ని కనపిస్తాయి.

#### గ్రాంథిక భాష :

కావ్య ప్రబంధాదులలోని వ్యాకరణానుసారి అయిన వాక్య విన్యాసం ఈ క్రింది సంకీర్తనలలో గుర్తించవచ్చు.

ఉదా :

పరగు బహు సజ్జన్మ పరిపక్వ హృదయుఁడై
మరికదా వేదాంత మార్గంబు గనుట ॥పల్లవి॥
కలుష హరమగు వివేకమ్ము గలిగిన యట్టి
ఫలముగాదా కృపా పారీణుఁడౌట
తలపోసి సకల భూతదయావిశేషంబు
కలిగి కాదా గుణ వికారంబుఁగనుట ॥పర॥ (1-131)

నిర్మలులు వీరు నిత్య సుఖులు
కర్మ దూరులు విష్ణు కైంకర్యపరులు ॥పల్లవి॥
పరమ జ్ఞాన సంపన్నులగు వారికివి
అరుదుగా దిచటి మహదైశ్వర్యము
హరి కృపాధనముచే నబ్బిన మహాత్ములకు
సరకు గాకుండు పంచల నిధానములు ॥నిర్మ॥
బలిమిని వేదాంత పట్టభద్రులకు నిల
బలు రాజ్యపదవులిరు గడ బంట్లు
లలిమీరి హరి చక్రలాంఛనపు శూరులకు
యెలమి విజయము లెల్ల నింటిలో నుండు ॥నిర్మ॥ (2-114)

ఈతఁడఖిలంబులకు నీశ్వరుఁడై సకల
భూతముల లోనఁదాఁబొదలు వాఁడితఁడు ॥పల్లవి॥
గోపాంగనల మెఱుఁగు గుబ్బచన్నుల మీఁద
చూపట్టుకమ్మఁగస్తురి పూఁత యితఁడు
తాపసోత్తముల చింతా సౌధములలోన
దీపించు సుజ్ఞాన దీప మితఁడు ॥ఈత॥
జలధి కన్యాపాంగ లలితేక్షణములలో
కలసి నెలుఁగుచునున్న కజ్జలం బితడు
జలజాసనుని వదన జలధి మధ్యము నందు
అలర వెలువడిన పరమామృతం బితఁడు ॥ఈత॥

పరివోని సురత సంపదల సింపులచేత
వర వధూతతికీ పరవశమైన యితఁడు
తిరువేంకటాచలాధిపుఁడు దానె యుండి
పరిపాలనము సేయ భారకుండితఁడు ॥ఈత॥ (1-170)

కడుఁజంచలములు కడు నధ్రువములు
కడు నల్పములని కాదందురు ॥పల్లవి॥

కర్మబోధ వికారంబులు
ధర్మ తంత్ర సంధానములు
దుర్మదైక సందోహములు
శర్మ దూర లివి గాదందురు ॥కడు॥

పరమ భాగవత భవ్య మతులు
పరమ బోధ సంభావకులు
తిరువెంకట గిరిదేవు సేవకులు
కరుణాధికు లివి గాదందురు ॥కడు॥ (1-122)

శిష్ట వ్యవహారం :

వర్తనంలో, వాక్కులో సంస్కారం అలవరచుకొన్నవారు పుట్టుకనుండి సభ్య కుటుంబంలో సమాజంలో పెరిగినవారు మాట్లాడుకొనే భాష శిష్ట వ్యవహారమవుతుంది. ఇలాంటి వారి భాషలో సంస్కృతం మోతాదు తగు మాత్రముండవచ్చు, లేదా తేట తెనుగు తీయదనం ప్రస్ఫుటించవచ్చు. ఇదే జాతీయత అవసరమైన చోట్ల ఇది ప్రతి ఫలిస్తుంది.

'భక్త కొలఁది వాఁడే పరమాత్ముఁడు
భుక్తి ముక్తిఁదానె యిచ్చు, భువిపరమాత్ముఁడు ॥పల్లవి॥

పట్టినవారిచే బిడ్డ పరమాత్ముఁడు
బట్టబయటి ధనము పరమాత్ముడు
పట్టపగటి వెలుఁగు పరమాత్ముఁడు
ఎట్ట నెదుటనే వున్నాఁడిదే పరమాత్ముఁడు ॥భక్తి॥

పచ్చిపాలలోని వెన్న పరమాత్ముఁడు
బచ్చెన వాసిన రూపు పరమాత్ముఁడు
బచ్చు చేతి వోరగట్టు పరమాత్ముఁడు
ఇచ్చ కొలఁది వాఁడు పో యీ పరమాత్ముఁడు (5-2:5)

'ఇతరుల దూరనేల యెవ్వరూనేమి సేతురు
మతి వారూఁదమవంటి మనుజులే కాక ॥పల్లవి॥

చేరి మేలుసేయఁగీడు సేయ నెవ్వరుఁగర్తలు
ధారుణిలో నరులకు దైవమే కాక
సారెఁదనవెంట వెంట జపుదెంచే వారెవ్వరు
బోరునఁజేసిన పాప పుణ్యాలేకాక ॥ఇత॥ (6 174)

ఇంక నీ చిత్తము కొలఁదిదేమాట
అంకెల చెలికడకు నంపనేల నన్నును ॥పల్లవి॥
చెప్పి చూపవచ్చుఁగాని చెట్టవట్టి తియ్యరాదు
ఇప్పుడెట్టున్నదో చెలి యిదేమాట
రెప్పలెత్తవచ్చుఁగాని రిచ్చపడివుండరాదు
అప్పటి చెలికడకు నంపనేల నన్నును ॥ఇంక॥ (27-454)

పామర భాష :

పండితులు కానివారు పామరులు. వారికి శిష్టులతో పరిచయం ఎక్కువ. అయినా వారి భాషలో జాతీయం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. పైగా తమ భావాల్ని సూటిగా దీటుగా చెప్పడం గుర్తించవచ్చు.

చవినోరి కేడదెత్తు సంపదేడ దెత్తు వీని
సవరించుబేనా సంపదిదిగాదా ॥పల్లవి॥

పచ్చడాలెక్కడ దెత్తు పట్టుచీర లేడ దెత్తు
వెచ్చనంబ్లేడ దెత్తు వెంట వేంటను
తెచ్చిన యీపచ్చడము దేహమిది వెంటవెంట
వచ్చిఁగాక తన్నుఁదానె వద్దనగ వచ్చునా ॥చవి॥ (11-1-20)

'సల్లు సూపుల సలమారి యిఁక
సెల్లఁబో నన్ను సెనకఁడుగా ॥పల్లవి॥
సంకు సక్రముల సక్కనయ్యకుఁదన
వుంకువవో నా వొళ్లెల్లా
సంకనున్న తన సదురాలి మెరఁగైన
సింకసూపు నాపై నిమ్మఁడుగా ॥సల్లు॥ (12-370)

సిన్న వాఁడవని నమ్మ సెల్లదు నిన్ను
సిన్నైన యాటడెల్ల సిక్కుసీరై పోయను ॥పల్లవి॥
అవ్వర బాలకిసునరాయఁడ నీవు సంటిపాలు
నవ్వులంటా నెత్తురెల్ల సప్పరించఁగా
కపకవ నవ్వి నవ్వి కన్నులు దేలగిలఁగ
సవరన్న యాటదెల్ల సప్పు సారై పోయను ॥సిన్న॥ (12-15)

జిగురు వంటి వాఁడె శినకాటి చింత
శిగురమ్మఁబోనీఁడె శినకాటి ॥పల్లవి॥
నేఁతి కుత్తిక వాఁడు సెడకుండఁబాఁచిన
పాఁత పెద్ద విల్లు బలుషన
నాఁతి కొరకు వచ్చి నడిమికి విఱిశిన
శేఁత లాఁడు గదె శినకాటి ॥జిగురు॥

రట్టడి శేఁతల రాకాశి నాయని
పట్టపు శెలి యలిఁబడవేశి
కొట్టఁగౌన ముక్కు గోశివేశి నట్టి
శిట్టగీడు గదె శినకాటి ॥జిగురు॥

నలువున వెంకట నగమునఁగోనేటి
నెలవున సొంపుతో నెలకొని
కలిమి పడుసుతోడి కాఁపురమున్నట్టి
శిలుగులాఁడు గదె శినకాటి ॥జిగురు॥ (12-367)

40)

సీతక పడుసు బోసిటి పాల మగఁడు
బాతిపడిన నగపడునటె వీఁడు ॥పల్లవి॥

మూడుగాళ్ళ పెద్ద ముసలి సవులుగొన్న
పోఁడి మేకల పాల పోశము
వేఁడి బుట్టిన తల్లి వేఁకటియై కన్న
వాఁడు వీఁడు శిన్న వాఁడటె వీఁడు ॥సీత॥

కొండలంత సను గుబ్బల రాకాశి
మిండెత గవిశి పై మింగ రాఁగా
గుండె వగుల నొక్క కోలనె సరగన
సెండి వెసినట్టి సిసువటె వీఁడు ॥సీత॥

రవ్వల సేఁతల రాకాశి నాయని
కొవ్విన మదము తెక్కోలు గొని
యివ్వలఁదిరువేంకటేశుఁడై యున్నాఁడు
గువ్వెక నిన జట్టిగొనెఁగదె వీఁడు ॥సీత॥ (12-378)

## 5. I. 2 ఉచ్చారణా విశేషాలు :

వ్యావహారిక పద ప్రయోగానికి 'ఉచ్చారణ' ప్రాణం లాంటిది. ఈ ఉచ్చారణ వ్యాకరణ విరుద్ధం కావచ్చుగాని జానపదుల సహజ సంభాషణానికి దర్పణం లాంటిది. జానపద ధర్మాల్ని పాటించిన అన్నమయ్య పామరుల 'ఉచ్చారణ'ను యథాతథంగా గ్రహించి కీర్తనల్లో శశ్వతం చేశాడు.

అరంపండు (అరటిపండు) 13-284
అక్కలాల (అక్కలార) 29-548
అచ్చుత (అచ్యుత) 10-3
అనవలశాన (అనవలె చాల) 25-2
అప్పణ (అర్పణ) 29-191
ఆటదాని (ఆడదాని) 13-338
ఇడ (అక్కడ) 6-65
కాపిరాలు (కాపురాలు) 29-210
కుచ్చితము (కుత్సితము) 28-242
కూరిమిగలితే (కూరిమిగలిగితే) 26-93
గనము (ఘనము) 24-21
గాతికి (ఘాతకు) 27-322
చక్కురము (చక్రము) 13-218
చెయ్యాట (సయ్యాట) 24-250

ఆతుమ (ఆత్మ) 2-242
ఆశ్చరియము (ఆశ్చర్యము) 8-109
ఇంస (హింస) 6-6
ఇత్తము (ఇచ్ఛేదము) 29-20
ఈడ (ఇక్కడ) 6-65
ఉపారము (ఉపహారము) 22-537
ఎగసక్కేలు (ఎకసక్యాలు) 26 242
ఏడ (ఎక్కడ) 6-74
ఎనిగె (ఏనుగ) 13-239
కంమోపు (గంపమోపు) 1-197
కప్రము (కర్పూరము) 7-68
కాసికె (కానుక) 29-106
కాణికలు (కానుకలు) 29-46
పరువతము (పర్వతము) 5-19
పాశము (పాయసము 27-158
దిష్టాంతము (దృష్టాంతము) 15-203
దూరతగాక (దూరుటగాక) 25-461
దూసకము (దూషకము) 26-350
నాయము (న్యాయము) 22-394
నిక్కెము (నిక్కము) 17-271
నిచ్చలము (నిశ్చలము) 15-114
నిరుహేతుకము (నిర్హేతుకము) 6-106
నెత్రు (నెత్తురు) 10-62
పంకించు (పరికించు) 29-535
పాతర (పాత్ర) 13-222
పానిపట్టి (పనిపెట్టి) 25-285
పొస్తకాన (పుస్తకాన) 14-383

చింక (జింక) 12-112
చివుకులు (చినుకులు) 24-73
చెరిత్రము (చరిత్రము) 2-321
చౌలు (చవులు) 24-4
జరసేరా (జడసేవా) 25-189
జజయుచు (జడయుచు) 25-199
జాతియ్యము (జాతీయము) 26-201
జూజమాడి (జూదమాడి) 27-45
తక్కరి (టక్కరి) 29-11
తారుకాణ (తార్కాణము) 29-26
తామెర (తామర) 17-553
తిట్టవై (దిట్టివై) 9-64
తెంకి (టెంక) 26-27
తేగరాయ (త్యాగరాయ) 2-459
యెశోద (యశోద) 29-337
రండు (రెండు) 4-273
రుకిమిణి (రుక్మిణి) 26-233
రేతిటనుండి (రాత్రినుండి) 22-295
లేదనెందురు (లేదనందురు) 1-67
లోసుగా (లెస్సగా) 25-33
వాడికె (వాడిక) 13-273
వావాదము (వాగ్వివాదము) 27-503
వాయిదాలు (వాయిద్యాలు) 17-403
వెంగెము (వంగ్యము) 24-12
వేసంగికాలము (వేసవికాలము) 13-444
శంకనినాదము (శంఖనినాదము 5-83
శాయక (చేయక) 15-279

బోయితో (బోయినచో) 10-84
బమ్మచారి (బ్రహ్మచారి) 13-207
బాయట (బయట) 32-357
బూవిదేవులు (భూదేవి) 27-87
బొమ్మచారి (బ్రహ్మచారి) 13-387
మానిసెంటా (మనిషియంటా) 10-256
మిరేలు (మిరియాలు) 29-428
మోతుగ (మోదుగ) 24-249
మోనము (మౌనము) 22-149
మొహముగత్తో (మోముగలిగితే) 26 44
యాల (ఏల) 13-10
శోదకత్తె (చోద్యకత్తె) 24-13
సంకు (శంఖము) 8-24
సంతము (సొంతము) 35-119
సగినాలు (శకునాలు) 13-506
సాదవా (సాధువా, 25-9
సమ్మందము (సంబంధము) 13-236
సుక్కురారము (శుక్రవారం) 14-453
సుగుడు వన్నిటా (సుగుణవన్నిటా) 23-506
సుభసోభనము (శుభశోభనము) 34-6
సూరియుండు (సూర్యుడు) 3-660
హల్లకల్లోలము (అల్లకల్లోలము) 01-155

## 5. 1. 3. వాక్య విన్యాసం :

వ్యావహారిక భాషలో పదబంధాల కెంత ప్రాధాన్యం వుందో వాక్యాలకు అంతే· భావానికి సంబంధించిన తీవ్రత, సారళ్యమనే గుణాలు వాక్య విన్యాసంలో ప్రస్ఫుటీకరిస్తాయి. వాక్యంలో ఏ విభాగానికి ఎంత ప్రాధాన్యం వుద్దేశిస్తామో ఆ వివిక్ష బట్టి వాక్యంలో ఆ భాగం ముందు వెనకలవుతుంటుంది. అలాంటప్పుడు కర్తృపదం లోపించడమో లేదా క్రియాపదం లోపించడమో జరుగుతుంది. అదీగాక వాక్యరచనలో ఏహ్యార్థకం, సముచ్చయార్థకం, ఆశ్చర్యార్థకాలు మాట్లాడే వ్యక్తి మనస్థితిని పట్టిస్తుంది.

అన్నమయ్య సంకీర్తనల్లో ఆధ్యాత్మికాలు, శృంగారాలు ప్రధాన భాగాలు. ఆధ్యాత్మికంలో నిర్వేదం, శరణాగతి, దైవస్తుతులు చేరతాయి. ఇవి చాల వరకు పురుషసంబంధాలుగా కనిపిస్తాయి. ఈ భావాలకనుగుణంగా వాక్య విన్యాసం సాగుతుంది. ఇవి చాలా వరకు నిత్యవ్యవహారంలోని పామరుల మాటల్లా కనిపించడం జానపద ధర్మం.

'అతని నడుగవో చిత్రగుప్త నాయందలి యోగాములన్నియును' 2-294
'అప్పులవారే అందరును
కప్పంగఁదిప్పంగఁగర్తలు వేరీ' 11-3-15

'అయ్యో పోయఁ బ్రాయముఁగాలము
ముయ్యంచు మనసున నే మోహమతి నైతి' 1-179
'ఆడరమ్మ పాడరమ్మ మీరు
వేడుక వసంతములు వెల్లవిరి యాయను' 8-112
'ఆడుతా బాడుతా నేతో నట్టెనట్టె ముద్దు గుసుసుతా
వోడక నీదండ చేరి వున్నారమయ్యా' 9-101
'ఇహమెట్టో పరమెట్టో ఇఁక నాకు
సహజమై హరియే శరణము నాకు' 2-461
ఊరకే దొరకునా వున్నతోన్నత సుఖము
సారంబుఁదెలిసి కా జయము చేకొనుట' 6-104
ఎంత మాత్రమున నెవ్వరు దలఁచిన అంత మాత్రమే నీవు' 7-156
'ఎట్టు వలసినాఁ జేయు మేమీనన నేరమయ్య
వొట్టిన నామనసు నీకొప్పన సుమ్మయ్యా' 9-16
'ఎప్పుడే బుద్ధి పుట్టునో యెరఁగ రాదు' 11-1-88
'ఎవ్వరుగల రెవ్వరికి
ఇవ్వల నవ్వల నితఁడే కాక' 11-2-49
'ఏఁటి విజ్ఞాన మేఁటి చదువు' 11-3-11
'ఏకాత్మవాదులాల యిందు కేదివుత్తరము
మీకులోక విరోధమే మిటఁ బాసీనయ్యలాల' 2-253
'ఏమి సేయవచ్చుఁ గర్మమిచ్చినంతే కాని లేదు' 1-55
'ఏమి సేసేమిఁక నేము యెంతని దాచు కొందుము
నీమహిమ యింతంతన నేరము నేమయ్యా' 2-51
'ఓయమ్మ యెట్టు సేసెనొకటొకటే
మాయలెల్లఁ జేసినాఁడు మరి యింక నెట్టో' 11-2-76
'చీచీ వోజీవుఁడా చింతించుకో జీవుఁడా
ఆచందాన కీ చందము అరుహమా జీవుఁడా' 2-115
'చెప్పితేఁబాసునందురు చేసిన దోసము లెల్లా' 7-78

'చెప్పినంతపని నేఁజేయఁగల వాఁడ నింతే' 1-412
'తెలిసిన దెలియుడు తెలియని వారలు
తొలఁగుఁడు బ్రహ్మదు లెరుఁగుదురు' 1-317
'నాటికి నాఁడుఁగొత్త నేటికి నేఁడుఁగొత్త' 6-85
'నీటముంచు పాలముంచు నీ చిత్తమిఁకను
చాటితి నీ కృప గురి సంసారమునకు' 10-224
'నీవెంత నేనెంత నేఁడు నాయగ్గలి కెంత
దేవ నీ దాసులఁ జూచితేనే నిన్నుఁగనుట' 2-380
'నేర్పుకంటెఁబెన్నిది గద్దా
ఓర్పుకంటె సుఖమొకటిఁక గద్దా' 11 2-68
'వారి వారి భాగ్యములు వ్రాసివున్నవి నొసళ్ళ
ధీరతతో నేదిమేలో తెలుసుకోరో' 2-270
'సేయని వాఁడెవ్వఁడు చేరి చిల్లర దోషాలు' 2-72

శృంగార సంకీర్తనలు చాలా వరకు స్త్రీలకు సంబంధించినవే. స్త్రీల విభిన్న మానసిక స్థితిగతులిందులో వ్యక్తమౌతాయి. కవి నాయికగా మధుర భక్తి భావనలో నాయకుణ్ణి ఆరాధిస్తాడు. అందువల్ల ఇలాంటి సంకీర్తనల్లో స్త్రీల సహజ సంభాషణకు అవకాశమెక్కువ. అదీగాక పురుషుల భాష కంటె స్త్రీల భాషలో తెలుగు జాతీయత, నుడికారం, కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. ఈ నాటికీ నాగరికత, ఆచారాలు, సంప్రదాయాలు స్త్రీలలోనే నిలిచి వుంది. ఆకారణం వల్ల అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో స్త్రీల మనోగతాభిప్రాయాలు భావానుగుణంగా భాషలో ప్రతిధ్వనిస్తాయి.

'అంగనా నీవును మాటలాడుకోరయ్యా
చెంగటను చెలులు సేసే పని యేదయ్యా' 24-98
'అక్కలాల అమ్మలాల ఆయఁబోవని' 28-8
'ఆఁడు జాతెల్లా నొక్కటే అందరికి నొక్కటాలే' 14-128
ఆడకే వచ్చేఁబోవే అంతే చాలు' 25-323
'ఆపెనందునో నిన్ను నందునో యీ చేఁతలకు
యేపున వూరెల్లా పొందులింతగాఁజేసితివి' 15-4

| | |
|---|---|
| 'అడిఁబెట్టఁగ నేల అతని నింతేసి నీవు' | 25-208 |
| 'ఇరుగు పొరుగు వారయీ (లీ?) తగవు వినరమ్మ<br>పెరిగె పూరకె నన్నుఁబెల్లించీ విభుఁడు' | 28-278 |
| 'ఈకాలం బెవ్వరికైనా యిచ్చక మేమేలు<br>మీకేఁటికి నిష్ఠూరంబులు మితిఁదానె బుద్ధి యెరిఁగీసి' | 17-440 |
| 'ఊడిగపువారము పూరకుండే వారము<br>జోడగుమీ సరసాలు చూచు కుందేమా' | 26-335 |
| 'ఊరకుండు చాలుఁజాలు వొరలోనఁబెట్టు మిఁక' | 27-286 |
| 'ఏమని చెప్పదునే మీకింతు లాల<br>ేముంచి నాకు వలపు చిమ్మి రేచె నతఁడు' | 24-158 |
| 'కపటాలూరకే మాతో కప్పేవు నే మెరుగమా<br>యిపుడాకె నీవొద్ద నిట్టె వుండడా' | 20-416 |
| 'కప్పురముఁదినలేల కడుఁజలిఁబడనేల<br>అప్పటికి నా భాగ్యమంటినంతె చాలును' | 25-467 |
| 'కొత్త పొందా పాఁత పొందా కొమ్మ నీకితని తోడ<br>బత్తితోడ నేపొద్దు పాయక వుందానను' | 22-478 |
| 'కోమలిరో యింతులకు గుట్టు వలదా' | 29-90 |
| 'చలములు మానవె సరసునితో<br>అలుకల కంటెఁ బ్రియంబులె మేలు' | 19-211 |
| 'చలువలు వెండ్లు జరపఁగనేఁటికి<br>నెలవగు మేలే నించఁగరాదా' | 17-34 |
| 'చిన్నదానవై తే నేమి చేఁతలు పెద్దవి గావా' | 29-45 |
| 'చుట్టమవుగావతిని సూడుబంటవూ గావు<br>ముట్టివేఁడుకోగాను మోమేల వంచేవే' | 17-378 |
| చెప్పరే యీతగవు చెలులాల ఆకెకు<br>కప్పీముద్దరాలి కేలే గయ్యాళి తనమూ' | 18-66 |
| 'జోమటి గొల్లవారికి దోసము లేదు<br>భామలాల మననోము ఫలియించెఁగదరె' | 22-522 |

'నమ్మవాయింకా నీవు నా మనసు
చిమ్ము బలుకుఁదేనెల సేద దేర్చ గాక' 13–79
'నీ చిత్తము నా భాగ్యము నీవెట్టయి నాఁజేయి
కాచుకున్న నీకుఁగరుణించు మిఁకను' 29–82
'పగవారికైనా నిట్టి పాటు వద్దయ్యా' 14–25
'పతికి విన్నపించరే పడతు లాల
తతితోడ దనమది దలతునే ననచే' 18–116
'పొద్దు గూకఁదెల్లవారు పురుషుని చిత్తమింతె
వొద్దివారే యిల్లైతే వోరువనే గలవా' 22–261
పోపోనీకిది యేమి పొద్దువోదు
తీపులు చూపి మమ్ము దియ్యకురా యికను' 13–262
'మంచితనము సేయఁగ మారు మలతురటవే
కంచువంటి చిత్తములో కపటా లేమిటికే' 19–261
'మగవాఁడు వలచితేను మగువల జాలిబెట్టి
అగడుగానేల అడియాసల బెట్టేనే' 24–390
'ముంద రెంచి మెలఁగవే మమ్మా చిలి
మందలించి కోరికలు మట్టు పెట్ట గలవా' 19–409
'వలపొక నోట సుండ వట్టి బయలీఁద నేల
బలిమిని మాతో నేల పచరేవు నీవూ' 18–401
రాయిది బెట్టక యింక రారే మీరు
చాయకు వచ్చినప్పుడు సమ్మతించీ గాని' 20–219
లెస్స బుద్ధి చెప్పరే లేమలిందరుఁగూడి
వుస్సురస్సు రనఁగానె వొద్దికి నేఁబోదునా' 17–274
'వేఁడుకొనవయ్యా యీపె వెల్లవిరి సేయకుండా
ఆఁడు దానికెంత పంతమైనా నియ్యవచ్చును' 20–554
'సరికి బేసికి మీరు చలము నింకా నేలే
సరసములు విరసములు చౌకగదే ఇపుడు' 25-453

జానపద భాషకు సంబంధించిన అంతర్భాగాల్లో సామెతలు, పలుకుబళ్లు జంట పదాలు ప్రధానంగా చేరతాయి.

5. 1. 4 సామెతలు :

శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు —

'సామెత శబ్దము 'సామ్యత' అను సంస్కృత శబ్దము నుండి పుట్టియుండ వచ్చును. సామ్యతా శబ్దము వ్యాకరణ దుష్టమైనను లోకము స్వీకరించినది. ఒక అర్థమును చెప్పుటకు మారుగా అనంత లోకసిద్ధి గలిగిన తత్సదృశార్థమును చెప్పుటయే సామెత యొక్క పరమార్థము' అని అభిప్రాయపడ్డారు[1].

శ్రీ సంపత్ రాఘవాచారిగారు —

'తెలుగులో 'సామెత' అనే అర్థంలో నానుడులు, సుద్దులు, జనశ్రుతులు శాస్త్రాలు, మాటలు అనే పదాలు కూడా వ్యవహారంలో వున్నాయి అని అభిప్రాయ పడ్డారు[2].

శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు —

'సాహిత్యంలో సామెతకు బదులుగా లోకోక్తి, శ్లోకము, సామ్యత జనవాదం, లోకహితోక్తి, కత, నానుడి, నుడికారం అనే పదాలు ప్రయోగింపబడ్డాయి' అని అభిప్రాయపడ్డారు[3].

ఏమయినా సామెత ఒక భాష మాట్లాడేవారి సాంఘిక మర్యాదను సాంఘిక జీవితాన్ని తెలిపేదిగా వుంటుంది. పదాలకుండే అర్థంకన్నా వేరయిన విలక్షణార్థాన్ని ద్యోతకం చేసేదిగా వుంటుంది. సందర్భాను సారంగా ప్రయోగించడానికి యోగ్య మయిన మాటల కూర్పు వుంటుంది.

సామ్యం, ప్రాచుర్యత, తరతరాల అనుభవమూలం. సాంప్రదాయికత సారవత' సంక్షిప్తత, శ్రవ్యత అనేవి తెలుగు సామెత ముఖ్య లక్షణాలుగా చెప్పవచ్చు.

అన్నమయ్య సంకీర్తనల్లోని సామెతల్ని మూడు రకాలుగా వర్గీకరించవచ్చు. మొదటిది అనాదిగా నుండి జనబాహుళ్యంలో ప్రచారం పొందుతూ అన్నమయ్య రచనల్లో కనిపించేవి. అవి - మచ్చుకుకొన్ని :

## అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

| | |
|---|---|
| అడవి గాచిన వెన్నెల | 6-6 |
| అడుసు చొరనేల కాళ్ళు కడుగనేల | 1-251 |
| అందని పండ్లకేల అఱ్ఱు చాచేవీవు | 3-67 |
| ఊరకున్నవారి కూరకోవదన్నట్లు | 25 540 |
| ఏనుగు దిన్న వెలగ పండి బేసము వలె | 6-140 |
| కాలిన పుండ్లలో నుప్పులు చల్లుట | 12-33 |
| కుక్కకాటుకు చెప్పులాట | 2-196 |
| కొంచెపు దేవరకు కొండంత ప్రతి | 2-235 |
| కోటి విద్యలు కూటి కొరకే | 11-1-44 |
| గోరఁబొయ్యే పనికి గా గొడ్డలేటికి | 25-325 |
| గోరు చుట్టుమీఁద రోకటి పోటాయె | 3-306 |
| తిన దిన వేమైన దీపవును | 5-542 |
| దేవుఁడిచ్చినా పూజారి వరమీఁడు | 8-220 |
| విప్పల నెయిఁబోసినట్లు | 2-369 |
| నీరు వట్టుగొన్న చోట నేయి మందుగా దెపుదు | 26-239 |
| నెలకొన్న పిండెంత నిప్పటి నంతే | 1-218 |
| మగడు విడిచినా మామ విడువనియట్లు | 8-220 |
| పిత్రొకటి వేట్టితేను వేరొకటి మొలచునా | 9-189 |
| వెన్నచేతఁబట్టి నేయి వెదకినట్లు | 10-118 |
| శిరసుండ మోకాల తేసయేఁటికి | 25-427 |
| సరికి బేసికి లంకె | 28-24 |
| హంస చేతి పాలు నీరునట్లగు | 6-6 |

రెండవది : ప్రసిద్ధ సామెతలకు బింబప్రతిబింబాలుగా కనిపించేవి. అంటే వ్యవహారంలోని సామెతలకు అన్నమయ్య వాక్యాలకు పోలిక లెక్కువగా వుంటాయనడం – అవి – మచ్చుకకొన్ని :

'మెడమీది మేక పిల్లను బెట్టుకొని వూరంతా వెదకాడు'

| | |
|---|---|
| అచుత లింగము గట్టి పరువత మెగిన భక్తుఁడు | 5-19 |

'చనువున్నప్పుడే చంనెక్కాలి'

| | |
|---|---|
| ఆస గలిగినచోట నాడినదె సరసము | 14-126 |

'తాగేది గంజి మీసాలు పట్టే వాళ్లిద్దరు'

| | |
|---|---|
| ఎంగిలి బూరె కడుగ నేల | 7-260 |

'పొగలో బడలేక సెగలో బడ్డట్టు'

| | |
|---|---|
| ఎద్దుదస్సీనని గుఱ్ఱము చాటున కేఁగిన యట్టి చందము | 2-192 |

'గాడిదకేమి తెలుసు గంధం పొడి వాసన'

| | |
|---|---|
| ఎద్దెమెరుగు అడుకుల చవి | 2-87 |

'కుక్కతోఁక వంకర'

| | |
|---|---|
| ఏటి వంకలు దిద్దవసమా | 4-58 |

'కొండ దవ్వడం ఎలుక కోసమా'

| | |
|---|---|
| కుప్ప నురుచుట కసవు కొరకా | 1-115 |
| కూడు వండుట గంజి కొరకా | 1-125 |
| కొండ ఎక్కుట దిగుట కొరకా | 1-115 |
| కొలుచు దంచుట పొట్టు కొరకా | 1-115 |

'పిండెంతో నిప్పట్టంతే'

| | |
|---|---|
| చనవెంత నగవూ నంతే | 1-213 |

'కంబళ్ళలో అన్నం తింటూ వెంట్రుక లేర నేల'

| | |
|---|---|
| చనవు లిచ్చినచోట సాధించ పనిలేదు | 13-592 |

'చేతులు శివుని ముందు చిత్తము చెప్పుల మీద'

| | |
|---|---|
| చేతులొక్కరి యందు చిత్త మొక్కరియందు | 2-154 |

'ఢిల్లికి ఢిల్లే పల్లికి పల్లే'

| | |
|---|---|
| జాజు జాజే కాక తిరిశపు బువ్వౌనా | 12-368 |

'తిన్న ఇంటికి వాసాలెక్కించినట్టు'

| | |
|---|---|
| పూవుల వేసిన వారి బొగ్గిట వేతురా | 26-246 |

'తనసీడ తన దగ్గరే వుండు

| | |
|---|---|
| మానిపండ్లు మఱి మాని కందనే వుండు | 26-279 |

'ముందు నుయ్యి వెనక గొయ్యి'
'వెనుక నుయ్యి తగరు ముందు 2–295
'రాజు వలచిందే రంభ'
రాజు వలచిననే దేవులందురు 14–156
'వేడుకకు వెలలేదు వెన్నెలకు కొలలేదు
వేడుకకు వెలలేదు, వెన్నెల కెంగిలి లేదు 7-27
సిగ్గే స్త్రీకి సింగారం'
నవ్వే మూలధనము నాతులకు' 11-228
'అడుసు దొక్కనేల కాలు కడుగ నేల'
సోదించ నేఁటికి సొట్టు లెంచ నేఁటికి 5-322
జాగరము సేయ నేల సరిగా నిద్రించ నేల 15–69
పంతము లేల అట్టె పందతన మేల 15–69

మూడవది : వాడుకలో లేకపోయినా, అన్నమయ్య రచనల్లో వాడబడి క్రమంగా జన వ్యవహారంలో సామెతలుగా నిలిచిపోయినవి :

అగ్గి పొంత నుండే గాఁకలే కాక చలువలు గలుగునా 11-1–94
అడవి ఐడిన వాడు వెదలఁజోటు లేక కంపల కింద దూరినట్లు 5–15
అద్దములో నీడ పొడ సూచినట్లు 6–140
'అప్పు లేని జీవమొక్క టారమైన జాలు' 11–2–48
ఆఁడు దనము అంగడి వేయ దగునా 17-283
'ఆపరానిది వలపు అణచరానిది చూపు 24–200
'ఆస గలిగిన చోట నాడినదె సరసము 14–123
ఇల్లు ముంగిలొక్కరిది మెరవొక్కరిది 2–254
ఈరు దియ్యఁబేనువచ్చు 29–260
ఉక్కు వంటి గుండెలోన లక్కవంటి మనసు 14–297
ఉడికి నందు మీదట పుప్పులు చల్లినట్లాయ 27–88
ఉప్పమ్మె వాఁడు చిట్లు వేఁగనఁడట 6–39
ఎంగిలి సెలవిలోన రంగువంటి మనసు 14–297

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు

ఎంత తొండమున్నా దోమ యేనుగవునటే 13-191

ఏనిగె గుజ్జాయెక్కిన వారికి 13-239

ఏనుగుతో యేలాటాలు యెవ్వరికేల 22-138

ఒలసితే నొకమాట వొల్లకుంటే వొక మాట 15-169

'ఒరిచితేఁ జుట్టరిక మొల్లకుంటేఁ జెట్టరికము' 26-108

కంచము లోని కూడు కాలదన్నుదురా 5-322

కంతలేని గుడి సొక్క గంపంతయి నాఁజాలు 11-3-48

కలగన్న చోటికి గంప యెత్తిన యట్లు 12-64

కాయ పండు సేయబోతే కడు పులుసే కాక యేయెడ తీపుగాదు

2-133

కూడులేక యాఁకటికిఁ గూర దిన్నట్లు 5-137

కూలిచ్చిన వాడు పసిగొనక విడుతురా 14-184

కొక్కసింట బెట్టుకొంటే గోడలు గోడలు దవ్వకుండునా 5-301

కొక్కెరలు హంసల బోలీనా 29-88

కొలిమి గూటిలో గంధులమ్ముట 12-124

గట్టుఁజెడి మ కంటే కొంచెపు మేలైనఁ జాలు 2-114

గుడ్డికుక్క సంతకుఁబోయి తిరిగిన దుడ్డు పెట్టేకాక దొరకీనా

11-3-69

చింతలఁజిగురు లెక్కిచేఁగఁ దేరినట్లు 10-80

చింతలేని యంబలొక్క చేరెఁడేవాలు 11-2-48

చిచ్చు గాగలించుకొంటే చిమిడించ కుండునా 8-273

చీమల పుట్ట చిమ్మిరేగి నట్లుండు 2-369

చెంది విత్తిన కొలంతే చేరి మొలచేటి పైరు 8-96

చెలిమి చెట్టడిచితే చేటఁదవును 24-194

చేరి యగ్ని పొంతనుంటే చెమరించ కుండునా 28-23

చేపట్టితే రానిది చిక్కి సన్నకు వచ్చీనా 27-55

'ఇంతగాను తరుణియే జాతైన నదె చాలు' 11-2-48

| | |
|---|---|
| 'జిగురు గండెం బక్షులు చిక్కినట్లు' | 2-369 |
| 'తన కర్మమెంత చేతయు నంతే | 1-213 |
| తప్పులేని జీతమెక్క తారమైన జాలు | 1-1.4 |
| తల్లికి లేని ముద్దు దాదికా | 8-133 |
| 'తిట్టు లేని బ్రదుకొక్క దినమైన నదె చాలు' | 11-2-48 |
| తెలిసిన మాటకు తెరమరు గేటికి | 17-416 |
| తేనేపేరు నోరనంటేటీపు పుట్టీనా | 26-75 |
| 'దైవము కృప యంత తానూ నంతే' | 1-218 |
| నిండు నీటనుంటేదమ్మి నెగడక మానునా | 28-23 |
| 'నిజముబలికిన వైరము లేయగును | 3-497 |
| నూతులు దవ్వగ బోతే బేతాళములు వుట్టె' | 6-8 |
| నెయ్యని హోసుకోరాదు నీళ్లని చల్లగరాదు. | 14-35 |
| పనియంత కూలీనంతె | 1-213 |
| పాసిన కూటి కంటే పస్తైనా మేలు | 26-19 |
| పైడెంత తూకము నంతే | 1-217 |
| పూట కూటి మీద దమ్మ వుమియుట | 12-238 |
| పూవువల్ల తుంగ తలకెక్కినట్టు | 9-151 |
| పెంచు దెచ్చి మాణికపు బిల్ల సేయు | 11-2-44 |
| మంచుగుంచాన కొలిచినట్లు | 3-329 |
| ముచ్చుగన్న తల్లి మూలకొదిగినట్లు | 7-760 |
| ముట్టు లేని కూడొక్క ముద్దేడే చాలు | 11-2-48 |
| ముల్లు దీసి కొఱ్ఱు మొత్తినట్టాయ | 11-3-74 |
| ముల్లు మొంట దీసి సుఖమున నుండినట్లు | 10-80 |
| మొదలి నీరు కొనకెక్కదా | 11-1-153 |
| రొంపి కంబమౌకంటే రోయుటే చాలు | 11-2-48 |
| లంపట పడనిమేలు లవలేశమే చాలు | 11-2-48 |
| వరిచెడ నూదర బలిసినయట్లు | 11-3-6 |

వెన్న దిన్న నోటనే వేడిపాలు దాగినట్టు 28 31
సముద్రము గడచి వోడలో జదిసి యినుము దెచ్చినయట్లు 9-285

5. 1. 5 పలుకు బళ్ళు :

పలుకు బళ్ళనే జాతీయాలని, నానుళ్ళని, అంటారు. ఆయా భాషల వ్యవహర్తలు వారి వారి అనుభవాల్ని బట్టి భాషాసుర్యాదల్ని బట్టి ఒక విశిష్టమయిన అర్థంలో కొన్నకొన్న పదాల్ని వాడతారు. ఇవి సామెతల్లాగా వాక్యాల రూపంలో గాకుండా పదాల అధ్యాహారంతో సంగ్రహంగా వుంటాయి. చెప్పేవారికి వినేవారికి సుగ్రాహ్యంగా వుంటాయి. వీటినే పలుకుబళ్ళు అంటారు. ఏ జానపదకవిలో కనిపించని రీతిగా అన్నమయ్య సంకీర్తనల్లో పలుకుబళ్ళు కనిపిస్తాయి.

మచ్చుకు కొన్ని —

అంకెకు వచ్చు 8-275
అంగడి బెట్టే వయసు 27-404
అంగడి బేరాలు 27-222
అందమైన మాటలు 12-560
అక్కజపు తురుము 13-561
అద్దములో నీడలు 7-34
అరగొరసేయు 29-235
అరచేతిమణి 17-512
అతికి పూసి కుడుపు 6-165
అల్లెడు నాలుక 9-40
ఆహివెట్టు 10-142
ఇనుప గుగ్గిళ్ళు నమలు 6-49
ఇరుమొన సూది 14-38
ఈడు వెట్టు 9-56
ఈంత వలపు 12-85
ఉడుకు చల్లినట్లు 15-33
ఉబ్బరి పులకలు 27-357
ఊర గూటముల వారు 29-313
ఏటి నడిమి పైరులు 7-1
ఏనుగ చేతి చెఱకు 25-407
ఓజలు దిద్దు 17-144
కంచము పొత్తు 26-221
కంచములో కూడు 9-249
కంచువంటి చూపు 22-363
కట్టు వదలని క్రీపు 12-75
కనుచూపుతామెరలు 13-561
కన్నుల తుదలు 24-553
కన్నుల [illegible]క్కు 26-70
కప్పురపు నోళ్ళ పొగడు 26-378
కాగిటి పొత్తు 29-169
కారపు వెంగెమాట 27-127
కారమువంటి చూపులు 13-140
కావరపు చందురుడు 29-44
కావిమోవి 26-50
కాలుకమ్మిన రతులు 24-71
కుక్కనోట కళాసము 11-3-24

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు

ఊరు వాడెడు చెలమ 12-75
కొంగు భత్యము 12 205
కొంగు రొక్కము 8_170
కోడెకత్తె 28-522
గద్దాయపు పొందులు 22-396
గజుఁజేతులు 24-7
గబ్బి చూపు 12-72
గాదె బోయు 12_280
గాము వంటి బిడ్డ 25_44
గాలపు మాటలు 25-307
గాలిముడిగట్టు 9_267
గుత్తపు గుబ్బలాఁడి 29-83
గుత్తపు వలపులు 26-202
గోఁడగురుతు 13-215
గోడమీది సున్నము 7-34
చందమామ గుటుకలు 7_34
చక్కెర బొమ్మ 29-83
చట్టురాతినోఁచు 29-231
చలవాది వాడు 14-175
చిత్తములో చింతనూఁయి 26-460
చుల్లరి చేతలు 27-436
చెఱకు వంకినపండు 12-75
చెఱగు మాసిన సుద్ది 29_135
చేమకూర శైత్యాలు 7-34
జంగిలి కాంతలు 13-185
తక్కరి రెప్పలు 26_2
తలపోత నెందలు 13_561
తఱివాయిపేయు 17_596

కూటి పేతి ప్రాణము 8-248
తాటిమాని నీడ 15-238
దావతి పాట్లు 17-344
దివ్వెత్తు పొద్దు 14-185
దొంతివిషయము 2_407
నవకపు జాణ 24_78
నవ్వులు వరఁవారు 29-110
వాలుకు సొంపు 2_61
నిటలపు రాత 8-79
నిప్పులేరై పారు 4_13
నీటు గర్వాలు 9-124
నీటిపై వ్రాత 7_34
నీటిలోని పుల్ల 27_518
పంగెన కోపము 29_198
పాయము పిడికిట బట్టు 5-257
పాలవంటి యూస 3-524
పావురపు పలుకులు 29-44
పెదవులెల్ల బెండవడు 26_119
పు వ్వవంటి ప్రాయము 22-495
పూత సిగ్గులు 12-85
పూవు వంటి బుద్ది 8_240
పూస గుచ్చినట్టు 18_391
పెంకులలోన వాన 6_144
పొత్తుల మగఁడు 13-183
పొత్తుల వలపు 28_441
బచ్చన బంధాలు 11_1-65
బట్టబాయిట [illegible] 12-175
బీరకాయ పిక్కు 9-24

బేడలుగా జేయు 7-116
బేస బెల్లి తనము 13-4
బొట్టుల మెకము 5-285
మగడు లేని సింగారములు 7-1
మాగిన మోవి 27-289
మాగిన రతులు 15-85
ముంగిట నిధానము 4-39
ముంజీతము 9-219
ముంజేతద్దము 11-1-43
ముంతల ముంచిన మోహములు 28-332
ముద్దు దుమ్మిదలు 29-118
ముద్దు ముద్దు వలె మొక్కుట 26-16
ముగ్గ్రసలెట్టు 10-185
మూరెడు నోరు 29-280
మూసిన ముత్తెము 18-455
మెఱుఁగుల వాన 26-116
మెరవడి కత్తె 27-315
మోనపు తిట్లు 26-257
మోరతోపు దనము 15-61
రవ్వపడిన చేతలు 29-259
రాల వంటి చన్నులు 28-214
రావిమాని పూలు 7-314
రొంపి కంబము 27-212
లంచపుఁ బులకలు 26-88
లక్కబుజ్జవంటి నోరు 24-141

వంకల ప్రాయము 28-16
వరద గలపు చింతపండు 7-1
వలపు గంపలు వెట్టు 26-18
వలపుల జడివాన 29-66
వలపుల పైరు 13-434
వలపుల వాతలు 26-59
విత్తు మీదటి పొల్లు 11-3-116
వీపు బట్టగట్టు 5-55
వీసమంత జోటు 5-292
వెట్టివాని చేతి రాయి 6-157
వెట్టిదవ్వట 6-69
వేఱు పురువు బుద్ధి 11-3-109
సంత తగరు 12-75
సగ బాలిది 29-415
సరికి బేసికి వచ్చు 15-177
సానబట్టి చూచు 15-7

5. 1. 6. జంటపదాలు :

అంగళ్ళు ముంగిళ్ళు 14-162
అడ్డాలు దుడ్డాలు 17-74
అదరు బెదరు 11-2-24
అదెవచ్చె నిదివచ్చె 2-79
అనలు కొనలు 6-118
అలసి సొలసి 15-280
అలుకు ఉలుకు 15-19
అలుకు జలుకు 15-32
అసురులు నుసురులు 13-552
అవుగాములు 28-95

# అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు

ఆకు అలము 11-3-35
ఆడుతా పాడుతా 9-101
ఆర్పులు బొబ్బలు 6-108
ఆసలు రేసులు 17-308
ఇంపు తెంపు 13-377
ఇత్తలికి అత్తలికి 26-420
ఈతలు మోతలు 12-194
ఈవల నావల 19-150
ఉపచారమో వుపతారమో 12 129
ఉప్పనౌనో చప్పనౌనో 27-105
ఉరుమో మెరుమో 12-192
ఎంచరాదు పంచరాదు 6-21
ఎండలు నీడలు 12-172
ఒఱపో మెఱపో 12-129
ఒలసీ నొల్లములు 17-93
కంచుగాదు పెంచుగాదు 6-21
కల్లందమో నిజమందమో 9-270
కసరులు కొసరులు 17-341
కాచన పోచన 11-3-77
కుప్పలాయ దెప్పలాయ 29-51
కూకులు వత్తులు 17-189
కూరిమియొ గయ్యాళితనమో 12-129
కైకొంట వొల్లకుంటే మానుట 10-223
కొంకు గొసరు 24-341
కొసరో విసరో 14-200
చద్దికి వేడికి 28-27
చలమో ఫలమో 14-1

చింతలు సిలుగులు 8-126
చిమ్ము దొమ్ము 5-91
జంకించ బొంకించ 14-88
జలకో లంకో 12-129
తండు ముండు 6-56
తతివచ్చె మితివచ్చె 29-51
తప్పులు ఒప్పులు 17-160
తెలుసునో తెలియదో 13-549
తోడునీడ 13-567
దిక్కు దెస 11-2-62
నగవులు తగవులు 5-65
నసుపో నగవో 12-129
నయమో ప్రియమో 12-129
నలుపో తెలుపో 12-192
నాటకాలు బూటకాలు 29-275
నుయ్యో కాందో 12-192
పొండి పంటా 8-63
పొట్లు పొరలు 15-152
బూతో ఐందో 9-51
మందో మత్తమో 25-374
మేలులేదు కీలులేదు 6-78
మాకులు మద్దులు 7-214
మాటలు నీటులు 15-193
మాయలు మందులు 12-264
మూరల్ బారల్ 12-267
వాసి వన్నె 29-596
సాటికి బేటికి 13-336

5. 2 సాంఘిక విశేషాలు :

ప్రాచీన కాలంలో రాకపోకల సాధనాలులేని కారణం వల్లను, సంబంధ బాంధవ్యాలు దూరప్రదేశాల్లో చేసుకొనే అలవాటులేని కారణం వల్లను, పరిమిత స్థలంలోనే, జనులు జీవయాత్ర గడిపేవారు. అంతేగాకుండా ప్రాచీన నాగరికత అంతా గ్రామం, గ్రామీణులు, గ్రామీణ పరిసరాల చుట్టూ అల్లుకొని వుంది. జానపద కవి తనకు అందుబాటులో వుండే ప్రాథమిక వస్తు జాలాన్ని, పరిచితమయిన ప్రదేశాల్ని కవితా వస్తువులుగా గ్రహించి రచనలు చేస్తాడు. అలా చేయడంలో రెండు ప్రయోజనాలున్నాయి. మొదటిది వాగ్గేయకారుడు వర్ణించే వస్తువు తమదే అని భావించుకోవడానికి అవకాశం కలగడం. రెండవది విద్యా గంధం లేని సామాన్య ప్రజలు వర్ణ్యవిషయాన్ని సులభంగా అర్థం చేసుకొనడానికి అవకాశం కల్పించడం.

అందువల్లనే జానపద కవిలాగే అన్నమయ్య కూడా పరిచితమయిన రకరకాల వస్తువులు, జీవరాసులు, ప్రదేశాలు మొదలయిన వాటిని కవితా వస్తువులుగా స్వీకరించి రచనలు గావించాడు.

5. 2. 1 గృహసంపద :

ప్రతివ్యక్తి జీవన వికాసంలో ఇల్లు మొదటి మెట్టు. మొదట శిశువు ఇంటిని ఇంటివారిని గుర్తించి ఎదగడం సర్వసామాన్యం. గృహ సంపదలో గృహోపకరణాలు వంటకాలు, కొలతలు, నిత్యంవాడే పనిముట్లు, అలంకారాలు, ఆభరణాలు, వినోదం కలిగించే వాద్యాలు మొదలయినవి చేరతాయి.

అట్టుక :

చిన్నచిన్న పూరిండ్లలో నివసించేవారు ముఖ్యమైన సామానుల్ని పెట్టుకోవడానికి గోడల పైభాగంలో కర్రలతో అరలాగా తయారుచేసు కుంటారు. దీన్ని పల్లీయులు అట్టుక అంటారు.

'గొల్లెడు దెచ్చిన పాలకుండలందు కొనవలె
యిల్లు చొచ్చి అట్టుగ పై నెక్కు కుండవయ్య (17 278)

అని అన్నమయ్య అట్టుకను ప్రస్తావించాడు

అ బ క :

కొబ్బరి చిప్పకు, మూరెడు పొడవయిన కర్రను అమర్చిన వస్తువును అబక అంటారు. దీనితో ద్రావక ఆహార పదార్థాల్ని తోడుకొంటారు. దీనివల్ల పదార్థపు వేడి చేతికి ప్రసరించకుండా వుంటుంది. దీన్ని ఆధారంగా తీసుకొని —

'చేతులార జేసేటి చేకొన్న కర్మానకు
ఘాతల గర్తగా నంటే కట్టువడఁడు
ఆతల నబక ముంచినట్టి వేడి చెయ్యంటదు
జాతి దేహము మోఁచిన సహజమింతే' (7-54)

మానవుడు స్వేచ్ఛావర్తనుడై ఎన్నో దుష్కర్మలు చేస్తూ ఈ దుష్కర్మల నన్నిటిని భగవంతుడు తనచేత చేయిస్తున్నాడని సమర్థించుకోవడం సబబుకాదు. దేహాన్ని ప్రసాదించిన వాడు భగవంతుడు గాని కర్మలు చేయించడం భగవంతుని అంటని విషయం అనే తత్త్వాన్ని అన్నమయ్య తెలియ జేశాడు.

ఉ ట్టి :

చిన్నచిన్న చట్లను లేదా ముంతల్ని పేర్చుకోవడానికి త్రాడుతోను, లేదా ఇనుప గొలుసుతోను, తయారుచేయబడి ఒక కొయ్యకు వ్రేలాడగట్టుకొనే వస్తువు ఉట్టి

'పొద్దనేమా నేము నిన్ను వూరల్లా జుట్టాలైతే
వొట్టికతో పలపులు వుట్టి బట్టవచ్చును' (24-291)

వూరంతా నీకు చుట్టాలయితే వలపుల వుట్టి పట్టవచ్చునని కృష్ణుని గోపికాను బంధాన్ని ఒక నాయిక బహిరంగం చేయడం ఇక్కడి విశేషం. క్రియలచేత అనుబంధం చేత పెంచుకొనే చుట్టరికాన్ని కూడా నాయిక దెప్పి పొడుస్తోంది. ఉట్టిలో చిన్నచిన్న చట్లను పేర్చే విధంగా వలసినట్లు గోపికానుబంధం పెంచుకోవచ్చునని వ్యంగ్యం. అన్నమయ్యలో అనేక రకాలయిన వుట్లను తెలియజేసే కీర్తన—

శంకరాభరణం

'అక్కలాల చూడుఁడందరును
నిక్కి వార వట్టీ నేఁడు గృష్ణుఁడు ॥పల్లవి॥

ఆనవాలవుట్టి ఆడుకుల వుట్టి
పానకపు టుట్టి బలిమినే
ఆనక కోలల నంది యంది కొట్టి
తేన వుట్టి (? గొట్టి దేవకి సుతుఁడు ॥అక్క॥

పెరుగువుట్టి మంచి పేరిన నేతివుట్టి
సరి వెన్న వుట్టి చక్కెర వుట్టి
వెరవుతో గొట్టి వెస బాలులతో
పెరుగు వుట్టి (?) గొట్టి పొంచి రాముఁడు ॥అక్క॥

మక్కున నలమేలుమంగఁగూడి నేఁడు
చొక్కి శ్రీవేంకటేశుఁడు వీథుల
సిక్కి వుట్లెల్లా నిండా గొట్టివుట్టి (?)
చక్కిలాలు గొట్టి జగదీశుడు ॥అక్క॥ (8-149)

ఈ కీర్తనలో ఆనవాల వుట్టి అడుకుల వుట్టి, పానకపు వుట్టి, తేనెవుట్టి పెరుగు వుట్టి, నేతి వుట్టి, వెన్న వుట్టి, చక్కెర వుట్టి మొదలయిన రకరకాలవుట్లు చెప్పబడ్డాయి.

తిత్తి :

భగవంతునిపై మనసు నిలపకుండా సంసారంలోని సౌఖ్యంకోసం కొట్టు మిట్టాడడం వృథా అనడాన్ని —

'హత్తించి హరిమీఁద నలరింపకది వృథా
తిత్తిలో సుఖమునకు తిరిగె నీప్రాణి (1-159)

అని వర్ణించాడు.

దివ్వె :

యెలమి నీ రాకల కెదురులు చూడఁగాను
వెలయగ దివ్వెలేకే వెలుఁగసిపించెను' (29-127)

నాయకుడు దీపం. నాయిక వెలుగు. దీపం లేక వెలుగులేదు. వెలుగువల్ల దీపానికి విలువ గౌరవం. అందువల్ల నాయికా నాయక సంయోగాన్ని చెలికత్తె అభిలషిస్తోంది

వంటశాల :

రకరకాల ఆహార పదార్థాల్ని తయారుచేసే స్థలం వంటశాల. భగవంతుడు 'వంటశాల' లాంటివాడు. అతన్ని అన్ని విధాల ప్రస్తుతించినా అలరేవాడే. రుచిని వాక్కులతో ఎంత జెప్పినా తక్కువే అవుతుంది. అలాగే వాక్కుల కందిన వాక్కుల కందని వాడు దేవుడు. ఈ భావాన్ని —

'వాచవి చవులు చూచే వంటశాల చోటేదో
ఆ చాయనే వుండు నాది మూలము' (7-184)

అని వర్ణించాడు.

ఇలాగే కంచం (12-155), కూటికుండ (12-58), గంప (21-191), దొంతి (12-155), పళ్లేలు (9-10), భోజనశాల (24-58), బిందె (17-389), ముంత (11-3-5) అలరుపానుపు (12 117), ఉయ్యాల మంచం (12-16) చప్పర మంచం (12-16)జంగాళము (29-105), తూగుమంచం (12 117). అరగు (17-273, వాకిలి 24-59), మొదలయిన గృహసంబంధ పదజాలాన్ని కూడా అన్నమయ్య పేర్కొన్నాడు.

వంటకాలు :

అన్నమయ్య సంకీర్తనల్లో వంటకాల వర్ణన రెండు రూపాల్లో కనిపిస్తుంది. మొదటిది స్వామికి అర్పించే నైవేద్యాల్ని పట్టికలో చెప్పడం, రెండవది జాప మ్యంగా చెప్పడం.

భారతదేశంలో ఏ దేవునికిగాని లేని పద్ధతుల్లో రకరకాల వంటకాల్ని అర్పిం చడం శ్రీ వేంకటేశునికేవుంది. అందువల్లనే అన్నమయ్య వాటిని కీర్తనల్లో పొందు పరచాడు. ఈ వంటకాల వర్ణన కృష్ణజయంతి కీర్తనల్లో సకృత్తుగా వేంకటేశ్వర స్వామికి చేసే నైవేద్యాల్లో బహుళంగా కనిపిస్తాయి.

దేసాళం

'అడుకులు చక్కిలాలు అనవాలు సురుగులు
వడపప్పు మొదలుగా వాముల కొలదులు ॥పల్లవి॥

దేవకి కొడుకుఁగన్న దినమిది శ్రీజయంతి
భావించ మన కన్నుల పండుగులాయ
దేవునిఁబూజించితిమి తేరో నైవేద్యాలు
కైవసమైన కృష్ణునికి గంపల కొలఁదులు ॥అడు॥ (10-27)

ఈ కీర్తనలో అడుకులు, చక్కిలాలు, ఆనవాలు నురుగులు, వడపప్పు మొద లయిన వంటకాలు చెప్పబడ్డాయి.

వెంకటేశ్వర స్వామికి అర్పించే నైవేద్యాలు —

## దేసాక్షి

ఏ పొద్దు చూచిన దేవుఁడిట్లానె యారగించు
రూపులతో బదివేలు రుచులైనట్లుండెను ॥పల్లవి॥

మేరు మందరాల వలె మెరయు నిడ్డెనలు
సూరియ చంద్రుల వంటి చుట్టు బళ్లెలు
ఆరని రాజాన్నాలు అందుపై వడ్డించగాను
బోరన చుక్కలు రాసిపోసినట్లుండెను ॥ఏపొ॥

పలు జలధుల వంటి పైఁడి వెండి గిన్నెలు
వెలి గొండలంత లేసి వెన్నముద్దలు
బలసిన చిలుపాలు పంచదార గుప్పఁగాను
అలరు వెన్నెల రస మందించి నట్లుండెను ॥ఏపొ॥

పండిన పంటల వంటి పచ్చళ్ళు గూరలును
వండియలమేలు మంగ వడ్డించగను
అండనే శ్రీ వేంకటేశుఁడారగించీ మిగులంగ
దండిగా దాసులకెల్ల దాఁచినట్లుండెను ॥ఏపొ॥ (9-10)

ఈ కీర్తనలో అలమేలు మంగ తన నాథుడయిన శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి వడ్డించిన మేరు, మందర పర్వతాల్లాగా మెరిసే ఇడ్డెనలు, చుక్కలు రాశిపోసి నట్లుగా వుండే రాజాన్నాలు, వెలగొండలంతేసి వెన్నముద్దలు, వెన్నెల రసం అందించి

నట్లుగా వుండే చిలుపాలు పంచదార, పండిన పంటల్లాగా వుండే పచ్చళ్లు, కూరలు మొదలయిన నానారుచుల వంటకాలు పేర్కొనబడ్డాయి.

ఇలాగే మరొకటి :

శ్రీ రాగం

ఇందిర వడ్డించ నింపుగను
చిందక యిట్లే భుజించవో స్వామి ॥పల్లవి॥

అక్కాళ పాశాలు నప్పాలు వడలు
పెక్కైన సయిదంపు పేణులును
సక్కెర రాసులు సద్యోఘృతములు
కిక్కిరియ నారగించవో స్వామీ ॥ఇంది॥

మీరిన కెళంగు మిరియపుఁదాళింపుఁ
గూరలు కమ్మని కూరలును
సారంపుఁ బచ్చళ్లు చవులుగ నిట్టే
కూరిమితోఁ జేకొనవో స్వామీ ॥ఇంది॥

పిండివంటలునుఁ బెరుగులుఁ బాలు
మెండైన పాశాలు మెచ్చి మెచ్చి
కొండల పొడవు కోరి దివ్యాన్నాలు
వెండియు మెచ్చవే వేంకటస్వామీ ॥ఇంది (1-?2)

ఈ కీర్తనలో ఇందిర స్వామి వారికి వడ్డించిన అక్కాళ పాశాలు, అప్పాలు, వడలు, సయిదంపు పేణులు, సక్కెర రాసులు, సద్యోఘృతములు, మిరియపు తాళింపు కూరలు, కమ్మని కూరలు, పచ్చళ్లు, పిండివంటలు, పెరుగులు మొదలయిన దివ్యాన్నాలు పేర్కొనబడ్డాయి.

ఇవేగాక దధ్యన్నములు (4-4), దుగ్ధాన్నములు (5-80), నానబియ్యాలు (5-159), పన్నీటి పానకములు (12-14), పరమాన్నములు (1-4) మొదలయిన నైవేద్య వంటకాల్ని కూడా అన్నమయ్య పేర్కొన్నాడు.

ఔపమ్య రూపంలో వంటకాల్ని చెప్పడం :

శ్రీ వేంకటేశ్వరుని వలచిన ఒకానొక నాయిక తన ప్రియునికి సిద్ధం చేసిన వంటకాల్ని అన్నమయ్య ఇలా వర్ణించాడు.

భూపాళం

చవులు సేసుక నీవు సారె సారెకు
అవసరములతోడ నారగించవయ్యా ॥పల్లవి॥

మాటల మూటల చద్దిమనసుతో చిలుపాలు
యే సేసి విందువెట్టీ నింతి నీకును
పాటల పంచదారలు పచ్చిమోవి తేనెలు నీ
యాటలాయ నేఁడిట్టే ఆరగించవయ్యా ॥చవులు॥

జంకెనల కారాలు చవుల పాకములు
లంకెల విందులు వెట్టీ లలన నీకు
పొంకపుఁజూపులంబళ్ళు పొరినవ్వుల పచ్చళ్ళు
అంకెలాయ నేఁడిట్టే ఆరగించివయ్యా ॥చవులు॥

కరజపు వినయాలు కాఁగిట రతిబువ్వాలు
సిరులతో విందు వెట్టీ శ్రీసతి నీకు
గరిమ శ్రీవేంకటేశ కలసితి రిద్దరును
అరుదాయనేఁడిట్టే ఆరగించవయ్యా ॥చవులు॥ (14-166)

ఈ కీర్తనలో మాటల్ని చద్దిగా, పాటల్ని పంచదారగా, మోవిని తేనెలుగా, చూపుల్ని కారాలుగా, పొంకపు చూపుల్ని అంబళ్ళుగా, నవ్వుల్ని పచ్చళ్ళుగా, రతిని బువ్వాలుగా వర్ణించాడు.

పానకము :

'పడఁతి నీకు దప్పికిఁబన్నీరందియ్యఁగా
కడఁగి శ్రీవేంకటేశ కైకొంటివి
తడయక అధరామృత పానకము నేఁడు
యెడనెడ మారుకు మారిచ్చితివి నీవు' (24-109)

ప్రియుని అధరామృతాన్ని పానకంతో పోల్చాడు.

పాలకూళ్ళు :

'కాలు దొక్కినట్టి నీ కామినుల కెల్లాను
పాలకూళ్ళాయను నీ పచ్చినవ్వులు' (27-240)

ప్రియుని నవ్వులు ప్రియురాండ్రకు పాలకూళ్ళ వంటివని పోల్చాడు.

మరొకటి :—

'బంతినాతఁడును నేను పాలకూళ్ళారగించఁగా
అంతట నుండి నీవేల అట్టె చూచేవే' (27-59)

పాల పొంగలి :

నాయిక సిగ్గుల్ని 'పొలప సిగ్గుల పాల పొంగలి గాఁబెట్టె' (28-320) అని పాలపొంగలిగా వర్ణించాడు.

పెరుగు :

'పేరబెట్టితే వలపు పెరుగు వంటిదె వో
కేరికాంచ బోతే విఁగి పోవు గాని' (14-59)

వలపును మచ్చికతో నిలబెట్టుకోవడం పేరబెట్టిన పెరుగును జాగ్రత్తగా వుంచుకోవడం వంటిదని పోల్చాడు. ఇలాగే ఊరుగాయలు (11-2-46), కంది కుడుములు (13-261), కుడుములు (12-14), జున్నులు (14-51), నెయ్యాల పొంగలి (14-10), మీగడలు (12-226), మొదలయిన పంటకాల్ని కూడా అన్నమయ్య ప్రస్తావించాడు.

కొలతలు :

అన్నమయ్య జానపదుల వ్యవహారంలో వుండే ప్రసిద్ధమయిన కొలతల్ని కవితా వస్తువుగా స్వీకరించి ఆంగిక సౌందర్య ఔన్నత్యాల్ని నాయికా నాయకుల అనురాగాన్ని వర్ణించాడు.

సాళంగం

ఎటువంటి పొందులో మీ కిద్దరికిని
తటుకున నీలోనే తలచు కోవయ్యా ॥పల్లవి॥

పట్టెఁడేసి గుబ్బల పడఁతి మొక్కితినవె
నెట్టన బంగారు వంటి నీపాదాలకు
మట్టున నీతోడుత మాటాలాడి రమ్మనె
యిట్టె మారుత్తరము లేమని చెప్పేవయ్యా ॥ఎటు॥

చేరఁడేసి కన్నుల చెలి యడిగితినవె
చేరి నీ పరిణామపు చేఁత లెల్లాను
వేరుసేయ కిట్టె నీవేళ చూచి రమ్మనె
నేరుపు మాపె తోడుత నేనేమందునయ్యా ॥ఎటు॥

కాఁగెడేసి పిఱుఁదుల కాంత వలచితి నవె
వీఁగక నీవు గూడిన వేడుకలను
కౌఁగిటిలో నిన్నూఁదన్నూఁ గలుపుదువు రమ్మనె
యేఁగి వచ్చి శ్రీవేంకటేశ కూడితివయ్యా' (29-27)

ఈ కీర్తనలో నాయిక సౌందర్యాన్ని పట్టెడేసి గుబ్బలు, చేరడేసి కన్నులు, కాగెడేసి పిఱుదులు అని కొలతలతో వర్ణించాడు.

గౌళ

'ఇద్దరికి మీకు దగునింత లేసి
బుద్దులేల నెరపేవు బారెఁడేసి ॥పల్లవి॥

నెలకొన్న సేఁతలు నీవేమి సేసితివో
సెలవుల నవ్వేనావె చేటఁడేసి
మలసి మలసి నీవు మర్మము లెట్టింటితివో
కులికిని సిగ్గులెల్లా గుంపెఁడేసి ॥ఇద్ద॥
సందడి మీకెటువలె సమ్మతులైన వో కాని
కందువ మాఁటలాడీని గాదెఁడేసి

మంచలించి నీవెంత మరగించితివో నేఁడు
పొందులు చూపినట్టే పుట్టెఁ జేసె ॥ఇద్ద॥

మంచముపై రతినెంత మనసుఁగరఁగించితివో
వంచీఁజూపులు నీపై వామెఁ జేసె
యెంచగ శ్రీవేంకటేశ యేలితివి నన్నునిట్టె
నించి వలపులెల్లా సిలివెఁ జేసి ॥ఇద్ద॥ (13-153)

ఈ కీర్తనలో నాయిక నవ్వుల్ని చేటదేసి. సిగ్గుల్ని గుంపెదేసి, మాటల్ని గాదెదేసి, పొందుల్ని పుట్టెదేసి, చూపుల్ని వామెదేసి, వలపుల్ని సిలివెదేసి అని వర్ణించాడు.

## సాళంగ నాట

ఈఁదు కరమ్మనవే యిటు నన్నుఁజూచుఁగాని
యీఁదాడంటేఁగోదాఁడనే యెదమాటలేఁటికి ॥పల్లవి॥

వలపు లేఁతల బంటి వడినాకు నైతేను
తలపోఁతలకునైతే తలబంటి
కలువల కైతేను కామువింటి తెగబంటి
చిలుకల కెల్లాను మచ్చికఁబుక్కిళ్ల బంటి ॥ఈఁదు॥

పాయము మోపులకొద్ది పైపై నాకైతేను
కాయపు గుబ్బలకైతే గంపల కొద్ది
చాయ వెన్నెలలకైతే చంద్రుడు గాసిన కొద్ది
కోయిలలకైతేను కృత్తిక కొద్ది ॥ఈఁదు॥

సారమైన వేడుకలు సందెఁదేసి నాకైతేను
కోరికల కైతేను గుంపెఁదేసి
యీరీతి శ్రీ వేంకటేశుఁడిట్టె వచ్చి నన్నుఁగూడె
కేరికలనోరి రొద చెప్పఁజేటఁదేసు ॥ఈఁదు॥ 24-37

ఈ కీర్తనలో బంటి అనే మాట ప్రయోగించబడింది. 'బంటి' అంటే నీళ్ల పరిమాణాన్ని తెలిపే ప్రత్యయం. వలపులకు ఈతల బంటి తలపోతలకు తలబంటి, కలువలకు తెగబంటి, చిలుకలకు పుక్కిళ్లబంటి అని గుబ్బలకు గంపలకొద్ది, వెన్నెలలకు చంద్రుడు గాసిన కొద్ది, కోయిలలకు కుత్తిక కొద్ది, వేడుకలకు సందెడేసి, కోరికలకు గుంపెడేసి, నోరి రొదకు చేటడేసి అనే కొలతల్ని ప్రయోగించాడు. వలపుల్ని –

'వెన్న చిట్టిఁజిట్టెఁడేసి, పాలదుత్త దుత్తెఁడేసి, చల్లదుబ్బ దుబ్బెఁడేసి పెరుగు చిప్ప చిప్పెఁడేసి' (13-180) అని వర్ణించాడు.

ఇలాంటి కొలతల్నే కాకుండా 'రూక, మాడ రువ్వ (1-458) పీసము (14-225), సొర్ణాంటకము (6-170) మొదలయిన నాణాల్ని కూడా ప్రస్తావించాడు. తాసును మనసుతో పోల్చడం (14-66) ప్రబంధాల్లో కనిపించని కొత్త ఔపమ్యం.

పనిముట్లు :

గొడ్డలి :

నాయకుని ఇంటికి రమ్మని నాయిక ఆహ్వానించింది. అయినా ప్రియుడు రావడానికి ఎందుకో వెనకాడుతున్నాడని గుర్తించింది. పెండ్లాడిన తర్వాత కూడా ఇంకొకరిపై మనసు పెట్టుకోవడం పదుగురిలో నగుబాటు అవుతుందని ప్రియునికి చెబుతోంది. మంచిమాటలతో 'పంతాలు పెట్టుకొంటే' లాభం లేదనడానికి—

'నానఁబెట్టితే గొడ్డలి నయమౌనా' (24-410) అని నాయిక చెప్పి పాడిచింది.

ఇలాగే మరికొన్ని —

'నానునా గొడ్డలి వంటి నాలైన నీచిత్తము' (13-484)

'గొల్లవారి తోడి పొందు గొడ్డలి నానఁబెట్టుట' (13-479)

మేకు :

అన్య మనస్కుడయిన నాయకుని తత్వం నాయిక మనస్సును గ్రుచ్చినట్లుంది. అయినా మెచ్చిన తర్వాత తనను తప్పు పట్టేదేముంది అని నాయిక అంటూ సమర్థించుకొంటోంది. ఈ భావాన్నే —

'మెచ్చినట్టి వాఁడవు మేకు లిఁకఁజేయకుమీ' (13-511)
అచ్చలాన యిక్కువలే అంటదు గాని (13-511)

అని వర్ణించాడు.

ఇలాగే మరొకటి —

'మేనెల్ల గర్వమే మేకులు నీకేమి బాఁతె
లోను సేసుకొంటివి మేలున నాతని' (27-378)

అలంకారాలు - ఆభరణాలు

అన్నమయ్య తన కాలంనాటి స్త్రీ పురుషుల అలంకారాన్ని, వారు వుపయోగించిన ఆభరణాల్ని ప్రస్తావించాడు.

అంచుల తొగరు చీర (12-103), పసపు కోక (12-370) కంకణము (27-353), కొప్పు (13-568), పసిడి చీర (28-64) ముడిచిన సవరము (13-432), ముత్యాల కుచ్చులు (12-78) మొదలయిన అలంకారాలు: మచ్చుకు కొన్ని – అంచుల తొగరు చీర, గాజు ;

'కట్టినది అంచుల తొగరుఁజీర సందిఁ
బెట్టినది మొలవంక పెద్దగాజు' (12-103)

కాకిపైడి బొట్టు :

'కాకిపైఁడి మాఁబొట్టు కప్పు పారిటాకు పట్టు
పైకొనఁజూచేవు నీకుఁజాతై తినా' (27-479)

ఒడ్డాణము (13-434), గజ్జెలు (12-219), కంచుటుంగరము (13-103), కుండలాలు (6-207), కేయూర కంకణములు (12-156) చెవిపోగులు (27-353) నీలమణిహారము (2-258), పద్మరాగాల వుంగరాలు (14-282), మాణికాల పోగులు (12-219), ముత్యాల పదకాల హారాలు (12-86), వజ్రాల కమ్మలు (13-417) మొదలయినవి. మచ్చుకు కొన్ని —

ఉంగరం : 'వెండిపైడి వుంగరాల వేలనే పెట్టితివే' (14-26)

కంచుమట్టెలు :

'మెట్టిన (ది) కంచు మట్టెల మించుమోత చేత
బట్టినది చల్లచాడె పట్టకురా నన్నును' (12-103)

మాణికాల పోగులు :

'మద్దికాయలు చెవుల మాణికాల పోఁగులు
పెద్దపెద్ద ముత్యాలు వెంపు మీరగ
ముద్దల వెన్నపాలు ముచ్చిలించు సేఁతలవి
బద్దుల పనులై పోయి పండరంగి రాయ' (12-219)

వాద్యాలు :

అన్నమయ్య జానపదుల వాడుకలో వుండే రకరకాల వాద్యాల్ని సంకీర్తనల్లో పొందుపరచాడు. అవి– కిన్నెర (12-245, 24-351, 28-42, 29-445), దుందుభి (8-21), బుఱ్ఱటకొమ్ము (24-389), పిల్లనగ్రోవి (20-456), భేరి (8-194), వీణ (13-392, 28-42, 29-462), శంఖం (1-141), సింగివాదం (7-12), మొదలయినవి. మచ్చుకు కొన్ని –

దండె :

'పతివేడుక పడీని చదురంగ మాడరాదా
తతిఁబాడేనంటా నేల దండె మీఁటేవు' (29-356)

తుత్తురుకొమ్ము :

'కొంకులేని పొలయాట కూరిములలో తేట
అంకెల బాలుల తోడి యాట పాట
పొంకపు తుత్తురు కొమ్ము పొలుపైన నీసొమ్ము
వేంకట నగము చాయ పిట్టలరాయ' (12-96)

పిల్లనగ్రోవి :

'అట్టు లెల్లా దినితిని అదివో యెవ్వరి వాఁడే
వుట్టులపై బిల్లగోవు లూదుచున్నాడు' (20-456)

5. 2. 2 వన సంపద :

వ్యక్తి జీవన వికాసానికి ఇల్లు తరువాత పరిసరం ప్రాధాన్యం వహిస్తుంది దీన్ని వనసంపదగా పేర్కొనవచ్చు. ఇందులో చెట్లు, పూలు, కాయలు, పండ్లు, మొదలయినవి చేరతాయి.

నెల్లి చెట్టు :

పెక్కువనితల మీద మనసు పెట్టుకొన్న నాయకునితో నాయిక అతి ప్రయాసలకు లోనయి సాధించిన వనితల పొత్తే ప్రీతిగా వుంటుందిగానీ సన్నిహితంగా వున్న మాలాంటివారు ఎలారుచిస్తారు అని చెబుతూ తన బాధను వ్యక్తం చేసుకొంటోంది.—

'పెళ్ళి చెట్టు మందుగాదు పెద్దకొండలెక్కి తెచ్చే
నెల్లి చెట్టు చవిగాక నేమేల నీకు' (25–435)

పెరట్లో వున్న చెట్టు మందుకు పనికిరాదు. ఎన్నో కష్టాలకు లోబడి కొండల్లో కోనల్లో వెదకి తెచ్చిన నెల్లి చెట్టే మందుకు పనికివస్తుందని వర్ణించాడు.

ముష్టిమాను :

పాపపుణ్యాల వల్ల కలిగిన జన్మ, పాపపుణ్యాలు చేయకుండా ఎలా వుండగలుగుతుందనే సత్యాన్ని —

'పుడమిలో ముష్టి మానఁబొడమిన శాఖలు
బడి ముష్టి పండ్లై పండకుండీనా' (7–155)

అని పోల్చాడు. ముష్టిమానుకొమ్మలలో ముష్టిపండ్లే పండుతాయి కాని వేరే పండ్లు పండవని భావం.

రా వి మా ను :

భవబంధాల్లో చిక్కుకొని మానవుడు ఆచరిస్తుండే కర్మలు ఎప్పటికీ తెగేవి కావు. అవి 'రావిమాను జిగురు' (6–105) వంటివని పోల్చాడు.

వేపమాను :

పాపపుణ్యాల లంపటంలో తిరిగేవాడు దుర్గుణుడుగా వుండటం సహజమనే భావాన్ని —

'వేపమానికిని చేదు విడువక వుండేది
యేపొద్దు సహజమే యెంతైనాను' (8-71)

ఇలాంటిదే మరొకటి –

కామక్రోధ లోభ మోహాలనే అంతశ్శత్రువుల వలయంలో చిక్కుకొన్న జీవిని ఎంత వుద్ధరించినా వాటిని వదలుకోలేడు. ఈ విషయాన్ని —

'ఖారమైన వేపమాను పాలుపోసి పెంచినాను
తీరని చేఁదే కాక తియ్య నుండీనా' (5-190)

అని వర్ణించాడు.

ఇలాగే అంపలి చెట్టు (15-66), తాటిమాను (7-34), పున్నాగ తరువు (12-177), మఱ్ఱిమాను (11-1-47), మద్దులు, మారేళ్ల (26-233) మొదలయిన వాటిని కూడా ప్రస్తావించాడు.

పూలు :

అన్నమయ్య నాయిక అంగిక సౌందర్యాన్ని మనసులో చెలరేగిన భావాల్ని తదను రూపమయిన పువ్వుల ద్వారా చిత్రీకరించాడు.

ముఖారి

దొరకెఁగా పూజ కందువ పూజని
విరహపు తనుతావి విరవాది పూజ
కలికి నీ కనుచూపు కలువ రేకుల పూజ
లలిన నీనగవు మొల్లలపూజ
తలపోఁత చింత చిత్తపుఁగమలపు పూజ
చలివేఁడి వూర్పు నీ సంపంగి పూజ ॥దొరకె॥

తనలుఁజెక్కునజేయి తరవల్లవపు పూజ
తను పులకలు జాజినల పూజ
తనరు నీవలులు దొంతర పూవుల పూజ
మొనయుఁజెమట మల్లె మొగ్గల పూజ ॥దొరకె॥

చెనకు నీగోళ్ళే చిఱుగేదఁగుల పూజ
గునియు గుబ్బలు పూవుగుత్తుల పూజ
ఘనతమై గూడి వెంకటపతి మోము సోఁ
కిన నీదుమోవి మంకెన పూవు పూజ' (12-95)

ఈ కీర్తనలో నాయిక విరహపు తను తావిని విరవాది పుష్పంతోను, కను చూపుల్ని కలువరేకులతోను, నగవుల్ని మొల్లలతోను, తలపోత చింతల్ని కమలం తోను, చలివేడి ఊర్పుల్ని సంపెంగతోను, చెక్కునున్న చేతిని కరపల్లవంతోను, పులకల్ని జాజులతోను, వలువను దొంతర పూవులతోను, చెమటల్ని మల్లెమొగల తోను, గోళ్లను కేదగులతోను, గుబ్బల్ని పూవుగుత్తులతోను, మోవిని మంకెన పుష్పం తోను పోల్చాడు.

గొజ్జగ పూవు :

'గోమునఁబెంచినయట్టి గొజ్జగపూవు వంటిది' (13 426) గొజ్జగపూవు సౌకు మార్యానికి ప్రతీక. లలిత లావణ్యవిలాసవతి అయిన నాయికను గొజ్జగపూవుతో పోల్చాడు.

తుమ్మిపూవు :

'తమ్మిపూవు తేటికి సీతావులై తానుండగాను
తుమ్మిపూవు చెప్పి చూప దోసము గాదా
నమ్మించి యీ రమణుండు నావద్దనే వుండగాను
యిమ్ముల సన్నలితని కేల సేసెనె' (3-118)

పువ్వుల మధువు గ్రోలడం తుమ్మెద సహజ లక్షణం. ఎన్నో రకరకాల పువ్వుల మధువును గ్రోలినా గాని అన్నిటికంటె పద్మంలోని మకరందమే తుమ్మె దకు ప్రీతి. తుమ్మిపూవు. తమ్మిపూవులు రెండూ ప్రసిద్ధమయినవే అయినా తామర పుష్పమే అందం. ఆకర్షణీయం. అలాగే తమ్మిపుష్పం లాంటి నాయిక చెంత తేటి లాగా నాయకుడు ఆకర్షితుడయి వున్నాడు. అలాంటప్పుడు తుమ్మిపువ్వులాంటి వర కాంత నాయకుని ఆకర్షించడానికి ప్రయత్నించడం వ్యర్థమని భావం.

తుమ్మిపువ్వు శివునికి ప్రీతిపాత్రమయింది. తమ్మిపూవు విష్ణువునకు ఇష్టం. తుమ్మిపువ్వును నిరసించి తమ్మిపువ్వును ఆదరించడంలో వైష్ణవాధిక్యత గోచరిస్తుంది. ఇలాగే మరొకటి –

'సిగిడి మగువ యెంత నేరుపరి యైనాను
మగనికిచ్చకురాలై మనవలెను
పొగరు తుమ్మి పువ్వులెన్ని ముడిచినా
తగిన జాజుల వలె తావి యంటీనా' (29-88)

జాణతనంతో పతి అనురాగాన్ని పొందినాగాని ఇష్టసఖిగా పొందికతో మసలితేనే అనుబంధం పెరుగుతుంది. తుమ్మిపూల మధ్య ఒక జాజిపువ్వు వున్నాచాలు వాసన నలువైపులా వ్యాపిస్తుంది. అలాగే పరసతులెందరున్నాగాని ప్రియసతిగా స్థానం పొంది మసులుకోవాలని అర్థం.

పొగడ పూవు :

ఎవరెన్ని చెప్పినా వారి వారి సహజ గుణాల్ని అనుసరించే ప్రవర్తిస్తారు. గాని తద్భిన్నంగా మారరు అనడాన్ని –

'పొగడ పూవులలోన పొందుగఁజూచిన తావి
తగుఁగాక తా మదము మానీనా' (12-368)

పొగడ పువ్వులో పరిమళం చిరకాలం దాకా వుంటుంది. కానీ మత్తుగుణాన్ని మాత్రం వదలదు అని వుపమించాడు.

మోదుగ :

అనురాగానికి ఎర్రదనం గుర్తు. అందువల్ల నాయికకు తన ప్రియుని మీద కలిగిన ప్రేమాతిశయాన్ని 'మోదుగై వలపు పూచె' అని వుపమించాడు.

సంపెంగ :

'తుమ్మెద మూఁకలఁజూచి దూరుచు తురుములోని
కొమ్మసంపెంగ విరులఁగొని వేసీని' (13-422)

నాయిక కొప్పు నల్లగా నిగనిగలాడుతోంది. ఆ నల్లదనానికి తుమ్మెదలు మూగాయి. వాటి ధాటికి ఆమె తట్టుకోలేక పోయింది. తుమ్మెదలకు సంపెంగలకు శత్రుత్వం. అందువల్ల నాయిక తుమ్మెదల్ని తరమడానికి సంపెంగల్ని విసిరిందని వర్ణించాడు.

ఇలాగే మరొకటి –

'సంపెంగ పూవుల లోన సారెకుఁజూచిన తన
తంపే కాక తన కాఁక మానీనా' (12–368)

సురపొన్న :

భగవంతుడు అనంత కల్యాణగుణోపేతుడు. బహురూపధారి, అలాంటి భగవంతుని నుతించడం ఎవ్వరికీ శక్యంకాదు. అలమేల్మంగ శ్రీ వేంకటేశ్వరుని ముద్దుల సతి. ఆమె తన ప్రియునిపై ముత్యాల సేస చల్లుతోంది. అప్పుడు శ్యామసుందరుడయిన స్వామివారు తెల్లగా శోభించారు. అలా శోభించిన స్వామికి వారిని మొగల సురపొన్నపుష్పంతో పోల్చాడు.

"తడవెలమేల్మంగ ముత్యాల సేస చల్లంగాను
పొడము మొగ్గల సురపొన్నఁ బోలితి" (13–169)

ఇలాగే తిలపుష్పం (8–47), దిరిశనపువ్వు (12–368), బొంతమల్లెలు (12–232). మేడిపండు (28–25), పేమంతి (12–104) గోరంట (27–91) మొదలయిన పుష్పాల్ని కూడా అన్నమయ్య పేర్కొన్నాడు.

కా య లు :

కలబెరికాయ :

సౌందర్యవతి అయిన స్త్రీ నాసికను కలబెరికాయతో పోల్చాడు.

'నలువున జనుపక నాసికమొకటే
కలసి కదంబపు కలబెరికాయ' (13–298)

కా క ర :

నాయకునికి తనమీద నిండుమనసు లేదని నాయిక గుర్తించింది. అలా అర్ధ మనసుతో ప్రవర్తించడం లోక సహజమే. ఒక రోజులోనే సగం వెలుతురు సగం

చీకటి వున్నట్లే తన ప్రియుని గుణాలు కూడా ఒక్కొకసారి అనుకూలంగా, ఒక్కొ-సారి ప్రతికూలంగా వుంటున్నాయి ఆ స్థితిని –

'చేదు కాఁకరను చెరకునఁదీపును
పోదితో నిట్టే పొదమీనటా
సేదల మతి నొలసియు నొల్లమియును
యీదెస నీకిది ఇటు దగుఁగదరా' (27–468)

కాకరలో చేదు, చెరకులో తీపు వున్నట్లుగా ప్రియునికి ఇష్టాయిష్ట మనస్తత్వం వుందని వర్ణించాడు.

చింతకాయ :

చిన్నతనంలోని స్నేహం నిష్కపటమయింది తలచుకొన్నంతనే చవులూరుతుందనే భావాన్ని —

'చెప్పఁగానే నూ (నో?) రూరీ చిన్ననాఁటి వలపు
కప్పము (?) వట్టిన చింతకాయ వలెను' (27-125).

అని పోల్చాడు.

ఇలాగే మరికొన్ని –

'బడిబడి చెప్పఁగానే పండ్లు వులిసీననే
కడునీ సుద్దులు చింతకాయవంటివి' (20-113)

'వింతగా భూసతి నీ వీఁపునినే వుండగాను
చింతించే వెవ్వరినోయి సిగ్గువడక
దొంతిబెట్టి రుచులెల్లా దొరకి తమకుండినా
చింతకాయ గనుగొంటే చేరి నోరూచుదురు' (27–282)

టెంకాయ :

స్త్రీ స్తన ద్వయ ఔన్నత్యాన్ని –
'యింతి తెంకాయ కానుక యిచ్చె నీవు గైకొంటివి
యింతలేసి యావె కుచాలివి యంటాను' (15-177)

అని పోల్చాడు.

నేతిబీర కాయ :

పేరులో నేయి వుందిగాని, నేతిబీరకాయలో నేయి వుండదు. అలాగే రాతిలో చెక్కబడిన పీరునిలో పీరత్వం వుట్టిపడుతుంది గాని జీవం వుండదు అనే భావాన్ని—

నేతిబీర కాయ నేయి అందులేదు
రాతిపీరునికి బీరము యించుకా లేదు' (7-230)

వెలంకాయ :

ఇష్టంలేని విధంగా అప్పుడప్పుడు మాట్లాడుతూ వెంటనే వలపు మాటలు మాటలాడే రెండు రకాల స్వభావల కలిగిన నాయకుని స్థితిని –

'లోలఁగ కిటు రెండు చేతుల వెలంకాయలై (?)
తచుకొత్తె జేఁత లెందలివాఁడవో' (13-596)

అని పోల్చారు.

ఇలాగే గుమ్మడికాయ (25-407), పుచ్చకాయ (14-131), పొరకాయ (13-391), బీరకాయ (9-24) మొదలయిన వాటిని గూడా అన్నమయ్య ప్రస్తావించాడు.

పండ్లు :

పల్లెల్లో ఎక్కువగా దొండపండు, అల్లనేరేడు పండు. ఈతపండు, చింత పండు, మామిడిపండు మొదలయినవి లభ్యమవుతాయి. అన్నమయ్య భగవంతుని ఒక పండుగా పేర్కొని రూపగుణ వైశిష్ట్యాల్ని రకరకాల పండ్ల లక్షణాల ద్వారా వర్ణించాడు.

శంకరాభరణం

తినరాని కొనరాని దేవలోకపు బండు
మనసున దలఁచితే మరిగించే పండు ॥పల్లవి॥

పంటకెక్కి పాలవెల్లి బండిన పాలపండు
లోంటి గొల్లెతల మోవి దొండపండు

అంటుకొన్న మేని చాయ అల్లునేరేడు బండు
ముంటి సింహపుగోళ్ళ ముండ్ల పండు ॥తిన

ఇచ్చల వేద శాస్త్రిలు దెచ్చిన పేరీత పండు
తచ్చిన దైత్యమారి దేవదారు బండు
పచ్చిదేర మెరసిన బండి గురువింద పండు
యిచ్చవలెనన్న వారి యింటనంటి పండు ॥తిన॥

తెమ్మగా మునుల పాలి తియ్యని చింతపండు
తె తి? మ్మల సిరివలపుఁ దేనెపండు
యిమ్ముల శ్రీవెంకటాద్రి నింటింటి ముంగిటిపండు
కొమ్మల పదారువేల గొప్ప మామిడిపండు ॥తిన॥ (13-284)

దేవలోకం లోని భగవంతుడనే పండును తినలేము, కొనలేము. అయితే మనసులో తలచుకోంచేచాలు చవులూరుతుంది.

ఈ పండును పాలవెల్లిలో పండిన పాలపండుగా, గొల్లెతల మోవికి దొండ పండుగా, మేని ఛాయలో నేరేడుపండుగా, సింహపుగోళ్ల ముండ్లపండుగా, వేద శాస్త్రిలు తెచ్చిన పేరీత పండుగా, దైత్య మారి దేవదారు పండుగా, మెరిసే బండి గురివింద పండుగా, ఇష్టమయినవారికి అరటిపండుగా, మునులపాలిట తియ్యని చింత పండుగా, సిరివలపుల తేనె పండుగా ఇంటింటి ముంగిట పండుగా పదారువేల కొమ్మలకు గొప్పమామిడి పండుగా పోల్చాడు

ఇందులో పాలపండు, అరటిపండు, చింతపండు, తేనెపండ్లు రుచి కోసం చెప్పబడ్డాయి. వీటివల్ల భగవంతుని వాత్సల్యాది గుణాలు వ్యక్తమవుతాయి.

దొండపండు, నేరేడుపండు, గురివిందపండ్లు రంగుకోసం చెప్పబడ్డాయి, వీటి వల్ల భగవంతుడు నీలమేఘశ్యాముడని, దేదీప్యమానంగా ప్రకాశించే వాడని తెలుస్తోంది.

ఈతపండు, మామిడిపండు, ముండ్లపండు దేవదారుపండ్లు వాటిని అందు కోవడంలోవున్న క్లేశాన్ని తెలుపుతాయి. వీటివల్ల భగవంతుడు, యజ్ఞయాగాదులు, జపతపాలు, దానధర్మాలు మొదలయినవి సర్వ్రదస్తేగాని లభ్యం కాదనే అంశ వ్యక్తమవుతుంది.

జీడిపండు :

నాయకుని గుణాన్ని —

'జీడిపంట గింజవంటి వెంగియుండెనీ గుణము' (27–427)

అని జీడిపండు గింజతో పోల్చాడు.

మేడిపండు :

నాయకుని కపట చేష్టల్ని –

'మేడిపండు సోన మింతే మేలు విచ్చి చెప్పఁబోతే
పాడియుఁబంతము చెల్లెఁబదవే దాలును' (28–25)

అని మేడిపంటి సోనంగా వర్ణించాడు.

వటఫలం :

నాయిక అధరాల్ని –

'వటఫలంబు పీవన్నెల మోవికి
గుటుకలలోనా గుక్కిళ్లో' (12-179)

అని వటఫలంతో పోల్చాడు.

ఇది ప్రబంధాదులందు కూడా కనిపించని క్రొత్త ఔపమ్యం.

5. 2. 3 జీవ సంపద :

అన్నమయ్య కవితా వస్తువులుగా స్వీకరించిన జీవ జాలాన్ని భూచర, ఖేచర, వనచర, జలచరాలనే నాలుగు విభాగాలుగా పేర్కొనవచ్చు.

భూచరాలు :

భూమిమీద చరించే ఎద్దు, ఎలుక, కోడి, కుక్క, గబ్బం, ఓమ, తేలు, దూడ, పాము, పొట్టేలు, మేక మొదలయినవి.

ఎద్దు :

ఎద్దు ప్రౌఢత్వానికి, అహంకారానికి ప్రతీక. దీన్ని కవితా వస్తువుగా తీసుకొని

'పట్టి దున్నే యెద్దుం దెచ్చి బండిగట్టి నురిపితే
నట్టె గవుగమెసి మల్లాడిన యట్లు
గట్టిగా శ్రీవేంకటేశ కష్టనిం బుణ్యం జేసితే
వట్టి యహంకారియై యెవ్వరిని గైకొనండు' (2-291)

ఎత్తుపల్లాలుగా వుండే మట్టి గడ్డలు పొలంలో దున్నడం ఎద్దుకు చాలా కష్టం. అలా కష్టపడే ఎద్దుకు బండి లాగే పనిబెట్టినా గాని అహంకారం విడువదు. అలాగే కష్టాల్లో సతమతమవుతున్న మానవుని భగవంతుడు కడతేర్చి సుఖజీవిని చేసినా గాని గర్వంతో ప్రవర్తిస్తాడని సమన్వయించాడు. అలంకారికంగా వాడిన ఈ పల్లవి పరికింపదగింది.

'ఎనుపోతుతో నెద్దు నేరు గట్టిన యట్లు
యొనపు ముందర సాగదేఁటి బ్రతుకు' (1-156)

ఎ లు క :

మానవ జీవితయాత్ర దుర్భరమయింది. ఎటు చూచినా బాధలు, ఇక్కట్లే తప్ప మనశ్శాంతి శూన్యం. ఇది తెలిసి కూడా సంసార బంధాల్లో సౌఖ్యం వుంటుందని శ్రమించడం వెట్టి. ఈ భావాన్ని —

'ఎంత వెట్టిఁగొండదవ్వి యెలుకఁబెట్టె దనేను
పంతపు శ్రీహరి నాశ్రమ వాపవే' (11-3-109)

అని పోల్చాడు.

కో డి :

వేంకటేశ్వరుడు ప్రత్యక్షమై ఎదుట నిలుచున్నా గాని మూర్ఖుడు చిల్లర దైవాలపై ఆసక్తి వదలడు. అలా వదలకపోవడం —

'మక్కువ నింతా నమృతమయ మైనఁ గోడికి
తెక్కుల దవ్వఁబొయ్యేది తిప్పపెంటలే' (6-33) త్రవ్వుకొంటూ ఏరుకోవడం వంటిదని పోల్చాడు.

కుక్క :

లోకంలో వక్రబుద్ధితో ప్రవర్తించే మనుష్యుల్ని గూర్చి చెప్పేటప్పుడు 'కుక్క తోక వంకర' అంటుంటారు. బుద్ధి ఋజుత్వం పుట్టుకతో రావాలిగాని ప్రయత్న పూర్వకంగా మార్చడం దుర్లభం. ఈ భావాన్ని —

'పాయదీసి కుక్కతోక బద్దలు వెట్టి బిగిసి
చాయకెంత గట్టినాను చక్కనుండీనా' (5-190)

ఇలాగే మరికొన్ని —

'చేరి తన వాకిలిఁగాచే శునకమునకైనా
పూరకాహారము వెట్టకుండ వచ్చునా' (2-282)

'శునకము బతుకును సుఖమయ్యే తోచు గాని
తనకది హీనమని తలఁచుకోదు
మనసొడబడితేను మంచిదేమి కానిదేమి
తనువులో నంతరాత్మే దైవమౌటఁదప్పదు' (10-264)

'అటు గొన్నాళ్లందాఁక యిటుఁగొన్నాళ్లందాక
కటకటా శునకపు గతి యాయఁగావచే' (10-227)

'నన్ను నింత సేయుకంటె నవ్వులున్నవా...
..............................
కుక్కదెచ్చి గంగిగోవు కొదమ గాఁగ భూమిలోన
ఒక్కమాటు యింతసేయ నోపవచ్చునా? (11-2-44)

'జడ్డు మానవుఁడు చదుఁవఁజదువ నాస
వడ్డ వారు గాక వదలీనా
గుడ్డి కుక్క సంతకు బోయి తిరిగిన
దుడ్డు పెట్లేకాక దొరకీనా' (11-3-69)

'మూసిన ముత్యము వలె ముంగిట నుండు' (22-54)

కోడెలు :

'సుఖము దుఃఖమును జోడుకోడెలు
అఖిలము గన్నవారు అడ్డమాడరెపుడు'

అనే కీర్తనలో జోడు కోడెలు నడచి పోయే పద్ధతుల్ని సుఖదుఃఖాల్లో ఒక సారి సుఖం మరోసారి దుఃఖం ఒకసారి రెండూ సమంగా సాగే జీవన ప్రవృత్తిని అన్నమయ్య విశదీకరించాడు.

గుఱ్ఱం :

గుఱ్ఱం దూకుడు స్వభావం కలది. కదం తొక్కేది, అలాగే మనసుకూడా రగులుతుంది. పొగులుతుంది. సెగలు క్రక్కుతుంది. ఉరకలేస్తుంది. డాబు దర్పం రెండూ గుఱ్ఱం స్వభావాలే.

'దిట్టమైన చిత్తమనే తేజి గుఱ్ఱమునకు
నొట్టుక రేవంతుఁడవు వుపమింపనీవు' (7-40)

అని చిత్తమనే గుఱ్ఱానికి భగవంతుడు రౌతువంటి వాడని పోల్చాడు.

చీమ :

జీవరాసుల్లో స్వల్పమయిన చీమ కూడా ముందు జాగ్రత్తతో రాబోవు కాలానికి కావలసిన ఆహారాన్ని సమకూర్చుకుంటుంది. ఇలాంటి చీమకే తిప్పలు తప్పనప్పుడు మానవుడు పడే సంసార లంపటాలు చెప్పనలవి గావనే భావాన్ని —

'తానెంత బ్రదుకెంత దైవమా నీమాయ యెంత
మానవుల లంపటాలు మరి చెప్ప గలదా

చెలఁగి నేలఁబారేటి చీమ సయితమును
కలసి వూరకే పారు గమ్మరనెందోమరలు
తలమోఁచి కాఁపురను ధాన్యములు గూడపెట్టు
యిల సంసారము దన కిఁక నెంత గలదో ॥తానెం॥ (9-179)

అని సమన్వయించాడు.

తే లు :

దుఃఖానికి హేతువు కోరిక. ఈ కోరికల్లో చిక్కుకొన్న మనసు హాని తప్ప మేలు చేయదనే భావాన్ని —

'మూరిమితోఁదేలు దెచ్చి కోకలోన బెట్టుకొన్నా'
సారెనారె గుట్టుగాక చక్కనుండీనా' (౬-190)

అని పోల్చాడు.

దూ డ :

జీవి దూడ లాంటివాడు దూడ మన్ను తినడానికి ఇష్టపడుతుంది. అది దూడకు మంచిది కాదు. అదిలించినా దూడ వినదు. అందువల్ల కళ్లకు గంతలు కట్టవచ్చు. అయినా ఎంతకాలం ఇలా చేయగల్గడమో చెప్పలేము. అలాగే జీవికి తనంతటగా గుణం రావాలిగాని బోధించడం వల్ల ఫలితం వుండదు ఈ భావాన్ని —

"మన్నుదిని మేటి దూడ మానుమంటా మెత్తిమెత్తి
కన్నుగట్టి యెందాఁకఁగాయగ వచ్చును" (2-197)

అని సమన్వయించాడు.

ఇలాగే మరికొన్ని —

'చెంతల శ్రీ వేంకటేశ చేరితి నీవద్ద నేఁడు
పంతుకుఁగామ ధేనువు వద్ది దూడ పలెను' (8-48)

'లోకము లేలుదువట లోకము లోపలి నేను
పైకొని నీ వేలినట్టి బంటనే సుమ్మీ
ఆకడ నావు గొంటే నావు వెంట దూడయును
జోకల గొన్నట్టివారి సొమ్మేకాదా' (7-207)

సా ము :

కోరికను అణచుకోవడం సాధ్యం కానిపని. ఈ అంశాన్ని —

'నెలకొని పారే పాము నిలుపఁగవచ్చు గాక
వలపెండ్లైనా నిలుపఁగ వచ్చునటవె' (22-425)

ప్రాకే పామునైనా స్తంభింప చేయవచ్చు గాని మనసును కోరికలు లేకుండా స్థిరంగా వుంచుకోలేమని స్పష్టం చేశాడు. ఇలాగే కోపాన్ని 'పామువలె నాలుక చాచఁగ' (8-208) అని పోల్చాడు.

పొట్టేలు :

> 'నిగిడి శ్రీవేంకటేశ నీవు నన్నుఁగూడితేను
> తగునని పొగడఁగఁదవకేమి
> మొగము చూచుకొని ముచ్చట నీతోనాడఁగా
> తగిలి పొట్టేలు వలె తానేల వచ్చీనే' (18-237)

ప్రియుడు పరకాంత దగ్గర వున్నాడని తెలుసుకొని ప్రేయసి సహించలేక పోయింది. వారిద్దరు ఏకాంతంలో వున్నాగాని లెక్కజేయక రౌద్రరూపిణియై వెళుతున్న ప్రేయసిని పొట్టేలుతో పోల్చాడు.

మేక :

ప్రతి జీవాత్మలోనూ భగవంతుడున్నాడు. అట్టి భగవంతుని తన దగ్గరే వుంచుకొని ఎక్కడెక్కడో వెదకటం అజ్ఞానమే. ఈ భావాన్ని –

> 'సరస మేఁక పిల్లఁ జంకఁ బెట్టుక నూఁత
> నరయు గొల్లని రీతి నజ్ఞాని నైతి' (5-19)

అని పోల్చాడు.

ఖేచరాలు :

ఆకాశంలో చరించే ఇసుళ్ళు, ఈగ, కోడి, చిలుక, తుమ్మెద, దోమ, పిచ్చుక, మిడుత మొదలయినవి.

ఇసుళ్ళు :

ఇసుళ్ల కుప్పలు తెప్పలుగా వృద్ధి చెందుతూ అల్పకాలంలో నశిస్తుంటాయి అలాగే సంతానం ఇసుళ్ళ పుట్ట లాగా వృద్ధి చెందుతుంటుందనే భావాన్ని —

'పొదలిన పుత్రుల యిసిళ్ళ పుట్టలు వెట్టెదము' (9-51)

అని పోల్చాడు.

ఈ గ :

ఐహిక విషయ వాంఛల నుండి బయట పడలేని మనసును 'తేనె లోపలి యీఁగ తెఱు గాయ మనసు' (11-3-125) అని పోల్చాడు, ఇలాగే మరొకటి –

'యీమేర శ్రీ వేంకటేశ్వరుని శరణని
సోమరి కర్మమంటితే జుంటీఁగ కతవురు' (6-29)

దోమ :

అధముఁడికి ఎన్ని వుపదేశాలు చేసినా ఉత్తముడుకాలేడు. అలాంటి అధముని గొప్ప వాడుగా చేయ దలచడం –

'చెడుగైన దోమ దెచ్చి సింహపుఁగొదమగా
బెడిదంపు బ్రేమతోడఁ బెంచినయట్లు' (5-185)

అని వర్ణించాడు.

చిలుక :

భగవంతుడు తన కధీనుడయిన భక్తుని ఎప్పుడూ రక్షించుతూ వుండాలిగాని శిక్షించ కూడదనే భావాన్ని —

'వేడుక కాఁడు చిల్కకు వింతమాట లెల్లానేర్పి
ఆడినట్టే యాడితేను అదలించ వచ్చునా' (6-214)

అని వర్ణించాడు.

మనసును స్వాధీనంలో వుంచుకోవడం, వుంచుకోలేక పోవడం అనేది వారి వారి ధీశక్తిపై ఆధారపడి వుంటుంది. ఈ భావాన్ని —

'చేవదలితే పెంచిన చిలుకైనా మేడలెక్కి
రావించి గూటఁబెట్టితే రామా యనును

భావించకుండితే యిట్టె పొదు నెందైనా మనసు
శ్రీవేంకటేశుఁగొల్చితే చేత జిక్కివుండును'     (7–107)

అని వర్ణించాడు.

తుమ్మెద :

'గతిగూడ గుంపు గట్టి కాఁపురము సేసీనవే
మితిమీరి శిరసుపై మేఁటి తమ్మెదలు'     (7-52)

స్త్రీ శిరసు తుమ్మెదల గుంపువలె వుందని వుపమించాడు.

పిచ్చుక :

'హరి యని నొడిగిన నణగెడి పాపము
నిరుల నేను నుతి సేయఁగ గలనా'
పరగిన పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
దొరకొని వూరకె తొడిగిన యట్లు'     (9-285)

పిచ్చుకను చంపడానికి చిన్న వడిసెల రాయి చాలు. అలాంటి దానికోసం బ్రహ్మాస్త్రాన్ని వుపయోగించవలసిన అవసరం లేదు. అలాగే 'హరి' అని నోరార ఒక్కసారి అంటేనే చాలు సర్వపాపాలు నశిస్తాయి. దానికోసం ఐశ్వర్యాన్ని అర్పించి స్తుతించవలసిన శ్రమ అవసరం లేదని వర్ణించాడు.

మిడుత :

'అనలము బొదగంటే నందనున్న మిడుతలు
పని లేకున్నా నందుఁ బడకుండీనా
పసిగి చెలులఁగంటే పురుషుల చూపులెల్లా
ననిశము నందు మీఁదనంటఁబారకుండునా'     (10-66)

మిడుతలు నిప్పు చేత ఆకర్షింపబడి అందులోనే పడిమాడిపోతాయి. అలాగే పురుషులుకూడా స్త్రీలను చూసినపుడు వారిచే ఆకర్షింపబడతారని వర్ణించాడు.

జీడిపండు :

వనచరాలు :

ఏనుగు, జింక, సింహం మొదలయినవి వనంలో చరించేవి.

ఏ ను గు :

వినశనానికి రెండు కారణాలు. మొదటిది అజ్ఞానం, రెండవది అహంకారం. అజ్ఞానమే మదం. మన్మథుడు మావటి వాడు. ఈ భావాన్ని —

"మరిగి యజ్ఞానమనే మదమెత్తి తిరిగితి
మరుఁడనె మావటీని మాయఁజిక్కితి" (10-227)

అని పోల్చాడు.

'కర్మాన్ని మదించిన ఏనుగుతోను, భగవంతుని మావటి వానితోనూ పోల్చాడు

'మక్కు గర్మ మనేటి మత్త గజమునకు
యెక్కువ మావటీఁడవు యెంచగ నీవు' (17-40)

గర్వాన్ని 'యేపున గర్వము దానే యేనుగ వలె మీరఁగా' (8-208) అని పోల్చాడు.

మనసు చంచలమయింది. ఈ మనసును 'వశముగాని కరివంటిది' (7-161) అని పోల్చాడు.

జిం క :

అడవి క్రూర మృగాలకు నిలయమయిన చోటు. జింక సాధువయిన ప్రాణి. కల్లకపటం తెలియనిది. అమాయక స్వభావం కలిగింది అలాంటి జింక అడవిలో పడితే క్రూర మృగాల పాలుకావడం తథ్యం. ఈ భావాన్నే —

'యేపున మనసనియెటి మా పెంపుడు లేడి
పాపమనే యడవి బడినది' (5-387)

అని పాపకర్మల్లో చిక్కుకున్న మనసును వర్ణించాడు.

సిం హం :

సింహం మృగరాజు. అలాగే దేవాధిదేవుడు వేంకటేశ్వరుడు. ఇష్టదైవం ఆత్మలో నెలకొన్నప్పుడు చిల్లర దైవాలకు తావుండదనే అంశాన్ని —

'కొంచక సింహముండేటి గుహ నుండ వచ్చునా
పొంచి నక్కలకె బొక్కలే కాకా' (6-17)

సింహముండే గుహలో ఇతర జంతువులకు స్థానం లేదని వర్ణించాడు.

జలచరాలు :

నీటిలో చరించే చేప, జలగ, తాబేలు మొదలయినవి.

చేప :

జీవి ఎల్లప్పుడూ భగవంతునికి అధీనుడే. గాని స్వతంత్రుడు కాదనే భావాన్ని

'జలధిలోపలి మీను జలధి దానౌనా
జలము లాధారమైన జంతువుగాక' (6-139)

అని,

తామర రేకులవంటి కొనచూపుల్ని –

'చెందమ్మి రేకుల కొనచేపలాయనేఁడు' (13-261)

అని పోల్చాడు.

ఇలాగే మరొకటి —

'వొదుగుచు జలముల నుండు మత్స్యములు
పదపడి యేగతి బాసీనయ్యా' (5-20)

మత్స్యాలకు ఆధారం జలం. అలాంటి జలాన్ని వదలిపెట్టి మత్స్యాలు జీవించలేవు. అలాగే భగవంతుని విడిచి ప్రాణులు మనలేవని అర్థం.

జలగ :

లోభబుద్ధిని పోగొట్టడం సాధ్యంకాదనడాన్ని –

'అయించక లోభము జలఁగవలె బీరుచఁగా
నియమించి మట్టుపెట్ట నేఁడు నాకు వసమా' (8-208)

అని పోల్చాడు.

తాబేలు :

అన్నమయ్య నాయిక పాదాల్ని - 'నీటిలోని తాఁబేళ్లు' (15-130) అని పోల్చాడు. ప్రబంధాదుల్లో కనిపించని క్రొత్త ఔపమ్యం.

5. 2. 4 వృత్తి విశేషాలు :

అన్నమయ్య ప్రధాన వృత్తులయిన వ్యవసాయం, నేతఁకు సంబంధించిన కీర్తనలే గాకుండా తదితర వృత్తుల్ని కూడా ప్రస్తావించాడు. వాటిలో కమ్మరి, కుమ్మరి, బొమ్మలపని పూతపని పూసపని మొదలయినవి వున్నాయి

కమ్మరి :

'యినలేక యెదిరికి యినుమ ఁడిచే వారికి
తన తగరముడువ దడవయ్యీనా
గునిసి సంసారపు కొండనే మోచేనంటా
తినికేమిదియు వట్టి దీమసము గాక' (8-61)

కుమ్మరి :

'ఇమ్మైన పాపంబు లెన్న వలసిన బ్రాణి
సమ్మతంబునఁ జేయఁ జాలుఁ గాకేమి
కుమ్మరికి నొక యేడు గుడియ కొక నాఁడౌను
నమ్మి తలఁచిన విష్ణునామంబు చేత' (5-64)

బొమ్మల వృత్తుల వారికి సంబంధించిన ప్రసక్తులు కూడా అన్నమయ్య కీర్తనల్లో కనిపిస్తాయి. వాటిలో రాతిబొమ్మ, మాసిబొమ్మ, తోలుబొమ్మ (5-189) మొదలయినవి.

పూత పనిని గూర్చి 'చెంబు మీఁది కనకపుఁబూఁత' (7-1) అని, పూస పనిని గూర్చి 'లక్క-పూస కపురులు' (7-34) అని ప్రస్తావించాడు.

5. 2. 5 ఆటలు :

మనిషికి ఆహారం మాత్రం చాలదు. ఆహారంతోబాటు వినోదం కూడా

